


# యుగ పురుషుడు
# వీరేశ లింగం

Full cau- 1

# యుగపురుషుడు వీరేశలింగం



: ప్రచురణ :

శ్రీ కందుకూరి వీరేశలింగం
స్మారకోత్సవముల సంఘం;
హైదరాబాదు

సంపాదక వర్గము :

శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి.

శ్రీ తెలికిచెర్ల వెంకటరత్నం.

శ్రీ ఆవుల సాంబశివరావు.

మూల్యం : రూ. 4-00

ముద్రణ : యువ ప్రెస్,

పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాదు.

# శ్రీ కందుకూరి వీరేశలింగం
# స్మారకోత్సవముల సంఘం:

అధ్యక్షులు : డాక్టర్ నీలం సంజీవరెడ్డి,
*ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి*

సభ్యులు : డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి,
*కేంద్ర ప్రభుత్వ సమాచార, ప్రసారశాఖల మంత్రి*

,, శ్రీ పి. వి. జి. రాజు,
*ఆంధ్ర విద్యాశాఖ మంత్రి*

,, శ్రీ ఎం. ఆర్. అప్పారావు,
*ఆంధ్ర ఎక్సయిజ్, మద్యనిషేధశాఖల మంత్రి*

,, శ్రీ బి. ఎస్. మూర్తి,
*కేంద్ర ప్రభుత్వ సమాచారాభివృద్ధిశాఖ ఉపమంత్రి*

,, కీ. శే. అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు,

,, శ్రీ ఎల్. ఎన్. గుప్త, ఐ. ఏ. ఎస్.,
*ఆంధ్ర ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి*

,, శ్రీ పాలపర్తి నరసింహం,
*ఎడిటర్ : 'ధర్మసాధని', గుంటూరు*

,, శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయడు,
*దానవాయిపేట, రాజమండ్రి*

,, "దివాన్ బహదూర్" బి. వి. శ్రీహరిరావు నాయడు,
*9, రామన్ స్ట్రీట్, టి. నగర్, మద్రాసు — 17*

,, శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి,
*ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రం*

,, శ్రీ కల్లూరు సుబ్బారావు, ఎం. ఎల్. ఏ.,
*హిందూపురం, అనంతపురంజిల్లా*

[ పుట త్రిప్పి చూడండి ]

సభ్యులు : శ్రీ పి. సుందరయ్య, ఎం. ఎల్. ఏ.,

*ఎం. ఎల్. ఎ. క్వార్టర్స్, హైదర్ గుడా, హైదరాబాదు*

,, శ్రీ తారకం (కె. రామశాస్త్రి)

*గాంధినగరము, కాకినాడ*

,, శ్రీమతి చోడగం అమ్మన్నరాజా, ఎం. పి.,

,, శ్రీ పాతూరి నాగభూషణం,

*ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘం కార్యదర్శి, పటమట*

,, శ్రీ పొన్నాడ వెంకటాద్రి,

*హితకారిణీ సమాజం కార్యదర్శి, రాజమండ్రి*

,, ఆచార్య ఎస్. గోవిందరాజులు నాయుడు,

*శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు, తిరుపతి*

,, శ్రీ వల్లూరు బసవరాజు,

*హైదరాబాద్*

సభ్యుడు - సమావేశకర్త :

శ్రీ ఆవుల సాంబశివరావు,

*అడ్వొకేట్, హిమాయత్ నగర్, హైదరాబాదు.*



# విషయ సూచిక

# కృతజ్ఞతలు:

ఉదారవిరాళముల కు:

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము.

ఉదాత్తసహకారమునకు:

రచయితలు;

హితకారిణీ సమాజము, రాజమండ్రి;

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య, విజయవాడ;

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం, విశాలాంధ్ర ప్రచురణాలయం;

శ్రీ పోలవరపు శ్రీహరిరావు;

శ్రీ జాస్తి జవహర్‌లాల్, హైదరాబాద్.

చిత్రరచనలకు:

ముఖపత్రం : శ్రీ జనార్దన్, హైదరాబాద్.

రేఖాచిత్రం : శ్రీ గోలి శేషయ్య, తెనాలి;

శ్రీ 'బుజ్జాయి', హైదరాబాద్.

ముద్రణకు:

యువ ప్రెస్, పబ్లిక్‌గార్డెన్ రోడ్, హైదరాబాద్.

# వీరేశలింగం ఉద్బోధ

"అస్మద్దేశీయులైన యాంధ్ర మహాజనులారా ! భ్రాతృవరులారా !

మీ వలెనే మన దేశస్థులితరులను నిర్హేతుక జాయామాన కటాక్షముచేత నన్ను గొప్ప చేయుచు వచ్చుటచే నా యల్ప సంస్కార ప్రయత్నమునుబట్టి తెలుగు దేశములో రాజమహేంద్రవరము సంస్కారములకు జన్మభూమి యని పేరు పడినది. ఈ ప్రఖ్యాతికి నేనే కారణము గాదు, నేను నాటిన సంస్కార లతాంకురమును బయికి లేవదీసి పట్టుకొమ్మలయి నిలిచి నానాముఖముల తీగలు ప్రాంకజేసిన మహనీయులు దీనికి ముఖ్యకారకులని చెప్పవలసి యున్నది.

ఈ కీర్తి తెలుగు దేశమంతటిది కాని రాజామహేంద్రవరమొక్కదానిదే కాదు. నేనరవ దేశమునందును కన్నడ దేశమునందును సంచారము చేయునప్పు డక్కడివారు సంఘ సంస్కారాది విషయములలో తమ దేశముల కంటె తెలుగు దేశమెక్కువ యభివృద్ధి పొందినదని చెప్పుకొనుచుండగా నేను పలుమారులు విని యాంధ్ర దేశము యొక్క యభ్యున్నతి కానందించి గర్వపడుచు వచ్చినాడను.

ఓ ఆంధ్ర మహాజనులారా! దేశాభివృద్ధికి సంస్కారము లన్ని విషయములలోను సమానముగా నుండవలయునుగాని యొక్కవిషయములో మాత్రమే నడచుచుండుట చాలదు. ధార్మిక సాంఘికాభివృద్ధి ప్రయత్నము నుపేక్షించి యొక్క రాజ్యాంగ స్వాతంత్ర్యాభివృద్ధినిగూర్చియే యుద్యమించుటయు సంపూర్ణ సుఖసాధనము కాజాలదని భావింపవలయును. ఇంటను బయటనుగూడ హేయ దాస్యమునుండి విముక్తులమయి యుభయస్వాతంత్ర్యములను బొందగలిగినప్పుడు గదా. మనము నిష్కళంక సౌఖ్యమునొంచి యవ్యాజానందము నొందగలుగుదుము.

మన .. దేశాభివృద్ధి కిప్పుడు పనికావలెనుగాని యది లేని పొడిమాటలు కావలసి యుండలేదు."

— కం. వీరేశలింగం

[ స్వీయ చరిత్ర నుంచి ]

# శ్రద్ధాంజలి

కందుకూరి వీరేశలింగం ఆంధ్రలోకానికి నవచేతన వైతాళికుడు; పునరుద్దీపితమైన వసంతానికి ఋతుపురుషుడు.

ఆయన ప్రసరించిన స్వేచ్ఛా వాయువులతో ఆంధ్రజాతి ప్రభావితమైనది. ఉత్తేజితమైనది. ఆయననుండి ఆంధ్రప్రజలు నిర్భయాన్ని నేర్చుకున్నారు. అన్యాయాన్ని ధిక్కరించగల ధైర్యసాహసాలను అలవరచుకున్నారు. మంచి చెడులను, తమకు తాముగా పరిశీలించి, పరీక్షచేయగల హేతువాదదృష్టిని, విచక్షణాశక్తిని గ్రహించుకున్నారు. తమ వ్యక్తిత్వాన్ని, మానవత్వాన్ని సంకుచిత పరుస్తున్న ఆచారాలను, సంప్రదాయాలను ఎదుర్కోగల శక్తిని సంపాదించుకున్నారు. తమ మహిళాలోకానికి నూతన తేజస్సును సంతరించుకున్నారు. తర తమ భేదాలతో చీలిపోకుండా, మానవులంతా ఒకటే అనే మానవతాధృక్పథానికి అలవాటుపడ్డారు. రచనా విధానంలో ఎన్ని పోకడలనో, ఎన్ని రూపాలనో ఆయననుండి తెలుసుకున్నారు.

వీరేశలింగం ఆంధ్రభూమికిచేసిన సేవ అమోఘము, అద్వితీయము. భౌతికంగా ఆయన 1919లోనే మరణించినా, తెలుగునాట స్వేచ్ఛావాయువులు వీచినన్నాళ్ళూ, తెలుగు హృదయంలో నిర్భయం వెలిగినన్నాళ్ళూ, వీరేశలింగం సజీవంగానే ఉంటాడు; తెలుగులోకాన్ని ఉత్తేజపరుస్తూనే ఉంటాడు.

ఆ అఖండ జ్యోతికి ఆంధ్రప్రజలు, ఆంధ్ర ప్రభుత్వం భక్తితో, కృతజ్ఞతతో సమర్పిస్తున్న అక్షర కుసుమాంజలి ఈ వ్యాసావళి.

— ఆవుల సాంబశివరావు



# మూలపురుషుడు

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

అభిన వాంధ్ర దేశోదయ ప్రాప్తికెల్ల – మూలపురుషం డొకండె విశాలదృష్టి,
నా మహర్షి నాటిన మహోద్యమ లతికలె – సూనపల్లవతతి మోసె సూర్యనృపతి,
జన మనోదాస్య మొక్కండు సంఘ కశ్మ – లత యొకండు దేశారిష్టశతములగుచు,
జాతి బలసౌష్టవముల నాశనమొనర్చు – శోధకు లెఱుంగుదురు దీని సూర్యభూప.

వన్నెకెక్కిన యాంధ్ర సభ్యతయుఁగూడ – కాలగతి నీ యరిష్ట దురతికిఁ దాను
దప్పినది కాదు. దూరైకదర్శిగాన – నా మహామతి యెఱిఁగె సూర్యావనీంద్ర.

భాషారచనయందు స్వాతంత్ర్యము వహించి తీయని వాకిండ్లు తీసినాడు
విజ్ఞానదృష్టి మాపిన శాస్త్రములు చీల్చి, జనమనోదాస్యంబుఁ జంపినాడు
కుల మత ద్వేష శృంఖలలనుచ్ఛేదించి జాతీయభావంబుఁ జాటినాడు
కుహనామతాచార కుటిల కృత్యము లాపి పరమాస్తికవ్యక్తి నెఱపినాఁడు

ఆ దయావ్రతి, మాతృదేశాభిమాని – సంఘ సంస్కారభార దీక్షా తపస్వి
యలరు వీరేశలింగ మహర్షి యొకఁడె – ప్రస్తుతాంధ్రోదయమునకు బ్రహ్మ యగుచు.

నెఱసిన పారతంత్ర్యసరణిన్ జిరవిస్మృతమై, యగమా గో
చర గతి నున్న యాంధ్రుల ప్రశస్త చరిత్రకుఁ బ్రాణబీజముల్
వరపి, మహాంధ్ర భూజనని పట్టునభక్తిమ యాభిమానముల్
బిరికొనజేసినట్టి కవి వీరుఁ డెవం డిల సూర్యభూపతీ ?

సురుచిరమై చిరంతన యశోభరమైన, విశాల సభ్యతా
పరితి వన్నెకెక్క, రసవ న్నవనీత మధు ప్రసాద మా
ధురిగల బాసకున్ పసిడి తొల్లై యనందగు, నీ మహాంధ్ర సుం
దర ధరకున్ నవోదయము దారిచె నే కవి సూర్యభూపతీ ?

ఆద్యంతంబులు నాంధ్రభూమి నిపు డల్లల్లాడఁగాఁ జేయు తీ
వ్రోద్యచ్ఛక్తులకెల్ల మూల మెవ డం చూహించినం దేలదే
విద్యావ్యాసుఁడు, దూరదర్శకుఁడు శ్రీ వీరేశలింగేశ్వరుం
డాద్యుండంచును బ్రాజ్ఞసంతతికి సూర్యారాయ భూనాయకా !

మతిమంతుండయి, కార్వశూరతఁ బురోమార్గమ్మునే బట్టి, లో
క తిరస్కారములన్ నిరంకుశ మనోగాంభీర్య దీక్షాగ్ని కా
హుతిగా వ్రేల్చి కృతార్థుఁడైన మహనీయుం డీ సమస్తాంధ్ర సం
తతికిం బూజ్యుండు పాస్యుఁ డేమిటి కనస్పర్ధ : సూర్యాగ్రగణీ !

దుర్వారంబుగ నీ నవాంధ్రభుని నాందోళించు తేజోవిధుల్
సర్వం బేక మురుంబుగాఁ దెలుపు భాషాదేశ చారిత్రముల్
వేర్వేరన్ వినిపింపవో పుడమి శ్రీ వీరేశలింగోద్యమం
బర్వాచీన వనీవసంతముగ సూర్యారాయ భూనాయకా ;

(శతపత్ర గ్రంథమునుండి)

# యుగపురుషుడు

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, ఎం.పి.,
"ఆంధ్రజ్యోతి" సంపాదకులు

ఈనాడు వీరేశలింగం 'స్వీయచరిత్రము'ను ఎంత మంది చదువుతున్నారనే విచికిత్సతో నేను అబ్బుర పడుతూంటాను. నేనా పుస్తకాన్ని మొట్టమొదటగా నా యౌవనారంభదశలో చదివాను. నేను ఇప్పటికీ పదే పదే చదువుతూండే బహు కొద్ది తెలుగు పుస్తకాల్లో ఇదొకటి. విస్పష్టంగా చెప్పాలంటే — ఈ పుస్తకం గాంధీ, నెహ్రూల ఆత్మచరిత్రలవంటి మహోన్నత సారస్వత శకలంకాదు, గాంధీ ఆత్మకథలోని సరళత, సూటిగా చెప్పడం వీరేశలింగం 'స్వీయచరిత్రము' లో కూడా వున్నవనడానికి సందేహంలేదు. కాని దాని సమానాంతర ప్రవాహగతి, విశాలత్వం, ప్రగాఢత ఇందులో లేవు. నెహ్రూ ఆత్మకథలోని మానసిక సంఘర్షణలు, నిశితమైన ఆత్మపరిశీలన, భావుకత్వపు విలువలు కూడా ఈ పుస్తకంలో లేవు.

అయినా — దీన్ని పదేపదే చదివినకొద్దీ, ఆంధ్రులమైన మనం ఈనాడున్న స్థితికిగాను వీరేశలింగంగారికి ఎంత ఋణపడివున్నామో మరింత ఎక్కువగా అవగాహన అవుతూంటుంది. శ్రీ రాజగోపాలాచారి : "వీరేశలింగం ఉద్భవించి సముత్తేజపరచకపోతే ఆంధ్రదేశమూ ఆంధ్రులూ ఈనాటివలె వుండేవారు కాదు. ఆయన నిశితమైన అంతర్‌దృష్టి, మహా ధైర్యము, సంచలనాత్మక శక్తిగల భారతీయ మహాపురుషుల్లో ఒకరు. హెర్క్యులస్ అంతటి ఉద్దండతతో అసత్యాన్ని ఎదిరించారు, అభ్యుదయకరమైన కృషిని పరిరక్షించారు" అన్నమాటలు నిజం.

"హెర్క్యులస్ అంతటి ఉద్దండత" — నిజంగా వీరేశలింగం వ్యక్తిత్వాన్ని గ్రహించడానికి ఈ పదమే కీలకం. ఆయన చిన్నవయసులోనే మాతృత్వం వహించిన స్త్రీకి ఏకైక పుత్రుడు, పుట్టుకనుంచీ దుర్బలుడు. పసితనంలోనే రెండుసార్లు చచ్చి బతికినవాడు. ఆయన దీర్ఘజీవితంలో ఏదో ఒక జబ్బులేని రోజంటూలేదు; అందులో ఆస్తమావ్యాధి శత్రువులా వెంబడించేది. ఎడతెగని అనారోగ్యం, అందువల్ల ఏర్పడిన శారీరక దుర్బలతా ఆయన ప్రకృతిని వికలంచేశాయి, ఆయన చీటికీమాటికీ చిరుబురులాడే ముక్కోపిగా తయారయ్యాడు. అతి స్వల్పవిషయానిక్కూడా కస్సుమనే ఈ ధోరణిని అదుపులో పెట్టుకోవాలని ఎన్నిసార్లు ప్రయత్నించినా ఆయనచేతకాలేదు.

ఆయన్ని కించపరిచిన మరోలోపం అత్యల్ప విషయాల్లో కూడా తన ఇష్టమే కొనసాగాలనే పట్టుదల. ఎదటివారు తన ప్రాథమిక సిద్ధాంతాలతో ఏకీభవించితే చాలదు; వారు ప్రతి సూక్ష్మాతిసూక్ష్మ విషయంలో కూడా తనను అనుసరించాలనే పట్టుదల చూపేవాడు. ఏ విషయం మీద, ఏ మూలనుంచి, ఎవరు వ్యతిరేకించినాసరే ఆయన వెంటనే కోపావేశ వివశుడై పోయేవాడు. అనేక విపరీత హేళన రచనలూ, చురకలు వేసే వ్యంగ్య రచనలూ చేసినవాడైనా ఆయనకు హాస్యాన్ని ఆనందించే మనస్తత్వం లేదు. తనను చూచి తాను నవ్వుకునే సంగతలా వుంచండి — ఎదుటి వారిని చూచినవ్వే ధోరణైనా లేని అతి కోపిష్ఠి. ఏదిఏమైనా—తనలోని ఈ లోపాల్నీ తదితర

లోపాల్ని కూడా దృఢ సంకల్పంతో అనేక సుగుణాలుగా మార్చుకో గలగడమే శ్రీ వీరేశలింగం గొప్పతనం. ఆయన తనకుగల ముక్కోపాన్ని—సమకాలిక సంఘంలో గల చిలిపి అంధ విశ్వాసాలమీద, కరడుగట్టిన మూర్ఖత మీదా అసహనంగా మార్చుకున్నాడు. ప్రతిదాంట్లో తన మాటే నెగ్గాలనే వ్యసనాన్ని—తన ప్రత్యేక పద్ధతిలో, ప్రతిభావంతమైన ధోరణిలో విజయసాధన కుపయోగించుకున్నాడు. తుకతుకలాడే తన కోపంతో భుగభుగమండే ఖడ్గాన్ని రూపొందించి—మర్యాద, సౌమ్యతలను భంగ పరుస్తున్న ప్రతి అన్యాయ, అమానుషాలపైనా పోరాడ్డానికి వినియోగించాడు. తన కఠోర తీవ్ర దృష్టి, తలచిన పనికే అంకితమయ్యే ధోరణులనుండి హెర్క్యులస్‌వంటి శక్తిని ఆవిష్కరింపజేసుకుని—తనదోవకు అడ్డువచ్చిన ప్రతి ప్రతిబంధకాన్నీ అవలీలగా నెట్టివేయగలిగాడు.

బడుగుదేహం; అందునా అనారోగ్యం—అయినా, వీరేశలింగం తోటి మానవు లందరికంటె మహోన్నతుడు. ఆయన చిత్రాన్ని చూడండి: అదొక నిరుపేద తెలుగు పండితుని ప్రతిబింబం. ఆయన వాస్తవంగానే తెలుగు పండితుడు; ధోవతి, నిలువునా గుండీలు పెట్టిన కోటు, తలపాగా మాత్రమే ధరించే పండితుడు. ఆ ధోవతి నిరాడంబరంగా సాధారణంగా వుంటుంది. ఆ కోటు నలిగి, ముడతలుపడి, శరీరానికి దిగవేసిన గంతలా వదులుగా వుంటుంది. ఆ పైన అస్తవ్యస్తంగా నిర్లక్ష్యంగా చుట్టుకున్న తలపాగా, అయినా—ఈ అన్నింటి వెనుకా ఇతరుల కష్టాలను తనవిగా చేసుకున్న మహనీయుని హుందాతనం. రాబర్ట్ బర్న్స్ వేనోళ్ళ వర్ణించినట్టు: తన వ్యక్తిత్వ ప్రత్యేక ముద్రను "సర్వశక్తి సంపన్నుడైన భగవంతుని నుంచే సరాసరి సంక్రమింపజేసుకున్న" వాడు. నిర్మోహమాటంగా, నిర్భీకంగా, నిశితంగా బరపే చూపులు—స్పష్టంగా కళ్ళకక్కుడుతూనే వుంటాయి.



ప్రజాస్వామిక రాజ్యాంగం, అది ప్రసాదించిన ప్రాథమిక హక్కులు, బహుముఖ సంఘ సంస్కరణల నుద్దేశించిన చట్టాలుగల స్వతంత్ర భారతదేశంలో పుట్టిన వారికి—వీరేశలింగం తన సుదీర్ఘ సంక్షోభాత్మక జీవితంలో ఎంతటి బలవత్తర క్రూర జీమూత శక్తులతో పోరాడవలసి వచ్చిందో గుర్తించడం చాలా కష్టం. ఆ రోజుల్లో ప్రతి ఇంటా ఏమూలను చూచినా ఓ దయ్యం, ఏ వీధిలో చూచినా ఓ భూతవైద్యుడు, ఓ స్త్రీకి చదువు చెప్పించడం—మెదడు సక్రమంగావున్న ఏ పురుషుడూ చేయరాని దుస్సాహసం. ఎందువల్లనంటే—'చదువుకున్న భార్య ప్రియుల్ని ఆకర్షించడానికి వుత్తరాలు రాయదటో!'

ఆరోజుల్లో బాల్య వివాహాలు సర్వసాధారణం. తరచుగా—చంక విడువలేని చంటివాళ్ళకే పెళ్ళిళ్ళుచేసేవారు; పుట్టబోయే బిడ్డల క్కూడా సంబంధాలు ఖాయం చేసుకోడంకద్దు. బహిరంగ వేలంలో ఆడపిల్లను కొనుక్కొని పెళ్ళాడడం సర్వసామాన్యం. ఊరు పొమ్మంటుంటే, కాడు రమ్మంటున్న వృద్ధుడు కూడా ఏ దురదృష్టపు పసిబిడ్డ తండ్రికో లంచమిచ్చుకో గలిగితేచాలు—రెండోపెళ్ళి, మూడో వివాహం, నాలుగో కళ్యాణమైనా నిస్సంకోచంగా, నిరభ్యంతరంగా చేసుకోవచ్చు. కాని—ఏ స్త్రీ అయినా భర్తను కోల్పోతే ఇక ఏ పరిస్థితుల్లోనూ పునర్వివాహం చేసుకోకూడదు. ఆమె యింకా వ్యక్తురాలు కాని పసిదేకావచ్చు—అయినా నిర్బంధ వైధవ్యాన్ని అనుభవించి తీరవలసిందే!

పెళ్ళిళ్ళ సంతలో దళారీగా వ్యవహరించడం పూర్తిగా గౌరవనీయమైన వృత్తి! వేశ్య నుంచుకోవడం గౌరవ స్థాయికి గుర్తు. భోగంమేళం లేనిదే ఏ శుభసందర్భమూ తృప్తికరంగా పూర్తయినట్టు కాదు. వర్ణాంతరులే కాదు—ఒకే కులంలోని వివిధ శాఖలవారైనా కలసికట్టుగా భోంచెయ్యడం మహాపాపం. విదేశాలకు వెళితే సంఘవెలికి బలికావలసిందే. తోటివారిలో కొందర్ని తాకితేచాలు—

అపవిత్రత చుట్టుకుంటుంది. సూక్ష్మంగా చెప్పాలంటే నాటి సంఘానికి హృదయం లేదు– నైరాశ్యం, క్రూరత, వికృత లక్షణాలతో ఆత్మనే కోల్పోతున్న సంఘం అది. దాని ఆలోచనల్లో, ఆచరణల్లో ద్వంద్వరీతి – నీతి విధా నాల్లోకూడా పురుషుల కొకటైతే, స్త్రీల కింకొకటి, పెద్ద లనిపించుకునే కొద్దిమంది అదృష్టవంతుల కొకటైతే, మిగతా అందరికీ మరొకటి. అసలు ఆ సాంఘిక వాతావర ణమే దౌర్జన్యపూరితం; వాస్తవంగా కుళ్ళుకంపుకొడుతూ– స్వతంత్ర భావాల్నీ, మానవత్వ సంచలనాల్నీ గొంతు పిసుకుతున్న వాతావరణం. ఇలాంటి సంఘ శాపాల్నీ, కంకాళత్వాల్నీ ఎదుర్కొంటూ శ్రీ వీరేశలింగం పోరాడ వలసి వచ్చింది.

వీరేశలింగం ఇంతటి మ హా వీ రు డు కాగలడని ఊహించతగ్గ లక్షణాలు ఏవీ అతని బాల్యంలో కన్పించేవి కావు. అయిదేళ్ళ వయసురాగానే తండ్రిని కోల్పోయాడు. ఏకాకిగా మిగిలిన వితంతుమాత అతన్ని అపురూపంగా పెంచింది. రాజమండ్రిలో వారి పూర్వీకుల గృహంలో ఒక భాగంమీదవచ్చే నెలసరి అద్దె నాలుగు రూపాయలు. అదే వారి ఆదాయం. అయినా–ఆ రోజుల్లో జీవనవ్యయం అత్యల్పంగా వుండేదిగనుక అదే ఆ తల్లీబిడ్డల అత్యవస రాలకు లోపంలేకుండా సరిపోయేది.

ఈడుకు మించిన తెలివితేటలు, అద్భుత ధారణశక్తి గల వీరేశలింగం ప్రతి తరగతిలోనూ మెరిట్ స్కాలర్ షిప్పులు (ప్రజ్ఞనుబట్టి లభించే ఉపకారవేతనాలు) సాధించు కుంటూ, ఒక్కొక్క మెట్టే పైకెక్కాడు. బడిలో విజ యాలు సాధించడం, కొన్నాళ్ళు జబ్బుతో తీసుకోడం – వెలుగు, నీడల్లా వెన్నంటుతున్న ఆ కాలం ఆ తల్లీబిడ్డలకు సుఖప్రదమైనదనే అనాలి. ఆ దశలో అతనిలో విస్పష్టంగా కన్పించిన మరో గొప్పలక్షణం – సత్యసంధత, త్రికరణ శుద్ధిగా సత్యాచరణ! అంతేగాని ఏటి కెదురీదే విప్లవ మనస్తత్వపు సూచనలే లేవు

ఆకాలపు అందరి పిల్లల్లానే–అతనికీ చిన్నతనంలోనే పెళ్ళయింది. పైగా ఆ పెళ్ళి భోగంమేళాల్తోసహా–తల్లిగా రొక మేళం, మామగా రొక మేళం పెట్టించారు–రంగరంగ వైభోగంగా జరిగింది. ఆ తర్వాత విగ్రహారాధనకు విరోధి యైన వీరేశలింగం, చిన్నతనంలో మనస్ఫూర్తిగా విగ్రహ పూజ చేస్తూ, నిర్మోహ పరిత్యాగదృష్టితో కఠోర నియమ వ్రతదీక్షలతో మహాశక్తులను సాధింపవచ్చుననే ఊహా లోకంలో గడిపేవాడు.

అయితే–వీరేశలింగం ఏ వయసులో క్రమబద్ధమైన పూర్వాచారానుష్ఠాన ధోరణినుండి మలుపు తిరిగాడో? విప్లవబీజాలు అతనిలో ఎలా నాటుకున్నాయో? ఈ అంశాలు అతని జీవితంలోనేకాక, ఆంధ్ర చరిత్రలోనే గొప్ప మలుపు లనేమాట అక్షరాలా నిజం. కాని; ఆయన తన స్వీయచరిత్రలో ఎక్కడా ఈ పరిణామానికి తగు కారణాలను ఉటంకించలేదు; అక్కడక్కడా కొన్ని స్వల్ప సూచనలు గోచరిస్తాయి. ఆయన యథాలాపంగా కేశవ చంద్రసేనుని ఉపన్యాసాల గ్రంథం చదవడం తటస్థించిం దని, అప్పటినుంచీ సంఘామోదంగల అనేక విశ్వాసాలు, ఆచారాలపట్ల ఆయనలో సంశయాలు రేకెత్తాయనీ సూచ నాత్మకంగా గ్రహించవచ్చు. ఆ తర్వాత కొద్దికాలానికే పొరుగూరునుంచి రాజమండ్రికి బదిలీ అయిన ఒక ఉపా ధ్యాయునితో వీరేశలింగానికి సాన్నిహిత్యం ఏర్పడింది. ఆయన ప్రభావంతో వీరేశలింగం – రాజా రామమోహన రాయ్, దేవేంద్రనాథ టాగోర్, కేశవచంద్రసేన్‌వంటి బ్రహ్మసమాజ మహానాయకుల బోధల్లోగల అంతరాన్ని, లోతును గుర్తించ సాగాడు. కొత్తవిశ్వాసాలు ఉత్తేజాన్ని రేకెత్తించడంతో ఆయనా, మరికొందరు యువకులూ రహస్య సమావేశాలు జరపసాగారు. ఆ సమావేశాల్లో తమతమ అభిప్రాయాలను చర్చించుకునేవారు. ఈ రహస్య సమావేశాల్లో ఇంకేమేమి జరిగేవో మనం చెప్పలేం –

నార్ల వెంకటేశ్వరరావు

కాని: ఆ తెరవెనుకనుంచే-ఆధునికాంధ్ర నిర్మాతగా వీరేశలింగం ఉద్భవించాడు.

ఒక కొత్తదోవ తొక్కిన-తర్వాత, మళ్ళీ వెనక్కి తిరగడమనేది వీరేశలింగం నిఘంటువులో లేదు. ఆయనకు ముందుకు నడవడంమాత్రమే తెలుసు. బయలుదేరినప్పుడే-తన ప్రయాణం బహుదూరమనీ, కష్టతరమనీ, ఎన్నో ప్రతిపక్షశక్తుల్ని ఎదుర్కోవలసి వస్తుందనీ ఆయనకు తెలుసు. తన పోరాటం మనుషులతోకాదని, తరతరాలుగా ఆత్మవంచనకులోనై బూజుపట్టిన వారి హృదయాలతోనేనని: తన కింక ఎన్నటికీ శాంతి, విశ్రాంతి అనేవి లభించవనికూడా ఎరుగును. ఇవన్నీ తెలిసినా ఆయన తన లక్ష్యాన్ని సడలించక, తన పోరాటాన్ని కొనసాగించి అన్ని అడ్డంకుల్నీ అధిగమించాలనే వజ్రసంకల్పాన్ని పాదుకొల్పుకున్నాడు. ఒకేసారి బహుముఖంగా పోరాటం సలుపుతూ నిర్దాక్షిణ్యంగా ముందుకు సాగిపోయాడు.

ఈ విప్లవయాత్రకు కొన్ని సంవత్సరాల క్రితమే - సంఘాచారబద్ధుడుగా వున్నకాలంలోనే శ్రీ వీరేశలింగం రచనా వ్యాసంగాన్ని ప్రారంభించి, అనేక సంప్రదాయిక రచనలు చేశాడు. వాటినిగురించి ఒక్క-మాటలో చెప్పాలంటే-సంప్రదాయిక కవితారీతుల్లో పాండిత్యప్రకర్షకు, కఠినతర ఛందోవిధానాలపైగల అధికారానికీ నిదర్శనాలు. ఏమైనా మన అదృష్టవశాత్తూ అది ఒక తాత్కాలిక ప్రలోభదశమాత్రమే అయింది. ఆయన తనకుతానుగా ఆలోచించి ప్రారంభించిన క్షణంనుంచీ, అప్పటికి అధిక జనామోదం పొందుతున్న జీవితపు విలువలను సవాలు చేయ నారంభించినప్పటినుంచీ-ఆయనకు సాహిత్యంపట్ల గల దృక్పథంకూడా స్పష్టంగా మారిపోయింది.

కొత్తతరానికి-విషయంలో, విధానంలోకూడా కొత్తదనంగల సారస్వతం అవసరమని ఆయన భావించాడు. స్వతస్సిద్ధమైన శక్తి, కూలంకషత్వాలను జొనిపిన సారస్వతాన్ని విరివిగా సృష్టించసాగాడు. వేగంగా రచించే అలవాటున్నవాడే: ఇక చేయవలసింది ఆ వేగాన్ని ఏ కొత్త రీతుల్లో ఉపయోగించాలనే నిశ్చయంమాత్రమే. సారస్వతంలో కొత్తరీతులగ్గాను ఆయన ఆంగ్ల సారస్వతంవేపు-అప్పుడప్పుడూ సంస్కృత గ్రంథాలవైపు కూడా-మళ్ళవచ్చు. కాని తెలుగులో తనకుతానై ఒక వచన రచనా విధానాన్ని సృష్టించవలసి వుంది. వున్న వచనశైలి కృత్రిమంగా, ఊబిలో దిగబడినట్లుగా, నోరు తిరగనట్టిదిగా వుండేది. కొత్తరీతి ఇందుకు భిన్నంగా వుండాలి, ఈ నూత్నసృష్టిలో ఆయన చిరకాలం కీర్తి నిచ్చే విజయాన్ని సాధించాడు. ఆయన ప్రవేశపెట్టిన వచనశైలి సరళంగా, స్పష్టంగా, సులభ గమనంతో వుంటుంది. నేటి శ్రోతలకు ఆ శైలిలో వైవిధ్యం, పటుసంచలనం, ఒకానొకపట్ల లయకూడా లోపించినట్లు తోచవచ్చు, అయినా-అది గతకాలపు సారస్వత రీతి నుంచి, ఎంతో చక్కటి, నిష్పష్ట, హేతుబద్ధమైన పుంతలు తొక్కింది! ఒక జీవితాన్ని మహోన్నత కీర్తి శిఖరాలెక్కించడానికి ఆ సారస్వత సృష్టి ఒక్కటే చాలు! ఈ ఘనతకుతోడు - తెలుగు సారస్వతంలో మొట్టమొదటిసారిగా ఆయన ప్రవేశపెట్టిన అనేక రచనా రూపాలను జోడించండి. అప్పుడుగాని రచయితగా వీరేశలింగం చేసిన కృషిలోని గొప్పదనం, తీవీ మనకర్థం కావు.

వాస్తవంగా, ఆయన ఆధునిక తెలుగు సారస్వతానికి దోవ చూపిన ఆదిపురుషుడు. డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి చెప్పినట్టు; ''ఆయన సారస్వతరంగంలో పండిత శైలితో ప్రవేశించి; కమనీయ, సహేతుకత ఉట్టిపడే విస్పష్ట, సరళవచనా శైలిని సురుచిర సుందరంగా, మహోదాత్తంగా మలచడం వరకూ పరిణమించిన రచయిత. శ్లేష, చిత్ర కవితా రీతులతోను, వికృత కృత్రిమ లక్షణాలన్నింటితోను కుప్పిగంతులువేసే ప్రబంధ స్రష్టగా బయలుదేరిన ఆయన - తెలుగు నవల,

తెలుగు సాంఘికవ్యంగ్యరచన, తెలుగునాటకం. (అందునా సాంఘిక వర్గం), విజ్ఞానశాస్త్రం, శాస్త్రీయజీవితకథ, తెలుగులో స్వీయచరిత్రల సృష్టికర్తగా పయనించారు.''

వీరేశలింగం రచనల్లో అనేకం యిప్పుడు కాలదోషం పట్టినట్టుండేమాట నిజమే. ఆ రచనలు సృష్టింపబడిన కాలంలో పాఠకులను అలరించిన 'నవీనత' ఇప్పుడుండదు. వాటిని రచించేప్పుడు ఆయనలో వుండిన హడావుడి, వ్యసనతర ఆవేశతధోరణుల కారణంగా-శ్రేష్ఠగుణం దెబ్బతిందికూడా. ఆయన మొట్టమొదట ఏదిరాస్తే అదే ఛాయపుప్రతిగా చెలామణిచేశాడుగాని, దాన్ని మరోసారి చదవడం, సవరించడం, సాపుర్రాయడం వంటివి ఎరుగడు. ప్రతిపేజీనీ-చివరిపంక్తిమీద సిరా అన్నా ఆరీ ఆరకముందే అచ్చుకు పంపించడంకద్దు. ఆయన మేడమీద కూర్చునిరాస్తూ, కిందిభాగంలోవున్న అచ్చాఫీసులోకి ఎప్పటికాయితం అప్పుడే జారవిడవడానికి వీలుగా ఓ కంత చేయించాడు. ప్రపంచంలో మరేరచయితైనా ఇలాంటి పనిచేశాడని నేనింతవరకూ వినలేదు.

ఆయన ఒకోసారి ఎంతవేగంగా, ఎంత తీవ్రావేశంతో రచనలు సాగించేవాడో తెలుసుకోడానికి ఆయన స్వీయచరిత్రలోనే ఒక కథవుంది: పిల్లల్లేని పెద్దమనిషొకాయన వీలునామా వ్రాయకుండానే చనిపోయాడు. అతని బంధువులు శవంచుట్టూచేరి, ఆయన కెవరు తలగొరువు పెట్టాలనే విషయమై కాట్లకుక్కల్లా కొట్లాడుకోవడం ప్రారంభించారు. ఎవరు శ్రాద్ధకర్మలు జరిపితే వారే వారసులనే ముద్రపడి, మరణించినవాని ఆస్తిపాస్తులు చట్టరీత్యా పొందవచ్చుననే తాపత్రయంతోనే ఇదంతా! ఈ సంగతి పంతులుగారి చెవిని పడింది. అప్పటికప్పుడు – పచ్చి స్వార్థంతో జుగుప్సాకరంగా ప్రవర్తిస్తున్న ఈ గుంపును విమర్శిస్తూ- సునిశితంగా దెబ్బకొట్టే వ్యంగ్యనాటిక నొకదాన్ని వ్రాసి, అచ్చువేయించి, శవంచుట్టూ చేరిన బంధువులు ఆ పోట్లాట ముగించకముందే ఊరంతా పంచిపెట్టించాడు! వీసమెత్తు సంశయమైనాలేని మహామేధావియైనా సరే- ఇంతటి విద్యుల్లతా వేగంతో రచనలు చేస్తే, వాటిలో లోపాలూ, అపభ్రంశాలూ ఉండకతప్పదు. వీరేశలింగానికి ఈ విషయం బొత్తిగాతెలియదనుకోలేము. తన స్వీయచరిత్రలో తన సారస్వత కృషిని సమీక్షిస్తూ తాను సాంఘిక, మతవిషయిక సంస్కరణలలో మునిగి వుండకపోతే, రచయితగా మరింత రాణించి వుండేవాడినేమో నని రాసుకున్నారు. తనరచనల్లో ఎలాంటి లోపాలున్నప్పటికీ, అవి ప్రప్రథమ ప్రయోగాల వంటివనీ, తన తరువాతివారు ఆ రీతుల్ని మరింత పురోగమింపజేయగలరనికూడా రాశారు. తనమట్టుకుతాను- దోవా తెన్నూతోచని కీకారణ్యంలావున్న ప్రదేశంలో భావి తరాల వారి ప్రయాణ సౌలభ్యకోసం తానొకచక్కని దోవనేర్పరచ గలిగా నని సంతృప్తిపడ్డాడు.

సృజనాత్మక రచయితగా ఆయనలో వున్న లోపమే- సంస్కరణ ప్రబోధకుడుగా ఆయనకు పట్టుగొమ్మ అయింది. సంస్కరణోద్యమానికి – నిర్విరామ రచనా శక్తి అవసరం. అనుక్షణం వేయి కళ్ళతో చూస్తూ, విశితంగా పరిశీలిస్తూ, ఎదుటివార్ని ప్రేరేపిస్తూ, కలాన్ని సదా చేపట్టి వుండాలి. ఆ కలం – భావ సౌకుమార్యాన్ని గాని, నొప్పించరాదనే సంశయాన్నిగాని గుర్తించరాదు. ఎదుటివార్ని గాయపరచడానికి ఇష్టపడ్డమేగాక-ఖండించడానికి కూడా వెనుకంజ వేయకుండా వుండాలి; అవసరమైతే చిట్టంకట్టిన బుర్రల్ని బ్రద్దలు చేసే సుత్తిగా కూడా ఉపయోగపడాలి. వీరేశలింగంగారి కలానికి ఈ లక్షణాలన్నీ వున్నాయి, అంతకంటె ఎక్కువ గుణాలు కూడా కద్దు.

ఆ కలంతోనే ఆయన – పత్రికలు, కరపత్రాలు, సంభాషణలు, హాస్యనాటికలు, వ్యంగ్య రచనలు, ప్రచార రూపాలు సృష్టించాడు. ఎంతటి అలజడి రేకెత్తించిన ఉద్యమం అది! అది ఎన్ని రంగాల్లో కొనసాగింది!!

నార్ల వెంకటేశ్వరరావు

ఆ ఉద్యమం గమనం స్త్రీ విద్యనుంచి, నిర్గుణ నిరూప ఏకేశ్వరోపాసన వరకూ కొనసాగింది. ఈ మధ్యలో — దయ్యాలంటే భయపడే అల్పత్వాన్ని ఎగతాళి చేసింది; విగ్రహారాధనను ఖండించింది; బాల్య వివాహాల తప్పి దాన్నీ మూర్ఖత్వాన్నీ బట్టబయలు చేసింది; వితంతు పునర్వివాహాల్ని ప్రబోధించింది; భోగం మేళాలను తూర్పారబట్టింది; వర్ణాంతర సహపంక్తి భోజనాల పద్ధతిని ప్రోత్సహించింది: ఆధునిక శాస్త్రీయ విజ్ఞానాన్ని ప్రసరింపజేసింది; అధికా రోద్యోగ బృందంలో గల లంచ గొండితనాన్ని రూపుమాపింది; ఇంకెన్నో ముఖాల విజయం సాధించింది. ఒక్క వాక్యంలో చెప్పాలంటే: తెలివిడి, స్వచ్ఛందతగల పరిపూర్ణ జీవితాన్ని గడప వలసిందని ప్రజానీకానికి చేసిన పటుతర విజ్ఞప్తే ఈ ఉద్యమం.

ఛాందసాచార, మౌఢ్యశక్తుల ప్రతినిధులు ఎంతో దృఢంగా, నిశితంగా, రాక్షసంగా ఎదిరించినప్పటికీ శ్రీ వీరేశలింగంగారి నిరంతర ప్రబోధం క్రమక్రమంగా విజయాలు సాధిస్తూ — ఆంధ్రదేశంలో "విజ్ఞాన రేఖల యుగాన్ని" ప్రభవింపజేసింది. ఇది — సహాయ సంప త్తులులేని ఒకే ఒక్కవ్యక్తి కృషి. అయినా — దీన్ని వోల్టేర్‌నుంచి కన్‌డోర్‌సెట్ వరకూగల ఫ్రెంచి విప్లవ కారులంతా కలసి సాధించిన (అంతటి ప్రపంచ పరీవ్యాప్తి ప్రాభవం లేకపోయినా) మహత్త్వంతో పోల్చవచ్చు.

వీరేశలింగం కార్యశూరతగల ఆదర్శవాది. అందువల్ల తన ప్రబోధాలను ఆచరణలోపెట్టి బలిష్ఠం చేసేవాడు. విద్య, విజ్ఞానాలు వ్యాపింపజేయడానికి విద్యాలయాలు ప్రారంభించాడు. అప్పటి కాచరణలోవున్న పద్ధతిని వదిలి హరిజనుల్ని కూడా తన విద్యాలయాల్లో చేర్చు కున్నాడు. వారికీ, బాలికలకూ ఉచిత విద్యార్జనావకాశాలు కల్పించాడు. దురదృష్టవంతులైన బాలవితంతువులు తమ తలిదండ్రుల నిర్దాక్షిణ్య పంజరాలనుంచి తప్పించు కుని స్వతంత్రులు కాదలచినప్పుడు, పునర్వివాహితలు కాదలచినప్పుడు వారి కాశ్రయ మిచ్చేందుకు వితంతు శర ణాలయం నెలకొల్పాడు. తనకు బిడ్డ ల్లేనందువల్ల — తన సహాయాన్నర్థించే ప్రతి ఒక్కరికీ దత్తు తండ్రి అయ్యాడు.

ఆయన ఒక పురమందిరం కట్టించాడు. తన పుస్తకా లన్నీ దానంచేసి ఒక గ్రంథాలయ స్థాపనకు కారకు డయ్యాడు పుస్తక పఠనాన్నీ చర్చలనూ ప్రోత్సా హించాడు. చివరికి తన ఆస్తిపాస్తు లన్నింటినీ — తను స్థాపించిన సంస్థల నిర్వహణార్థం విరాళంగా ఇచ్చి వేశాడు. వీరేశలింగం తన కార్యక్రమాలకుగాను ఇతరుల నుండి స్వీకరించిన పెద్ద మొత్తం ఒకే ఒక్కటి. పితా పురం రాజావా రిచ్చిన ఆ మొత్తంతో — రాజమండ్రిలో తను స్థాపించిన హైస్కూలుకు భవనాలు కట్టించాడు. ప్రజోపయోగానికై తాను నిర్మింపజేసిన ఇతర భవ నాలకూ, నెలకొల్పిన సంస్థలకూ వెచ్చించిన ధనంలో హెచ్చుభాగం తన పుస్తకాల మీద వచ్చిన ఆదాయమే.

ఆయన జీవితం నిరాడంబరమైంది అసలు ఆయనకి స్వంతాని కొక్కవలసింది చాలా స్వల్పం. వ్యక్తిగత ఖర్చు విషయంలో ఆయన దాదాపు పిసినారిగా వుండేవాడు ఆయన 'విలాసంగా ఖర్చు పెట్టా' డని చెప్పుకోదగ్గది ఒకే ఒక టుంది. అది రాజమండ్రిలో తాను ఏర్పరచిన 'ఆనందోద్యానం'. ఆ తోటకు మాత్రం ఎక్కువగా ఖర్చు పెట్టేవాడు. భారతదేశంలో ప్రతి ప్రాంతంనుంచీ రకరకాల మొక్కలు సేకరించి, ఈ వనంలో నాటించి, తండ్రిలా పెంచేవాడు. ఆయన వృద్ధాప్యంలో ఈ వనంలో కూచ్చుని — అందలి నిత్య వసంత శోభనూ, నును లే చివుళ్ళ సౌందర్యాతిశయాన్నీ ఆస్వాదిస్తూ గంటల తరబడి కాలం గడిపేవాడు. బహుశా — తాను కలలుగన్న 'ఆదర్శ సాంఘిక వ్యవస్థ' నిత్య నూతనత్వాన్ని సంత రించుకోవడం ఆ వనలక్ష్మిలో దర్శించుకునేవాడేమో!

ఆయన ధర్మపత్ని శ్రీమతి రాజ్యలక్ష్మమ్మను గురించి క్లుప్తంగానైనా చెప్పకపోతే — వీరేశలింగంగారికి మనం సమర్పించే శ్రద్ధాంజలి పరిపూర్ణంకాదు. సమకాలిక సంఘంతో నిత్యా సంఘర్షణపడుతూ, విగ్రహారాధనా వ్యతిరేకియైన భర్తతో కాపురం చెయ్యడం అంత తేలిక్కాదు. ఆయన్ని ఉత్తేజపరచిన విశ్వాసంగాని, ఎన్ని అవాంతరాలు వచ్చినా అంతిమ విజయం మాత్రం మనదే ననే ఆత్మవిశ్వాసపు పట్టుదలగాని ఆమె ప్రకృతిలోలేవు. ఆమెకున్న విద్య అంతంత మాత్రం; పుట్టి పెరిగిన వాతావరణం పూర్తిగా పూర్వాచారసంపన్నం; నిమ్మకు నీరెత్తినట్టు మిన్నకుండే మనస్తత్వం—ఆమె కీర్తి ప్రచారాలకోసం ప్రాకులాడలేదు. అయినా—భర్త చెప్పేదాన్నీ, చేసేదాన్నీ సంతోషంగా సమర్థిస్తూ, ప్రతివిషయంలోనూ ఆయనకు దన్నుగా నిలబడింది. ఒకవిధంగా చూస్తే వీరేశలింగం భరించిన కష్టనష్టాలకంటె, ఆమె సహించినవే గురుతరాలు తనను శరణుజొచ్చిన ప్రతి బాలవితంతువుకూ ఆశ్రయమివ్వడం ఆయనకు సులభమే. కాని—రాజ్యలక్ష్మమ్మ అలా చేరినవారికందరికీ తిండీతిప్పలూ చూడాలి, గుడ్డలదగ్గర్నుంచీ అన్నీ సమకూర్చాలి; వాళ్ళ తల్లుల్ని మరపించే ప్రేమ, వాత్సల్యాలతో సాకాలి; ఇదంతా సాధారణ స్త్రీలు చెయ్యగల పనేమీకాదు.

ఆమె వంటవాణ్ణి పెట్టుకుందామన్నా సాంఘిక కట్టుబాట్లభయం కారణంగా ఎవరూ ఆ ఛాయలకు వచ్చేవారు కాదు. ఇతర పనిమనుషులైనా దొరికేవారుకాదు. ఇంట్లో చేరే ఆశ్రితుల సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతుండేది. అందునా పరస్పర పరిచయంలేని వివిధ ప్రాంతాలనుంచీ వచ్చే, విభిన్న మనస్తత్వాలుగల వారినందర్నీ తన బిడ్డల్లా సాకాలి, ఆత్మదైన్యంతో కుములుతూండే ఒక్క వితంతువును సంబాళించాలన్నా తలప్రాణం తోకకొస్తుంది. అలాంటి వితంతువుల్ని అనేకమందిని ఆమె తృప్తిపరచవలసి వుండేది. నానాయాతనాపడి ఆ బాలవితంతువులకు పునర్వివాహంచేసి కాపురానికి పంపించిన తర్వాతకూడా, కొందరు పదేపదే ఈ దంపతులసహాయం కోరుతూ ఇబ్బంది పెడుతూండేవారు. వాళ్ళు ప్రత్యేక సంసారం పెట్టుకోడానికి ప్రాథమిక సహాయాలన్నీ చేసినా తృప్తిపడక— తమకు నెలసరిబత్తాలు కావాలనీ, కొత్తబిడ్డ పుట్టినప్పుడల్లా తమకింకా ఎక్కువ సహాయం చెయ్యాలనీ అడుగుతూ— ఈ దంపతుల్ని దుంపతెంపుతూండేవారు. ఎవరిమేలుకోసం తాము నానాయాతనలూ పడి, సమాజానికి దూరమై, త్యాగాలుచేస్తున్నారో—వాళ్ళే కృతఘ్నులై, కఠినదుర్భాషలాడుతూంటే ఈ పుణ్య దంపతులు సహించవలసిన సందర్భాలుకూడా చాలా వున్నాయి.

ఆమెవలె ఆత్మస్థైర్యమూ, భర్తను పూర్తిగా ఆరాధించే తత్వమూ లోపించిన మరే స్త్రీ అయినా సరే ఈ కష్టనష్టాల తాకిడికి, గుండె పగిలిపొయ్యేది. వీరేశలింగం ఎంతటి సాధారణ ఉదాత్త స్వభావాలు గలవాడో — రాజ్యలక్ష్మమ్మ అణగి మణగియుండే తన సహజ ధోరణిలో అంతకంటే అసాధారణ ఉదాత్తతగల సాధ్వి.

అంతకుముందు తరంవారైన రెనడే, విద్యాసాగరుల వలె — వీరేశలింగం కూడా రాజకీయ దృక్పథంలో మితవాది. అంటే; ఆయన రాజకీయ స్వాతంత్ర్యాశయాన్ని విశ్వసించలేదని కాదు; బ్రిటిష్ వారితో గల సంబంధం మొత్తం మీద భారతీయుల జీవిత విధానాల్ని ప్రభావితం చేసి బాగుపరచగలదని ఆశించేవారు. మన సంస్కృతి, నాగరికత బూజుపట్టి ఊబిలో కూరుకుపోయిన తరుణంలో బ్రిటిష్వారి సంస్కృతీ ప్రభావం కొంత స్వతంత్ర, సహేతుకతల్ని అందిస్తున్నదని ఆయన దృఢ విశ్వాసం. మనం పొందే రాజకీయ స్వాతంత్ర్య ఫలితాన్ని మనం పూర్తిగా అనుభవించాలంటే— అంతకు ముందే సాంఘిక, విద్యారంగంలో సంస్కరణలు పాదుకొనాలని ఆయన ఉద్ఘాటించారు. అజ్ఞానంలో ఛాందసాచార

మూఢవిస్వాసాలలో మునిగి తేలుతున్న జాతి _ తనకు తానుగా విజ్ఞతగల ప్రభుత్వ విధానాన్ని అమలు జరుపుకోలేదు. సర్వతోముఖాభివృద్ధిని సాధించలేదని ఆయన వాదం. జాతీయ కాంగ్రెసు మొదటిరోజుల్లోనే అందులో సభ్యుడుగా చేరారు. ఒకవార్షిక సమావేశానికి ప్రతినిధిగాకూడా హాజరైనారు. సామ్రాజ్యవాద ప్రతినిధియైన లార్డ్ కర్జన్ ఉత్తర్వుల ప్రకారం బెంగాలు విభజన జరిగిన తర్వాత, కాంగ్రెసు అధ్వర్యాన తలెత్తిన 'వందే మాతరం' ఉద్యమంతో వీరేశలింగం ఏకీభవించలేక పోయాడు. అందువల్ల ఆకాలపు యువకుల్లో ఆయన పై కొంత విముఖత ఏర్పడింది. అయినా_ ఆయన తన విశ్వాసాన్ని సడలించుకోక, సహజధైర్యాన్ని ప్రదర్శించాడు తన రాజకీయాభిప్రాయాన్ని విడవకుండా; విద్యా సాంఘిక సారస్వత రంగాల్లో తనకృషిని మరింత శక్తిమంతంగా కొనసాగించాడు.

"సమగ్రంగా పరిశీలిస్తే, వీరేశలింగం ఈ ఆధునిక యుగపు ఆంధ్రుల్లో అగ్రగణ్యుడు. ఒక నూతనయుగావతరణ పరిణామాల్ని ఆయన తన జీవితంలో క్లుప్తంగా ప్రతిబింబించారు...అనేకమంది _ తామున్న యుగంమీద ఎలాంటి కాంతినీ ప్రసరించకుండానే బ్రదికి పోతారు. వారికి వెలుగు నివ్వడంగాని, వెలుగును పొందడంగాని చేతగాదు. నిత్యనవోత్తేజాన్ని పొందుతూ, నవనవోన్మేష తను సృష్టించే వాడే మహాపురుషుడు. నిరంతర పరిణామ, పురోగమనా లనే ఫలభరిత సూత్రమే నవోత్తేజం; అదిలేని జీవితం వర్థి చెత్తగా, జడపదార్థంగా, అవాంఛనీయంగా తయారవుతుంది. వీరేశలింగం ఈ నవయుగ నిర్మాతల్లో ఒక స్రష్టగనుక, ఈ యుగభావాలను ప్రతిబింబించాడు. ఒకవేళ_ ఆయన ఈ యుగకర్త అయితే, అది తానీయుగసృష్టిలో ఒక వ్యక్తికూడా కావడంవల్లనే. యుగధర్మంచేత ప్రభావితం కావడానికి సిద్ధపడిన వారు మాత్రమే యుగధర్మాన్ని సృష్టించగలరు."

డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి చెప్పిన ఈ మాటలతో కొద్దిగా వ్యతిరేకిస్తున్నాను. వీరేశలింగం ఆంధ్రదేశంలో నవయుగ 'నిర్మాతల్లో ఒకస్రష్ట' మాత్రమే కాదు; ఆయన నవయుగానికి ఏకైకసృష్టికర్త అని నా అభిప్రాయం. రాజారాంమోహన్‌రాయ్‌కి— రవీంద్రనాథ టాగోర్ సమర్పించిన ప్రశంస ధోరణిలో, నేను వీరేశలింగాన్ని 'ఆంధ్రదేశంలో మొట్టమొదటి ఆధునికవ్యక్తి' యని అభివర్ణిస్తున్నాను. శత్రువులకు సింహస్వప్నం, అనేక తీవ్రయుద్ధాలలో విజయుడు, స్వతంత్ర భావుకత నిర్భయ కార్యాచరణలకు మురువుబొట్టు; అభ్యుదయ విజ్ఞానాలకు వైతాళికుడు; సారస్వతస్రష్టగా, విద్యావేత్తగా, సంఘసంస్కర్తగా ఎంతటి మహత్తరవ్యక్తో_ మానవుడుగా అంతకంటె మహోన్నత మనీషి.



# వీరేశలింగం భాషాసేవ

శ్రీ తాపీ ధర్మారావు

కందుకూరి వీరేశలింగం పంతులు పేరు వినేసరికి ఆంధ్రాభిమానులకు కనబడేది ఒక మహాద్భుత దృశ్యం. యాభయి సంవత్సరాల నిడివిని, ఆంధ్రదేశమంతటి విస్తీర్ణమును కలిగిన వెండి తెరమీద, అనేక రసవంతాలైన సన్నివేశాలతో నిండిన ఒక మనోహర చలన చిత్రము చూచినట్లవుతుంది. ఒక చిన్నబడి తెలుగు పంతులు వీరావేశముతో విజృంభించి, అడ్డుతగిలిన శత్రుకోటిని హతమార్చి, విజయపరంపరలను సాధించడం కనబడుతుంది. సాహిత్య రంగములోను, సంఘ రంగములోను పేరుకొనిపోయి వున్న దురాచారములను నిర్మూలన చేసి, ప్రజాసామాన్యానికి విజ్ఞాన వికాసాలు సమకూర్చిన కథానాయకుడి చరిత్ర గోచరిస్తుంది.

వీరేశలింగం పంతులు వ్రాసిన పుస్తకాలు, నడిపిన పత్రికలు, చేసిన వుపన్యాసాలు, పూనుకున్న ప్రయత్నాలు, సాధించిన విజయాలు, అన్నీ ఒక్కసారిగా చూస్తే ఎటువంటి వారికైనా విభ్రాంతి కలగక మానదు. దాదాపు నూటయాభై రచనల జాబితాచూస్తే యేదో పుస్తకాల షాపువారి క్యాటలాగులాగ కనిపిస్తుంది. వివిధ రంగాలలో అతడు సాధించిన విజయాలను గురించి ముచ్చటిస్తే యేవో అతిశయోక్తులు అల్లుతున్నట్లనిపిస్తుంది; నిర్మించిన సంస్థలను గురించి చెప్పాలంటే కేవలం స్తోత్రపాఠం లాగా వుంటుంది. పదిమంది వుత్సాహపూరితులు తమ పది జీవితకాలాలలోను సాధించలేని కార్యాలను ఆ మహానుభావుడు తన ఒక్క జీవితకాలములోనే సాధించాడు.

ఇటువంటి వారినే ఇంగ్లీషులో "జీనియసెస్" అంటారు. అంటే మహా మేధావి, మహా నైపుణ్యము, ...అన్ని మహా గుణాలు కలవాడని భావము. ఎక్కువ పనిచేయగల సమర్థతే "జీనియస్" అని కార్లైల్ మహాకవి సూక్ష్మంగా నిర్వచనం చెప్పాడు. (ఇక్కడ సమర్థత అన్నది గుణపరంగాను, వస్తుపరంగాను, అన్వయించుకోవాలి). ఈ జీనియస్ అన్న మాటకు తగిన పర్యాయ పదము మనకులేదు. మితిమీరిన పనిచేసేవాడిని "అబ్బా రాక్షసిలాగ పనిచేసేవాడు" అని, "వాడు రాక్షసి చదువు చదువుతాడు". అని మనము వాడుతుంటాము. ఇంగ్లీషులో మహా మేధావులను "Intellectual giants" అంటారు. మన సాహిత్యంలో కవిరాక్షసు లున్నారు. ముద్రారాక్షసములో మంత్రిరాక్షసు డున్నాడు. కాబట్టి జీనియస్‌కు "రాక్షసి" అని పర్యాయపదం వాడితే క్షమిస్తా రనుకుంటాను. అప్పుడు, రామానుజాన్ని గణిత రాక్షసిగాను, సి. వి. రామన్‌ని కాంతి రాక్షసిగాను చెప్పుకోవచ్చును. ఈ సూత్రము ప్రకారం మన కందుకూరి వీరేశలింగం సాక్షాత్తు రాక్షసి; మానవ మాత్రుడు కాడు.

తన 22 వ యేట (1870) లో వీరేశలింగం మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. అప్పటికే అతడు సంస్కృతాంధ్రాలలో మంచి పాండిత్యం సంపాదించి చక్కని కవిత్వం చెప్పుతూవుండేవాడు. చక్కని వాక్పటుత్వము తర్కబుద్ధి గల యువకుడు కాబట్టి ప్లీడరీ చదివితే బాగా రాణించడమే కాక ధనార్జనకు అనుకూలంగా వుంటుందని అనేకులు ప్రోత్సాహపరిచారు. కాని పంతులు ఆ ఊహను నిరాకరించాడు. ఆ నిరాకరణ ఆంధ్రదేశానికంతటికీ ఒక మహోపకార మయిందని వేరుగా చెప్పనక్కరలేదు.

తాను పేద పరిస్థితులలో నున్నప్పటికి అతనిబుద్ధి ధనార్జనమీదికి పోలేదు. ధనమంటే పెద్ద గౌరవము అతని కెన్నడూ లేదు. అతనికిముఖ్యమైన విషయాలు న్యాయము, విజ్ఞానము, సత్ శీలము. అన్యాయము జరుగుతూ వుంటే చూచి మనకెందుకు అని వూరుకునే స్వభావము కాదు. యెంతకష్టపడియైనా దానిని ప్రతిఘటించి, దాని అంతు తెలుసుకొని, అంతమొందించేవరకు నిద్రపోయే వాడు కాదు. ఆ అక్రమాన్ని వేళ్ళతో పెకలించితేగాని అతనికి తృప్తి కలుగదు. ఈ సిద్ధాపముతోనే ఆనాటి హరిజనులకు, స్త్రీలకు కలుగుతుండే అన్యాయాలను తొల గించే సంఘ సంస్కరణ మహాకార్యమును సాధించాడు. అలాగే ఆ దినాలలో ప్రకోపించివుండిన మూఢ విశ్వాసాలు, అధికారుల లంచగొండితనాలు మొదలైన అనుచి తాలను నిర్మూలనము చేయుటకు పూనుకున్నాడు. ప్రజా బాహుళ్యములో వ్యాపించియున్న అజ్ఞానాన్ని రూపుమాప డానికి సర్వవిధాల ప్రయత్నించి కృతార్థుడయ్యాడు. ప్లీడరీ అయివుండినట్లయితే యిన్ని సంస్కరణలు, ఇంత భాషోద్ధరణ ఆ స్వల్పకాలములో నెరవేరివుండగలవని అనుకోలేముగదా ?

అద్భుతమైన వివేచన, కుశాగ్రబుద్ధి, సునిసితమైన విమర్శన, సర్వంకషమైన పరిశీలన, మహాసముద్రమంత ఓపిక-ఇవన్నీ కందుకూరి సొమ్ము. వీటితో అతడు తల చుట్టూ కన్నులు బెట్టుకొని ప్రపంచాన్ని చూచేవాడు ఆ నాటి ఆంధ్రసమాజస్థితి ఆ లేత హృదయానికి మహా వేదన కారణమయింది. ఆ స్థితి నుద్ధరించుటే తన కర్తవ్యమని కంకణం కట్టుకున్నాడు. కావలసిన శాస్త్ర పరిజ్ఞానం సమకూర్చుకొని ప్రతివాదిభయంకరు డయ్యాడు. పత్రికలు, గ్రంథాలు, ఉపన్యాసాలు, వాదనలు వీటితో స్త్రీ విద్య, విధవా వివాహాలు, హరిజనోద్ధరణ మొదలైన సంస్కరణలను యెలాగు సాధించాడో ఆంధ్రు డెన్నడూ మరువడు.

వీరేశలింగం భాషాసేవ

పూర్వకాలపు మెట్రిక్లేషను కాబట్టి ఇంగ్లీషులో ఇప్పటి బి ఏ. ల కంటే మెరుగే అని అంగీకరించాలి. ఆ భాషా జ్ఞానంతో పంతులు ఆంగ్ల సారస్వతాల్ని చాలవరకు చది వాడు. దానిలోని కొత్తదనాన్ని చూచి ముగ్ధుడయ్యాడు. షేక్స్పియర్ నాటకాలు, వానిలోని స్వభావ నిరూపణాది గుణాలు మనసు నాకర్షించాయి గోల్డ్స్మిత్, 'వికార్ ఆఫ్ వేక్ఫీల్డ్' యెంతచక్కని రచన అని అనిపించింది. స్విఫ్ట్ వ్రాసిన 'గలివర్స్ ట్రావెల్స్' లోని వ్యంగ్యం హృదయంగమంగా తోచింది. ఇంకా యెన్నో సుప్రసిద్ధ ఆంగ్ల గ్రంథాలు చూశాడు. ఆ రచనలు నడచిన పుంతలు గుర్తించాడు. అవి మన సంస్కృత కవుల పుంతలూ కావు, తెలుగు రచయితల పుంతలూకావు; కొత్త పుంతలు, చాల మనోహరంగా వున్నాయి.

అయ్యో, ఇలాంటి పుంతల గ్రంథాలు మనకులేవే అని చింతించాడు. ఆ లోపాన్ని తీర్చినట్లయితే తెలుగు భాషా సాహిత్యం బాగా శోభిస్తుందని నమ్మాడు.

ఆ దృష్టితో మన తెలుగు సారస్వతం చూచాడు. కొన్ని శతాబ్దాల దూరంలో నన్నయాదుల పురాణాలూ, శ్రీనాథాదుల ప్రబంధాలు, తంజావూరు యక్షగానాలు కని పించాయి దగ్గరగా పసలేని వ్యసనాలుగా పరిణమించిన ఒరవడి ప్రబంధాలు వెర్రితలలు వేస్తూ కనిపించాయి. కొందరు వచన రచనలు చేయపూనారు ఒక పక్కను మిషనరీలు తమకు వచ్చిన తెలుగులో బైబిల్ భాషాంతరీ కరణలు సాగిస్తున్నారు. 1857 లో స్థాపించిన మద్రాసు విశ్వవిద్యాలయంలోని చిన్నయసూరిగారు నీతిచంద్రిక కొంత వ్రాసి దివంగతులయారు. బ్రౌను, మెకంజీ దొరలు అనేకవిధాల భాషోద్ధరణకు పూనుకొన్నారు. "నిఘంటు రచనకు ప్రయత్నం సాగుతూవుంది."

నాటకాలులేవు, నవలలులేవు; వ్యంగ్య రచనలులేవు, జీవితచరిత్రలు లేవు; శాస్త్రగ్రంథాలులేవు; అక్షరజ్ఞానము మాత్ర మున్నవారు చదివి గ్రహించగల పుస్తకాలులేవు;

కవుల విషయాలు తెలిపేగ్రంథాలు లేవు. ఇటువంటి లోపాలు తీర్చాలంటే, సరళమయి సుబోధమైన వచన రచన చెయ్యాలి. అలా చేస్తే "ఎబ్బే! వీడు పండితుడు కాడు" అంటారు; రచనలకు విలువ ఉండదు. అందుచేత మొదట పండితలోకంలో తనకొక సుస్థిర స్థానం నిర్మించుకోవాలి. ఇతడు అభాజనుడు కాడు; గట్టి పండితుడే అని అనిపించుకోవాలి. ఆరోజులలో శ్లేష కవితలు, గర్భ కవిత్వాలు, బంధ కవిత్వాలు, నిర్వచనాలు, నిరోష్ఠ్యాలు—ఇలాంటివి అయోమయంగా వ్రాసినవారే కవి ప్రకాండు లనిపించుకొనేవారు.

అందుచేత తానుగూడ శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమును, ప్రబోధ చంద్రోదయమును వ్రాసి పండిత ప్రకాండుడై ఆచార్య స్థానమును అలంకరించిన చిన్నయ సూరి అసంపూర్ణంగా విడిచిపెట్టిన నీతిచంద్రికలోని సంధి, విగ్రహ లన్న భాగాలను పూర్తిజేసి సూరియంతటివాడే యనిపించుకున్నాడు

ఆ పాండిత్యము, ఆ కవితాధార, ఆ ఊహా చాతుర్యము కల్పనా కౌశలము వున్నవాడు తానొక రామాయణాన్నో భారతాన్నో రచియించి వున్నట్లైతే కందుకూరిపేరు ఈ నాటి దేశగ్రంథాలయాల్లో, పెద్దగ్రంథాల బీరువాలలో చిరస్థాయిగా నిలిచివుండేది. తాను నన్నయ, తిక్కన భాస్కరాదులతో సాపత్న్యము పొందగలిగి వుండేవాడు. కాని ఆ భాషాసేవకుడు అలా ఆలోచించలేదు. అదిగూడా తెలుగు సారస్వతానికి మహోపకారమైనది.

అతనికి కావలసినది తన గొప్పతనము ప్రకటించుకోవడం కాదు. తెలుగు రచనలను కొత్త సాహిత్య రూపాలలో ప్రదర్శించి, వాటిలోని విశిష్టతను పాఠకులకు గ్రంథకర్తలకు రుచిచూపి ఆంధ్ర వాఙ్మయాన్ని పరిపుష్టము చేయడమే అతడు కోరినది. దారి చూపినట్లయితే తెలుగు ప్రతిభ ఆ పుంతలలో నడచి ఉత్తమోత్తమ రచనలతో ఉన్నతస్థాయికి పోవచ్చును కదా అన్న ఆశ. సులభంగా బోధపడే పద్ధతి నవలంబించడంవల్ల రచనలలోని వివేక విజ్ఞానాలు పాఠకుల మనసులకు నాటుకొని వారిని వివేకవంతులుగా చేయవచ్చును గదా అన్న వూహ. ఒక వంక నూతన సాహిత్యరూపాలు అందజేస్తూనే తన ప్రధాన లక్ష్యమైన సంఘ సంస్కరణ ప్రచారము సాగించుకుంటూవుండవచ్చునన్న ధైర్యము. ఆనాటికే అభాసుపాలై అసహ్యాకరంగా పరిణమించిన నిస్సార ప్రబంధం వ్యామోహము పోగొట్టి సాహిత్యానికి నూతనవికాసము భవిష్యత్ అభ్యుదయము సమకూర్చవచ్చునన్న తలంపు.

నాటకాలు లేవన్నకొరత తీర్చడానికి సంస్కృతము నుంచి శాకుంతలము, మాళవికాగ్ని మిత్రము, రత్నావళి మొదలైన నాటకాలను తెలుగులోనికి అనువదించాడు. ఆంధ్రనాటక వాఙ్మయములో మొదటినాటకము వీరేశలింగానిదే.తరువాత తరువాత ఎందరెందరో శాకుంతలాన్ని భాషాంతరీకరించారు. కాని, ఈనాటిదాకా ఆంధ్రరంగస్థల ఆదరణపొందుతూవున్నది కందుకూరి శాకుంతలమేఅంటే అతని ప్రతిభ ఎంత అసాధారణమో తేటపడుతుంది

విజ్ఞానం విస్తరిల్లుతున్న కొలది వచనరచనకు ఎక్కువ ప్రాధాన్యం కలుగుతుందని గ్రహించి, ఆ రచనకు తగిన పునాదులు వేయడానికి పూనుకున్నాడు. ఆ రచన చిన్నయసూరిగారి నీతిచంద్రికలాగుంటే ప్రయోజనం లేదని నిరాకరించి, తేట మాటలతో, సులభ వాక్య నిర్మాణంతో, విషయం కరతలామలకంగా తెలిసేలాగుండే రచనకు అంకురార్పణ చేశాడు. ఆంగ్లభాషలో ప్రసిద్ధినంది అనేక ఖండాంతర భాషలలోనికి తర్జుమా అయిన ''వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు'' ''గలివర్సు ట్రావెల్సు'' లాంటి మంచివి ఎంచుకున్నాడు. అన్యభాష, అన్యదేశ విషయం ఎంత జాగ్రత్తగా భాషాంతరీకరించినా అది ఎరువుల సొమ్ముగానే వుంటుంది గదా! ఈ సత్యాన్ని గుర్తించి పంతులు అలాచేయలేదు. ఆంగ్లేయ రచనలోని మూలసూత్రాన్ని పట్టుకొని మనజాతి జీవనంలోంచి

తాపీ ధర్మారావు

అలాంటి సన్నివేశాలను ఊహించి స్వతంత్ర రచనగా వ్రాసాడు. అలాంటివే రాజశేఖర చరిత్ర, సత్యరాజ పూర్వదేశయాత్ర, ఆడమళయాళము మొదలయినవి. మొదటిది కుటుంబజీవితంలోని లోపాలోపాలను విశద పరుస్తుంది. రెండవది రాజకీయార్థికాది విషయాలను గురించిన వ్యంగ్యరచన, మూడవది చక్కని హాస్యముతో పురుషులు స్త్రీలకెంత అన్యాయము చేస్తున్నారో ప్రత్యక్షముగ కనబరిచే రచన.

వీటికితోడు వుండనేవున్నాయి అతని పత్రికలు, ప్రహసనాలు—తన రచనావిధానం వ్యాపించడానికి. వీటన్నిటికీ ప్రజాదరణ ఎక్కువగా వుండడంచూచి పండితులూరుకోలేక పోయారు. వట్టి పేలవ రచన లన్నారు. ఇక్కడ వ్యాకరణదోష ముందన్నారు. అక్కడ సంధి కలవలే దన్నారు. ఎగతాళి చేశారు. ఆకూతలు లెక్క చేయకుంచా తన రచన మదపుటేనుగులాగా నడుచుకుంటూ పోయింది.

తర్కశాస్త్రం, శారీరక శాస్త్రము, ఖగోళశాస్త్రము ఇలాంటి ప్రకృతి శాస్త్రాలను అనువదించడానికి అంకురార్పణ చేశాడు, విక్టోరియా, జీసను క్రైస్తు మొదలైన ఉదారాశయుల జీవిత చరిత్రలు వ్రాయడానికి భవిష్యత్ రచయితలకు దారిచూపించాడు. అంతేకాదు ఆ నాటికి ముద్రణభాగ్యం లేకుండా పడివున్న మహాకవుల ఉద్గ్రంథాలు కొన్నింటిని పరిష్కరించి ముద్రింపించి వాఙ్మయ పోషకుడయాడు. వాటిలో నాచన సోమన్న ఉత్తర హరివంశము, అయ్యలరాజు అనంతామాత్యుడి భోజరాజీయము, కాకుమాని మూర్తి పాంచాలీ పరిణయము, మొల్లరామాయణము—ఇటువంటి గ్రంధా లున్నవంటే అతని విచక్షణ, ఔదార్యము, భాషాభివృద్ధికాంక్ష చక్కగా తేటపడుతుంది. ఎన్నెన్ని చెప్పగలము, చెప్పితే నేను మనవిచేసినట్లు అది ఒక క్యాటలా గవుతుంది.

పండితులతోను, ప్రజలతోను ప్రమేయమున్న రచనలతో తృప్తిపడ్డవాడు కాదు వీరేశలింగం. సంఘ కూకటి వేళ్ళవైపు దృష్టిసారించాడు. పాఠశాలలో చదువు కుంటున్న బాలబాలికలకు తగిన పాఠ్యపుస్తకాలు కనబడలేదు. విద్యావికాసం కోసం ప్రయత్నాలు బాగా సాగుతూన్న రోజులవి. చిన్నచిన్న తరగతులలో ఏదో వెర్రి మొర్రి పాఠాలు చెప్పితే విద్యలకు సరియయిన పునాదు లుండవని గుర్తించాడు. చిన్న చిన్న తరగతులకు వ్రాయడమంటే చాలా చిన్నతనముగా భావించకుండ వ్రాయడానికి పూనుకున్నాడు. ఈ రచనలలో గూడా అతని ప్రత్యేకశ్రద్ధ ప్రత్యక్షమవుతుంది. తరగతుల వాచకాలలో విజ్ఞానం అన్నివిధాలా క్రమ వికాసముతో సోపాన పంక్తిలాగుండడం న్యాయము. ఇప్పటి పాఠ్యపుస్తక రచయిత లనేకులు ఈ ముఖ్య సూత్రాన్ని పాటించినట్లు కనబడ దనడం సాహసముకాదు.

వీరు రచించిన అయిదవ వాచకములో చెప్పదగిన సంధులు, క్రియారూపాలు, వాక్య నిర్మాణాలు, ఇలాంటివి రెండవ వాచకములో కనబడతాయి. నాల్గవ తరగతిపుస్తకములో కొన్ని పాఠములు రెండవతరగతికి గూడ పనికి రానివుంటాయి. అట్టలమీద ముద్రించిన "మూడవ వాచకము" "ఆరవ వాచకము" అన్న పేరులనుబట్టే వాటి తరగతిని గ్రహించాలిగాని, లోపలిరచనా విధానాన్ని బట్టి తెలుసుకోవడానికి వీలుండదు.

పంతులు అలాగుచేయలేదు, విభక్తి, సంధి, క్రియారూపము, వాక్య నిర్మాణము, విషయకాఠిన్యము, వీటినన్నిటిని క్రమపద్ధతిని సోపానాలుగా విభజించుకొని, ఆ విభజన ననుసరించే తరగతుల వాచకాలు వ్రాసి ఈ నాటి వారికిగూడా ఆదర్శప్రాయుడయాడు. చిరుతలకు కావలసిన చిన్న వ్యాకరణము, నీతిమంజరి ఇలాంటివాటిని గూడా ప్రచురించి పిన్నల విద్యావికాసానికీ, భాషాజ్ఞానానికీ చేయూతనిచ్చాడు.

# బీజవ్యాపకుడు

శ్రీ వి. సీతారామబ్రహ్మం

"సంస్కర్తలకు, సంస్కార వ్యతిరేకులకేకాదు సంఘర్షణ జరుగుతున్నది, లోకమంతటా-అన్నిరంగాలలో సత్యానికి అసత్యానికి, ధర్మానికి అధర్మానికి, స్వాతంత్ర్యానికి పరపీడనకు పోరు సాగుతున్నది... సత్యం సన్మతం సర్వదా ఐశ్వర్యంలో, అధికారంలో, వున్నత పదవులలో, పెద్ద మేడలలో వుండవు...స్వాతంత్ర్యానికి శత్రువులయినవారు, నిరంకుశత్వానికి మిత్రులయినవారు యిదివరకెన్నడు కడపటి విజయం పొందలేదు, ఇక పొందబోరు'' అని ప్రవచించాడు నవ భారత నిర్మాత రాజారామమోహన్‌రాయ్.

మానవుడసత్యంనుంచి సత్యానికి, అజ్ఞానంనుంచి ప్రజ్ఞానానికి, వ్యష్టినుంచి సమష్టికి, వైరుధ్యంనుంచి సమన్వయానికి, నానాత్వంనుంచి ఏకత్వానికి, పరాధీనతనుంచి స్వాధీనతకు సంకల్పంనుంచి సంసిద్ధికి సాగించే ప్రయాణమే అభ్యుదయమూ, వికాసమూను.

మానవకోటి అభ్యుదయం నిమిత్తం కొందరు మహాత్ములు, తమకాలంనాటికి భ్రష్టమైన ధర్మాన్ని పునరుద్ధరించడానికి ప్రయత్నిస్తారు. ఇంక కొందరు పరస్పర విరుద్ధంగా కనబడే విభిన్న ధర్మాలకు నూతన దృక్పథంతో సమన్వయాన్ని సాధిస్తారు. వేరు కొందరు తృణీకరింప బడుతున్న ఒక ముఖ్య ధర్మానికిగల ప్రాధాన్యాన్ని, విలువను నిరూపిస్తారు.

వీటిలో ఏపని నిజంగా జరిగినా, సమాజ వ్యవస్థలో పరివర్తనం కలుగక తప్పదు. అంతటితో అప్పటికి అమలులోవున్న వ్యవస్థవల్ల ప్రయోజనం పొందుతున్న వారికి జీవన్మరణ సమస్య ఏర్పడుతుంది. కనుక అట్టి వారందరూ ఏకమై మార్పును తమ యావచ్ఛక్తితో ప్రతిఘటిస్తారు. అంధకారాన్ని చీల్చుకొని ఉషఃకాంతుల ప్రసరించడానికి ముందు తమస్సు తమసావృత మవుతుంది. విడిపోతున్న చీకటి తెరలు పడేకలవరం, ఉద్రేకం అంతా యింతాకాదు. ఎంతగా దోషధూసరితమైనా, పెద్ద కాలంనుంచి వర్ధిల్లుతున్న ఒక వ్యవస్థ కూలిపోతుంటే, అంతవరకు దాని అండను చేరి, తరతరాలుగా సుఖపడ మరగిన వారందరు తత్కాల వ్యవస్థను కాపాడుకోడానికి తంటాలు పడ్డంలో 'అబ్బురంలేదు. మార్పు తమ మేలు కొరకె జరుగుతున్నదని తెలుసులేక, నాయకుల బోధలకు మోసపోయి పామరులుకూడా ధర్మావతరణను ప్రతిఘటిస్తారు. ఆ సమయంలో మనుష్య ప్రకృతి వికృతమవుతుంది. 'నైచ్యం, కాపట్యం, కౌర్యం, మూర్ఖత్వం, అసూయ, ఆత్మవంచన, ఆడంబరం, ప్రగల్భం కొండంతలుగా విజృంభిస్తవి. మానవచేతన లోని ఆరలలో, పొరలలో దాగివున్న తేళ్ళు, జెర్రులు, పాములు, పులులు, నక్కలు, భల్లూకాలు ఒక్కసారిగా రంగంలోకి దూకుతవి. సంఘంలోని పెద్దలు తమ అమూల్య పదవులు, అధికారాలు, పలుకుబడులు, బుద్ధిబలం, భుజబలం క్షుద్రదేవతారాధనకు వినియోగిస్తారు.

ఆరిపోయేదీపం మరింత కాంతితో వెలుగుతుంది. అదేవిధంగా యుద్ధం కడపటి ఘట్టంలో అధర్మం స్వస్వరూపంలో నిలబడలేక ధర్మవేషం వేసుకుంటుంది. కొరివి దయ్యంలాగ ఒకప్పుడు భ్రాంతికొలుపుతూ, మరొకప్పుడు ధైర్యోత్సాహాలను చెదరగొడుతూ, ఇంకొక్కప్పుడు విశ్వాసాన్ని సడలిస్తూ మరికొంతకాలం రాజ్యం చెయ్యడానికి అధర్మం ఎత్తులు వేస్తుంది. ఆధ్యాత్మిక సాధనలోని ఒక్కొక్కదశలో అహంకారమే

ఆకాశవాణిగా ధ్వనిస్తుంది. అసురులు దివ్యలీలను అవలీలగా అనుకరించి సాధకులను పెడదారిని పట్టించడానికి ప్రయత్నిస్తుంటారు. అందుకే ధర్మసాధన అసిధారావ్రత మన్నారు. ఆధ్యాత్మిక సాధకులు, ధర్మయోధులు నిరంతర నిర్నిద్రులయి వుండాలి.

కొన్ని దురాచారాలవల్ల ఎవరికీ ఏవిధమైన ప్రయోజనం లేకపోయినా, వాటిని నిర్మూలిస్తున్నప్పుడు కూడా యింత ప్రతిఘటనా జరుగుతుంది. దీనికిక్కారణం మౌఢ్యం. మౌఢ్యంమీద మమకారం. సత్యంకంటే తీక్షణతరమైన దేముంది? మామూలు విషయాలలోనే ఒక్కొక్క నిజం తెలిసి, ఒక్కొక్క భ్రాంతి తొలగి, ఒక్కొక్క మసక విడిపోతుంటే తలప్రాణం తోకకు వస్తుంటుంది. తీక్షణమైన జ్ఞానకిరణాల తాకిడికి యజ్ఞాన యవనిక చినిగిపోతుంటే మనః ప్రాణదేహతత్వాలు దద్దరిల్లుతవి. కనుకనే సాధకులు ఆధారాన్ని శుద్ధిచేసి, దానికి ధారణాపటిమ కలిగించడం అవసరం.

కొందరు మహాత్ములకు తమ జీవితకాలంలోనే అవతార పురుషులుగా ఆరాధింపబడే అదృష్టం పడుతుంది. మరికొందరికి లోకం ఆగ్రహానికి గురికావలసినయోగం కలుగుతుంది. సమాజ వ్యవస్థను కదలించక, సామాన్య ప్రజల నిత్య జీవిత సమస్యల జోలికి పోక, ప్రాచీన సంస్కృతి వైభవాన్ని వర్ణిస్తూ, ఆచరణతో నిమిత్తం లేని తత్త్వమీమాంసచేస్తూ, పాదపూజ లందుకొన్న మహానుభావులలో ఒకడు కాదు వీరేశలింగం, లోకంపై పూలుచల్లి, లోకంచే రాలు రువ్వించుకున్న సంస్కర్తల శ్రేణికి చెందినవాడు వీరేశలింగం. ఇట్టి ప్రవక్తలను లోకం మొదట నిర్లక్ష్యం చేస్తుంది. తరువాత పరిహాసిస్తుంది. అనంతరం పూజించడం నేర్చుకుంటుంది.

ఈ మహాపురుషుని జీవితం అద్భుత రసప్రధానం. ఈయనది దుర్బలదేహం. చేసినది చిన్నతరగతి బడి పిల్లలకు సహితం లోకువ కాదగిన తెలుగుపండితుని ఉద్యోగం. లోకరంగంలో ఏకార్య సాధనకయినా ముఖ్యంగా కావలసిన ధనం, బలం, అధికారం, పదవి– వీటిలో ఏవీ ఈయనకు లేవు తల పెట్టినది ఆకాలపు అభిప్రాయాలకు బద్ధవిరుద్ధమైనపని, ఇన్ని ప్రతికూల పరిస్థితులలో ఈ శూరుడు సాధించిన ఘన విజయాలు మనల నాశ్చర్య చకితులను చేయునేగానీ మరొకభావం తోచనీయవు. కాని ఆశ్చర్య సంభ్రమాలతో ఆగిపోవడం విషయ పరిశీలన కాదు. ఈ మహత్తర జీవితంలోని మర్మమేమిటి ?

చెట్టుమీద గుత్తులు గుత్తులుగా వున్న అనంతమైన పూలను, నిండయిన పండ్లను చూచినప్పుడు ఎవరికయినా ఆనందం కలుగుతుంది—రసజ్ఞత బొత్తిగా శుష్కమైతే తప్ప. చూచి ఆనందించడంతో తృప్తిపడేవారు కొలది మంది. అనేకమందికి వాటి ననుభవించా లనిపిస్తుంది. కాని ఈ ఫలపుష్పాలకు కారణ మేమిటనే ఆలోచన చేసేవారు చాలా కొలదిమంది. వారిలో కూడా పెక్కుమంది చటుక్కున దగ్గరగా కనబడుతున్న దేనితోనో ముడి పెట్టుకొని కారణం గ్రహించామని మనస్సమాధానం చేసుకుంటారు. ఫలాలకు కారణం పువ్వులని, పువ్వులకు కారణం రెమ్మలని, ఆకులని చెప్పడంవంటిదే ఆవిధంగా సమాధానంచేసుకోడం. కాని, నేలమీద ఎక్కడా కనబడక, భూగర్భంలోకి ప్రాకిపోయి వెళ్ళే ఫల పుష్పాలకు నిజమైన కారణం !

*[ నేటి మనం అనుభవిస్తున్న సాంఘిక పుష్పఫలాలకు శ్రీ వీరేశలింగం నాటిన బీజములే కారణమని భావం. ]*

# సంగ్రహ జీవిత చరిత్ర

శ్రీ తల్లావఝగడ ప్రకాశరాయుడు

ధీరుడు, ధర్మవిదురుడు, కర్మవీరుడు, కళాభిజ్ఞుడు అయిన శ్రీ వీరేశలింగం పేరుప్రతిష్ఠలు అతడు సృష్టించిన అమూల్యమైన సాహిత్యంలోను, నడిపించిన సాంఘిక విప్లవంలోను, తద్వారా ఆంధ్ర జాతి హృదయంలోను ఆ చంద్రార్కం నిలిచివుంటాయి. కనుకనే 'నవ్యాంధ్ర జాతిపిత' బిరుదం ఆయనపట్ల సంపూర్ణంగా సార్థకమయింది. ఆత్మవిశ్వాసంతో, అనన్యమైన పూనికతో అర్ధశతాబ్దానికిపైగా స్వీయ జీవితాన్ని, సంఘజీవితాన్ని శోధించి సానపట్టిన మనీషి; తలపులో, పలుకులో, పనిలో లాభాలాభాలను జయాపజయాలను గణించకుండ, విపత్పరంపరలమధ్య తా నమ్మిన దానిని పట్టుదలతో చేసిచూపించిన వజ్ర సంకల్పుడు వీరేశలింగం. ఆయన జన్మతిథి 1848 ఏప్రిల్ 16 వ తేదీ.

పున్నమ్మ, సుబ్బారాయుడుగార్లు ఈయన తల్లిదండ్రులు. ఈయన తాత వీరేశలింగంగారు - జ్ఞాతులకు, విద్వాంసులకు మడిమాన్యా లిచ్చిన మహాదాత. మన వీరేశలింగం శైశవంలోనే తండ్రి మరణించాడు. విద్యాబుద్ధులు చెప్పించి పెదతండ్రి ఈబిడ్డను పెంచాడు. రెండవతరగతిలోనే వీరేశలింగానికి తెలుగు సాహిత్యంపైన అభిలాష హెచ్చింది. ఇంగ్లీషునుకూడ ఉపేక్షించి, పురాణాలు, కావ్యాలపైన ఆసక్తి మెండయింది. జ్ఞాపకశక్తి, బుద్ధికుశలత చిన్ననాటనే ఈ విద్యార్థిని వరించాయి. ఆ లేతవయస్సులోనే చక్కని పద్యరచన కూడ పట్టుపడ్డది. అతనిప్రవర్తనవల్ల ఉపాధ్యాయులకే గాక, తోడిబాలురందరికీ కూడ అతనియందు పూర్ణమైన సదభిప్రాయమేర్పడ్డది. తన పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ఇంగ్లీషుపాఠం సరిగా బోధించలేడని చెప్పి, బడిబాలురచేత సంతకాలుచేయించి, తాను చేసి, పై అధికార్లకు విజ్ఞప్తి పంపించాడు వీరేశలింగం. ప్రధానోపాధ్యాయుని కిది తెలిసి అర్జీదార్ల ననేక విధాల బాధించాడు. అయినా తనది న్యాయపక్షం కనుక, పట్టినపట్టు వీరేశలింగం వదలలేదు. పాఠశాలోపాధ్యాయుల సానుభూతినికూడ సంపాదించి, విచారణాధికారిని రప్పించి, ప్రధానోపాధ్యాయుని పంపివేసి, కొత్తవానిని రప్పించే వరకు అతడు నిద్రపోలేదు. జీవితం పొడుగునా ఇట్టి సత్యాగ్రహదీక్ష ఈ ప్రపంచంలో ఒక్క వీరేశలింగానికే సాధ్యమయింది. విద్యార్థి దశలోనే వీరేశలింగం ప్రజలలోని అర్థంలేని ఆచారాలను, మూఢ నమ్మకాలను విమర్శించి ఖండించేవాడు. చాలమందికి దయ్యాలనుగూర్చిన నమ్మకం, భయం అధికంగా వుండేది. కనుక భూతవైద్యులుకూడ కొల్లలుగావుండే వారు. కాని విన్నదానినెల్ల విశ్వసింపగూడదని, విశ్వసించినదానినెల్ల ధైర్యంతో అనుసరించితీరాలని వీరేశలింగం చేసుకున్న ధర్మనిర్ణయం. ఒక్క దయ్యాన్నైనా తనకు చూపించవలసిందని భూత వైద్యులను, మాంత్రికులను ఆశ్రయించాడు. వాళ్ళతోను, వంటరిగాను, స్మశానాలలో కూర్చున్నాడు. కాని దయ్యాన్ని చూపగలిగినవా డొక్కడూ లేకపోయినాడు. వీరేశలింగం కోరంగిలో ఉపాధ్యాయుడుగా నుండగా, అక్కడ తనను చంపుతానని శపథంచేసిన

బ్రాహ్మణ భూతవైద్యునిగూర్చి "స్వీయచరిత్ర" మూడవ అధ్యాయంలో వర్ణింపబడ్డ విచిత్ర విషాద గాథ దయ్యాల భయస్థులకు కనువిప్పు కాగలదు.

1867 ప్రాంతంలో పెత్తండ్రి చనిపోయి, కుటుంబ భాధ్యత తనపై బడటంవల్ల వీరేశలింగం అవశ్యంగా ఏదో ఒకవృత్తిలో ప్రవేశించక తప్పిందికాదు. నెలకు రు. 20 లు ఇస్తానని, దినమూ మూడుగంటలు తన వద్ద లేఖకుడుగా పనిచేయమని ఒకన్యాయవాది వీరేశలింగాన్ని కోరినాడు ఇతడు దానికంగీకరించి పనిలో ప్రవేశించాడేకాని, ఆ న్యాయవాది వేశ్య నుంచుకొన్న దుర్నీతిపరుడని కొద్దిరోజులకే ఈ గుమాస్తాకు తెలసింది. ఒకరోజున వేశ్య బాహాటంగా ప్లీడరు యింటికేవచ్చి, అందరియెదుట అతనితో సరసాలాడటం వీరేశలింగం సహించలేకపోయినాడు. వెంటనే పనిమానుకొని ఇంటికిపోయినాడు. 1870 లో వీరేశలింగం విశ్వవిద్యాలయ ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. కాని ముందుగతి యింకా నిర్ణయంకాలేదు. న్యాయవాది కావా లనుకున్నాడు. కాని ఆ వృత్తిలో న్యాయాన్యాయాలను తారుమారుచేయవలసి వస్తుందని విని, దానిమీద రోతపుట్టింది. కనుక ఆప్రయత్నం విరమించాడు. అయితే స్వతంత్ర జీవనమో, లేదా ఉపాధ్యాయత్వమో చేయనిశ్చయించాడు. 1871 లో రాజమహేంద్రవరంలోని ప్రభుత్వ జిల్లా పాఠశాలలో ఒక సంవత్సరం సహోపాధ్యాయుడైనాడు వీరేశలింగం దృష్టిలో అధ్యాపకత్వమంటే విద్యార్థులకు పెద్దలయెడ భయభక్తులను, నీతివర్తనను, ఉపాధ్యాయగణంలో పరస్పర గౌరవభావాన్ని పురిగొల్పడమే. తదుపరి 1872 లో కోరంగి యింగ్లీషుపాఠశాలలో ప్రధానోపాధ్యాయత్వం లభించింది అది రెండేళ్లలో ఆఖరయింది 1870 నుండే "గోదావరీ విద్యాబోధిని" పత్రికకు వ్యాసాలువ్రాయ మొదలుపెట్టాడు. కోరంగి వెళ్లకపూర్వం బందరులోని "పురుషార్థ ప్రదాయిని"కి గ్రంథాలే వ్రాసిపంపేవాడు. ఈ లోగా భాషాంతరీకరణ పరీక్షలో కూడ కృతార్థుడైనాడు. కోరంగి తరువాత ధవళేశ్వరం పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడైనాడు. 1874 ప్రాంతంలో అక్కడి మిత్రులు అష్టావధానం చేయవలసిందని కోరగా దానినిచేయ మొదలుపెట్టినాడు. అదిచూచినవారందరూ ఆశ్చర్యంతో ఆనందపరవశులయ్యేవారు కాని, దానివల్ల తలనొప్పేకాని, లోకానికిగాని తనకుగాని నిజమైన ప్రయోజనం లేదని భావించి, తరువాత ఎవరెన్నివిధాల ప్రార్థించినా అవధానం చేయడం మానుకున్నాడు.

చిన్నతనంలోనే వీరేశలింగంలో సంఘ సంస్కరణాభిలాష పొడచూపి, దిన దినం అభివృద్ధి చెందుతూ వచ్చింది. ప్రజలలో నిజమైన విద్యాగంధం లేక, సంఘం దురాచారాలతోను, మతం మూఢవిశ్వాసాలతోను నిండి, అధికార్లలో నిరంకుశత్వం, లంచగొండితనం బాగా చెలరేగిన రోజులవి. వాటి నిర్మూలనకు విరామంలేని కృషి సల్పడమే ఈ ఉపాధ్యాయుడు వృత్తిలో వృత్తిగా పెట్టుకున్నాడు. తన్నిమిత్తం 26 వ యేట 1874 లో "వివేకవర్థని" యనే మాసపత్రికా ప్రచురణ ప్రారంభించాడు. చిరకాలం అది విజయవంతంగా సాగింది. పత్రికోద్దేశం "భాషాభివృద్ధి, దేశాభివృద్ధి" అన్నాడు. వ్యాపారదృష్టితోగాని, పాండిత్య ప్రకర్షకోసంగాని బ్రతికిన పత్రిక కాదు వివేకవర్థని. దేశంలో మత సాంఘిక పారిశుద్ధ్యానికి సత్ప్రవర్తనయే మూలకందమని ఆయన మతం సంఘ శరీరంలో పేరుకొన్న సమస్త మాలిన్యాన్ని వదలకొట్టడమే వివేకవర్థనికి ప్రధానాశయమయింది. లంచాలు తినడం ఉద్యోగధర్మమని, వేశ్యాగమనం గొప్పతనమని చెప్పి వాటికిలోబడిన ఘరానా

సంగ్రహ జీవిత చరిత్ర

దుర్జనులందరికీ వివేకవర్ధని అంకుశమయింది. దానికి భయపడి, పైకి మిత్రులలాగున నటిస్తూనే, చాటున దూషిస్తూ, సమయంచూచి చేతనైనంత చెరుపు చేయ తలపెట్టిన వారనేకులుండేవారు. అయినా "ఈశ్వర బలం, సత్యబలంముందు మనుష్యబలం, ధనబలం, అధికారబలం ఎందుకూ కొరగావ" ని ఆయన దృఢ విశ్వాసం. 1878 సం॥లో రాజమహేంద్రవరంలో కోర్టు మునసబుగావుండిన పోలూరి శ్రీరాములు, గవర్నమెంటు ప్లీడరు చిత్రపు కామరాజు, జిల్లాజడ్జి కోర్టు సిరస్తాదారు రొజారియో, రికార్డుకీపరు బొల్లా ప్రగడ వెంకన్న తోడుదొంగలై న్యాయానికి మసి పూసి ప్రజలకుచేసిన దారుణ ద్రోహాలకు వివేకవర్ధని శస్త్రచికిత్సగా, బహ్మాస్త్రంగా పనిచేసింది. ఒక్కొక్క వ్యాజ్యంలో వీరేశలింగం ప్రజాపక్షం అవలంబించి కేవలం యమధర్మరాజువలె పూనికతో తీసుకున్న అద్భుత చర్యల ఫలితంగా పై దుష్టచతుష్టయానికి ప్రాప్తించిన శిక్షల, జాలికరమైన దుర్మరణాల విచిత్ర చరిత్ర ధర్మవిజయానికి ప్రతీకంగా కల్పాంతంవరకూ నిలిచివుండగలదు. వివేకవర్ధనికి మరోపేరు "దుష్టాధికార గర్భనిర్భేదకం" అనవచ్చు.

స్వతంత్రుడుగా నుండవలెననే యుద్దేశ్యంతో వీరేశలింగం ధవళేశ్వరం పని మానుకొని 1876 లో స్వస్థానానికి చేరుకున్నాడు. కాని బంధు మిత్రుల ఒత్తిడి వల్ల రాజమహేంద్రపుర ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రాధ్యాపకత్వానికి ఒప్పుకున్నాడు. ఉపాధ్యాయత్వం అతడికి దైవమిచ్చిన వృత్తి అయింది. ఏదో ఒక రూపంలో మనసా, వాచా, కర్మణా ఆయన నడిపిన అపూర్వ సంస్కరణోద్యమమంతా తరతరాల మానవులను తరింప జేసిన అధ్యాపకత్వమే. స్త్రీ పునర్వివాహాది ఉద్యమాలన్నిటిలో ఆనాటి యువక విద్యార్థులే ఆయనకు అండగా నిలిచి పనిచేసినవారు.

మత సాంఘిక సంస్కారోద్యమాన్ని విస్తరింప జేయడానికి రెండు సంవత్సరాలు సెలవుపెట్టి 1897 లో భార్యా సహితంగా చెన్నపురికి చేరాడు. వెళ్ళడంతోనే అక్కడొక సంఘ సంస్కార సభ స్థాపించి, తద్వారా వితంతు శరణాలయాన్ని కూడ నెలకొల్పాడు. అక్కడ సంఘసంస్కార సమాజ మందిర మొకటి, బ్రాహ్మణ సమాజికులకొక ఈశ్వరోపాసనా మందిరం కట్టించాడు. తన గ్రంథ ముద్రణకొక ముద్రాయంత్రం, దానికొక యిల్లు కొన్నాడు. ఈ లోగా తనను మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలకు మార్చినట్లు ఉత్తర్వు రాగా, దానిని దైవచిత్తంగా యెంచి 1905 వరకూ అక్కడనే పనిచేసి, నెలకు రు 24 ల ఉపకార వేతనంపైన తిరిగి జన్మస్థలానికి చేరుకున్నాడు. సంపూర్ణ శ్రద్ధతో ఉద్యోగ ధర్మాన్ని నిర్వహిస్తూనే మద్రాసులోకూడ తన సంస్కారోద్యమాన్ని సముద్రతరంగంగా నడిపించాడు. దాని ప్రభావం ప్రసారం పరిసర రాష్ట్రాలకుకూడ పాకింది. 1908 లో బెంగుళూరులోకూడ ఒక ప్రార్థన సమాజ మందిరం కట్టించి యిచ్చాడు. 1898 లో మద్రాసులో జరిగిన భారత జాతీయ సంఘ సంస్కార మహాసభకు అగ్రాసనాధిపత్యం వహించాడు. అందు మహాదేవ గోవిందరానడే మహాశయుడు వీరేశలింగం పంతులుకు "దక్షిణ భారత విద్యాసాగరుడ" నే నూతన నామకరణం చేశాడు. 1902 లో కాకినాడలో చెన్నరాజధాని దేశీయ సాంఘిక మహాసభకూ, మరల 1903 లోనే చెన్నపురిలో భారత జాతీయాస్తిక మహాసభకూ అధ్యక్షత వహించాడు. అతడు అనుష్ఠానిక బ్రాహ్మ సమాజికుడు కావడానికి కారణాంతరాలవల్ల మరికొంతకాలం పట్టినా, వివేకవర్ధని స్థాపన నాటికే అతడు బహు దేవతారాధనను మానివేసి ఏకేశ్వరోపాసనను నిష్ఠతో అవలబించాడు.

తల్లాప్రగడ ప్రకాశరాయుడు

వీరేశలింగంతో ఆంధ్ర వాఙ్మయంలో ఒక నూతన పోకడ, ఒక నూతన శకమే యేర్పడ్డదని చెప్పవలె. ఇతడు సృష్టించినన్ని వాఙ్మయ శాఖలు మరే ఒక్కరూ సృష్టించలేదు. చిన్ననాటి ఉబలాటంతో ప్రారంభించి పట్టిన ప్రతిజ్ఞను నిలుపుకొన్న "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం" మొదలుకొని అత్యంత వ్యయ ప్రయాసలతో, శ్రమతో, పరిశోధనా పటిమతో వ్రాయబడ్డ ఆంధ్ర కవుల చరిత్ర వరకూ గల పలు రకాల రచనలలో స్త్రీ పురుషుల వివేక విజ్ఞానోదయానికి అవసరమని తోచిన ఏ ఒక్క విషయాన్నీ ఆయన విడిచిపెట్టలేదు. దేశీయ పురాణాలు, ఇతిహాసాలు, వివిధ దేశాల కావ్యాలు, నాటకాలు, ప్రపంచ మహాపురుషుల ఉత్తమ స్త్రీల దివ్యచరిత్రలు ఎన్నో గాలించి, పర్చి, కూర్చి — పెద్దలకు నవల, చిన్నలకు ఈసపుకథ, గుండె చీల్చివేసే దుర్మత ఖండన, కడుపుబ్బ నవ్వించే హాస్యవిమర్శ — ఒక్కొక్కరికొక్కొక్కటి, అందరకూ అన్నీ — ఇన్ని విధాలుగా, కావలసిన వారికి ప్రౌఢిమతో కూడిన పద్యంలోను, ఎక్కువ భాగం మనోహరమైన గద్యంలోను చెప్పి మెప్పుపొందిన సారస్వత సామ్రాట్టు వీరేశలింగం. ఇక్కడ చోటు చాలదుకాని, పది పన్నెండు పెద్ద సంపుటాలలో కూర్చబడ్డ ఆయన రచనల జాబితా, వరుసను వ్రాసినా, దానిమట్టుకదే వీనులకు విందవుతుంది. ఆయన యేగ్రంథం వ్రాసినా అందు సంఘ దురాచార సంస్కరణం, పరిశుద్ధాస్తిక ధర్మ ప్రకటన ప్రచారం వీలైనచోటల్లా చొప్పించడం మరువలేదు.

వీరేశలింగం జీవితకథలో స్త్రీ పునర్వివాహ ప్రయత్నం ప్రత్యేకస్థానం, అగ్రస్థానం ఆక్రమిస్తుంది. ఆయన అవతరించింది దానికోసమే అంటే అతిశయోక్తి కాబోదు. ముఖ్యంగా రాజమహేంద్రవరం, మద్రాసు అందుకేర్పడ్డ రెండు కళ్యాణ పీఠాలు. వివిధ ప్రదేశాలలో సమాజాలు స్థాపించడంతో ఉద్యమం ప్రారంభమయింది. దీనికి ప్రార్థనసమాజం విద్యార్థులసంఘం రెండూ రెండు భుజాలు. వివేక వర్థని శంఖారావంచేసే సారథి. ఈ విషయంలో భార్య రాజ్యలక్ష్మమ్మకు మొదట కలిగిన భయ సందేహాలను తీర్చి, సంపూర్ణంగా ఒప్పించి, ఆమెను సహయాత్రిణిగా చేసుకున్నాడు. న్యాపతి సుబ్బారావు పంతులు ముఖ్యంగా ప్రాణసఖుడు బసవరాజు గవరాజువంటి సహచరులెందరో వెంటనున్నారు. జంబుకాలు జడిపించాయి, శకునపక్షులు శరించాయి, తుంటరిమూకలు రంకెలువేసి రాళ్లవర్షం కురిపించాయి. అయినా సింహబలంతో యజ్ఞవేదిక నధిష్టించి మంత్రజప మారంభించాడు వీరపురుషుడు. 1881 డిశంబరు 11 వ తేదీని మొదటి స్త్రీ పునర్వివాహం జరిగింది. వీరేశలింగం నిఘంటువు ప్రకారం జరుగవలిసింది జరిగే తీరుతుంది. మానదు. దేశమంతటా వాద ప్రతివాదాలు, విమర్శలు, దూషణలు, మఠ పీఠాధిపతినుండి బహిష్కార పత్రికలు —— ఇట్లా దుమారం చెలరేగింది. అయినా ఉత్సవరథం ఆగలేదు. ఈశ్వర ప్రేరితం, ఈశ్వర ప్రీతికరం కనుక అది మరింత వడివడిగా సాగజొచ్చింది. ఒకటి తరువాత వొకటి వివాహాలు పరంపరగా జరిగించబడ్డవి. ఇట్లా రాజమహేంద్రవరంలో రూపొందిన వితంతూద్వాహోద్యమం వీరేశలింగంపేరు భరతఖండమంతటా ప్రతిష్ఠ పొందినవి. "వీరేశలింగం" అంటేనే ధర్మానికి, ధైర్యానికి ప్రతిజ్ఞాబలానికి పెట్టింది పేరని ఋజువయింది.

వీరేశలింగం నెలకొల్పిన ప్రజాహిత సంస్థల, వాటికోసం నిర్మించబడ్డ కట్టడాల చరిత్ర చెప్పుకుంటేనే పెద్ద అధ్యాయమవుతుంది. 1890 లో పుర మందిర నిర్మాణం, 1897 లో ప్రార్థన సమాజ

మందిరం కట్టించబడ్డవి. 1905 లో ఒక తోటను కొని సకుటుంబంగా కాపురం అక్కడకు మార్చాడు. గృహ నిర్మాణం తరువాత వితంతు శరణాలయం కూడ అక్కడనే స్థిరపడ్డది. ఆ కాలంలోనే "నిరుపమాన సద్వర్తనుడు, సంస్కార దీక్షాదక్షుడు" దేశిరాజు పెదబాపయ్య అనుష్ఠాన బ్రాహ్మదీక్షయందు తనకు మార్గదర్శకుడైనట్లు వీరేశలింగం పరమానందంతో చెప్పుకుంటాడు. తాను వర్ణభేదాన్ని, యజ్ఞోపవీతాన్ని త్యజించినా, హిందూ వితంతు వివాహోద్యమానికెట్టి అంతరాయం కలుగనియ్యలేదు. తాను పూనిన సత్కార్యాలను నెరవేర్చడానికి 1906 లో "హితకారిణీ సమాజాన్ని" నెలకొల్పి, రిజస్టరు చేయించి, అప్పటికి రు 41,500 ల విలువగల ఆస్తులను వారి కప్పగించాడు. 1908 నుండి హితకారిణీ ఆస్తికోన్నత పాఠశాలను ప్రారంభించి, స్వయంగా నడిపించాడు. అందు బాలికలకు, పంచములకు ఉచిత విద్య ఏర్పాటు చేశాడు. ఇపుడు పెద్ద భవనంలో పని చేస్తూన్న వీరేశలింగాస్తిక పాఠశాల అదే. ఇన్ని సంస్థల, కట్టడాల భగీరథ ప్రయత్నం, దానికి తగిన విజయం ఈ తెలుగుగడ్డపై మరి ఏ వొక్క వ్యక్తికి సాధ్యమయింది ?

తన తోడునీడగా, తనతో సరిసమానంగా సమస్త కష్ట నిష్ఠురాలను భరించిన సహధర్మచారిణి, మహా సాధ్వి, అవ్యాజ దైవభక్తి సంపన్నరాలు శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ 1910 లో అకస్మాత్తుగా కాలధర్మం పొందింది. దానితో కాలూ చేయీ పడిపోయినట్లు బాధపడ్డా డాయన. తీరని అసహాయత, ఏకాకితనం అనుభవించాడు. పాపం! భార్య అస్తికలను నిక్షేపించిన తోటలోనే ఆమె సమాధిని నిర్మించాడు. దాని ప్రక్కనే తన సమాధికి చోటేర్పరిచాడు సమాధి చుట్టూ వున్న చిన్న తోటకు "రాజ్యలక్ష్మి ప్రమదావన" మని పేరు పెట్టాడు. భార్య మరణం అతని ప్రజా సేవకు ఆటంకం కాలేదు. కాని చిన్ననాటి నుండి బాధిస్తూ వుండిన ఉబ్బసంతో సహజంగా దేహదార్ఢ్యం క్రమంగా క్షీణించింది. 1919లో తన ఆఖరి జన్మ దినోత్సవం చేసుకున్న మూడవనాడు మద్రాసు ప్రయాణం పెట్టుకున్నాడు. ఆ వెళ్ళడం కూడ అక్కడి పుస్తక భాండాగారంలోని పూర్వ సాహిత్య పరిశోధన కోసమే. ఆ మనిషి పరిశ్రమ, పట్టుదల అట్టివి! "నే నీసారి మద్రాసు నుండి తిరిగి రాజమహేంద్రవరం రాగలననే నమ్మకం నాకు లేదు. నాలో మూడు కోరికలు మిగిలి వున్నవి; (1) రాజమహేంద్రవరంలో నన్నయభట్టుపేర గొప్ప గ్రంథాలయ మొకటి స్థాపించుట, (2) కవుల చరిత్రను పూర్తి చేయుట, (3) సమగ్రమగు తెలుగు వ్యాకరణం రచించుట, ఈ మూడును నా జీవితకాలంలో నెరవేరనిచో, నా మిత్రులు వాటిని నెరవేర్చెదరని నా ఆశ." అని యన్నాడట. ఆయన తుది కోరిక లెట్లున్నాయో చూడండి! లోకమే కుటుంబంగా బ్రతికేవారి లక్షణ మది. తాననుకున్నట్లుగానే, తెలుగు దేశపు దురదృష్టంవల్ల, నెల రోజుల్లోనే 1919 మే 27 వ తేదీని మద్రాసులో దేహం చాలించి అమృతత్వా న్నందు -కున్నాడు ఆ వీర పురుషుడు.

వీరేశలింగం భాగ్యవంతుడు కాడు, ఆరోగ్యవంతుడు కాడు. ఒక్కమాటలో చెపితే — ఆయన సత్కార్యాచరణ ధైర్యమే ఆయనకు భాగ్యం, ఆరోగ్యం అయి ధన్యాత్ముణ్ణి చేశాయి.

---

తల్లాప్రగడ ప్రకాశరాయడు

# మా గురువుగారు

డాక్టర్ కే. కే. ఆచంట లక్ష్మీపతి

నేను వీరేశలింగంగారి శిష్యులలో నొకణ్ణి. మొట్టమొదట రాజమహేంద్రవరం కళాశాలలో పంతులుగారు తెలుగు పండితులుగా వున్నప్పుడు, నేను వారివద్ద యఫ్. ఏ. క్లాసులో విద్య నభ్యసించినాను. అప్పటి చదువు నందలి ముఖ్యాంశములు నాకు జ్ఞాపక మున్నంతవరకు పాఠ్య క్రమమునకు యేర్పరచిన పుస్తకములలో, భారతములోని ఉద్యోగ పర్వము, నాటకములలో చిత్ర నళీయములును. వ్యాకరణము అంతా పంతులుగారు పది సూత్రాలలో సంక్షిప్తముగా చెప్పివేసి చిన్నయసూరి వ్యాకరణమును నిరసించేవారు.

సరళమైన వచన రచనను ఆంధ్రదేశమున ప్రోత్సహించిన వారిలో ప్రప్రథములు పంతులుగారని నా అభిప్రాయము. ఆయన ప్రహసనములలో గ్రామ్య భాషను వుపయోగించిననూ, సామాన్య గ్రంథముల యందును, పత్రికా రచనల యందును హెచ్చు గ్రాంధికము గాక, బొత్తిగా గ్రామ్యమును గాక పట్టణ వాసులు వుపయోగించు వాడుక భాషలో వారు గ్రంథములు వ్రాసి యుండిరి. ఆ శైలే విద్యార్థుల వ్యాస రచనమునకు మార్గదర్శకమాయెను.

పంతులుగారికి పూర్వాచారాలంటే తల నొప్పి. సత్య ప్రియత్వము, నైతిక పవిత్రత, సాంఘిక దురాచార ఖండనము—ఈ మూడింటి కొరకు ఆయన యావజ్జీవమును ధారపోసిరి.

ఆర్య నాగరికత యందు ఆయనకు గౌరవము వుండినను, పురాతన సాంఘిక ఆచారాలను కొన్నింటిని నిర్మొహమాటంగా ఆక్షేపించేవారు. ఉదాహరణ: "వారిజాక్షు లందు, వైవాహికము లందు, ప్రాణ విత్త మానభంగ మందు, చకిత గోకులాగ్ర జన్మరక్షణ మందు బొంకవచ్చు నఘము బొంద దధిప." (భారతంఆదిపర్వం) ఈ పద్యమును పంతులుగారు తరుచుగా వల్లించుచూ, మనవారల సత్యప్రియత్వము యిట్టిదని ఆక్షేపిస్తూ వుండే వారు. ప్రతిదినము పాఠములు చెప్పేటప్పుడు రెండు పద్యములు చదవడము తడవుగా, యేదో ఒక సాంఘిక విషయమై చర్చకు దిగడమో, వుపన్యాసమును ప్రారంభించడమో, తరగతి గంట కొట్టే వరకు జరుగుతూ వుండేది. కొంతకాలము ఆయనవద్ద శిష్యత్వము చేసిన వాళ్ళందరికీ వారియందు చాలా గాఢాభిమానము కలిగేది.

అప్పటికి మేము సంఘ సంస్కరణ సభలలో ముందంజ వేసినవారితో చేరి పంతులుగారి నాయకత్వమున అస్పృశ్యతా నివారణ, పరదేశ గమన ప్రోత్సాహము, వితంతు వివాహ ప్రోత్సాహము, వేశ్యా బహిష్కరణోద్యమము, వరశుల్క నిషేధము, మద్యపాన నిషేధోద్యమము మొదలగు సమస్యలను గూర్చిన సభలు గ్రామము మొదలు పట్టణముల వరకు, ఆంధ్ర దేశమంతటా ప్రచారము జరుపుతుండే వారము. మామూలుగా యీ సంస్కరణ సభలు రాజకీయ మహా సభలకు అనుబంధముగా జరుగుచుండేవి. రాజకీయ సభల యందు పాల్గొనుటకు వీలుగాని సర్కారు వుద్యోగస్తులు సహితము, యీ సంస్కరణ సభలను ఆసటగా తీసుకొని అప్పటి వుద్యమములలో పాల్గొనేవారు. "వ్యవహార ధర్మబోధిని" అనే పంతులుగారి ప్రహసనములను, విద్యార్థులు గ్రామములలో ప్రదర్శిస్తూ వుండేవారు.

ఆంధ్రదేశము నంతటనూ, మా గురువుగారి వ్రాతలచే నేమి, మార్గదర్శకత్వముచే నేమి, లంచగొండి తనము,

అబద్ధ ప్రచారము, వ్యభిచార దోషము మొదలగు దురాచారములు చాలామట్టుకు తగ్గిపోయి, నవీన యుగము ప్రారంభ మైనదని చెప్పడములో అతిశయోక్తి లేదు.

రాజకీయముగా పంతులుగారు సర్కారు నౌకరు అగుట చేత మితవాదులై యుండిరి గాని, దేశాభిమానము నందు వీరు యే దేశభక్తునికిని తీసిపోరని నా దృఢ విశ్వాసము.

మా గురువుగారు చిన్ననాటి నుండియు వుబ్బసముతో బాధపడుతూ వుండేవారు. రాజమహేంద్రవరపు వేసవికి తాళలేక ప్రతి సంవత్సరము చెన్నపట్నములో ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రధాన తెలుగు పండితులుగా వున్నారు. గ్రంధముల వల్లను, విశ్వవిద్యాలయములో పరీక్షకులుగా వుండుట మూలముననూ, కొంత ధనము ఆర్జించిననూ, మా గురువుగారు బహుమిత వ్యయముతో నిరాడంబర జీవితము గడుపుచుండెడివారు. వారికి ఒకటో రెండో చొక్కాలు మాత్రమే వున్నా, బహు శుచిగా వుంచుకొనే వారు. వారు నవనాగరికతా ప్రచారకులైనప్పటికీ తాటాకు గ్రంథాలను పుచ్చుకొని నడివీధిని వెళ్ళటానికి జంకేవారు కారు.

నేను డాక్టర్ పరీక్ష ప్యాసైన తరువాత చెన్నపట్టణములో 1909 వ సంవత్సరములో ప్రాక్టీస్ పెట్టినాను. అప్పటికి "విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి" వారివి నాలుగైదు గ్రంథములు వెలువడినవి. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి ఆధిపత్యముక్రింద, ఈ మండలి మానేజరుగా నేను పనిచేసే రోజులలో మా గురువుగారు చెన్నపట్టణము వచ్చినప్పుడల్లా మా యింట్లో బస చేసేవారు. నా యందు అత్యంత ప్రేమాభిమానములు కలిగి వుండేవారు. నాకును వారియందు అత్యధికమైన గురు భావమును, గౌరవమును కలదు. వారిని వారి స్వీయ చరిత్ర వ్రాయుటకు ప్రోత్సహించి, మా మండలి తరపున రెండు భాగములను ప్రచురించ గలిగితిమి.

1919 వ సంవత్సరం వేసంగి సెలవులలో మా గురువుగారు శ్రీ కొమర్రాజువారి నివాసగృహమైన "వేద విలాస్" మేడమీద మంగమ్మ (ఆయన పెంచి పునర్వివాహం చేసినారు) మరొక ముసలి నౌకరుతోను వచ్చి దిగినారు. అప్పటికి మా గురువుగారి శరీరము చాలా దుర్బలంగా వుండెను. ఫోర్స్ అటుకులను పాలలో కలిపి వారు పుచ్చుకుంటూ వుండేవారు. వోపిక వున్నప్పుడల్లా స్వీయ చరిత్ర మూడవ భాగము సంపూర్తి చేయవలెనను వుద్దేశ్యముతో వ్రాస్తూ వుండేవారు. వారి చెయ్యి కొంచెముగా వణికేది. కాని బుద్ధి మాత్రము, బహు చురుకుగా పని చేస్తూ యుండేది. మా గురువుగారు నిర్విచారుడు. స్థితప్రజ్ఞుడు. చిత్తు వ్రాయడము అంటూ లేదు. పది పంక్తులు వ్రాస్తే అంతా సాఫీగాని ఒక అక్షరము దిద్దుబాటు గాని, వెనుకాముందు సర్దుబాటు గాని యేమియు వుండేది కాదు.

షుమారు మూడవ భాగంలో నలుబదియైదు పుటలు కాబోలు వ్రాశారు. ఆఖరి పుటలోని పంక్తిలో సగము మాత్రమే పూర్తి అయింది. అంతా నిశ్శబ్దం. యెవ్వరూ దగ్గరలేరు. నే నొక్కడనే దగ్గర వుంటిని. అసంపూర్తిగా వ్రాసిన స్వీయ చరిత్ర మూడవ భాగపు కాగితాలను మా గురువుగారు నా కిచ్చిరి. కడసారి సందేశంగా నాకో చీటీ వ్రాసి యిచ్చిరి. ఆ చీటీలో మా గురువుగారిచ్చిన సందేశం ఈ క్రింది విధంగా వుండెను.

"నా జీవితంలో సాధించవల్సిన కార్యము లింకెన్నో యున్నవి. అవి సాధించబడక పూర్వమే అసువులు వీడవల్సి వస్తున్నది. అయినా నా అనుచరులు, మిత్రులు, సంస్కారాభిలాషులు నా యీ మిగిలిన బాధ్యతను నిర్వర్తిస్తారని ఆశిస్తున్నాను. అజ్ఞానంలో, అమాయకత్వంలో జీవిత సంస్కారం లేని ప్రజాసామాన్యానికి విద్య విజ్ఞానం, సమానత్వం, సంస్కారం కలిగించడానికి కృషి చేయాలని కోరుతున్నాను."

ఆ మాటలు యింకా నా కర్ణ రంధ్రాలలో మారు మ్రోగుతూనే వున్నవి.



ఆచంట లక్ష్మీపతి

# కర్మయోగి కందుకూరి

శ్రీ కాళోజీ నారాయణరావు

ఛాందసాల చీకట్లను
స్వార్థబుద్ధి పడికట్లను
గుడ్డి నమ్మకాల దడుల
దొడ్డతనము రాబడుల
ఏకాకిగ హుంకరించి
ఎదిరించిన వా డెవ్వడు ?

గురువుల గూడుపుఠాణీ
మరుగున సాగే ఆటల
లంచగొండి అధికారుల
వంచన కట్టిన మూటల
రచ్చకీడ్చి, కుళ్లునంత
చిచ్చయి కాల్చిన దెవ్వడు ?

కావ్యరచన వ్యాసంగం
కడుపుకొరకు కాదుకాదు
విశ్వశ్రేయస్సునకని
వివరించిన వాడెవ్వడు ?

అన్యసాహితులకు సరిగా
ఆంధ్ర సరస్వతికి కూడ
సర్వాలంకరణములను
సమకూర్చిన శిల్పి ఎవడు

ఘనుడు ఘనుడు మహనీయుడు
కర్మయోగి కందుకూరి.

హితమునకు కొట్టురాని
హేతువాది కందుకూరి.

సంఘ జీవనమున కూడ
సత్యవ్రతుడు కందుకూరి.

---

సంస్మరణ

'తాకట్టు' పడనట్టి
తలవున్న వాడు
తాకట్ల పరధి కా
తల నున్న వాడు.

తలలేని మూక కా
వల నున్న వాడు
తలవున్న వారి ఎడ
దల నున్న వాడు

తలలేని జాతికే
వెలియైన వాడు
వలపన్న లేనట్టి
తలపున్న వాడు

లేదు లేదు మనకు
లేదు ఈ నాడు
తల గలిగి ఈ నాడు
తలచె ఈ నాడు. ★

# సర్వతోముఖ సంఘసంస్కర్త

ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్య

వీరేశలింగం పంతులుగారు సంఘములోనుండిన దురాచారములలో గొన్నిటిని మాత్రమేగాక అన్నిటిని గూడ రూపుమాపి, వాటిస్థానమున సదాచారములను నెలకొల్పుటకై యావజ్జీవము తీవ్రకృషి గావించిన మహానుభావుడు. సంస్కరణోద్యమములలో వారికిగల శ్రద్ధాభక్తులు స్వతహాగా కలిగినవేగాని వంగదేశములోని రామమోహనరాయలు, ఈశ్వర చంద్ర విద్యాసాగరు, మహారాష్ట్రదేశములోని మహదేవ గోవింద రానడి మొదలగు వారియొక్క ప్రభావమువలన కలిగినది గాదని చెప్పవచ్చును. ఇదిగాక వారు సంఘసంస్కరణమును తలపెట్టిన 1870 ప్రాంతమునను అటుతర్వాతను విద్యాధికులలో అనేకులు రాజకీయ రంగమందు సంస్కరణములు జరిగిన చాలునను భావముతో నుండిరి. పంతులుగారట్లుగాక దేశమభివృద్ధి యగుటకు అన్నిరంగములలో సమానముగ సంస్కరణములు జరుగుట అవసరమని భావించిరి. వీరి దృక్పథములోని విశిష్టత ఇదియే. 1888 ప్రాంతమున వారీవిషయమును గురించి చెప్పినమాట లిట్లు ఉన్నవి. "ఇంచుమించుగా నన్నివిషయములయందును సమానముగా వృద్ధినొందుచుండుటయే యభివృద్ధి యగునుగాని తక్కిన విషయములం దధమదశలోనుండి యొక్క విషయమునందు మాత్రము వృద్ధిచెందుట నిజమైన యభివృద్ధికాదు. అట్టియేక దేశాభివృద్ధివలన దేశ క్షేమకరములు కలుగవలసినంత కలుగనేరవు ... కాబట్టి రాజ్యాంగ విషయమయిన స్వాతంత్ర్యములతోడి పాటుగా జ్ఞాన నీతులవిషయమునను మతవిషయమునను, కులాచార విషయమునను కూడ నభివృద్ధి పొందుచుండుట యత్యంతావశ్యకము. క్రూరములయిన కులాచారములకు దాసులమయి మనయింటనుండు స్త్రీల కష్టములను నివారింపలేని వారము రాజ్యాంగ స్వాతంత్ర్యములనుపొంది దేశముయొక్క కష్టములనెట్లు నివారింప గలుగుదుము? మతవైషమ్యమును వహించి యైకమత్యమును త్యజించి యొండొరులను ద్వేషించుచు తగవులాడుచుండెడివారము రాచరికపు సంబంధములయిన స్వాతంత్ర్యములను పొందినప్పుడు జాతి మత వైషమ్యములవిడిచి యెట్లు సర్వజన క్షేమమునకై యైకమత్యముతో పాటుబడ గలుగుదుము?". ఇదిగాక రాజకీయ సంస్కరణములు జరుగుటకు ప్రభుత్వముయొక్క సహకారము సానుభూతి అవసరమగుచున్నవి. అవి లభించవచ్చును; లభించక పోవచ్చును. సంఘ సంస్కరణమట్లుగాక మనము స్వయముగ పాటుబడి సాగించగలది. ఇట్టి అభిప్రాయములు వారియం దుండినందున వారు మొదటినుండియు వారి దృష్టిలో చాలా భాగమును సంఘ సంస్కరణోద్యమమందు కేంద్రీకరించిరి.

## ఆచారముల వర్గీకరణము

ఆచారములను దురాచారములనియు, సదాచారములనియు వర్గీకరణము చేయుటలో పంతులుగారు ఒకమూలసూత్రమును అనుసరించిరి. వారు ఏకేశ్వరోపాసకులు. వారి దృష్టిలో పరమేశ్వరుడు దయాస్వరూపి. మానవులందరు

భగవంతుని సంతతివారు. అందుచేత వారిలో ఎలాటి తరతమ భేదములు ఉండరాదు. అందరు సుఖముగ జీవించుటకు అర్హులు. సంఘములో కొందరు మాత్రము సుఖించుటయు మరికొందరు దుఃఖములపాలై కష్టపడుటయు భగవదేచ్ఛకును, సృష్టిక్రమమునకును విరుద్ధము. ఇదియే పంతులవారి దృఢ విశ్వాసము. దీని ఫలితముగ వారు మానవుల సౌఖ్యమునకు తోడ్పడు ఆచారములు సదాచారములనియు, వారి సౌఖ్యమునకు తోడ్పడనట్టియు తోడ్పడినను కొందరి సౌఖ్యమునకు మాత్రమే తోడ్పడునట్టి ఆచారములు దురాచారములనియు నిర్వచించిరి. స్త్రీ పునర్వివాహ విషయమై వారుచేసిన మొదటి ఉపన్యాసమందు వారు చెప్పినమాటలు కొన్ని ఈ సందర్భమున స్మరించదగియున్నవి.''సృష్టి మర్యాదనుబట్టియు దానివలన దెలిసికోదగినంతవరకు భగవత్స్వభావమును బట్టియు విచారింపగా భగవచ్ఛాసన మెప్పుడును ప్రజాసుఖమునకే యనుకూలముగా నుండుననియు ప్రజాసౌఖ్యమునకు ప్రతికూలముగానుండు కట్టుబాటులన్నియు భగవన్మతవిరుద్ధములయి పాపైక మూలములయి యుండుననియు మందమతిసహితము సులభముగా తెలిసికోవచ్చును. కాబట్టి లోకములో కొందరెప్పుడును దుఃఖపడుచు నుండవలెననియే భగవదిచ్ఛయనియు, ధర్మమనియు బోధించువారు కేవల వంచకులనియు భగవత్సంకల్ప మా ప్రకారముగా నుండుననుట యపచారమనియు,దైవదూషణమనియు జ్ఞానలేశముగలవారందరును తెలిసికోవలెను.'' మన ఆచారములలో ననేకములు పురుషులకును అగ్రవర్ణముల వారికినిమాత్రమే సుఖము కలిగించునవి ; స్త్రీలకును, హీనజాతులకును దుఃఖమును కలిగించునవి. అందుచేత నవి దురాచారములుగ పరిగణింప దగియున్నవి. ఇదే విధముగ వేశ్యావృత్తి, బోగము మేళములు, అధికారులలో లంచగొండితనము సంఘములో ఒకరికిగాక అందరికిని కష్టముగలిగించునవి. ఆకారణమున అవికూడ దురాచారములుగ పరిగణింపదగియున్నవి.స్త్రీ విద్య,స్త్రీ పునర్వివాహము మొదలైనవి స్త్రీల సుఖమునకు తోడ్పడునట్టివి. వీటి మూలమున ఎవరికికూడ కష్టముగాని నష్టముగాని కలుగజాలదు. అందుచేత ఇవి సదాచారములుగ పరిగణింప దగియున్నవి. దురాచార సదాచారములకుగల ఈ భేదమునుబట్టి దురాచార నిర్మూలమును సదాచార సంస్థాపనమును సంఘ సంస్కరణమునకు ప్రధాన లక్షణమని పంతులుగారు స్పష్టపరచిరి. వారి మతములో ఇదియే సంఘ సంస్కరణమునకు సరియైన నిర్వచనము.

## ప్రచారము

విశాల నిర్వచనముతో గూడిన ఇట్టి సంఘ సంస్కరణమును సాగించుటలో వీరు రెండుమార్గములను అనుసరించిరి — వాటిలో మొదటిది ప్రచారము; రెండవది కార్యాచరణ.

వీరు సంస్కరణోద్యమమును ప్రారంభించిన కాలములో సంఘములోని వారందరు — విద్యావిహీనులేగాక విద్యాధికులుకూడ — ప్రాచీనాచారములకు దాసానుదాసులై వాటిలోని గుణదోషములను విమర్శించుటకు ఎంతమాత్రమును సమ్మతింపనివారుగ నుండిరి. అట్టి సందర్భములో ప్రచారముద్వారా ప్రాచీన ఆచారములలోని దోషములను, వాటిని అనుసరించుటవలన కలుగుచుండు నష్టములను వివరింపవలసిన అవసరమేర్పడెను. పంతులుగారు ఆ అవసరమును వారి హేతువాదముచేతను, యుక్తులచేతను, చాలవరకు తీర్చిరి. ప్రాచీనాచారములవలన కలుగుచుండు కష్ట నష్టములును, వాటిమూలమున అనేకులు దుఃఖములననుభవింపవలసి వచ్చుటయు నిరూపించగలిగిరి. వారు తలపెట్టిన ప్రతి సంస్కరణమునుగురించి వారు చేసిన ప్రసంగములు, వ్రాసిన వ్యాసములు, గ్రంథములు మొదలగువానిలో చాలభాగము ఇట్టి నిరూపణమునకై వినియోగింపబడెను. వేశ్యా వృత్తివలనను, స్త్రీల నిర్బంధ

వైధవ్యమువలనను, స్త్రీలకు విద్యగరపక పోవుటచేతను, వర్ణభేదముల మూలముననుు, కలుగుచుండు నష్టములను సోదాహరణముగ వీరు వివరించిరి. కాని ఇంతమాత్రముతో వీరికి తృప్తికలుగలేదు. వీరు యెన్ని యుక్తులు చెప్పినను, వీరుచెప్పినయుక్తులు ఎంత విశ్వసనీయములుగ నుండినను వీరుతలపెట్టిన సంస్కరణము శాస్త్ర సమ్మతముకాదను కారణమున పండితు లనేకులు సంస్కరణమునకు అంగీకరింపకుండిరి. అందుచేత హేతువాదములతోపాటు సంస్కరణము శాస్త్ర సమ్మతమని ఋజువు చేయవలసిన భారముకూడ పంతులవారు వహింపవలసి వచ్చెను. వా రీ పనికి పూనుటకు శాస్త్రములందు వారికి విశ్వాసముండుట కారణము కాదు - అట్టి విశ్వాసము తమకులేదని వారు స్త్రీ పునర్వివాహ విషయమై బందరులో జరిగిన సభయందు సూటిగాచెప్పిరి. కాని ఆ సభయందే వారు, "ఆత్మ సంరక్షణార్ధమును శాస్త్ర విశ్వాసము గలవారి నిమిత్తమును నేను శాస్త్ర ప్రమాణములను జూపుచున్నా" నని సెలవిచ్చిరి. వారు అసంఖ్యాకములయిన ప్రాచీన గ్రంథములను స్మృతులను పరిశీలించి స్త్రీలు విద్యనేర్చుకొనుటయు, పునర్వివాహము చేసుకొనుటయు శాస్త్ర సమ్మతములనియు, అతిబాల్య వివాహములు శాస్త్ర నిషిద్ధములనియు స్పష్టపరచగలిగిరి. అప్పటికికూడ అనేకులు వారి మొండివాదమును విడువక మన పూర్వులు మనకంటె బుద్ధిమంతులనియు, వారు విధించిన ఆచారములు సనాతనములనియు, వాటిని మార్చుటకు అల్పజ్ఞులైన మనకు అర్హతలేదనియు వాదించుచు వచ్చిరి — పంతులువారు ఈ వాదమునుకూడ ఖండించి, ఆచారము లెప్పుడు ఒకేవిధముగ నుండినవికావనియు, కాలానుగుణముగ నివి మార్పుచెందుచునే వచ్చు చుండెననియు, ప్రతి తరమువారును వారి స్వబుద్ధిని వినియోగించి వారి కాలమునకును, పరిస్థితులకును తగినట్లు ఆచారములను మార్చుకొనుటయే ఉత్తమ మార్గమనియు ప్రబోధించిరి. ఈ విధముగ పంతులవారు సాగించిన ప్రచారము హేతువాదముతోడను, యుక్తులతోడను, శాస్త్ర విచారముతోడను, చారిత్రక దృష్టితోడను కూడినదియై సంఘములో అనేకులను సంస్కరణములపట్ల సుముఖులుగ జేయగలిగెను. సంస్కరణముల దలపెట్టువారు వారి ప్రచారమును ఏ విధముగ సాగించవలెనో పంతులవారు స్పష్టపరచిరి.

## కార్యాచరణము

వారు వాక్శూరులు మాత్రమేకారు. వారు ప్రధానముగ కార్యశూరులు. భోగముమేళములు, స్త్రీ పునర్వివాహములు, ఆడపిల్లలను పాఠశాలలకు పంపుట, అతిబాల్య వివాహములను విడనాడుట, పంక్తిభోజనముల చేయుట మొదలగు విషయములలో వారితో ఏకీభవించినవారు సహితము తమ అభిప్రాయానుసారము ఆచరించవలసి వచ్చినప్పుడు వెనుదీయువారై యుండిరి. పంతులవారి స్వభావమట్టిదికాదు. "ఒకరు తా నుపదేశించినదాని ననుష్ఠించి చూపినంగాని కేవల శుష్కోపన్యాసము వలనను పుస్తక ప్రకటనమువలనను కార్యముండదు," అని స్వీయ చరిత్రలో వారు వ్రాసిరి. "కర్తవ్యతా విషయమున దృఢ విశ్వాసము కలిగినతరువాత కార్యారంభమునకు తడవు పుట్టదుగదా," అని తన్నుగురించి వారు చెప్పియున్నారు. ఈ కార్యాచరణయే సంఘ సంస్కరణోద్యమ మందు వారికి విజయము సమకూర్చినట్టిది. 1874 లో చందాలను వసూలుజేసి వారు స్త్రీల పాఠశాలను స్థాపించిరి. స్త్రీ పునర్వివాహముగురించి ప్రచారము చేయుటయేగాక అట్టి పునర్వివాహము లెన్నియో చేయించిరి. వితంతు శరణాలయమును స్థాపించిరి. నీతిబోధయు మతబోధయు లేని విద్య విద్యకాదన్న విశ్వాసము గలవారగుటచేత హితకారిణి సమాజమును స్థాపించి, దాని సాధనమున వారు నెలకొల్పిన విద్యాలయములలో నీతిబోధకును, మతబోధకును ప్రాధాన్యము కల్పించిరి. వారు తలపెట్టిన

సంస్కరణములు విజయవంతములగుటకు ఇట్టి కార్య దీక్షయే ప్రధా నాధారము.

పంతులవారు తొలగింపదలచిన దురాచారములు, వారు తలపెట్టిన సంస్కరణములు అనేకములు. అందుచేతనే వారిది సర్వతోముఖ సంస్కరణమని చెప్పదగియున్నది. వారి కృషిఫలితముగ వారికాలములో నుండిన దురాచారములు కొన్ని — బోగము మేళములు, అతిబాల్య వివాహములు, కన్యాశుల్కము, స్త్రీలనిర్బంధ వైధవ్యము, స్త్రీలను పాఠశాలలకు పంపకుండుట మొదలైనవి — చాల వరకు అదృశ్యము లయ్యెను. వీటి విషయములో వారు ప్రారంభించిన సంస్కరణములు చాలవరకు సాఫల్యము గాంచెను. మరికొన్ని దురాచారములు వర్ణభేదములు, అధికారులలో లంచగొండితనము మొదలైనవి — ఇప్పటికి కూడ పూర్తిగ నశించకున్నవి.

## వేశ్యావృత్తి

దురాచారములన్నిటిలో వారిని ప్రప్రథమముగ ఆకర్షించినది వేశ్యావృత్తి. ఆ వృత్తిని, దానికి అనుబంధమై వివాహాది శుభసమయములలో ఏర్పాటు చేయబడిన బోగము మేళములను, వాటిని చూచుటకు వెళ్ళినవారు నిర్బంధముగ ఇయ్యదలచిన సంభావనలను, నిర్మూలించుటకు వారు 1870 ప్రాంతమునుండి కృషి చేయ సాగిరి. వారు స్థాపించిన వివేకవర్ధని యను పత్రిక యొక్క ప్రధానోద్దేశములలో ఈ నిర్మూలన మొకటి. వారు చెప్పినట్లు "ఈ యొక్క హిందూదేశమునందుతప్ప మరి యే దేశమునందును, ఏ కాలమునందును...ఏ జాతి వారిలోను, వ్యభిచారమే ప్రతిష్ఠావహమయిన కుల వృత్తిగా నేర్పరుచుకొని సంభోగ నియమము లేక స్వేచ్ఛగా విహరించు కులమువా రున్నట్టు కనియు వినియు నుండలేదు". ఆ కాలమున రాజమహేంద్రవరము మొదలయిన పట్టణములలో వేశ్యాప్రియుల సంఖ్య మేరమీరి యుండెను. ఈ విషయమై వారు వారిపత్రికలో ఈ క్రింది విధముగ ఒకానొకప్పుడు వ్రాసిరి. "ఈ కాలమున జారిణీ సంభోగమే సత్కృత్యమని కొనియాడబడు చున్నది. కట్టుకొన్న యాలిని దుఃఖపెట్టి, పరాంగనల గలియువారు గర్హణీయులుగా నెన్నబడకున్నారు; మరి లంజెలు లేనివారు పెద్దమనుష్యులే కారని గణింపబడు చున్నారు; మీదు మిక్కిలి యేకభార్య వ్రతస్థులు పురుషులే కారనియు, నపుంసకులనియు బరిహాసింప బడుచున్నారు. ఎల్లరిచేగొప్పవారని గౌరవింపబడుచున్న ధనికులయిన యధికారులే వేశ్యలకింటిబంటులయి, వారికి వశవర్తులయి, యా భోగముచానల నాశ్రయించిన వారినే గౌరవించు చుండుటచేత నా ధనికుల యనుగ్రహము నిరీక్షించి వారి వలన బాగుపడదలచి యాశ్రయించుచున్న వారందరును ఆ చెడుపడతుల యడుగులకు మడుగులొత్తవలసిన వారుగా నున్నారు". ఇందులో ఏలాటి అతిశయోక్తి లేదని పంతులు గారు ప్రత్యేకముగ జెప్పియున్నారు.

ఆ కాలమున వేశ్యలను వేశ్యావృత్తిని సమర్థించినవా రెందరో ఉండిరి. వేశ్యావృత్తి నశించినయెడల సంగీత విద్యయు నాట్యవిద్యయు నశించునని వారు వాదించిరి. ఈ వాదమును పంతులవారు తీవ్రముగ ఖండించి, ఈ యుత్తమ విద్యలు వారాంగనల పిడికిళ్ళనుండి విముక్తి నొందినగాని కులకాంతలు వాటిని నేర్చుకొనుట కిష్టపడజాలరనియు, కులకాంతలు నృత్యగీతాదులు నేర్చుకొనుట యెంతమాత్రమును గౌరవలోపమయిన పని కాదనియు పదేపదే చెప్పిరి. వీరి ప్రచారమువలన చాల వరకు ఈ దురాచారము నశించెను. ప్రస్తుత కాలమున సంగీతమునకును, భరతనాట్యమునకు గల గౌరవము దీని ఫలితమే. పెండ్లిండ్లలో వ్యర్థవ్యయమునకు కారణమయి నట్టియు, పవిత్రములయిన వివాహ సమయములలో కులటా సాంగత్యమునకు దోహదమిచ్చునట్టియు బోగము మేళములు కూడ క్రమక్రమముగ నడుగంటెను.

## ఉద్యోగుల లంచగొండితనము

వివేకవర్ధని పత్రిక సాధనమునను, ప్రహసనముల సాధనమునను పంతులుగారు కొంతవరకు రూపుమాప గలిగిన దురాచారము ఉద్యోగస్థులలోని లంచగొండి తనము. దీనిని గురించి వారు ఈ క్రింది విధముగ చెప్పి యున్నారు. "ఆ కాలమునందు వేశ్యనుంచుకోనివా డరసికు డనియు, పౌరుషహీనుడనియు భావింపబడుచుండినట్టె లంచ ములు పుచ్చుకోనివా డప్రయోజకుడనియు బుద్ధిహీను డనియు పరిగణింప బడుచుండెను. అప్పుడు లంచములు స్వీకరింపనొల్లని ధర్మపరులయిన రాజకీయోద్యోగులు సహిత మందందు గొందరుండుచువచ్చిరిగాని యట్టివారి సంఖ్య యత్యల్పమయి యుండెను. లంచములు గైకొనుట యుద్యోగ ధర్మమని యెల్లవారును దలచియుండుట చేత నిచ్చువారుగాని పుచ్చుకొనువారుగాని దానిని తప్పుగా దలపకుండిరి. రహస్యమన్నది లేక బంటు మొదలుకొని మంత్రివరకును బహిరంగముగానే యుత్కోచ స్వీకరణము చేయుచుండిరి." పత్రికా ముఖమున నిర్భయముగ నిట్టివారి దుష్ప్రవర్తనమును బహిరంగపరచియు, వీటిని గురించి న్యాయస్థానములలో నభియోగములు తేబడినప్పుడు వారిని దండించుటకు కావలసిన పూర్తి సాక్ష్యము సమకూర్చియు, పంతులవారు లంచగొండి తనమును చాలవరకు రూపు మాపగలిగిరి. వారీ విషయములో చూపిన ధైర్యసాహ సములను శ్రద్ధయు ఇప్పటి వారు చూపగలిగిన యెడల దినదిన ప్రవర్ధమాన మగుచుండు లంచగొండి తనము కొంతవరకైన తగ్గగలదని చెప్పవచ్చును. వారీ విషయములో అనుసరించిన మార్గములు ఇప్పటి వారు కూడ అనుసరింపదగియున్నవి. ఇందును గురించి వారు వారి స్వీయ చరిత్రలో విపులముగ వివరించి యున్నారు.

## స్త్రీ విద్య

పంతులుగారి సంఘ సంస్కరణోద్యమ మంతటిలో సంఘములో స్త్రీల కుండవలసిన గౌరవ స్వాతంత్ర్య ముల గురించి వారు గావించిన కృషి అగ్రస్థానము వహించియున్నది. "స్త్రీల స్థితి బాగుపడినగాని దేశము బాగుపడదని నా నమ్మకము," అని వారొకపర్యాయము చెప్పియుండి దాని కనుగుణముగ సంస్కరణోద్యమము నంతను మొదటనుండి చివరవరకు కొనసాగించిరి. స్త్రీల స్థితి బాగుపడుటకు వారు విద్యావతు లగుటయే ప్రధాన సాధనమని వారి విశ్వాసము. ఆ కాలమున స్త్రీలను పాఠశాలలకు పంపుట సదాచారముగ గ్రహింపబడి యుండ లేదు. వేశ్య లొక్కరికే చదువు అవసరమను అభిప్రా యము కూడ వ్యాపించియుండెను. పంతులుగారు దీనికి భిన్నమైన అభిప్రాయము గలవారై, "స్త్రీల హృదయము లజ్ఞానాంధకారబంధురములయి మౌఢ్య మహారాక్షస దుష్పరిపాలనమునకు లోబడియున్నంత వరకు నానావ గుణ పిశాచము లచ్చటినుండి తొలగిపోవు," అనియు, "గృహము మహారణ్య సదృశము గాక భూతల స్వర్గము వలె నుండగోరిన యెడల పురుషులు గృహిణులను విద్యా వతులుగా జేసి జ్ఞానదీప ప్రభావముచేత నజ్ఞాన తిమిరము తొలగించి దుర్గుణ దురాచార సర్ప శార్దూల సంచారము లకు నారీ హృదయ కుహరముల యందు చోటు లేకుండ జేయవలెను," అనియు ప్రచారము గావించిరి. "స్త్రీలకు విద్య కూడదు" అని కొక్కొండ వెంకటరత్నం పంతులు మొదలైనవారు వాదించుచు, తమ వాదమును సమర్థిం చుటకై వారుపయోగించిన యుక్తులనే ఆధారము జేసికొని "పురుషులకు విద్య కూడదు" అను వ్యాసమును వ్రాసి వెంకటరత్నం పంతులుగారి వ్యాసములోని హేత్వాభాసము లను ఈ క్రింది విధముగ ప్రకాశము చేసిరి. "పురుషు నకు విద్య కూడదు. మన పూర్వు లెప్పుడున్నూ విద్య

మామిడిపూడి వేంకటరంగయ్య

చదువుకోలేదు. కాబట్టి విద్యాభ్యాసము పూర్వాచార విరుద్ధము. యుక్తిచేత చూచినా, విద్య నేర్చుకొనడంవల్ల చాలా నష్టాలు కనబడుతూ ఉన్నవి. ఇప్పుడు కోర్టులలో పుట్టే తప్పు దస్తావేజులున్నూ దొంగ పత్రములున్నూ చదువు మూలముగానే కదా పుట్టుతూవున్నవి...పూర్వ కాలపువారందరు విద్య చదువుకోకపోయినందుచేత చచ్చిపోయినారా? చదువుకోకపోతే జీవనం జరగదా?...".

ప్రచారముతోపాటు వీరు స్త్రీల పాఠశాలలను స్థాపించిరి. స్త్రీలే ఉపాధ్యాయినులుగ నున్న యెడల వయసు వచ్చిన పిల్లలుకూడ పై తరగతులలో చదువ గలరను కారణమున క్రమముగ స్త్రీలను ఉపాధ్యాయినులుగ నియమించిరి. భర్తలతో కాపురము చేయు స్త్రీలు వారి వారి గృహకృత్యములను చక్కబెట్టుకొనవలసినవారగుటచేత మామూలు పాఠశాలలకు సకాలములో వెళ్ళి చదువును కొనసాగించుటకు అవకాశము లేనివారుగా నుండిరి. అట్టివారి సదుపాయార్థము ప్రత్యేక వేళలలో వారు చదువుటకు తగిన ఏర్పాటులు కొన్నిటిని గావించిరి. వారు స్థాపించిన హితకారిణీ సమాజపు పాఠశాలలో, "స్త్రీలను గౌరవించెడు సద్గుణము పురుషులకు చిన్నతనములోనే నేర్పడవలెన"న్న యుద్దేశముతో పురుషులతో పాటుగ స్త్రీలను గూడ జేర్చుకొని ప్రవేశ పరీక్ష వరకు చదువుటకు కావలసిన సదుపాయములను గల్పించిరి. ప్రత్యేకముగ స్త్రీల కుపయోగపడు గ్రంథము లనేకములను వ్రాసిరి. ఇట్లనేకవిధములుగ వారు స్త్రీ విద్యా వ్యాప్తికై తోడ్పడిరి. ప్రస్తుతకాలమున స్త్రీలకు విద్య అవసరము లేదని చెప్పువా రెవ్వరును లేరు. స్త్రీలు ఉన్నత విద్యల నభ్యసించి పురుషులవలె సమస్త రంగములందును కీర్తి ప్రతిష్ఠలతో పని చేయుచున్నారు. దీనికంతకు స్త్రీ విద్యా విషయములో పంతులుగారు చేసిన అమోఘమైన కృషి ప్రధాన కారణములలో నొకటి యని చెప్పవలసియున్నది.

## అతి బాల్య వివాహములు

పంతులుగారు నిర్మూలించదలచిన దురాచారములలో అతి బాల్యవివాహ మొకటి. ఆ కాలమం దీ యాచారము అగ్రవర్ణములలో — అందులో ముఖ్యముగ బ్రాహ్మణులలో — బహుళ వ్యాప్తిగాంచి యుండెను. ఆడపిల్లలలో పది సంవత్సరముల వయస్సు దాటినవారు అవివాహితులుగ నుండిన వారి సంఖ్య చాల తక్కువ. మూడు నాలుగు సంవత్సరముల వయస్సులో వివాహ మాడినవారు కూడ అనేకు లుండిరి. పురుషులుకూడ పదునైదు సంవత్సరములకు ముందే వివాహ మాడుచుండిరి. పంతులుగారు ఈ యాచారము సర్వానర్థములకు మూలమని అభిప్రాయపడిన వారు. దీనిమూలమున బాల్యమునందే విధవలై, యావజ్జీవము నిర్బంధ వైధవ్య మనుభవించుచు, సుఖ మన నేమియో యెరుగనివారు లక్షలాదిగ నుండిరి. "చిన్నతనములోనే వివాహము చేయుటచేత వరులకు విద్య నశించును. చదువుకోదగిన కాలములోనే సంసారము మీద పడుటచేత పెద్దపరీక్షలకు చదువుకొనుటకు వీలులేక యల్పములైన యుద్యోగముల కాశపడి చదువు మానుకోవలసినవా రగుచున్నారు...స్త్రీలకు పిన్న వయసులోనే సంతానము కలుగుచుండుటచేత, అకాలమునందు కాచిన కాయలవలె పిల్లలును బలహీనులుగాను, రోగపీడితులుగాను నుందురు...పిన్నయీడులోనున్న తల్లులకు దేహదౌర్బల్యము కలుగుటయు—వయసులోనే ముసలితనము వచ్చుటయు నల్పాయుష్మంతురాండ్రగుటయు సంభవించుచున్నది" అని 1881 లో వారు వివేకవర్ధని యందు వ్రాసిరి. ఈ అభిప్రాయములను వారు పదేపదే వ్యక్తపరచుటయేగాక, అతి బాల్య వివాహములు శాస్త్ర సమ్మతములు కావనికూడ ఋజువు చేయగలిగిరి. వీటి అన్నింటి ఫలితముగ కాలక్రమమున నీ దురాచార మడుగంటెను. ప్రస్తుతము మన మెదుర్కొనుచుండు సమస్య ఇరువది ఇరువదియైదు సంవత్సరముల వయస్సు వచ్చిన స్త్రీలు

కూడ తగిన వరులు దొరకక అవివాహితలుగ నుండుటయే.

అతి బాల్య వివాహములతో కన్యాశుల్క దురాచారము అతి వృద్ధులగు పురుషుల వివాహ దురాచారము ముడివడి యుండెను. శుల్కమును పుచ్చుకొనక ఆడపిల్లలకు వివాహము చేయు తలిదండ్రులు అరుదుగ నుండిరి. వరుడు అర్హుడా, అనర్హుడా అను విచారణ చేయక, ఎక్కువ శుల్కము నిచ్చినవా డెట్టివాడైనను, వాడు కాటికి కాలు సాచిన కడు వృద్ధుడైనను వానికి తమ కూతు నిచ్చుటకు సంకోచింపని తల్లిదండ్రు లెందరో యుండిరి. ఈ నర మాంస విక్రయము బహిరంగముగా జరుగుచుండుటను చూచి సహించలేక, "భూతదయను ముఖ్యముగా పాటించువార మన్న ప్రతిష్ఠ వహించిన హిందువుల మయిన మనము మన దేశమున బుట్టిన నిరపరాధిను లయిన ముద్దుబాలికలను నిర్దాక్షిణ్యముతో ధనాశా భూతావేశమత్తులయియున్న పిత్రురూప ధారులగు ఘోర రాక్షసులు పనికిమాలిన వారికి విక్రయించెడి దురాచారమును" గురించి పదేపదే వారి పత్రికలయందు వ్రాసియు, ప్రహసనము లనేకములు రచించియు, సమావేశములలో ఉపన్యసించియు దాని నిర్మూలమునకు సుముఖముగ ప్రజాభిప్రాయమును మార్చగలిగిరి. ప్రస్తుతము మనకు కన్యాశుల్క సమస్య లేకుండుటకు వారి కృషి గొప్ప కారణము. మన మిప్పుడు వరశుల్క సమస్యను పరిష్కరించవలసిన వారమై ఉన్నాము.

## స్త్రీ పునర్వివాహము

స్త్రీల విషయమై పంతులుగారు తలపెట్టిన సంస్కరణములన్నిటిలో స్త్రీ పునర్వివాహ సంస్కరణము అత్యంత ప్రధానమైనది. దీనికై వారు చేసినంతకృషి మరి యే యితర సంస్కరణమునకై చేసియుండలేదు. రెండు సంపుటములలో వారు వ్రాసిన స్వీయచరిత్రలో అత్యధిక భాగము ఈ సంస్కరణమునకై వారు గావించిన ప్రయత్నముల వివరణమే. వారి ఉపన్యాసముల సంపుటి లోని ఇరువదియారు ఉపన్యాసములలో ఏడు ఉపన్యాసములు దీనికి సంబంధించినవి. నిర్బంధ వైధవ్యమువంటి క్రూర దురాచారము మరియొకటి లేదని వారు విశ్వసించిరి. అనేకులు అతి బాల్యమందే ఇట్టి నిర్బంధవైధవ్యమును అనుభవించవలసిన వారగుచుండిరి. సుఖపడవలసిన స్త్రీలు దుఃఖములపాలగుట భగవదేచ్ఛకు విరుద్ధమనియు, నిర్బంధవైధవ్యము వ్యభిచారమునకును భ్రూణ హత్యలకును దారిదీయునట్టిది అనియు వారు వాదించిరి. నొసటలోని కుంకుమబొట్టును పొయిలోని బూడిద బొట్టు గాను, చేతుల బంగారు కంకణములు రాగి పట్టెలు గాను; మెడలోని ముత్యాలహారములు తులసిపూసల పేరులుగాను; సరిగపట్టుచీరెలు అంచులేని పనికిమాలిన ముదిగుడ్డలుగాను; మెత్తని పరుపులు కటికనేలను తాటి చాపలుగాను మారుటకంటె క్రూరమైన ఆచారము మరి యొకటి ఉండునా? "చిన్నప్పటినుండియు చమురురాచి పెంచుకొని నిత్యమును దువ్వుకొనుచు పువ్వులు ముడుచు కొనుచు ప్రాణముతో సమానముగ జూచుకొనుచున్న తల వెంట్రుకలను మంగలివాని కఱకు కత్తుల కొప్ప గించుటకంటె మానవతుల కొక్కసారిగా తలకొట్టి వేయుట యుత్తమముగాతోచదా?" అను ప్రశ్నల మూలమున ప్రజల హృదయములందు గొప్ప పరివర్తనము కలిగించి, వారిలో అనేకులను స్త్రీ పునర్వివాహమునకు సుముఖులుగా చేయగలిగెను. అనేక స్మృతులను పరిశీలించి ఇట్టి వివాహములు శాస్త్రసమ్మతములని కూడ ఋజువుచేయగలిగిరి.

వారి సహజమైన కార్యదీక్షతో బాలవితంతువు లనేకులకు తగిన వరులను సమకూర్చి వివాహములను చేసిరి. సంఘములోనివారు అట్టి వారిని బహిష్కరించి నప్పుడు వారికి కావలసిన సహాయమునంతను చేసిరి.

మామిడిపూడి వేంకటరంగయ్య

ఇట్లు కాలక్రమమున సంఘమందుండి నిర్బంధవైధవ్య దురాచారము తొలగు అవకాశమేర్పడెను.

ఈ విధముగ స్త్రీ యుద్ధరణమునకై పంతులవారు చేసినసేవ అమోఘమైనదని చెప్పవలసియున్నది. పతిత యువతుల రక్షణకై వారొక రక్షణశాలను స్థాపించిరి. స్త్రీలు సభలకువచ్చి, ఉపన్యాసములవినుటకును ఉపన్యాస ములు చేయుటకును అవకాశములను మొట్టమొదలు కల్పించినవారు వారే.

## ఇతర సంస్కరణములు

విద్యారంగమందు వారనేక సంస్కరణములను గావించిరి. విద్యావిధానములో నీతిబోధకు, మతబోధకు ప్రత్యేక స్థానమును వారు వారి పాఠశాలలలో కల్పించిరి. పంచమ బాలురను వారి పాఠశాలలో చేర్చుకొనిరి. విద్యార్థిదశలో నున్నవారు పరీక్షలో కృతార్థులయి స్వతంత్ర జీవనము సంపాదించుకొనువరకు రాజ్యాంగపు ప్రక్షోభములో ప్రవేశింపక పాఠములయందే శ్రద్ధవహింపవలెనని హితోపదేశము గావించిరి. విద్యకంటె నీతియే యెక్కువ ప్రాధాన్యమును వహించ తగ్గదనియు నైతిక బలమును చేకూర్చని విద్య విద్యయే కాదనియు వారి సిద్ధాంతము. అందుచేతనే విద్యార్థులు పొడుముపీల్చరాదనియు పొగత్రాగకూడదనియు వారు శాసించిరి. విద్యార్థుల దృష్టిని సాంఘిక సేవలోనికి మరలుచ్చు ఉద్దేశముతో వారి సహాయమున రాత్రి పాఠశాలలను స్థాపించిరి.

పంతులుగారు రాజమహేంద్రవరపు మునిసిపల్ సంఘములో అనేక సంవత్సరములు సభ్యులుగనుండి పట్టణ పురపాలన విధానములో అనేక సంస్కరణములను గావించిరి.

పంతులుగారి హృదయము బహువిశాలమైనది. వారి ఆశయములు బహుఉదాత్తములైనవి. అందుచేతనే వారు సర్వతోముఖమైన సంఘ సంస్కరణోద్యమమును ప్రారంభించి,పట్టుదలతో దానినినడిపి చాలవరకు విజయము గాంచినవారైరి. వారు తొలగింపదలచిన దురాచారములు కొన్ని ఇప్పటికికూడ పూర్తిగ తొలగియుండలేదు. వారి కాలమునలేని దురాచారములుకొన్ని ఇటీవల ప్రాబల్యమును సంపాదించియున్నవి. ఈ తరము వారందరు వారనుసరించిన మార్గములలోని గుణములను గ్రహించి తదనుసారముగప్రవర్తించి సంఘములో నెట్టిలోపములు లేకుండునట్లు సంస్కరణముల గావించవలసినవారైఉన్నారు. వారి జీవితమునుండి ఇప్పటివారు నేర్చుకొనవలసిన గుణపాఠము ఇదియే.



"మన సంఘంలో ప్రబలియున్న మౌఢ్యాన్ని, అంధకారాన్ని నిర్మూలించడానికై దక్షిణ భారతంలో ప్రభవించిన సంస్కర్తలలో శ్రీ వీరేశలింగంపంతులుగారు ప్రథములు. భవిష్యత్తును చూడగలిగిన సంస్కర్తలు అందరివలెనే ఆయన కూడా హింసింపబడ్డారు. నాటి ప్రజలు చేసిన పరిహాసాన్ని సరకుగొనక, ఆయన సాంఘిక పునరుజ్జీవనానికి కృషిచేశారు. ఆయన మార్గాన్ని అనుసరించడమే ఆయనకు మనం జోహారు లర్పించడం."

— సర్వేపల్లి రాధాకృష్ణన్



ఆదర్శ దంపతులు

వీరేశలింగం  రాజ్యలక్ష్మమ్మ

16_4_1848 _ జననం _ 17_11_1851

27_5_1919 _ మృతి _ 11_8_1910

# ధర్మపత్ని
# రాజ్యలక్ష్మమ్మ

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

## 1

"కులజయు నిర్మలాంగి యను
కూలయు నయ్యయి విద్యలందు గౌ
శలవతియున్ ప్రశస్త గుణ
సన్నుతురాలును నైనయట్టి కో
మలి లభియించినన్ గద స
మంజసమౌను గృహస్థధర్మ మ
ట్లలవడినట్టు లైనను గృ
హస్తుని భాగ్యము చెప్పశక్యమే."

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారికి రాజ్యలక్ష్మమ్మగారు అనుకూలవతియైన భార్య. ఆమె సహాయముతో ఆయన అనేక మహత్తర కార్యములను చేయగలిగారు.

రాజ్యలక్ష్మమ్మగారు 1851 సంవత్సరములో తూర్పు గోదావరి జిల్లా కాతేరు గ్రామంలో జన్మించారు. ఈమె తండ్రి అద్దంకి పట్టాభిరామయ్యగారు. కాని ఈమె తలిదండ్రులవద్ద పెరగలేదు. ఈమెకు నాల్గవయేట తల్లి మరల ఒక మగశిశువును గని చనిపోగా ఈమె మేనమామ వెన్నేటి వెంకటరత్నముగారును వారి సతీమణి లచ్చమాంబగారును ఈమెను అల్లారుముద్దుగా పెంచి విద్యాబుద్ధులు చెప్పించి పెద్దదానిని చేశారు.

రాజ్యలక్ష్మమ్మగారికి 8 వయేట వివాహమైనది. అప్పటికి వీరేశలింగము పంతులుగారి వయస్సు పదిరెండు మాత్రమే. వివాహమైన మరి నాలుగేళ్ళకు అనగా పండ్రెండవ యేట రాజ్యలక్ష్మమ్మ అత్తవారియింటికి వచ్చింది. అంతే – నాటినుండి ఈ దంపతులు యేబది సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా గార్హస్థ్య జీవితం గడిపారు. ఇది సాధారణ సాంసారిక జీవితంగాదు, అనేకమైన శారీరక మానసిక క్లేశపరంపరలతో కూడుకున్నది, విశిష్టమైనది.

## 2

పంతులుగారు ఆంధ్రదేశాభ్యుదయానికి నలుముఖాల అమోఘమైన కృషిచేశారు. ఒకటి సారస్వత సేవ, రెండవది బాలవితంతువుల వివాహము, మూడవది వేశ్యాలంపటులును, లంచగొండులును అయిన పెద్దమనుషులతో పోరాటము, నాల్గవది కర్మపరిత్యాగము, విగ్రహారాధన నిషేధము, జాతిమత భేదములులేని ఏకేశ్వరోపాసన. సారస్వత విషయం తప్పిస్తే వీనిలో ప్రతి ఒక్కటీ సంఘంలో తుపానురేపేవే. కాని వీరేశలింగం పంతులుగారు ఆరాధ్య నియోగి బ్రాహ్మణులు. ఈ శివపూజా దురంధరులకు పట్టుదల యెక్కువ. అనుకున్న పనిని యెన్నికష్టము లెదురొన్నా వెనుదీయక చేయడమేతప్ప మానుకొనడమనేది వారి తత్వంలోనే లేదు. వీరి కడగండ్లకు ముఖ్యకారణమైనది పంతులుగారు తలపెట్టిన స్త్రీ పునర్వివాహ ఉద్యమము. చిన్నతనముననే భర్తల కోల్పోయి అష్టకష్టములు పడుచున్న బాలవితంతువులకు మరల వివాహములు చేయవలెనని పంతులు ప్రయత్న

మారంభించారు. ఇది పూర్వాచార పరాయణులకు ఎంతో కంటకప్రాయమైంది. దీనిని వారు సంఘబలంతోను పీఠాధిపతుల మద్దత్తుతోను బహుముఖాల ఎదిరించారు. ఆ రోజుల్లో ప్రజలు సంఘానికి వ్యతిరేకమైన యే ఒక్కపని చేసినా కులములోనుంచి వెలిబెట్టడం సర్వసాధారణం. కులబహిష్కారం సామాన్యమైన కష్టంగాదు. ఇంటికి పనివారు రారు, వంటచేసేవారు రారు, బంధువులు మిత్రులు రారు, పురోహితులు రారు, పేరంటములకు, భోజనములకు వీరిని యెవరూ పిలువరు. వీరు పిలిస్తే ఒకరు రారు. వీరి యింటికి ఎవరు వచ్చివెళ్ళినా వారికి, వారివారి యింటికి వచ్చివెళ్ళినవారికిగూడా కులంలో వెలే, వారింట భోజనమే చేయనక్కరలేదు, తాంబూలము పుచ్చుకువచ్చారని తెలిస్తే చాలు కులబహిష్కరణమే. సంఘంలో పుట్టి, సంఘంలో పెరిగి, సంఘంలో మెలగ నేర్చిన మనిషికి దీనిని మించిన కష్టంలేదు. కనుక ఆ కాలంలో ప్రజలు వెలికి వెరచినట్టుగా పులికైనా వెరచేవారుకాదు.

## 3

స్త్రీకి భర్తయందు భయభక్తులతోగూడిన అనురాగము, పుట్టింటివారియందు విపరీతమైన అపేక్ష ఉండుట సహజ లక్షణము. పెనిమిటి స్త్రీ పునర్వివాహోద్యమం తలపెట్టడంతో పుట్టింటి, అత్తయింటి సంబంధాలు రెండూ రాజ్యలక్ష్మమ్మగారికి రెండుసమస్యలై కూర్చున్నవి. రెంటిని అంటిపెట్టుకొని ఉండటానికి పరిస్థితులు అనుకూలంగా లేవు. పుట్టింటిమీద అపేక్ష పెట్టుకున్నదా భర్తను వదులుకోవాలె, భర్తమీద మమకారం పెట్టుకున్నదా పుట్టింటివారిమీది ఆశ త్రెంచుకోవాలె. ఈ రెండును ఆలోచించి రాజ్యలక్ష్మమ్మగారు భారతనారీమణికేది కర్తవ్యమో ఆ భర్తవద్ద ఉండటమే నిశ్చయించుకున్నది. ఈ సంగతివిని చిన్నతనంనుండి అతిఅపేక్షతో పెంచుకున్న మేనమామ, ఏకైకసోదరుడు తమ్ముడూ వచ్చి పుట్టింటికి వచ్చివేయమని వేవిధాల చెప్పారు, ఏడ్చారు, నిష్ఠూరాలాడారు. కాని సీత, సావిత్రివంటి పతివ్రతల శ్రేణికిచెందిన రాజ్యలక్ష్మమ్మగారు భర్తనువదలి పుట్టింటివారి పంచ చేరడానికి అంగీకరించలేదు. వానతో సేగి, పెనిమిటితో పేదరికము లేదు, వడ్లతో తట్ట యెండవలసినదే అన్న సామెతలు సార్థకంచేస్తూ భర్తవద్దనే ఉండిపోయినారు.

కుల బహిష్కారం మూలంగా రాజ్యలక్ష్మమ్మగారు పాపం అష్టకష్టాలు పడవలసివచ్చింది. పనివాళ్ళు రానందువల్ల ఉదయం వాకిలివూడ్చడం దగ్గరనుంచి, అంట్లు చెంబులు, వంట అన్నీ స్వయంగా చేసుకోవలసివచ్చింది. మంచినీళ్ళు తెచ్చువాళ్ళు రానందున గోదావరికివెళ్ళి నీళ్లు తేవలసి వచ్చింది. ఒకటేమిటి ఆకష్టపరంపరలకు అంతులేదు.

ఈ పనిపాటలు తప్ప మరేముచ్చటాలేదు. నోములనీ వ్రతములనీ పండుగలనీ పబ్బములనీ పేరంటములనీ విందులనీ తోడిస్త్రీలంతా పూచిన తంగేడులాగా చక్కగా సొమ్ములుపెట్టుకొని సరదాగా వెళ్ళుతుంటే రాజ్యలక్ష్మమ్మగారు కులబహిష్కారంవల్ల తమరిని ఎవ్వరుపిలువక ఎక్కడికీ పోవడానికిలేక, యిరుగుపొరుగు స్త్రీల యెత్తిపొడుపులకు హేళనలకు మనస్సు చిల్లులుపడుతూ గ్రుడ్ల నీరు గ్రుడ్ల క్రుక్కుకుంటూ ఉండిపోతూ ఉండేది. పైగా పెనిమిటి ముక్కోపి, ఎందునా చొరవీయని మనిషి, మనసులోబాధ ఆయనతోనైనా చెప్పుకోడానికిలేదు. చెప్పుకున్నదా నీకంతకష్టంగావుంటే మీవాళ్ళయింటికి వెళ్ళమనడానికి వెనుదీయడు. అటువంటి పరిస్థితుల్లో రాజ్యలక్ష్మమ్మగారు ఈ కష్టాల్ని ఎట్లాభరించిందో ఆమెకే ఎరుక, భగవంతునికే ఎరుక.

## 4

ఎంతెంత కష్టాలనూ మరపించే ప్రభావం కాలానికున్నది. కాలక్రమంగా రాజ్యలక్ష్మమ్మగారు ఈ కష్ట

ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మ

పరంపరలకు అలవాటు పడిపోయింది. వివాహేచ్ఛతో తమ యింటికివచ్చిన బాలవితంతువులను చేరదీసి ఆదరించడము, వారికి బొట్టుపెట్టి గాజులుతొడిగించి చీరె రెవికలు కట్టబెట్టి జడవేసి పూలుపెట్టి కూర్చుని వారికి పెండ్లిండ్లుచేయడము ఈ పనులలో నిమగ్నురాలై తమ బహిష్కారబాధలు మరిచిపోయింది. 1881 డిశంబరు 11 తేదీని వీరేశలింగం పంతులుగారు ప్రథమ పునర్వివాహం చేశారు. వరుడు గోగులపాటి శ్రీరాములుగారు. వీరికి మొదటి భార్యచనిపోగా ఆమెవల్లకలిగిన నాలుగు మాసములపిల్లవానిని రాజ్యలక్ష్మమ్మగారు పెంచుకున్నారు. ఇతను ఈమె పోషణలో పెరిగి పెద్దవాడై పట్టపరీక్షయందు ఉత్తీర్ణుడై వివాహసమయమునకు పెంపుడు తలిదండ్రులు చేస్తామన్న బాలవితంతువును చేసికొనక ప్రాయశ్చిత్తముచేసుకొని కులములో కలిసి సాధారణ కన్యను పెండ్లి చేసుకున్నాడు. ఈ కుమారుని యెడబాటు రాజ్యలక్ష్మమ్మగారికి ఎంతో దుఃఖముకలిగించింది, చాలా రోజులు అన్నము నీళ్ళుగానక అల్లాడిపోయింది. ఆమె భగవంతునిగూర్చి వ్రాసుకున్నపాటలో—

కల్లగాదు సుతునిబాసి—తల్లడిల్లుచుంటిని
ఉల్లమందు నిలిచినీవు—నామనసు చల్లచేయవేదేవ

—అన్న చరణమును బట్టి ఈ పుత్రునియెడబాటు ఆమెకెంత వేదన కలిగించిందో తెలుసుకోవచ్చు.

## 5

స్త్రీ పునర్వివాహములేగాక ఏ కారణముచేతనైనా పతితలైన స్త్రీలను, అట్టివారు కని పారవేసిన పిల్లలను గూడ సంరక్షించవలెనని రాజ్యలక్ష్మమ్మగారికి తలంపు గలిగి భర్తను అడిగింది. ఆయన వెంటనే పతిత స్త్రీల ఉద్ధరణాలయమును, అనాథబాలల శరణాలయమునుగూడ కట్టించారు. రాజ్యలక్ష్మమ్మగారికి భూతదయాపరత్వము మెండు. వారేకులమువారైనా ఎట్టివారైనా• సహాయము చేయడమే ఆమెపని. ఒకనాడు మండుటెండలో ఒక హరిజనుడు ఆకలి దప్పులచే శోషిల్లి వీధిలోబడి ఉండగా ఎవరినో సహాయముతీసుకొనివెళ్ళి అతనిని పట్టుకవచ్చి పంచలో పడుకోబెట్టుకొని అతనికి సేదతీరేంతవరకు ఉపచర్యచేసి రక్షించినదట. మానవులేగాదు పెంపుడు కుక్కలు పిల్లులు పశువులన్నా ఆమెకుప్రీతే. ఒకనాటి రాత్రి రాజ్యలక్ష్మమ్మగారు ఎదుటఉన్న పామునుచూడక ముందుకునడచిపోతూ ఉండగా బ్రౌన్ అనుఆమె పెంపుడు కుక్క ఆమెకు అడ్డమువచ్చి ముందుకు అడుగువేయకుండా ఆపినదట. కారణమేమిటని దీపముపెట్టి చూడగా ఎదుట పెద్దపాము! వెంటనే దానినెవరో చంపివేశారు. ఆమె చనిపోయిన తరువాత ఆమెను కుర్చీలో కూర్చోబెట్టగా ఆమె పెంపుడుపిల్లి వచ్చి ఒడిలోకూర్చుండి ఆడుకున్నట్లు పంతులుగారే వ్రాశారు.

## 6

రాజ్యలక్ష్మమ్మగారికి భగవద్భక్తి యెక్కువ. ఆమె రాజమహేంద్రవరములో స్త్రీలకొక ప్రార్థన సమాజము స్థాపించి ప్రతివారము స్త్రీలను సమావేశపరచి ప్రార్థనలు చేస్తూ ఉండేది. భార్యకోరికపై పంతులుగారు దానికి మందిరము గూడా కట్టించారు. ఆంధ్రప్రదేశమున స్త్రీల నిమిత్తమై స్థాపింపబడిన ప్రార్థన సమాజములలో రాజ్యలక్ష్మమ్మగారి సమాజమే మొట్టమొదటిది.

రాజ్యలక్ష్మమ్మగారు చిన్ననాడు వీధిబడిలో కొద్దిగా చదువుకొనినారు. పెద్దవారైన తరువాత ఆ చదువును వృద్ధి చేసుకున్నారు. ఆమె ఏకేశ్వరుని గురించి ఎన్నో కీర్తనలు వ్రాశారు. అవి యెంతో భక్తిభరితంగా ఉంటాయి. శ్రీ వీరేశలింగం పంతులుగారి రచనలన్నీ చదివాము. అవి అన్నీ గద్య పద్యములే.వానిలో కీర్తనలున్నట్టు లేదు. ఆ కీర్తనల భాగమును రాజ్యలక్ష్మమ్మగారు విరచించి అర్ధాంగి నామమును సార్థకం చేసుకున్నారు.

కనుపర్తి వరలక్ష్మమ్మ

## 7

రాజ్యలక్ష్మమ్మగారి జీవితమెంత దివ్యమైనదో ఆమె మరణము గూడా అంత దివ్యమైనదే. ఆమె యెల్లప్పుడు చేయు అనుదిన ప్రార్థనలో భర్తకంటె ముందుగా తాను పోవలెననేది ముఖ్యమైనదట. అందువల్లనే పంతులుగారు తన యావదాస్తిని హితకారిణీ సమాజమునకు దానపత్రము వ్రాస్తూ తన భార్యకు యివ్వవలసిన దానిని గూర్చి ఆలోచిస్తూ ఉండగా ఆ సంగతి రాజ్యలక్ష్మమ్మగారు తెలుసుకొని నేను మీకంటెముందుగా పోతాను, నా కెందుకు ఆస్తి అన్నదట. ఇదే విషయమై ఆమెకు ఆప్తులైన వారు వచ్చి మీ ఆయన ఆస్తినంతా నీకు లేకుండా ధర్మము చేస్తుంటే వూరుకుంటావేమని హెచ్చరించారుట. "నేను నా భర్త కళ్ళ ముందుగానే పోతాను. నాకు ఏ ఆస్తి అక్కరలే"దన్నదట. అదేమి విశ్వాసమో అదేమి స్వచ్ఛంద మరణమో, ఆమె 1910 సంవత్సరము ఆగస్టు 11 వ తేదీ శుక్రవారము రాత్రి ప్రొద్దుపోవు వరకు వంట వగైరా అన్నిపనులుచేసి, భర్తకు కావలసిన సపర్యలు చేసి, తాను భోజనము చేసి, సుఖముగా పడుకొని తెల్లవారునప్పటికి ఏ బాధ లేకుండా చనిపోయి ఉన్నది. ఆమె ఏమైనా మరణబాధపడినదా అంటే ఏమీ లేదు. బొట్టు చెరగలేదు. తల రేగలేదు. తలలో బెట్టుకున్న గులాబి పువ్వైనా వాడలేదు, కట్టుకున్న చీరైనా నలగలేదు. చనిపోయి గూడా నిద్రపోతున్నట్టుగా ఉండిపోయినది. మంచివారి చావు మరణ కాలమున తెలియునన్న సామెతను రాజ్మలక్ష్మమ్మగారి మరణము సార్థకం చేసింది. ఆమె మరణం చూచి యెల్లరు ఆశ్చర్యపోయినారు. ఆ నాడు వారియింటా వాకిటా వీధిలో అంతా తిరునాళ ప్రజే.

భార్య మరణానంతరము వీరేశలింగముపంతులుగారి జీవితము నీరువీడిన చేప చందమైంది. అన్ని విధముల అసహాయుడైపోయినాడు. పంతులుగారు సహజముగా దుర్బలశరీరులు, వ్యాధిగ్రస్తులు. రాజ్యలక్ష్మమ్మగారు ఆయన శరీరతత్వము మనస్తత్వమెరిగి ఎన్నో విధముల ఉపచరించేవారు. రాజ్యలక్ష్మమ్మగారు ఏబది సంవత్సరములు ఆయనను తల్లివలె పోషించింది. దాసివలె ఉపచరించింది. మంత్రివలె ఆలోచన చెప్పినది. భూదేవివలె కష్టములు సహించినది. మహాలక్ష్మివలె ఉండి అన్ని విధముల ఆయనను సుఖపెట్టినది. భార్య మరణానంతరము పంతులుగారు తొమ్మిది సంవత్సరాలు జీవించారు. ఈ తొమ్మిది సంవత్సరములు సుఖపడిన దినములేదు. చేసిన మహత్కార్యములేదు. కృష్ణుని నిర్యాణానంతరం అర్జునుని వలె నిస్సహాయుడై శారీరక మానసిక క్లేశము లనుభవించి తనువు చాలించారు. ఏబది సంవత్సరములు భర్తకు తోడుగా నీడగాఉండి శతాధిక గ్రంథములు వ్రాయుటకేమి, స్త్రీ పునర్వివాహాది సంస్కార కార్యములు చేయడానికేమి, యావద్ధనమును పరహితార్థం సమర్పించడానికేమి సహకరించిన రాజ్యలక్ష్మమ్మగారు ధన్యాత్మురాలు. ఇట్టి అర్ధాంగలక్ష్మిలేకున్న పంతులుగా రింతటి మహత్తర కార్యములు చేయగలిగే వారు కారేమో !

రాజ్యలక్ష్మమ్మగారి పాటలు చాలా కాలం క్రింద చదివాను. ఆ పాటలలోని ఈ పాటభాగము నా నోటికెట్లా వచ్చిందోగాని ఆ ముక్కలు నాకెంతో యిష్టం :

కాపాడ నీకన్న ఘను లెవ్వరున్నారు
కరుణతోబ్రోవుమయ్యా - పాపసంహార
నీ పాలబడిన నన్ను ఆప దుద్ధారక
ఆదరింపవే దేవ ॥కా॥

ఆమె యెంత అనుభవంతో వ్రాశారోగాని ఆ పాట పాడుకుంటూఉంటే నాకేదైనా మనఃక్లేశం కలిగినప్పుడు గూడా మనశ్శాంతి కలిగిస్తూ ఉంటుంది. స్వర్గీయ రాజ్యలక్ష్మమ్మగారికి నా కృతజ్ఞతాంజలి. 

ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మ

# సంస్మరణము

కవిరాజ హంస-కవికులాలంకార
బాలాంత్రపు వేంకటరావు

ఆరంభించిన సుకృతులు
పారము ముట్టంగ జయముఁ బడసిన ధీరున్
వీరేశలింగ సత్కవి
సూరున్ మదిఁ దలఁతు భక్తి జోహారులతోన్. 1

అది తెల్గునాటికి నాకురాలుం గాల
మామని యయ్యె నే యయ్యచేత
అది తెల్గునాటికి నమవస నిశి వేళ
పున్నమి యయ్యె నే పుణ్యరాక
అది తెల్గుజాతికి ననుతాప సమయంబు
వానకా రయ్యె నే వంద్యబోధ
అది తెల్గుమాతకు నదటుజీవపు దెన్ను
కుదురుబా టయ్యె నే కొడుకునడక

తెలుఁగువారల బాసకు దేశమునకు
ఛిద్రకాలంబు కడతేర్చి భద్రమిడు, శు
భోదయంబయ్యె నెవని శుభోదయంబు
అట్టి వీరేశలిం గాఖ్యు నాత్మఁ దలఁతు. 2

నాటకంబులు గూర్చునాడు కావ్యంబులఁ
దేటతెలుంగునఁ దీర్చునాడు
నవలలు వెలయించునాడు శాస్త్రంబుల
సులభశయ్య రచించి చూపునాడు

నవ్వుకబ్బము లల్లునాడు సత్కవి చరి
త్రంబులఁ జెక్కింటి వ్రాయునాడు
నడవడి మేలెంచునాడు భాషాసంఘ
వివిధ సంస్కర్తయై వెలయునాడు

తెలిసె గద్యతిక్కనయని తెలుఁగునాడు
బాసవచ్చినవాఁడు సెబాసనంగ
నవ్యసాహిత్యకర్త యైనాఁడు నేడు
కందుకూరి వీరేశలింగ ప్రధాని. 3

కొండజేగురు కావి కోపంబు రూపింప
కను గెంపులోఁ జూడఁగంటి నాడె
పండువెన్నెల సుస్వభావంబు పరికింప
కరుణార్ద్ర దృష్టిలోఁ గంటి నాడె
చెకుముకిరాయియే చిత్తంబు లక్షింప
కార్యజవంబునఁ గంటి నాడె
అడుగుంచి తప్పని నడవడి తిలకింపఁ
గార్యసంసిద్ధిలోఁ గంటి నాడె

గురుఁడవై శిష్యకోటులఁగూర్చినపుడె
సంఘ సంస్కర్తవై మేలుసలిపినపుడె
గొప్ప యుగకర్తవని యెంచుకొంటి నాడె
కందుకూరి వీరేశలింగ ప్రధాని! 4

అనితర శక్తియుక్తి తన యర్ధసతీమణి రాజ్యలక్ష్మియే
ఘనతర సంఘసంస్కరణ కార్యబలంబిడి తోడుసూపఁగా
ననదలకై వితంతు శరణాలయ మాంధ్రమునన్ ఘటించి నం
దనవనమట్లు చేసితివి నాడు* పరిశ్రమ సార్థకంబుగాన్. 5

అర్ధాంగితో నంద నారామమున నుండి
కందువే ప్రేమ నీ నందనంబు!
దివి కవీశ్వరులతో దేవేంద్రుసభ నుండి
అరయుదే భువి కవీశ్వరగణంబు!

ఋషిమండలంబుతో నిష్టానుమతినుండి
కాంతువే లోకమంగళపథంబు !
విజ్ఞాని సమితితో వినువీథిపై నుండి
పరికింతె సౌభాగ్య భాగ్యకళల !

అమరుఁడవు కీర్తిమంతుఁడ వండ్రు నిన్ను
పరముఁడవు జీవకళ్యాణ పరుఁడ వండ్రు
సుజనలోక సన్నుతిపాత్ర ! సుకవి మిత్ర !
కందుకూరి వీరేశలింగ ప్రధాని ! 6

పదపద్మములుపట్టి పాశ్యంబు లీ నేర్తు
కవికుల దేశికుగా గ్రహించి
అర్ఘపదార్థాప్తి నాతిథ్య మీ నేర్తు
ఘనతర సంస్కర్తగా గ్రహించి
భావార్థపదమిచ్చి ప్రణుతింపఁగా నేర్తు
నిగమంపుఁ జతురాస్యునిగ గ్రహించి
కృతి సుధాధామ మంకితముగా నీ నేర్తు
నిత్యసత్యాతురునిగ గ్రహించి

ఆత్మదేశాభ్యుదయ కృతులాచరించి
త్రిభువనంబులఁ గీర్తిమూర్తిగ వెలుంగు
నినుఁ దలఁపులోనే యర్చింప నేర్తు నయ్య
కందుకూరి వీరేశలింగ కవిచంద్ర ! 7

ఎదుటఁ గానలేక యెడదలో నిను నిల్పి
నీదు సుకృతులందుఁ జాదుకొల్పి
నిన్ను భక్తిఁ గొల్చుచున్న మాకు శుభంబు
లిమ్ము సుకవిచంద్ర ! యిపుడు నెపుడు. 8

---

*నాడు=(నానా)=దేశము
ఆనాడు
అపుడు

బాలాంత్రపు వేంకటరావు

# ప్రభావశీలి

శ్రీ ఏటుకూరు బలరామమూర్తి

కందుకూరి వీరేశలింగంగారు మరణించి 45 ఏండ్లు అయింది. తెలుగుజాతి పునరుజ్జీవనానికై బహుముఖంగా ఆయన చేసినకృషి, పుష్పించి, ఫలించగా, నేటి తరంవారు ఆ ఫలితాలు అనుభవిస్తున్నారు. ఇంకా పెక్కు శాఖలలో మౌఢ్యం, ఛాందసం, స్వార్థం, భయం గూడుకట్టుకుని ఉన్నందుకు తెలుగువారు ఆవేదన పడుతున్నారు.

మహాపురుషులకృషి కాలం గడిచినకొద్దీ కొత్త కాంతులతో విలసిల్లుతుంది. కాలపురుషుని కరాఘాతాలు తగిలి, ఆ రాపిడితో, మరుగుపడిన అంశాలు వెలికి వస్తాయి. వీరేశలింగం అట్టి మహనీయుడు. ఈనాటి కంటె మరొక అర్ధశతాబ్ది తర్వాత ఆయన కృషి మరింతగా గుర్తించబడుతుంది. నన్నయ, తిక్కన కవుల ప్రతిభ, వేమనవంటి సంస్కర్తల గొప్పతనం ఈనాడు గుర్తించినట్లుగా తెలుగువారు 25 ఏండ్ల క్రితం గుర్తించ లేదు గదా !

వీరేశలింగంగారి సేవకు స్థూలంగా మూడు వలయాలున్నాయి. మొదటిది సంస్కారవలయం, రెండవది సాహిత్యవలయం, మూడవది పైరెంటికంటె నిగూఢము, ప్రతిభాసమన్వితము ఐనది — వ్యక్తివలయం. తెలుగువాని ఆలోచనను భయం, అనుమానం, ఛాందసం, మౌఢ్యం - అను దుష్టచతుష్టయం బారినుండి వెలికిలాగి, ఆధునిక హేతువాద స్రవంతిలో, పడవను వదలినట్లు వదలినవారు వీరేశలింగంగారు. ఆ పడవ పయనిస్తున్నది. మధ్య మధ్య తుపానుల తాకిడికి ఊగిపోవచ్చు. తాత్కాలికంగా నడక మందగించవచ్చు. ఐనా వెనుదిరగటం మాత్రం లేదు. నిరంతరాయంగా ముందుకే సాగితీరుతుంది.

75 సంవత్సరాల క్రితంనాటిమాట. నాటి తెలుగు విద్యార్థికుడు ఇంట్లో ఆచారానికి బందీ. బైట తెల్ల అధికారులకు దాసుడు. అజ్ఞానం, భయం, అనుమానాలతో కుంగిపోయేవాడు. ఏదోవిధంగా పైవారి ప్రాపకం సంపాదించి నాలుగు రాళ్ళు సంపాదించుకోవడమే అతని జీవిత లక్ష్యం. ఇంట్లో ఇల్లాలివలన లేని సౌఖ్యాన్ని సానివాడల్లోనూ, అధికారులకు తలఒగ్గి అణచివేసుకున్న ఆత్మాభిమానాన్ని, కింది ఉద్యోగులపై జబర్దస్తీ రూపంలోనూ తీర్చుకునేవాడు. అతడొక అల్పజీవి. శకునాలు, గ్రహబాధ, వర్జ్యాలు, దయ్యాలు, స్వాములవార్లు అతనిని రాత్రింబవళ్ళు పీడించేవారు.

అతనికి స్వతంత్ర ఆలోచనలేదు. పాతవరవడిన నడవటమే అతనికి తెలుసు.

ఇట్టి తెలుగు వానిని శ్రీ వీరేశలింగంగారు వీపు తట్టి ధైర్యంచెప్పి, పరిహసించి, హుషారిచ్చి, విమర్శించి, ఆధునిక మానవునిగా రూపొందించారు. దయ్యాలు, శకునాలు, గ్రహబాధలు మొదలైన కల్పిత భయాలను వదలించాడు. సానివాడల్లో సరసమాడటం భారతీయ సంస్కృతికి, గృహవ్యవస్థకు విరుద్ధమని దూషించి, ఖండించాడు. స్త్రీలకు చదువు, సంస్కారం, సమానత్వం కలిగించి, గృహాన్నే స్వర్గసీమగా చేసుకోగల మార్గం చూపించాడు. లంచాలుపట్టే జడ్జీలు, కలెక్టర్లు, తెల్లవారైనా, నల్లవారైనా నిర్దాక్షిణ్యంగా విమర్శించి, కోర్టుల కెక్కి, నానా బాధలు అనుభవించారు.

తెలుగుజీవితంలో సంస్కారాన్ని, నీతిని, ఆత్మాభిమానాన్ని ఆ మహనీయుడు ఉజ్జీవింపజేశాడు. ఆయన సాహిత్యసేవ, సంఘసంస్కారమూ — రెంటిలోనూ ఈ తీవ్రమైన ఆవేదన, మథన కనిపిస్తాయి. తోటిదేశాలవలె భారతదేశం, తోటి రాష్ట్రాలవలె తెలుగు రాష్ట్రం ఆధునికయుగంలో సగౌరవంగా తలెత్తుకు తిరగా లనేదే ఆ మథన.

ఈ ఆవేదన శ్రీ వీరేశలింగంగారికి నరనరాల్లోనూ జీర్ణించుకుపోయింది. ఒక్కక్షణం, ఒకగంట, ఒకరోజు కూడా వృధా చేయక, అనుక్షణమూ వ్రాస్తూ ఆలోచిస్తూ మాట్లాడుతూ చర్చిస్తూ ఆమరణాంతం ఆయన గడిపాడు. ఈ ఆలోచనలో ఆయన స్వంత విషయాలులేవు. జాతి భవిష్యత్తే మెలకువలోనూ, నిద్రలోనూ ఆయన నావహించిన మహాశక్తి.

ఈ శక్తి ఆయనచేత వందలాది గ్రంథాలు వ్రాయించింది.

తెలుగు వచనానికి ఆయన సేవ మరపురానిది. ప్రబంధ పద్యాలకుమాత్రమే అలవాటైన తెలుగుమాటను నవలకు, నాటకానికి, ప్రహసనానికి, స్వీయచరిత్రకు, చరిత్రరచనకు, భౌతిక, రసాయనాది విజ్ఞానశాస్త్రాలకు వీలుగా ఆయన చెక్కి నగిషీపెట్టాడు. శతాబ్దాల నిస్తబ్దత వలన తెలుగు మాటలకు ఏర్పడిన జడిమను వదల్చి, సానపెట్టి, జవసత్వాలు కూర్చి, అల్పాక్షరముల అనల్పార్థము వ్యక్తీకరించగల సామర్థ్యం చేకూర్చాడు.

ఈ కృషిలో తనకు తోచని ఊహలు ఇతరులనుండి గ్రహించటానికి ఆయన వెనుకాడలేదు. వ్యావహారిక భాషావాదం శ్రీ వీరేశలింగంగారికి తోచలేదు. మొదట్లో నచ్చనూలేదు. కాని అతిత్వరలో గిడుగు, గురజాడల వాదనాబలాన్ని ఆయన గ్రహించారు. 70 ఏండ్ల వృద్ధాప్యంలో ఈ విధంగా కొత్తవాదనను స్వీకరించగల జీవశక్తి సామాన్యమైనదా ?

వారి ఇతర గ్రంథాలన్నీ ఒకఎత్తు, కవుల చరిత్ర ఒకఎత్తు. వీరేశలింగంగారు కవి, సాహితీపరుడు. ప్రాచీన సాహితీవేత్తల చరిత్రను తెలుగువారి కందించనిదే, పాతకొత్తల అనుబంధం అసాధ్యమని ఆయన తెలుసుకున్నారు. వందలాది తాళపత్ర గ్రంథాలు పరిశీలించి, రాత్రింబవళ్ళు శ్రమించి, రాగద్వేషాదుల కతీతంగా, ప్రాచీనకవుల కథ రసవత్తరంగా వర్ణించారు. వారి కవుల చరిత్ర నిశిత శాస్త్రీయదృష్ట్యా చక్కని చరిత్ర. సాహిత్యపరంగా కావ్యం. నిద్రాణమైన పసితనంలో ఉన్న తెనుగుజాతిని మేల్కొల్పటానికి ఆ మహనీయుడు చల్లగా, శ్రవణపేయంగా చెప్పిన ఒక కథ.

అందులోని కాలనిర్ణయాదులు కొన్ని లోపభూయిష్టాలు కావచ్చు. అది సహజం. కాని తెలుగుజాతి సాహితీ చరిత్రను తవ్వి తెలుగువారికి కథారూపాలు అందివ్వాలనే ఆకాంక్ష, ప్రతిమాటలోనూ వ్యక్తమౌతూనే ఉంటుంది. అదే దాని విశిష్టత.

స్త్రీ జనోద్ధరణకు వీరేశలింగంగారు చేసిన కృషి మరపురానిది. 40 కి పైగా వితంతు వివాహాలు చేయించే యత్నంలో ఆయన దాదాపు ప్రతితడవ ప్రమాదాలను ఎదుర్కొన్నారు. ఇంటిమీద రాళ్ళురువ్వడం, దారికాచి కొట్టాలని యత్నించటం, తప్పుడుకేసులు పెట్టి అప్రతిష్ఠపాల్జేయాలనే యత్నం, హత్యచేయాలనే దుర్బుద్ధి — ఇవన్నీ ఆయనను నలుమూలలా ఎదుర్కొన్నాయి. కాని ఆ వీరుడు చలించలేదు. నమ్మిన ఉద్యమానికై ఎంతటి త్యాగానికైనా వెనుదీయలేదు.

హిందూమత సంస్కరణకు ఆయన దీక్షవహించారు. బ్రహ్మసమాజ మతాన్ని అనుసరించారు. వితంతువివాహాలకు ఆటంకమేమోనని చాలాకాలంవరకు నమ్మకం లేకపోయినా హిందూ మతాచారాలను అనుసరించారు. కాని అందులో ఆయనకు అసత్యం కనిపించింది.

ఏటుకూరు బలరామమూర్తి

ఏ ఉద్యమమైనా దాని పటుత్వంపై ఆధారపడాలి. ఒక లక్ష్యం కొరకు, మరొక లక్ష్యాన్ని తాకట్టు పెట్టరాదు, పెట్టనక్కరలేదు.

కనుకనే చివరిరోజులలో వీరేశలింగంగారు బ్రాహ్మ సమాజ దీక్షను పూర్తిగా స్వీకరించి కర్మకాండ నంతటినీ విసర్జించారు.

వ్యక్తిగా ఆమరణాంతం ఆయన ఎదుగుతూనే ఉన్నారు. భాషలో, భావాలలో, ఆచరణలో, నిత్యమూ కొత్తదనాన్ని స్వీకరించటానికి సంసిద్ధత వ్యక్తం చేస్తూనే ఉన్నారు.

జీవితం విలువైంది. తిరిగిరాదు. పునర్జన్మలో వీరేశలింగంగారికి నమ్మకంలేదు. కనుకనే ఈ జీవితంలో ఆఖరుఘడియవరకు ఏదోఒక మంచిపని చేస్తూ ఉండాలని ఆయన మతం. అందుకే మద్రాసులో కొమర్రాజు లక్ష్మణరావుగారి ఇంట్లో కవుల చరిత్రను సంస్కరిస్తూ, రాత్రింబవళ్ళు కృషిచేస్తూ, ఆ కృషిలోనే మరణించారు. ఆయన నిజమైన కర్మయోగి.

తనకు ముందే భార్య మరణించింది. పిల్లలులేరు. సంపాదించిన లక్షలాది ఆస్తిని వేర్వేరు సంస్థల కిచ్చివేసి, తెలుగు ప్రజ లందరూ తన పిల్లలే అనుకుని నిశ్చింతగా మరణించారు.

తెనుగువారు ఈ పితౄణాన్ని తీర్చుకుంటున్నారా?



''ఈనాడు నేనింత ఉచ్ఛస్థితికి రావడానికి ముఖ్యకారణం ప్రఖ్యాతాంధ్ర సంస్కర్త శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి ఆశయాల్ని అనుసరించి నడుచుకోవడమే. స్త్రీ జనోద్ధరణ కాయన ఎంతో కృషిచేశారు. ఆయన మహిళాలోకాన్ని అభివృద్ధికి తేవడానికే జీవితమంతా అర్పించాడు. భారతదేశపు స్త్రీలు ముఖ్యంగా ఆంధ్రమహిళలమైన మేము ఆయనకెంతో ఋణపడివున్నాము. అటువంటి మహాపురుషుడు ఉద్భవించినందుకు ఆంధ్రమహిళనైన నేనెంతో గర్విస్తున్నాను.''

— శ్రీమతి దుర్గాబాయమ్మ

# కవిచరిత్ర పరిశోధన

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

చరిత్ర పరిశోధన అనేది — అది దేశ చరిత్ర పరిశోధన కానీండి, వాఙ్మయ చరిత్ర పరిశోధన కానీండి — చాలా కష్టతమమైన కార్యం ఇప్పటికీని. అటువంటప్పుడు పందొమ్మిదవ శతాబ్ది కడపటి దశకాలలో కందుకూరి వీరేశలింగంగారు పరిశోధన కావించి ఆంధ్ర కవుల చరిత్ర వ్రాయగలిగారంటే అది లోకోత్తరమైన అపూర్వ విషయం. అది వారి పరిశోధనా పాటవానికీ, ఆంధ్ర వాఙ్మయాభిమానానికీ నిస్తులమైన తార్కాణం.

వాఙ్మయ చరిత్ర వ్రాయాలంటే ముందు ఆయా కవుల, వారు రచించిన కృతుల కాలం నిర్ణయించడం అత్యం తావసరం. ఇది ముందు నిర్ణయమైతేనేకాని మన ఆంధ్ర సాహిత్య క్రమ పరిణామం తెలుసుకొనుటకు వీలుపడదు. ఒక్క వాఙ్మయ చరిత్రకే కాదు, దేశ చరిత్రకైనా కాల నిర్ణయ ప్రణాళిక చాలా అవసరం. కాల పరిగణనలోని ముందువెనుకలు, పూర్వోత్తరాలు నిర్ణయమైతే కాని జాతి ఏయే కాలాలలో ఎట్టెట్టి పరిణామ, వికాసాలు పొందిందో, భాషా వాఙ్మయాలలోను, మతంలోను, కళలలోను ఎప్పు డెప్పు డెట్టి మార్పులు వచ్చినవో, ప్రజాభిరుచి ఎట్లా మారుతూ వచ్చిందో తెలియదు. కాల పరిగణన విద్య చరిత్రకు వెన్నెముక వంటిది. ఆంగ్ల విద్యాగంధం అబ్బిన తరువాతనే దేశీయులైన ఆంగ్ల విద్యాధికులు ఈ కాలనిర్ణయావశ్యకతను ఎక్కువగా గ్రహించారు. అంతకు పూర్వము కవులనుగూర్చి, వారి కృతులనుగూర్చి పిట్ట కథలవంటి కట్టుకథలే ప్రచారంలో ఉంటూ వచ్చేవి. కవి వ్రాసిన గ్రంథాలే అన్నీ తెలియనప్పుడు కవి జీవిత విశేషా లేమి తెలుస్తాయి ?

కవులు గ్రంథాలైతే వ్రాశారుకాని వారు తమ జీవిత చరిత్రలు వ్రాసుకోలేదు. వారు తమ జీవిత చరిత్రల కంటెను తమ కృతులకే ప్రాధాన్యం ఇచ్చారు. ఎందు కంటే కృతి సప్త సంతానాలలో ఒకటి; అది పుణ్య కార్యమూ, కీర్తిదాయకమూ గనుక. కొందరు కవులు తమ కృతులను తమ యిష్టదైవముల పేర చెప్పినా చాలా మంది తమ కాశ్రయ మిచ్చినవారికి, తమ్ము పోషించిన వారికి అంకితమిచ్చి కావ్య ప్రారంభంలో సువర్ణతిలకాయ మానంగా ఉండేటట్టు కృతి భర్తృ వంశాన్ని అభివర్ణిస్తూ వచ్చారు. దాన్ని అనుసరించి — మనకు దేశ చరిత్ర లేక పోయినా కొందరు కృతి భర్తలైన భూపతుల చరిత్రలు తెలుస్తాయి. కొందరు కవులను గురించి, వారి పోషకు లను గురించీ — నిజమో అబద్ధమో తెలియని — కొన్ని కథలూ, గాథలూ ప్రచారంలో ఉండేవికదా. వాటిని తగిన ఆధారాలతో పరిశీలించి సాధ్యమైనంతవరకు అబద్ధపు కథలూ గాథలనూ విడదీసి నిజమయిన వాటిని స్వీక రించడం కవి చరిత్రకారుల విద్యుక్తధర్మాలలో ఒకటి.

కవులు రచించిన కృతులన్నీ ఒక్కచోట దొరికితేనే కాని వారి చరిత్ర వ్రాయడం సాధ్యంకానిపని. శ్రీ వీరేశ లింగంగారి కాలానికి ఆంధ్రగ్రంథాలస్థితి ఎట్లాఉందో తెలుసుకోవడం చాలా అవసరం. అది తెలిస్తేనేకాని వీరేశలింగంగారు కవుల చరిత్ర ఎట్లా రచింపగలిగినారో మనకు విశదంకాదు.

మనదేశంలో పూర్వకాలమందు — పద్దెనిమిదవ శతాబ్దంవరకూ కూడా గ్రంథాలన్నీ తాటియాకులమీద గంటంతో వ్రాయడం పరిపాటిగా ఉండేది. గ్రంథాలేకాదు

అన్నివిధాలైన పత్రాలకు తాళపత్రాలే వాడకం. కారణం- అప్పటికి ఇంకా మన దేశానికి కాగితం రాకపోవడమే. వచ్చినా అది అరుదుగా దొరికే పీచుకాగితం, ధర ఎక్కువ. తాటాకుకమ్మలు రెండుకొట్టి తీసుకువస్తే కృతి రచించుటకు కావలసినంత ఆకు. ఇది ఎక్కడపడితే అక్కడ దొరికే వస్తువు; కానీ కర్చులేనిది. ఎటువచ్చీ ఆకులు చక్కగా కత్తిరించి రచన చేయుటకు తగినట్లు అందంగా వాటిని సంతరించాలి. వ్రాయుట కనువుపడే తాళపత్ర గ్రథనంకూడా పూర్వం ఒక కళగా రాటుదేరింది. దక్షిణ భారతంలో పూర్వప్రబంధాలన్నీ తాళపత్రాలమీద వ్రాసినవే. భారత, భాగవత, రామాయణాదులకు తరువాత ప్రజా హృదయాకర్షకములైనవి ప్రబంధాలూ, శతకాలున్నూ. అట్టి కృతులు చదవాలని ఆశగొన్న సంపన్నులు లేఖకుల కింతయని ధాన్యభృతియిచ్చి మాతృకలకు ప్రతికలు వ్రాయించుకొని చదువుకొనేవారు. చదవాలని ఆసక్తి ఉన్న వారికే గ్రంథం దొరికేది ; అదయినా చాలాకష్టంమీద. ఈ విధంగా పూర్వకాలంలో తాటాకులమీద గంటంతో ముద్దులు మూటగట్టేటట్టు ముచ్చటగా వ్రాయగల ముసద్దీ వ్రాయసకాండ్రకు విలేఖకత్వం ఒక వృత్తిగా ఏర్పడింది.

మనదేశంలో ముద్రణయంత్రం వచ్చిన తరువాత ఈ కష్టం తీరిపోయింది. అప్పటినుంచి ఒక్కొక్క గ్రంథానికి కావలసినన్ని ప్రతులు తయారయి సులభమైన మూల్యానికి దొరుకుతూవచ్చాయి. మద్రాసులో 1772వ సంవత్సరంలో ముద్రాయంత్రం ప్రతిష్ఠితమైనా 1800 ల ప్రాంతానగాని తెలుగులో పుస్తకం అచ్చవలేదు. అచ్చయిన వైనా క్రైస్తవమత గ్రంథాలే. మొట్టమొదట ముద్రణయంత్రాన్ని మనదేశానికి తీసుకువచ్చినవారు మిషనరీలే; అది క్రైస్తవమత ప్రచారంకోసమే. తరువాత మన దేశంలో ఉన్నతోద్యోగాలు చేయవలసి వచ్చిన సివిలియన్లు తెలుగు నేర్చుకోవలసిన అవసరం కలగడంవల్ల ఆంగ్లేయులు వ్రాసిన తెలుగు వ్యాకరణాలు అచ్చవుతూవచ్చాయి. మరో మూడు నాల్గుదశాబ్దులకుగాని ఆంధ్రులు అచ్చు ఉపయోగం తెలుసుకోలేకపోయారు. అప్పుడయినా దాన్ని మాస, వార, పక్ష పత్రికల కెక్కువగా ఉపయోగించుకొన్నారుకాని తమగ్రంథాల ముద్రణకుకాదు. ముందుగా అచ్చయినవి భారత, భాగవతాలే. అందువల్ల 1850 నాటికి అచ్చయిన తెలుగుకృతులు మృగ్యంగానే ఉంటూవచ్చాయి.

ఇక తాళపత్ర గ్రంథాలు సంపాదించడమంటే బహు వ్యయప్రయాసలు. ఇప్పటివలె అప్పుడు పుస్తక భాండాగారాలు ఉండేవికావు. తంజావూరు నాయకరాజులు స్వయంగా కవులూ, కవిజనాశ్రయులూ అయినందువల్ల ఆంధ్ర భాషాభిమానులైన వారు స్వోపయోగం నిమిత్తం కొన్నికొన్ని ప్రాచీనాంధ్ర కావ్యాలూ, ఇతరగ్రంథాలూ సేకరించీ, ప్రతులు వ్రాయించీ ఉంచారు. వారి అనంతరం తంజపుర రాజ్యం పరిపాలించిన మహారాష్ట్ర మహీపతులుకూడా తమ రాజ్యంలో తెలుగు రాజభాష అయినందువల్లనూ, సంగీతాని కనువైన భాష అవడంవల్లనూ సంగీత, సాహిత్యాభిమానులైనవారు తెలుగు నేర్చుకొని, తెలుగులో గ్రంథాదులు రచించి ప్రాచీనాంధ్ర తాళపత్ర గ్రంథాలను ఇమ్మడిగా, ముమ్మడిగా సంపాదించీ, మాతృకలకు ప్రతికలు వ్రాయించీ తమ సరస్వతీ మహలు పుస్తక భాండాగారంలో పదిలపరిచి తద్గ్రంథ సంచయాన్ని అభివృద్ధి చేశారు.

ఈ విధంగానే కల్నల్ కాలిన్ మెకెంజీ తన సొంత సొమ్ము వ్యయపరచి దేశభాషలలో రచించిన తాళపత్ర గ్రంథాల నెన్నిటినో సేకరించాడు. అతని మరణానంతరం ఆయన భార్యవద్ద ఈ గ్రంథాల నన్నిటినీ కొని కుంపిణీ ప్రభుత్వంవారు మద్రాసు సెంటుజార్జి కోటలో జాగ్రత్త చేశారు. తరువాత చార్లెస్ ఫిలిప్ బ్రౌను అనే కుంపిణీ సివిలు ఉద్యోగి తెలుగుభాష నేర్చుకొని, దాని మాధుర్యాది గుణాలకు ఉల్లసిల్లి సొంతధనం వెచ్చించి తెలుగులోఉన్న కావ్యాలను కొన్నిటిని కొనీ, మరికొన్నిటిని

పండితులకు బత్తెకర్చు లిచ్చి పంపి వాటికి ప్రతికలు వ్రాయించి తెప్పించీ చాలా సేకరించారు. జీర్ణావస్థలో ఉన్న తాళపత్ర గ్రంథాలకు కొన్నిటికి ప్రతులు వ్రాయించాడు; పండితులనుపెట్టి నిర్దుష్టపాఠాలు నిర్ణయించి కొన్ని కావ్యాలు పరిష్కరించాడు. ఇవన్నీ మద్రాసు తాళపత్ర లిఖిత గ్రంథ భాండాగారంలోనే ఉన్నాయి. వీరేశలింగం గారు 1887 లో ఆంధ్రకవుల చరిత్ర వ్రాయుటకుపూర్వమే పూర్వ కవికృత గ్రంథాలు కొంతవరకు ఈ విధంగా ఒక చోటికి చేరినవి.

ఇట్టి స్థితిలో మునుముందు, అనగా 1876_1880 ల మధ్య ''ఆంధ్ర కవిజీతములు" అను పేరుతో విడివిడిగా చిన్న పొత్తములుగాను, పెద్దాపురంనుంచి వస్తూవుండే ప్రబంధకల్పవల్లి అనే పత్రికలోను ప్రచురించారు శ్రీ గురుజాడ శ్రీ రామమూర్తిగారు. వారు జీవితాలు వ్రాసిన కవులు చాలా కొద్దిమంది. వారు ఆయా కవుల కాలాన్ని నిర్ణయించుటలో కంటె చాలాకాలంనుంచి ఆ కవులనుగురించి ప్రచారంలో ఉంటూవచ్చిన కథలను, గాథలను సేకరించి వ్రాయుటలో ఎక్కువ శ్రద్ధవహించటంవల్ల వారి ''కవిజీవితా''లకు వీరేశలింగంగారి ''ఆంధ్రకవుల చరిత్రకు'' వచ్చిన పేరు దానికి రాకుండా పోయింది.

వీరేశలింగంగారి ''ఆంధ్రకవుల చరిత్ర''కు ప్రశస్తీ, ప్రాముఖ్యమూ తెచ్చినవి రెండు ప్రధానవిషయాలు. అవి యేవంటే (1) కవి కాలనిర్ణయ పద్ధతి, (2) కవి విరచిత గ్రంథం చదివి విమర్శాపూర్వకంగా దాని విలువ_కావ్య గౌరవం_నిర్ణయించడం. ఈ రెంటిలోను మొదటిది కష్టతమమైనది. ఇది యెంత కష్టమైనపనో వీరేశలింగంగారే తమ స్వీయచరిత్రలో ఇట్లా తెలిపారు :

"పూర్వకాలమునుండియు మనదేశములో జరిత్రములను వ్రాసెడి యాచార మంతగాలేదు. అందుచేత కవుల చరిత్రమును వ్రాయుట యెంతో కష్టసాధ్యమయ్యెను. ఎవ్వరో నలుగురైదుగురు తప్ప కవులెవ్వరును దమ వంశవర్ణనములలో దాము పుట్టిన కాలమునైనను దెలుపుకొనలేదు. గ్రంథరచన చేసినకాలము నంతకుముందె తెలుపుకొనలేదు. గ్రంథకర్త లనేకులు తమ గ్రంథములను రాజులు మొదలైన వారి కంకితము చేసియుండుటచేత రాజుల కాలమును గనుగొని దానినిబట్టి కవుల కాలమును గనుగొనవలసి వచ్చెను. రాజులకాలమును గనుగొనుటకైన మనలో చరిత్రములు లేవు. వారు తాము బ్రాహ్మణులకు భూదానాదులను జేసినప్పుడును, గుళ్ళుగోపురములు కట్టించినప్పుడును తామ్రశాసనములను, శిలాశాసనములను వ్రాయించుచువచ్చిరి. ఆ శాసనములలో సాధారణముగా దాము దానాదులుచేసిన కాలమును వేయించుకొనుచు వచ్చుటచేత తన్మూలమున రాజుల కాలనిర్ణయమును, వారు కృతులనందుటచేతఁ దద్వారమున గృతికర్తల కాలనిర్ణయమును చేయవలసివచ్చెను."_(స్వీ.చ; భా. ౧; 3వ ముద్రణము; పుట 229).

రాజులు మొదలైనవారికి అంకితమియ్యని కవుల కాలమును కనిపెట్టుట అంతకంటెను కష్టం. అట్టివారి కాలనిర్ణయం ఎట్లా చేయవలసివచ్చెనో వీరేశలింగంగారే ఇట్లా వ్రాస్తున్నారు :

"కృతికర్తలలో నధికసంఖ్యాకులు తమ గ్రంథములను రాజుల కంకితమొనర్పక దేవతల కంకితముచేయుచు వచ్చిరి. అట్టివారి కాలమును గనుగొనుటకయి వారు తమ గ్రంథములయందు పూర్వకవులనుగా బేర్కొని స్తుతించినవారి నామములుతక్క వేఱాధారము లేవియు కనబడలేదు. ఆయల్పాధారమునుబట్టి సరిగా వారి కాలనిర్ణయము చేయుటకు వీలుకలుగలేదు. కొందఱు కవులు తాము ఆధునికులయ్యును భారతకర్తలయిన కవిత్రయమునుదక్క నితేవలివారి నెవ్వరిని కవిస్తుతిలో బేర్కొనకుండిరి. కవుల కాలనిర్ణయమును జేయుటలో లక్షణ గ్రంథములు కొన్ని కొంతవరకు సాయపడినవి. లక్షణ

మల్లంపల్లి సోమశేఖరశర్మ

గ్రంథములను జేసినవారు కొందరు తాము చెప్పిన లక్ష్యములుగా పూర్వకావ్యములనుండి పద్యముల నుదహరించుచువచ్చిరి. అప్పకవి తాను గ్రంథరచన కారంభించిన కాలమును దన పుస్తకమునందే వ్రాసికొనియున్నాడు. ఇట్లాతని కాలము తెలియుటచేత నప్పకవీయమునందు బేర్కొనబడిన కవులందరును నాతనికి బూర్వమునందుండినవారగుట నిశ్చయమేయైనను, వారిలో నెవ్వరెంత పూర్వులో తెలిసికొనుట కా పుస్తకము సహితము సహకారి కాలేదు. ఇట్లెన్నియో కష్టములున్నను నేనెంతో శ్రమపడి కాలనిర్ణయమును గొంత వరకు జేయగలిగినాడను.''—(స్వీ. చ; భా. 2; 3వ ముద్రణము. పుటలు 229-30).

ఆంధ్రకవుల చరిత్ర వ్రాయుటకు వీరేశలింగంగారు పడ్డశ్రమ అంతా కాలనిర్ణయాన్ని గురించే. పూర్వ కవి కృత గ్రంథాలు చాలావరకు మద్రాసులోను, తంజావూరులోను దొరకుటవల్ల వారి ప్రయత్నానికి మంచి ప్రోత్సాహం కలిగింది. ఆయా పట్టణాలకు వెళ్ళి నెలలకొద్ది ఉండి అచటి గ్రంథభాండాగారాలలో ఉదయం 10 మొదలు సాయంత్రం 5 గంటలవరకు కూర్చుని తాళపత్ర గ్రంథాలు చదివి వాటిలో తమకు కావలసిన భాగాలు వ్రాసుకొంటూ వారు చాలా శ్రమపడ్డారు. వారు చాలా శ్రమపడి వ్రాసుకొన్న భాగాలుగల పుస్తకం ఒకమారు పోవడంకూడా తటస్థించింది. వారే చెపుతున్నారు చూడండి :

"ఒకనాడు ట్రాముబండిలో నెక్కిపోయి సముద్రతీరమున (మద్రాసులో) దిగి పుస్తకభాగములను వ్రాసికొనవలెనన్న యుద్దేశముతో నక్కడినుండి కోటకు నడిచిపోయి, కావలసిన పుస్తకమును పుస్తక భాండాగారమునుండి పైకి తీయించి వ్రాసికోబోగా నాకంచుకకోశము (చొక్కాజేబు) లోని వ్రాతపుస్తకము కనబడలేదు. ట్రాముబండిలో దానిని విడిచివచ్చితినని వెంటనే మరల సముద్రతీరమునకుబోయి మరియొక్క ట్రాముబండినెక్కి విద్యుద్బలోత్పాదక స్థానమునకువెళ్ళి యచట మొదటనెక్కి వచ్చిన బండిని నడుపువాని కనుగొని యడుగగా నత డేదో వ్రాతపుస్తకము బల్లమీదనుండగ క్రిందపారవైచితినని చెప్పెను. అతనిబండిలో మరలనెక్కి యాతడు పుస్తకము పారవేసితినన్న స్థలమునకు వచ్చి దిగి యా సమీపమున వెదకి చుట్టుపట్టులవారిని విచారించి పుస్తకమిచ్చినచో సొమ్మిచ్చెదనని యాశపెట్టితినిగాని పుస్తకముజాడ యెక్కడను కానరాలేదు. పుస్తకము తెచ్చియిచ్చినవారి కిరువదియైదు రూపాయలు పారితోషిక మిచ్చెదనని ప్రకటించినను కార్యము లేకపోయెను. ఇందుమూలమున నేను నెల దినములు పడిన కష్టమంతయు నిష్ఫలమయ్యెను."- (స్వీ. చ.; భా. 2; 3వ ముద్రణము, పుట 231).

తెలుగు కావ్యముల, లక్షణ గ్రంథములమాట అటుంచి తెలుగు కృతులు అంకితంగొన్న రాజులు మొదలైనవారి కాలము తెలుసుకొనుటకు పూర్వులు రచించిన చరిత్రగ్రంథములు లేకపోవడంచేత మరింత కష్టమైనది. ఇందుకు కావలసిన ప్రధానసామగ్రి శాసనాలు. ఇవి శిలాశాసనాలు, తామ్రశాసనాలు అని రెండువిధాలు. సర్వసాధారణంగా శిలాశాసనాలు దేవాలయాలలోని ప్రధాన దేవతలకుచేసిన దానాలను, తామ్రశాసనాలు శాస్త్ర పండితులైన బ్రాహ్మణులకు చేసిన దానాలను తెలిపే నేటి దానపత్రాలవంటివి. వాటిలో చెప్పిన దానకాలాన్ని అనుసరించి — వీరేశలింగంగారు తెలిపినట్లు — రాజకాల నిర్ణయం, తద్వారా అంకితమిచ్చిన కృతికర్తల కాల నిర్ణయంచేయాలి. కాని అప్పటికీనాటివలె ప్రభుత్వ శాసనశాఖ ఏర్పడలేదు — శాసనాలు సంపాదించుటకు ఎక్కడెక్కడ ప్రాచీన నిర్మాణాలు, శాసనాలు ఉన్నాయో విచారించి వాటికన్నిటికీ పట్టికలు తయారు చేయవలసిందని మద్రాసు ప్రభుత్వంవారు జారీ చేసిన ఉత్తర్వు ననుసరించి 1875 లో రాబర్ట్ సూయెల్ దొర స్థానికాధికారుల సాయంతో వాటినిగురించిన వివరాలు సంపాదించి Lists of Antiquarian remains of the

Madras Presidency అనేపేరుతో రెండు సంపుటాలు ప్రకటించాడు. వీటివల్ల ఏయేగ్రామాలలో ఏయేశాసనా లున్నాయో అవి ఎవరివో ఏకాలానివో తెలియడమే కాకుండా ఆశాసనాల నాధారం చేసుకొని వ్రాసినకొన్ని పూర్వపు రాజ్యాల, సంస్థానాల చరిత్రకూడా అరకొరలుగా అయినా కొంత విశదమవుతుంది. అప్పటికి బయలుపడిన తామ్ర శాసనాలను, తెలియవచ్చిన శిలాశాసనాలను పురస్కరించుకొని కుంఫిణీ ప్రభుత్వోద్యోగీ, సంస్కృతాంధ్ర పండితుడూ అయిన బుక్కపట్నం రాఘవాచార్యులుగారు చెన్న రాజధాని కౌన్సిలు సభ్యుడుగా ఉండిన డి. యస్. కార్మికేలుదొర ఉత్తర్వును అనుసరించి వ్రాసిన ఆంధ్రదేశ చరిత్రకూడా అముద్రితంగా ఉంది. ఇవన్నీ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలోనే ఉండేవి. ఇన్నివచ్చినా తెలుగు దేశ చరిత్రకు చట్రమైనా ఏర్పడలేదు. అన్నీ లొసుగులే. అయినా వీరేశలింగంగారు లభ్యమైన ఈ లిఖిత పుస్తక సంచయాన్నంతను పరిశోధించి రాజుల కాలనిర్ణయం ఒక రీతిని కుదుర్చుకొని ఆంధ్రకవుల చరిత్ర రచించారు. తాము పడిన కష్టమును గురించి వారే ఇట్లా వ్రాసికొన్నారు.

"ఇప్పటివలె అప్పుడు గ్రంథాలయములు లేవు. ఇప్పుడు ముద్రింపబడి యెల్లవారికిని సుసాధ్యములయి యున్న గ్రంథములలో నూరులకొలది కాకపోయినను పదులకొలదియైనను తెలుగు గ్రంథము లప్పు డముద్రితములై తాళపత్రైక శరణ్యములయి దుస్సాధ్యములయి యుండెను. ఇప్పుడు ప్రకటింపబడియున్న శిలా, తామ్ర శాసనాదులలో ననేకము లప్పుడు ప్రకటింపబడ కుండెను. ఇట్టి స్థితిలో కవుల చరిత్రమును వ్రాయుట యప్పుడెంత కష్టకార్యముగా నుండునో నేను చెప్పనక్కర లేకయే బుద్ధిమంతు లూహించుకో వచ్చును. అయినను నేను వ్యయ ప్రయాసలకు వెనుక దీయక పుస్తక సంపాదన మునకై చెన్నపురి, తంజాపురి మొదలైన దూరపుదేశములకు సహిత మరిగి, యిచ్చినవారి యొద్దనుండి తాళపత్ర పుస్తకములను సంపాదించియు, గొన్నిటికి మాత్ర కలకు పత్రికలు వ్రాయించియు, నియ్యనివారికడ జీర్ణతాళపత్ర పుస్తకముల నెరవుగా గొని చదివి వానినుండి కావలసిన చరిత్రాంశములను వ్రాసికొనియు...నా కప్పటికి లభించిన పరికరసాహాయ్యమున నాంధ్ర కవులను గూర్చి యేదో తోచిన దానిని వ్రాసి ప్రకటించి కవులచరిత్ర మని పించితిని.''

ఇంతగా కష్టపడి రచించిన గ్రంథము గనుకనే ఆయన తాను చేసిన గ్రంథాలలోనెల్ల ఆంధ్రకవుల చరిత్రే ప్రధానమయినదని చెప్పుకొన్నారు. నిజమే, అప్పటికే కాదు, మొన్న మొన్నటిదాకా కూడా, కొంచెె మించుమించుగా ఇప్పటికీ కూడానేమో ఆయన రచించిన ఆంధ్రకవుల చరిత్రే పరమప్రామాణిక గ్రంథంగా ఉంటూ వచ్చింది. ఆ గ్రంథం ప్రతి పుటలోను ఆయన పడ్డశ్రమ గోచరిస్తూనే ఉంటుంది. ఓపిక, కార్యదీక్ష, సత్యాసత్య వితర్క వివేకము, సత్యం మీద లక్ష్యము, గుణదోష విచారము, న్యాయబుద్ధి, ఇవి పరిశోధకుని కుండవలసిన ప్రధాన గుణాలు. ఇవి వీరేశలింగంగారికి సహజములైనవి. ముందేర్పరచుకొన్న యభిప్రాయానికి అనుగుణంగా సాధనకలాపాన్ని మలచి సిద్ధాంతం చేయడం, అనుచితమైన అభినివేశం, దురభిమానం — ఇవి పరిశోధకుని ప్రామాణికతకు భంగం తెచ్చేవి. వీరేశలింగంగారికి సత్యం మీదే లక్ష్యం కాని ప్రతీది మనదే గొప్పదన్న దురభిమానం లేదు. అందువల్లనే ఆయన పరిశోధన మండలికి అప్పటికీ ఇప్పటికీ పూజ్యుడయినాడు. పందొమ్మిదవ శతాబ్దం కడపటి దశకాలలో ఆయనను మించిన — కాదు, ఆయనతో సరిసమానుడయిన పరిశోధక పండితుడు ఆంధ్రులలో లేడు. మన దేశంలో పరిశోధన జ్యోతిని వెలిగించిన ఆంధ్రులలో ఆయన ప్రథముడూ, ప్రముఖుడూను. ఆయనతోనే తెలుగు దేశంలో పరిశోధన ప్రారంభం. అసదృశమైన ఇతర కార్యకలాప భారాన్ని తలకెత్తుకొని ఇంతటి పరిశోధన

మల్లంపల్లి సోమశేఖరశర్మ

కార్యాన్ని ఎట్లా నిర్వహించాడో ఆయన అని ఆశ్చర్యం కలుగుతుంది. ఎందుచేతనంటే ఏకాగ్రత ఉంటేనే కాని సాగేపని కాదు ఈ పరిశోధన.

వీరేశలింగంగారు అంత శ్రమపడి వ్రాసిన ఆంధ్రకవుల చరిత్రలో తప్పులున్నవని నిశితముగ దానిని విమర్శించిన వా రున్నారు. అంత శ్రమపడి వ్రాసిందిగనుక దానిని విమర్శింపకూడదని కాదు; దోషములెక్కడ ఉన్నా విమర్శనీయములే. కాని విమర్శనము సహృదయ సహముగా ఉండాలి; పరిశోధన అనేది ఎంతపాతదో అంత కొత్తది. కొత్తశాసనములు, కొత్తగ్రంథములు బయలు పడుటచేత ఇదివరలోచేసిన పాతసిద్ధాంతములు మారి పోవచ్చును; అదివరకు వ్రాసినదానిలో కొన్ని సవరణలు చేయవలసిన అవసరం కలుగవచ్చును. అంతమాత్రం చేత ఆధునిక పరిశోధకులు అంతకుపూర్వపు పరిశోధకులు వ్రాసినవి తప్పులతడికలనీ, చేసిన సిద్ధాంతము లపసిద్ధాంతాలనీ అధిక్షేపణచేసి, తామేమో వారికంటె అధికులైనట్లు భావించుట అహంభావ మనిపించుకొనును కాని వివేక మనిపించుకొనదు. అది పరిశోధనస్వభావము నెరుగని అజ్ఞానవిలసనము. వెనుకటివారి పరిశోధనా ఫలితములు తరువాతి వారికి సోపానాలవంటివి. వెనుకటి పరిశోధకులు తమకుదొరికిన సాధనకలాపముతో తమకుతోచినట్లు, ఆ గ్రంథాదులు రచించారుగనుకనే ఆధునిక పరిశోధకులు కొత్తగా లభించినవిషయాన్ని సమన్వయదృష్టితో పరిశీలించి కొత్తసిద్ధాంతాలు చేయుటకు, కొత్త విషయాలు చెప్పుటకు అవకాశం కలిగింది. ఇంతకూ శ్రీ వీరేశలింగం గారు చెప్పినట్లు కొత్తగాపూనుకొని ఒక పనిచేయడం కష్టం; చేసినదానికి వంకలుపెట్టి దానిలో తప్పులు పట్టడం సులభమే.

ఆంధ్రకవులచరిత్ర మొదటిభాగంవలె మిగిలిన రెండు భాగాలూ ఆయన చేతిమీదుగా సంస్కరింప బడకపోవడం ఆంధ్రుల దురదృష్టం.

---

"ఆంధ్ర ప్రజాబాహుళ్యమంతా శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు కెంతో ఋణపడి వుంది. సాంఘిక పునర్నిర్మాణానికి, సారస్వతాభివృద్ధికి, విద్యావ్యాప్తికి ఆయన చేసిన కృషి అమోఘమైనది. ఆ మహామహుని శతవార్షిక వర్ధంతిని దిగ్విజయంగా జరపడం ప్రతి ఆంధ్రుడికి ముఖ్య కర్తవ్యం - ఆయన జ్ఞాపకార్థమై ఒక శాశ్వత స్మారక చిహ్నం ఏర్పరచుకోవడం కూడా మన విధి."

— ఆంధ్ర కేసరి ప్రకాశం

# నమస్కృతులు

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

చిన్నయసూరి చూపిన విశిష్టత లెస్స యెఱింగి దానిఁ గై
కొన్న మనీషి వీవు ; తెలుఁగుందన మందము చిందునట్టు లె
న్నెన్నొ రచించి గ్రంథముల నిచ్చి గడించితివయ్య 'గద్యతి
క్కన్న'గఁ బెద్దపేరు ; మొనగాఁడవు సర్వవిధాల ధీనిధీ !

జాతిని మేలుకొల్పుచుఁ బ్రచారముచేసెడి వాఙ్మయంబు నీ
చేతికిఁ జిక్కిన ట్లెవరి చేతికిఁ జిక్కినదయ్య తెల్గులో ?
నీతికి నీవు నిల్చి, యవినీతులకున్ గడు బీతు పుట్టఁగా
వ్రాఁతలు వ్రాసి వారలకు వాతలు వెట్టితివయ్య మూతులన్.

ఒక సంస్కారముకాదు ; దేశమున నీ వొక్కండవే నాఁడు పూ
నికతోఁ జూపిన యుద్యమం బెవరుగానీ చూపలేరైరి ; యిం
తకుఁ బూర్వం బెవరైన నీవలెఁ గవిత్వ ప్రాభవం బింత నై
తిక మార్గాలను బంచియిచ్చిరె ! మహాధీరుండ వీ వన్నిటన్.

నీవు నిజంబుగాఁ దెలుఁగు నేలను వి త్తిన వి త్తనమ్ములే
భావియుగంబు వారి కొక భాగ్యము గూర్చెడి వృక్షజాతులై
ఠీవిగ నిల్చి పొల్చియుఁ బటిష్ఠత చూపియు వేలు దన్ని సం
జీవులునై తనర్చి వికసించి ఫలించినవయ్య యెన్నఁడో.

నీ సంకల్పబలం బదెట్టిదియొ గానీ నీవు దేశంబులో
నే సిద్ధాంతము లిట్టి వట్టివని యేయే త్రోవలోఁ జూపి సం
దేశం బిచ్చిన వాఁడవో యవియె యుత్తేజంబుతో మాకు సం
తోసంబున్ గలిగించుచున్నయవి యెంతో జ్ఞానమున్ గూర్చుచున్.

దివ్య గోదావరీ నదీ తీరమందు
నన్నయాది మహాకవు లున్న పురమె
'కందుకూరిని' సృష్టింపఁగలిగి తెలుఁగు
తియ్యఁదనమున కాస్కార మయ్యె నయ్య.

జాతి కక్కఱయైన సంస్కార మొక్క
చేతిమీఁదుగ నింతగాఁ జేసినట్టి
పండితుఁడు - నాయకుఁడు - కవీశ్వరుఁడు మనకు
లేఁడు లేఁడిఁక నేడను నాఁడు నేఁడు.

కందుకూరి వీరేశలింగమును గూర్చి
కవిత లల్లియు వర్ణింపఁగలముగాని
అతఁడు చెప్పిన త్రోవలో నడుగువెట్టి
నడువనేర్చుట సాధ్య మందఱకుఁ గాదు.

అతని పవిత్ర జీవితమునందలి మేలిమిఁయెల్ల నేర్మిమై
వెతకియు సేకరించియు వివేకను కొంత గడించి వాని కిం
పితమగు బాటలో నడచి పేరును బెంపును బొందుటొక్క చే
హితమగు ధర్మ మాంధ్రులకు ; నిట్టి గుణాఢ్యుని జూడ మెన్నఁడున్.

తన దేహంబును గేహమున్ ధనము నిత్యం బెంత త్యాగంబు చే
సిన పుణ్యాత్ముఁడో 'కందుకూరి'? యనుచున్ శ్రీకారముంజుట్టి యిం
కను వ్రాయంబనిలేదు ; వానికయి లోకంబెల్ల జోహారు సే
యును వర్ధంతు లొనర్చు వేడుకలతో నుల్లాసముం జూపెడున్.

తెలుఁగుల కిట్టి ధీరుఁడు సుధీవరుఁ డిద్ధయశుండు త్యాగి ని
ష్కలుషుఁడు దేశభక్తుఁడు వికస్వరచిత్తుఁడు సత్కవీశ్వరుం
డలఘుఁడు పుట్టి దేశమున కంతకు నన్నివిధాల శక్తి యు
క్తులు వ్యయపెట్టి దీప్తి యొనగూర్చెను; వాని కివే నమస్కృతుల్ !!

★

# నాటకములు

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

రాజకీయేతర రంగమునందు ఆంధ్రజాతి స్థాపకులుగా పరిగణింపదగిన మహాపురుషులలో కందుకూరి వీరేశలింగము పంతులుగారు ఒక్కరు. నా దృష్టిలో ప్రాచీనుడైన ఆపస్తంబ మహర్షి, కుమారిలభట్టు, నన్నయభట్టారకుడు, వీరేశలింగముపంతులు — ఈ నలుగురు మహనీయులును ఆంధ్రజాతి పితలు. వారు కారణ జన్ములు. వారు వారు అవతరించిన యుగధర్మములను, అవసరములనుబట్టి వారు ఆంధ్రజాతికి గొప్ప సేవచేసి, యుగ పురుషులను కీర్తికి తావలమైరి. వీరేశలింగము పంతులుగారు కార్యక్షేత్రమున దిగునప్పటికి ఆంధ్ర దేశమునందుండిన పరిస్థితులను మనము చక్కగా అవగాహనము చేసికొన్నచో వారి మహత్తర కృషియొక్క ఆవశ్యకతను, దాని యమోఘ ఫలితములను బాగుగా నాకళించుకొనగలము. సంగ్రహముగ చెప్పవలసినచో అప్పుడు 'ధర్మగ్లాని' జరిగెననియు, పంతులుగారు దాని నెదుర్కొని, 'ధర్మసంస్థాపన' చేసిరనియు నిస్సందేహముగ చెప్పవచ్చును. కొందరనవచ్చును — ఇసీ! వితంతు వివాహములను చేయించుటయు, లంచగొండితనముపై కత్తి కట్టుటయు, మతదాంభికత్వము మీద నల్లేరుపై బండివలె నడచుటయు, విగ్రహారాధనను తెగడుటయు, వారకాంతా లోలత్వమును ఎగ్గుగా నిరూపించుటయును — ఇవియేనా వీరకార్యములు, ఇదొక ధర్మగ్లానియా! వీనిలో కొన్నిటిని ప్రవర్తింపజేయుట, కొన్నిటిని నిర్మూలించుట — దీనికి ధర్మస్థాపనమను పెద్ద పేరు పెట్టుట తగునా? అని కొందరనవచ్చును. దీనికి సమాధానమిది — అయ్యా! రోగము మాన్పబడిన తర్వాత అది యంత దురంతవ్యాధి కాదేమో అను భ్రమ కలుగుచుండును. కాని ఆ రుగ్మతను అట్లే వ్రేళ్ళు పారనిండు. దాని పరిణామము ఎంత అప్రతి విధానమో దీర్ఘకాలము మీద గుర్తునకు వచ్చును. ఆనాడు ఆంధ్రసంఘమునకు పట్టిన దుర్నీతియను చీడ ఉపేక్షింపబడినచో జాత్యభ్యుదయ సస్యమును సమూలముగ నష్టముచేయ జాలియుండెను. అట్టి భయంకర రుగ్మతనుండి యాంధ్రుల నుద్ధరించిన వెజ్జు, గొప్ప ధన్వంతరి — వీరేశలింగము పంతులు.

పంతులుగారు జాత్యారోగ్యమునకు రక్ష సేయుటలో ఉపయోగించిన చికిత్సా విధానము ప్రధానముగా సారస్వతము. అందు నాటక ప్రక్రియ మిక్కిలి కార్యసాధకమైన భేషజము. ''నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్'' అని కాళిదాస మహాకవి నుడివియున్నాడు. సారస్వతము, వైద్య పరిభాషలో Anaesthesia నిశ్చైతన్యకరణి యగు పరమౌషధము. గాయమును కోయుచున్నప్పుడు తాత్కాలికముగ బాధను తెలియనీయని నిద్రమందు. దుర్నీతి పంకమును ప్రక్షాళనము చేయుటలో సారస్వతము — తత్రాపి — నాటక ప్రక్రియయంత శుద్ధజలము వేరొకటి లేదు. 'అవస్థానుకృతి ర్నాట్యం' అని దశరూపకకారుడు చెప్పినట్లు లోకమునందలి పాత్రలే నాటకమునందు నాయికానాయకు లగుచున్నారు. లోక వృత్తమే ఇతివృత్త మగుచున్నది. నాటక ప్రదర్శనమునందు సామాజికుడు తన్నుతానే చూచు

కొనుచున్నాడు. చూచి యానందించుచున్నాడు. ఆనందించి సంస్కారమును తనకు తెలియకుండగనే పొందుచున్నాడు. హాస్యము, అపహాస్యము, వికృతీకరణము (Caricature) మున్నగునవి బహు సున్నితములయి వాడి వాదరగల శస్త్రియుధములు. వీనితో దుర్నీతియను దుష్టాంగమునకు శస్త్ర చికిత్స చేయగా, వ్యాధిగ్రస్తుడు ఇతరులతోపాటు తానును నవ్వుచు, లోలోన కోతబడి, పరువునష్టము లేకుండ ఆరోగ్య సంస్థాపితు డగును. ఇచ్చటనే దృశ్యకావ్యము శ్రవ్యకావ్యమునకన్న ఎక్కువ జనరంజక మగుచు, ఉపాదేయ మగుచున్నది.

వీరేశలింగము పంతులుగారు తమ యితర సారస్వత ప్రక్రియలనువలెనే నాటకమునుగూడ సంఘారోగ్య సుస్థితికి సాధనముగా ప్రయోగించినారు. ఇచ్చట ఒక ముఖ్య ప్రశ్న. నాటకము కానిండు — నవల కానిండు, కవిత్వము కానిండు — వీటియన్నిటి పరమ ప్రయోజనము ఆనందమని కదా చెప్పుదురు. ఉపదేశ మొసంగుట అవాంతర ప్రయోజనముగా మాత్రమే సాహిత్యకులు పరిగణింతురు కదా. వీరేశలింగముగారు ఉపదేశమునే ముందుపెట్టి వినోదమును వెనుకకు నెట్టినారని చెప్పవలసి యున్నది. ఇట్లు సాహిత్యపు విలువలు తారుమారై, వీరేశలింగముగారికి దృశ్య కావ్య నిర్మాతలలో మహోన్నత స్థానము లేకుండ పోయినదేమో అని శంక చేయవచ్చును. దీని నిట్లు పరిష్కరింతుము. సహృదయ మహాశయా! నీవు చెప్పిన సాహిత్యపు విలువలు కాదనము. కాని యవి సంఘము నీరోగమైన ఆరోగ్యము ననుభవించుచున్నప్పుడే ప్రసక్తములు. ఈశ్వరుడు వీరేశలింగము గారిని మరియొక మహా ప్రయోజనమును సాధింప జగద్రంగముపై నిలిపినాడు. దారితప్పి, కంచెలు కంపలబడి, కొఱవి దయ్యముల భ్రామక కాంతులచే అంధకూపము లోనికి నడచుచున్న యొక మహా సంఘమునకు సత్య దీపము చేతబూని దారి చూపుటకై వీరేశలింగము పంతులుగారు అవతరించిరి. ప్రాణావసరమైన ఈ ప్రయోజనముముందు తదితర ప్రయోజనములు క్షుద్రములు కాకపోయినను, మొదటి మెట్టుమీద నిలువదగినవి కావు. అట్లని వీరేశలింగముగారు రసబ్రహ్మానభిజ్ఞుడని కాని, ఉత్తమ శిల్ప స్వరూపము నెరుగరని కాని చెప్పుట పరమ సాహసము. పరతత్వము ముప్పేట రజ్జువు. సత్యము, శివము, సుందరము దాని పురులు. పంతులుగారు ప్రధానములకు ప్రధాన స్థాన మిచ్చిన మహనీయులు. వారు నాటకములద్వారా సత్యమును శివమును ప్రధానముగా ఆరాధించిరి. సుందరము సత్యము నంటియే యుండును. అది వెలి కాదు. ''వాచమర్థో౽ నుధావతి'' యన్నట్లు మహా సత్యము నంటియే శివము, సుందరము ఉండును. లోకసామాన్య సాహిత్య సూత్రములతో వీరేశలింగము గారిని కొలుచుట గజముబద్దతో హిమాలయమును కొలవబూనుటవంటిది. అది విజ్ఞతయుకాదు—కృతజ్ఞతయుకాదు.

పంతులుగారి సారస్వత జీవితములో 1875–95 వరకు గల ఇరువది యేండ్లు ప్రధానముగ నాటకరచన దశయని చెప్పవచ్చును. దానిని తిరిగి క్రిందివిధముగా వింగడింపవచ్చును.

1. సంస్కృత నాటకానువాదములు 1875–85
2. స్వతంత్రనాటక నిర్మాణదశ 1880–90
3. ఆంగ్ల నాటకానువాదములు 1880–95

ఇది స్థూలవిభజనము మాత్రమే. ఒక్కొక్కప్పుడు వీనిలో ఒకటికన్న-ఎక్కువరీతులను ఏకకాలమందే పంతులుగారు నిర్వహించుచుండిరి. వీరినాటకసాహిత్యమును వీలైనంతవరకు ఒకచోట సందర్శింతము.

## సంస్కృతానువాదములు

| | |
|---|---|
| శాకుంతలము | 1875–1883 |
| రత్నావళి | 1880 |
| మాళవికాగ్నిమిత్రము | 1885 |
| ప్రబోధ చంద్రోదయము | 1885– 91 |

## ఆంగ్లానువాదములు

| | |
|---|---|
| చమత్కార రత్నావళి | 1880 |
| వినీసువర్తక చరిత్రము | 1880 |
| రాగమంజరి | 1885 |
| కల్యాణ కల్పవల్లి | 1894 |

## స్వతంత్ర నాటకములు

అ) ప్రబోధాత్మకములు :

| | |
|---|---|
| బ్రాహ్మవివాహము | 1880 |
| వ్యవహార ధర్మబోధిని | 1880 |
| వివేక దీపిక | 1880 |
| తిర్యగ్విద్వన్మహాసభ | 1889 |
| మహారణ్య పురాధిపత్యము | 1889 |
| మూషకాసుర విజయము | ? |

ఆ) రసప్రధానములు :

| | |
|---|---|
| దక్షిణ గోగ్రహణము | 1885 |
| ప్రహ్లాద నాటకము | 1885 |
| సత్యహరిశ్చంద్ర నాటకము | 1886–89 |

పైనచూపిన వింగడింపునుబట్టి సామాన్యముగ తెలియవచ్చునదేమన—పంతులుగారు తమ నాటకరచనా ప్రథమదశయందు సంస్కృత నాటకానువాదములతో అభ్యాసము చేసిరి. గీర్వాణరూపకముల ధర్మములను నిర్మాణవిధానమును చక్కగా అవగతము చేసికొనిన తరువాతనే తెలుగులో స్వతంత్ర నాటకరచనకు పూనుకొనిరి. ఆంగ్ల నాటకానువాదములుకూడ ఈ నడుమనే వచ్చినవి. అనగా షేక్స్పియరు, షెరిడను మున్నగు ప్రసిద్ధాంగ్ల నాటక కర్తల శిల్పవిధానమును గూడ పంతులుగారు కరగతము చేసికొనిరి. కావున వారినాటక రచనాదశలో ఇంచుమించు చివర బయలువెడలిన స్వతంత్రనాటకములు గీర్వాణాంగ్ల రూపకములందలి ప్రశస్తమార్గములను సమీకరించుకొనియే వెడలినవని నిర్ణయింపవచ్చును. అయినను స్వతంత్రభావ ప్రేరితులును, ప్రతిభావంతులును అగుటచే వీనిని అంధానుకరణముగ అనుసరింపలేదు.

వీరేశలింగముగారి సంస్కృత నాటకానువాదములలో మనము గుర్తింపవలసినది వారి శైలీప్రసన్నతయే. శాకుంతలమునే వారు మొట్టమొదట అనువదించుటకు పూనుకొనిరి. పెద్ద కుండకు ఎసళ్ళు పెట్టినట్లు వెళ్ళివెళ్ళి ప్రారంభములోనే కాళిదాసువంటి మహాకవిని ఎన్నుకొనుటేల? అందును సర్వోత్కృష్టమని భావింపబడు శాకుంతలమునే యెత్తుకొనుటేల? మరొక చిన్న నాటకమును దేనినైన చేపట్టి శైలి మున్నగునవి కుదురుటకు సాధనచేసి యుండరాదా అను ప్రశ్న మనకు తోచును. పంతులుగారికినీ తోచినది. దానికి వారే తమ స్వీయచరిత్రయం దిట్లు సమాధానము చెప్పిరి. "కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా" యని మన పూర్వులు నాటకములలోకెల్ల శాకుంతల నాటక మత్యంత రమణీయమైనదని చెప్పియున్నారు. అంతటి రమణీయమైన నాటకము నంత రసవంతముగాఁ దెలిఁగించుటకు నావంటి యప్రౌఢుఁడు సమర్థుఁడు కాఁజాలఁడని నే నెఱుంగకుండిన వాఁడనుగాను. అట్లయ్యును తప్పిపోయినను కాళిదాసునివంటి మహాకవియొక్క యుత్తమ నాటక రచనయందే తప్పిపోవలయునన్న బుద్ధి చాపల్యమును మరలించుకోలేక దాని యాంధ్రీకరణమునకుఁ బూని నాచేతనైనట్లెల్లో దానిని నిర్వహింపఁ గలిగినాఁడను". పంతులుగారి వినయవాక్యములు మనోజ్ఞములుగా నున్నవి. వారు వినయపరులయ్యు ఆత్మ విశ్వాసమునందు పర్వత ప్రతిమానులు. ఆంధ్రదేశమునందు దిగ్దంతులవంటి పండితులెందరో పంతులుగారి తరువాత శాకుంతలము నాంధ్రీకరించిరి. రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారు, వేదము వెంకట్రాయశాస్త్రిగారు, దాసు శ్రీరాములు పంతులుగారు, వడ్డాది సుబ్బారాయుడుగారును శాకుం

తలమును అనువదించిరి. అనువాదము లన్నిటిలో వీరేశ లింగముపంతులుగారిదే నాటికిని నేటికిని జనామోదము నందినది. పంతులుగారికి కొంచెము ముందుగనే విశాఖ పట్టణవాసులు మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులవారు శాకుంత లాంధ్రీకరణమును చేయబూని రెండంకములు మాత్రము ప్రకటించి విరమించిరి. వీరేశ లింగముగారికి గాఢమైన సంస్కృతభాషా పరిశ్రమ లేదనియు, శాకుంతల వ్యాఖ్యానాపేక్షములైన యర్ధములను సారస్యములను వారు తమ యనువాదములో ప్రదర్శింపలేదని కొందరు లాఘువపరచజూతురు. పంతులుగారు కొందరు పండితులవలె 'డుకృఞ్ కరణే' యని నిత్యపారాయణ చేయువారు కాకపోవచ్చును. కాని వారి సంస్కృత భాషాజ్ఞానము శంకింపదగినదికాదు. శాకుంతలానువాదమునందు వివిధ ప్రతులను సంపాదించి పాఠ బేధములను సమన్వయించుకొని ప్రశస్త పాఠముల నెన్నుకొనుచునే రచించితిమని వారు సెలవిచ్చియుండిరి. కానైతే వారిది అనువాదమునందు నన్నయాదుల ప్రాచీన సుందర పద్ధతి. భావానువాదమునే ప్రధానముగా నెంచిరి కాని పదానువాదమున కంత పట్టుదల వహింపకుండి రనవలెను. స్వతంత్ర రచనమునందువలె భావము అక్లిష్టముగానుండుట, ప్రసన్న రమణీయమైన శైలి ఈ రెండే పంతులుగారి యనువాదమునకు ప్రాశస్త్యము జనామోదము తెచ్చిపెట్టినవి. కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయ నాటకమును కూడ పంతులుగారే మొదట అనువదించిరి. వీరి తరువాత వడ్డాది సుబ్బారాయుడు గారును దీని ననువదించిరి. ప్రబోధ చంద్రోదయము వేదాంతపరమైన రమణీయ రూపకము. ఇందలి పాత్రములు మనస్సు, మహామోహుడు, వివేకుడు, ఉపనిషద్దేవి, గీతాదేవి — వంటి సాంకేతిక పాత్రములు. తమ శైలి పేలవముగా నున్నదని కొందరధిక్షేపించుటచే పటిష్ఠమైన శైలినిగూడ నడపింపగలమని చూపుటకుగాబోలు పంతులుగారు దీని యందు ఓజో గుణమువంకకు కొంచెము దృష్టిని మరలించిరి. అయినను మొత్తము మీద ఈ నాటకానువాదము కూడ మిక్కిలి సరసముగా నున్నది.

పంతులుగారి ఆంగ్ల నాటకానువాద పద్ధతినిగూర్చి రెండుమాటలు చెప్పవచ్చును. అక్కడి వాతావరణము, పాత్రల పేర్లు, సాంఘికాచారములు మనవారికి క్రొత్త గనుక యథాతథముగ ఉంచినచో దేశీయులను రంజింపజాలవని వారు యుక్తముగనే భావించిరి. మనదేశపు పరిస్థితులకు వాటిని సన్నిహితముగ తెచ్చుటకై పేర్లుమార్చి దేశీయములైన పేర్లుపెట్టి, అనువాదము నడిపించిరి. అనువాదముయొక్క ప్రయోజనము, విదేశ నాటకముల జీవితవిధానము యథామాతృకముగ మనవారికి తెలియుట గదా. వాటి రంగును మార్చి వేయుట తగదని కొందరందురు. కావచ్చును. పంతులుగారు అన్యథాభావించిరి. షేక్స్పియరు, షెరిడన్ మున్నగు నాటకకర్తల రచనలను యథామాతృకముగ నుంచినచో మనలో సామాన్యులు వాటిని చదివి యానందింపలేరు. పంతులుగారి పద్ధతినిబట్టి అవి చదువుటకును ప్రదర్శించుటకును మనవారికి వీలుపడుచున్నవి. షేక్స్పియరు కృతమైన 'Merchant of Venice' అను నాటకమును 'వినీసు వర్తక చరిత్రము' అనుపేరుతో ద్విపదములుగా కొన్ని అంకములు నడిపించిరి. ఇందు పాత్రల నామములను ఆంగ్లమునందున్నట్లే ఆంటోనియో, బసాన్నియో, షైలాకు మున్నగురీతిని నిలిపిరి. ఆంగ్లములోని ఛందోరీతులకు, 'Blank Verse' కు ఇది సన్నిహితముగా నుండునని అట్లు చేసిరో యేమో. ఇదియంత తృప్తికరము గాకపోవుటచే గాబోలు ఆంగ్ల నాటకానువాదములందు పద్యరచనను పరిహరించి వచనములోనే వ్రాసిరి. అట్లయ్యును ఆంగ్ల నాటకమునందలి కొన్ని చమత్కారములు తెలుగులోనికి తెచ్చుట కష్టమైయుండును. ఉదా

హరణకు షెరిడను వ్రాసిన 'Rivals' అను నాటకమును పంతులుగారు కల్యాణ కల్పవల్లి అను పేర నాంధ్రీకరించిరి. దీనిలో మాలప్రాప్ సతీమణి అను నొక వనిత కలదు. ఈమెకు విదుషీమణి యని పిలిపించుకొనవలెనని చాపల్యము మెండు. తన భాషాపాండిత్యమును ప్రదర్శించుటకై అనవసరముగనే పెద్దపెద్ద మాటలను వాడి యెదుటివారిని దిగ్భ్రమ కలిగించవలెనని ఆమె యత్నము. కాని విద్యాభ్యాస మంతగా లేనిదగుటచే ఒక యర్థము నిచ్చుటకై వేరొక్క పదమును సామ్యమునుబట్టి దొర్లించి వేయుచుండును. Geography అనుటకు Geometry అన్నట్లు. తెలిసినవారందరు ఆమె మౌఢ్యమునకు లోలోపల నవ్వుచుందురు. ఇదియొక విశిష్ట హాస్యరచనాపద్ధతి. మాలప్రాప్ సతీమణి తప్పు ప్రయోగములు సుప్రసిద్ధములై ఆంగ్లభాషయందు 'Malapropism' అను చమత్కారమును సృష్టించినవి. ఆంధ్రీకరణమునం దిట్టివి తెచ్చుట కష్టము. మన నాటకములలో పురాణకథలను విజ్జోడుగా ప్రయోగించుటచే చక్కని హాస్యము పుట్టినట్లు. ఇది మృచ్ఛకటికాదులందు కాన్పించును. 'రావణుడు కుంతీదేవినివలె ఈమెను చెరపట్టుచును' వంటివి. ఎడనెడ తెలుగు పలుకుబళ్ళు, చిన్నచిన్న తిట్లు-ఓరి గాడిద, ఓరి కుంక, ఓసి ముద్దరాలా! ఓసి మతిహీనురాలా! వంటివి దొర్లుచుండుటచే పరిచిత వాతావరణ మేర్పడి ఈ యనువాదములు చదువ బుద్ధిగొల్పుచున్నవి.

వీరేశలింగంగారి స్వతంత్ర నాటక రచనలను రెండు విభాగములు చేసితిమి. (1) ప్రబోధాత్మకము (2) రస ప్రధానములు. బ్రాహ్మవివాహము, వ్యవహార ధర్మబోధిని, వివేకదీపిక, తిర్యగ్విద్వన్మహా సభ, మహారణ్యపురాధిపత్యము అనునవి ప్రబోధాత్మకము లనవలెను. నిజమునకివి నాటక నామమున కర్హములా యను సందేహమును కలుగును. నాటక ధర్మములైన ఉదాత్త ఇతి వృత్తము, నాయికా నాయకులు, రససామగ్రి వీనిలో మృగ్యములు. సంభాషణరీతిలో నుండుట, అంకవిభజనము కలిగియుండుట, ఇవి మాత్రమే వీని నాటక ధర్మములు. పంతులుగారు కూడ ఈ లోపమును గుర్తించక పోలేదు. కావుననే వారు వీటిని 'ఆక్షేపగర్భ సంభాషణము' 'ఆక్షేప గర్భనాటకము' అని తమ స్వీయచరిత్రలో పేర్కొనిరి. ఆనాటి సాంఘిక దురాచారములపై ఇవి యాక్షేపగర్భ రచనలు. సంభాషణ రీతిలో నుండుటచే వానికి ప్రదర్శన యోగ్యతకూడ కలిగెను. బ్రాహ్మవివాహమునందు అతిబాల్య వివాహ దురాచారము పరిహసింపబడెను. దీనికితోడు ఆ దినములలో వివాహములందు వ్యాపించిన పెక్కు దాంభిక, అవినీతి మూలక ఆచారములను వికృత రూపముగ చిత్రించి వానిపై లోకులకు ఏవగింపు కలిగించిరి. పెండ్లిండ్లలో వేశ్యల మేళములను పిలిపించుట, సానులకు 'ఒసగులు' అను పేర-కలవారును లేనివారును నిర్బంధముగ కానుకలు వేయుట, బ్రాహ్మణ కుటుంబముల యిండ్లలోని పెండ్లిభోజనముల ఆర్భాటములు – ఇవియన్నియు చక్కని హాస్యరీతిలో చిత్రించిరి. సంఘ దురాచారపంక ప్రక్షాళనమున కీతరగతి నాటకములు శుద్ధజలములు.

అట్లే వ్యవహార ధర్మబోధినియందు న్యాయవాదవృత్తిలోని అవకతవకలను, ఉద్యోగస్థుల లంచగొండితనమును నిశితముగా ప్రదర్శించిరి. ఆనాటి సామాన్యజనులుకూడ పంతులుగారి యీ ఆక్షేప నాటకములను గుంపులుకూడి చదువుచుండిరట. ఆ విధముగా నవి ఉద్దిష్టఫలదాయకములయ్యెను. వివేక దీపికయనునది చదువుటకు బాధాకరమైన రచన. బాలవితంతువుల దుష్ప్రవర్తనను పంతులుగారిందు తీవ్రముగ అధిక్షేపించిరి. తన్మూలమున వితంతు వివాహముల యావశ్యకతను స్థాపించుటయే వారి యుద్దేశము. శుద్ధవాచ్యమైన యిట్టి రచన సాహిత్య నామమునకు అర్హముకాక పోవచ్చును. ఆనాటిపెద్దలు కొందరు బాధపడి పంతులుగారికి తమ యాక్షేపమునుగూడ తెలిపిరి.

వ్యవహార ధర్మబోధినినిగూర్చి దివాన్ బహదరు వల్లూరి జగన్నాధరావు పంతులుగారు వీరేశలింగంగారి కిట్లువ్రాసిరి.

"I see you are mercilessly exposing the faults of the young Rajahmundrians. Harsh expositions will some times do more harm than good, while they lower the whole community in the estimation of foreign nations". వివేక దీపిక ఈ దృష్టితో పరికించిన మిక్కిలి కటువుగా తోచును. అయినను జడీభూతమైన సంఘమనస్సును కదలించి కర్తవ్య మార్గమునందు జనులను పెట్టుటయే పంతులుగారి ఆశయ మనుట నిర్వివాదము. ఈ నాటకము చివర, వితంతు వివాహము వేదశాస్త్ర సమ్మతమని పండితులకు నిరూపించుటకై చేయించిన విద్వత్సభా ప్రసంగములు చాల ఉన్నత స్థాయిలోనున్నవి. నాటకారంభము నందలి కటికి చీకటి విరిసి లేతవెన్నెలలోనికి ప్రయాణించినట్లుండును. తిర్యగ్విద్వన్మహాసభయందు తిర్యగ్జంతువులు వృషభము, శునకము, మేషము, జంబుకము, భల్లూకము మొదలైనవి పాత్రలు. వీనికి సోమయాజులు, చయనులు, శాస్త్రులు, అవధానులు మొదలగు పండితనామములు చేర్చివాడుటచే అపహాస్య మేర్పడుచున్నది. మన సంఘమందలి దురాచారములలోనొకటి–బంధుమరణము జరిగినప్పుడు దుఃఖితులైన వారిని ఆదుకొనుటకు బదులు ఎవరికివారు తప్పించుకొని, మొగము చాటువేసి, వ్యర్థములైన దాంభిక ప్రసంగలను చేయుట చూతుము. ఈ నిర్దయవర్తనము నీ నాటకము నందు పంతులుగారు అధిక్షేపించిరి. మహారణ్యపురాధిపత్యముకూడ ఆక్షేపగర్భరచనయే. పంతులువారి ఆక్షేప రచనలు తమ్ముగూర్చి రచింపబడినవని కొందరు భ్రమసి వారిమీద న్యాయస్థానములయందు చర్యగూడ నడిపించిరి. మహారణ్య పురాధిపత్యము తమ్ముద్దేశించి వ్రాయబడినదని ఏలూరి లక్ష్మీనరసిహంగారు వీరేశలింగముగారిపై అభియోగము తెచ్చిరి.

నా ట క ము లు

ఎవ్వరేమన్నను తెగడినను పొగడినను పంతులుగారు తమ సంఘ దుర్నీతి ప్రక్షాళన కర్తవ్యమును విరమించ లేదు. సంఘ నీతి దెబ్బతిన్నది. అది రోగ గ్రస్తమైనది. దానికి చికిత్సయవసరము. శస్త్రచికిత్సచే రోగి తాత్కాలికముగ బాధపడి. కుయ్యో! మొఱ్ఱో! యని వాపోయిన వాపోవనిండు. వ్యాధిగ్రస్తుని మేలు కోరువారు బలవంతముగనైన వానికి మందు మాకు వేయవలెను. ఇది వారి సత్సంకల్పము; ఈశ్వరప్రేరణ. స్వలాభమును వారు కాంక్షించలేదు. నష్టమునకు వెనుదీయని మహా ధీర స్వభావులు పంతులుగారు.

రూపక నిర్మాతగా వీరేశలింగముగారి స్థానమును నిర్ణయించునవి వారి దక్షిణగోగ్రహణము, ప్రహ్లాద నాటకము, సత్యహరిశ్చంద్ర. వారి నాటకశిల్పమున కివి మచ్చుతునకలు. వీనిలో ధర్మోత్సాహము స్థాయిగాగల వీరరసమే ముఖ్య ప్రతిపాద్యము. ఇక్కడకూడ పంతులు గారు తమ ధర్మస్థాపన వ్యగ్రతను విస్మరించలేదు. కరుణ రసము ప్రహ్లాద, హరిశ్చంద్ర నాటకములలో సమృద్ధిగనే యున్నది. ధర్మశృంగారమును మాత్రమే పంతులుగారు లక్షించిరి. కాగిచల్లారిన పాలవంటి దాంపత్యప్రేమమునే వీరు చిత్రించిరి. దీనికి లీలావతీ హిరణ్యకశిపులు, చంద్రమతీ హరిశ్చంద్రులు గొప్ప ఉదాహరణములు. హాస్యము నింతకుముందు ప్రహసనాదులలో విస్తారముగ నిక్షేపించుటచేతకాబోలు వీనిలో దానికంతస్థాన మీయరైరి. అది గాకయు, హాస్యము లఘుతరరసమని మన ప్రాచీనులు సంభావించినట్లే పంతులుగారును తలపోసియుందురు. ధీరగంభీర ప్రకృతుల ఉదాత్తవృత్తముతో తేలికయైన హాస్యమునకు పొత్తుకుదురనిమాట వాస్తవమేకావచ్చును. పాశ్చాత్యుల కష్టాంతనాటక సంప్రదాయములను పంతులు గారు బాగుగ గమనించినవారు. విషాదాంత వాతావరణము నందు హాస్యము తలఎత్తుట వికృతముగనుండును. ఇది గ్రీకుసంప్రదాయము. కాని మహామేధావియైన షేక్స్పి

యరు దీనికికొన్ని వన్నెలుదిద్దెను. విషాదాంత వాతావరణ స్ఫూర్తిని ఘనీభూతముచేయుటకై రవంత హాస్యము తోడ్పడునని యాతడుకనిపెట్టి తన నాటకములందు నిక్షేపించెను. ఆతని హామ్లెటు నాటకమునందు, బొందపార గాండ్ల (Grave diggers) హాస్యసంభాషణమును ఉదాహరణముగా చెప్పుదురు. అమావాస్యచీకటిలో కునుకు దీపము ఒక క్షణమువెలిగి ఆరిపోవుటచే తమస్సాంద్రత గాఢముగా అనుభూత మగుచున్నది.

వీరేశలింగముగారు ఈ రహస్యమును గుర్తించి తమ గొప్ప నాటకములలో హాస్యమున కింతమాత్రమే స్థానమొసంగిరి. ప్రహ్లాద నాటకమునందు మూడవ అంకములో దుర్ముఖుడు అలంబసుడు అను రాక్షస భృత్యులు ఇంద్రునితో చేసిన ప్రసంగము నీచపాత్రగత హాస్యమునకుదాహరణము. హిరణ్యకశిపుని వధానంతరము ప్రచండ భయంకర వాతావరణ మేర్పడియున్నది కదా. ఇచ్చట తిరిగి దుర్ముఖాలంబసుల వికటప్రసంగము విషాదాంతచ్ఛాయను నిబిడము చేయుటకే ప్రవర్తించినదని చెప్పవలెను. షేక్స్పియరు రచనలందువలెనే పంతులుగారును ప్రసంగ వశమున వచ్చిన భావములను దీప్తిమంతములుగా విస్తరింతురు. షేక్స్పియరు ప్రసిద్ధపంక్తులు 'Cowards die many times before their death; the valiant never taste of death but once' వంటి వాని ప్రతిధ్వనులు యీ నాటకములందు బాగుగా వినవచ్చుచుండును. ఆంగ్లనాటకములందువలె తమ నాటకములందును అంకములను రంగముగా విభజించుటను పంతులుగారు పాటించిరి. సంస్కృత నాటకముల సంప్రదాయమైన నాంది, ప్రస్తావనలను వీరు ఆదరింపలేదు. కాని హరిశ్చంద్ర నాటకమునందు మాత్రము నాందియు ప్రస్తావనయు గూర్పబడినవి. ఈ ప్రస్తావనయైనను కవి కావ్యప్రశంసకుగాక నీతి ధర్మముల యావశ్యకతను గూర్చి ప్రబోధము చేయుటకు వ్రాయబడినది. పాశ్చాత్యులు Epilogue అని పేర వ్యవహరించు భరత వాక్యము హరిశ్చంద్ర నాటకమున మాత్రమే గానవచ్చును. ప్రహ్లాద నాటకము చివర నృసింహదేవుడు సామాజికుల నుద్దేశించి ధర్మమార్గ యాత్రకై ప్రబోధించును. నాటకములు మూడింటను పద్యరచన కాన్పించును. వాని శైలి ప్రబంధరీతి కాక సులభమై సుప్రసన్నముగ నుండుట విశేషము.

ఈ నాటకములందు సంభాషణలు దీర్ఘతరముగా నున్నవనియే చెప్పవలెను. పద్యములును ప్రచురముగనే యున్నవి. కావున నివి యథాతథముగ ప్రయోగానుకూలములు కానట్లే భాసించును. రంగస్థలానుకూలము లయిన నాటకములందు దీర్ఘప్రసంగములు, ఉపన్యాసములు ఒప్పియుండవు. ప్రహ్లాద నాటకము దీనికి కొంతవరకు అపవాదము. ప్రహ్లాద ముఖమున విష్ణుభక్తి ప్రాశస్త్యమును చెప్పించు నొకటిరెండు స్థలములందును, నాటకాంతమున నరసింహమూర్తి తన భక్తవ్రాతము నుద్బోధించు సందర్భమునను దప్ప యీ నాటకమునందు పద్యములు లేవు. కేవల గద్య నాటకములకు పంతులుగారు విముఖులు కారనియే దీనివలన నూహింపవచ్చును. అందును విషాదాంత వాతావరణ ప్రాచుర్యముగల నాటకములందు పద్యరచనకన్న గద్యమే యెక్కువ రసానుకూలముగ ఉండగలదను విషయమును పంతులుగారు గుర్తించిరనియే తోచును. దక్షిణ గోగ్రహణము నందును, సత్యహరిశ్చంద్ర నాటకము నందును నాయకులు కష్టము లెదుర్కొన్నను అవి విషాదాంత నాటక శ్రేణిలో చేరునట్టివి కావు. కావున వానియందు పద్య రచన నాట్యశిల్ప సూత్రములకు విరుద్ధము కాదు. ప్రహ్లాద నాటకమునందు నాయకుడని చెప్పదగిన హిరణ్యకశిపుడు ధీరోద్ధత ప్రకృతి కలవాడై ఉత్తమ విషాదాంత నాటక నాయకు డనదగి యున్నాడు. మన ప్రాచీన నాటక నియమములనుబట్టి ధీరోద్ధతుడు సాధారణముగా ప్రతి నాయకుడుగా మాత్రమే యుండును.

ఖండవల్లి లక్ష్మీరంజనం

ఇక్కడ దానికి భిన్నముగ పంతులుగారు కల్పించి, నూత్న సాహసమును ప్రదర్శించినారు.

పాశ్చాత్య నాటక సూత్రముల ప్రకారము విషాదాంత నాయకుడు ధీర ప్రకృతిగలవాడై, ఎన్నియో సద్గుణములు కలిగియు, ఒకటిరెండు దుర్గుణములు లేక లోపములు కల్గియుండును. ఈ లోపములు దురంత పరిణామములకు త్రోవతీయునవిగా ఉండును. నాటకముయొక్క విషాదాంత పరిణతి కివి బీజములై యుండును. ప్రకృతము హిరణ్య కశిపుడట్టి ధీర–ప్రచండనాయకుడు. అతని పరాక్రమము, తపోనిష్ఠ నిరాక్షేపములు. అతని భ్రాతృప్రేమ, భార్యానుకూలత, పుత్రవాత్సల్యము మిక్కిలి కొనియాడదగినవి. విష్ణుభక్తి వైముఖ్యమొక్కటే వానియందలి దుర్దాంత లోపము. అదియే యాతని దురంత వీరమరణమునకు కారణమైనది. అరిస్టాటిలు సూత్రప్రకారము విషాదాంత నాటకము రౌద్ర కరుణ సమ్మిశ్రమైయుండి సామాజిక భావములను పునీతముచేయునదై యుండవలెను. ( To purge the feelings through pity and fear ) ప్రహ్లాదనాటకమునందు కరుణరసము ముఖ్యనాయకుడైన హిరణ్యకశిపు నాశ్రయించలేదు.మన మీతని మరణమునకు శోకించుటలేదు. ఇచ్చట శోకము ప్రహ్లాదు నాశ్రయించి యున్నది. ఇదియొక విచిత్రసమ్మేళనము. మొత్తముమీద ఆంధ్రనాటక ప్రపంచమునందు వీరేశలింగముగారు కల్పించిన హిరణ్యకశిపును మించిన మహోన్నత విషాదాంత నాయకుడు వేరొక్కడులేడని నాకుతోచును. విషాద సారంగధర నాటకమునందలి రాజరాజనరేంద్రుడుగాని, సారంగధరుడుకాని హిరణ్యకశిపుని సరస నిలువజాలరు. ఆ లోకోత్తర పరాక్రమము, కొండలను పిండికొట్టజాలుదనుధీమా, దైవమునకు మారొడ్డినిల్చు అచంచల స్థైర్యము వారియందులేవు.

సత్యహరిశ్చంద్రుడు ధీరోదాత్తమహానాయకుడగుట సువ్యక్తము. ఈ నాటకముకూడ విషాదరంజితమగు సన్నివేశ సామగ్రితో, చెక్కపూటుగా నిండినయోడవలె నడచును. ఏ క్షణము ఆ మహానౌక విధిప్రాతికూల్యయుంయూ మారుతముచే జీవితమహార్ణవమునందు విపన్నమగునోయని మనము భయౌత్సుక్యములతో నుందుము. అయినను ఇది విషాదాంత నాటక మన వీలు లేదు. ఏలన హరిశ్చంద్రుడు గురియగుచున్న పరీక్షల పరిణామము సర్వజన విదితము. సత్యము, ధర్మము అగ్నిపరీక్షలకు లోనయ్యు పరాజయము నొందవని భారతీయుల దృఢనిశ్చయము. కావున నాటకము మోదాంత మగునను ప్రత్యయము సామాజిక హృదయములందుండనేయున్నది. ఈ నాటకము చివర అద్భుత సామగ్రిగా పార్వతీపరమేశ్వరులు ప్రవేశించుటకలదు. వీరులేకున్నను నాటక నిర్వహణమునకు లోపములేదు. నాటకకర్త కథా సన్నివేశములనట్లు కల్పించుకున్నాడు. లోహితాస్యుడు నిజముగ మరణించలేదు. సర్పవిషముచే మూర్ఛితుడైనాడు. విషమును విరుచు మందులచేతనే విశ్వామిత్రుడా బాలుని పునరుజ్జీవితుని చేసెను. ఇంక కాశిరాజు పుత్రులు చంపబడనేలేదు. నక్షత్రకుడు వారి నెక్కడనోదాచి, బాల వధ నేరమును చంద్రమతిపై మోపించెను. ఈ విధముగ హరిశ్చంద్ర నాటకములో మరణములే లేకపోవుటవలన, మరణించిన వారిని పునర్జీవితులను చేయవలసిన ఆవశ్యకతలేదు. దేవతలు ప్రత్యక్షము కానక్కరయులేదు. నాటక శిల్పమునందు దివ్యసామగ్రిని (Supernatural element) ప్రవేశపెట్టుట కల్పనా దౌర్బల్యమని పంతులుగారు గుర్తించినట్లే విశద మగుచున్నది. అయినను ఆనాటి సామాజికుల యభిరుచులకు అనుగుణముగ ఉండునని కాబోలు, నాటక పరిణతికి ఆవశ్యకముగాకున్నను దివ్య దంపతులను ప్రత్యక్షము చేయించిరి.

వీరేశలింగముగారు నాటక రచనయందు పాత్ర నిర్మాణమున కెంత ప్రాధాన్య మొసంగిరో దాని యందు వారు సాధించిన విజయమెట్టిదో కొంత నిరూపించినాము.

దక్షిణ గోగ్రహణమునందు వీరు సుధేష్ణ పాత్రను లోక నిందనుండి యుద్ధరించుటకు చేసిన ప్రయత్నము ప్రశంసా వహముగ నున్నది. సుధేష్ణయనగా చుప్పనాతివంటి దను భావము లోకములో వ్యాపించియున్నది. ఆమె ధూర్త వనితయని తలంతుము. దీనికి కారణము మహాభారతము నందా మె వృత్తాంతము అట్లుండుట. సుధేష్ణ నిజముగా క్రూరవనిత కాదనియు, ఆమె యందు పెక్కు సద్గుణములు కలవనియు, మన సానుభూతి కామె అర్హురాలే యనియు తోచునట్లు పంతులుగారు కల్పించిరి. ఈ నాటకము సింహబలుని మరణానంతర వృత్తాంతముతో ఆరంభించుచున్నది. నూటొక్క సోదరులు హఠాత్తుగ మరణించిన సోదరి విషాదముతో సుధేష్ణ మనకు ప్రత్యక్ష మగును. దుర్మార్గులేకానిండు, ఎవరి బంధువులు వారికి ప్రీతికదా. ఆమెకు గల్గిన ఘోరనష్టము ఆమె యందు మనకు సానుభూతిని ప్రేరేపించుచున్నది. ఇంతేకాక సుధేష్ణ పతిభక్తి కొనియాడదగినది. ఆమె తన భర్తతో రణరంగమునకు పోవుటకు వెనుదీయని శూరకాంత. సుశర్మ పాండవాన్వేషణమునకు దండయాత్ర చేసి యుండునని విని యామె పాండవులకై జాలివహించుట ఉత్తమ ప్రకృతిని జూపుచున్నది. మొదటి యుద్ధమునందు సుశర్మ సైన్యము జయించి సుధేష్ణను చెఱబట్టి పోవు చున్నారని విని మన మామెపై జాలినొందుదుము. సుశర్మాదులు రెండవ యుద్ధమందు పాండవ సోదరుల కోడి విరాటుని కొలువునకు బందీలుగా కొనిరాబడిరి. వారికి మరణదండన విధింపబడెను. అప్పుడు సుధేష్ణ స్త్రీ సహజమైన దయాశీలముతో ఆ నిర్భాగ్యులను క్షమింప వలెనని భర్తను ప్రార్థించి వారిని విడిపించెను. ఇట్లు సుధేష్ణ ఉత్తమ రాజకాంతయని వీరేశలింగముగారు కల్పించి యామె పాత్రకు గౌరవము నాపాదించిరి.

పంతులుగారు స్వయముగ చెప్పుకొన్నట్లు వారు ఏమాత్ర మవకాశము కల్గినను సత్య ధర్మముల ను ద్బోధించు ప్రసంగములు చేయించుట మానరు. వారు ధర్మ సంగ్రామికులు. అయినను నాటక శిల్పపు ఆయువు పట్టులు వారికి కరతలామలకములు.

---

"అంకురితమైన కార్యదీక్షతో ఆయన అసత్యంతో యుద్ధంచేసి దేశాభ్యు దయానికి కృషిచేశాడు. ఆయనను తలచుకొని ఆంధ్రులు గర్వించడం సహజం, న్యాయం. ఒక్క ఆంధ్రులేకాదు, ఆయన సంగతి బాగా తెలిసిన దక్షిణ భారతీయు లందరు గర్వించగలరు. శ్రీ వీరేశలింగం ఘనతను మనం నిర్మించి, భద్రపరచే స్మారక చిహ్నాలుగాక, ఆయన సాధించిన మహత్కార్యాలే చాటగలవు."

— శ్రీ సి. రాజగోపాలాచారి

# నీరాజనము

శ్రీ దాశరథి

కలముచేతిలో పట్టినంత నే
హాలము హాలములో త్రిప్పినంత నే
కైతరాదనెను, రైతుకాడనెను
కందుకూరి వీరేశలింగము.

కైతలందు ముందంజ వేసినా
చేతల్లో వెనుకంజ తగదయా !
కళ్లు విప్పి నల్గడల జూడు మనె
కందుకూరి వీరేశలింగము.

సంస్కరణము కావలె నటందురు,
సాని కొంపలకు వెళ్లు చుందురు,
కూత వేరు మరి చేత వే రనెను
కందుకూరి వీరేశలింగము.

మనసులోనిదే మనకు తెలిపెను
మనకు తెలిపినదె పనిలో నిలపెను
కల్ల కపటముల మంట గలిపెను
కందుకూరి వీరేశలింగము.

చీకటింటిలో దివ్వెలుంచెను
శోక గీతిలో నవ్వు పెంచెను
కాంతల మనసుల శాంతినించెను
కందుకూరి వీరేశలింగము.

'ప్రహసన' వజ్ర ప్రహారాలతో
ప్రజలను నిద్దుర లేపాడు
కాంతి పథాలను చూపాడు
కందుకూరి వీరేశలింగము.

ఎడారులైన రమణీ ముఖాలను
ఎర్రని కుంకుమ లద్దాడు
కాంతల బ్రతుకులు దిద్దాడు
కందుకూరి వీరేశలింగము.

మదించి పెరిగిన దురాచారమను
మత్తేభానికి మహాసింహమై
కుంభ స్థలమున దూకాడు
కందుకూరి వీరేశలింగము.

తిరోగాములగు ప్రగతి ద్వేషుల
కరకు గుండెలను ఖండించుటకై
కలమును కత్తిగ ఎత్తాడు
కందుకూరి వీరేశలింగము.

★

# స్మృతులు, అనుభవములు

## శ్రీమతి ఐత్తుల కామాక్షమ్మ

ఆంధ్ర దేశముయొక్క ఈనాటి ఈ వికాసమునకు సర్వవిధముల కారణభూతుడైన శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి స్మారకోత్సవములను మన ఆంధ్ర ప్రభుత్వము జరుపుటకు పూనుకొనుట చాల సంతోష కారణము. ఎందువల్లననగా శ్రీ వీరేశలింగముగారు జీవించియున్న 19వ శతాబ్దపు అంత్యభాగమునందును, 20వ శతాబ్దపు ప్రథమభాగమునందును భారతీయ జాతీయ జీవనము, ముఖ్యముగ ఆంధ్రుల జాతీయజీవనమును, ఈనాటి జాతీయజీవనమును సరిపోల్చుకొని, తరతమ పరీక్షచేసి చూచుకొన్నచో, ఈనాటి ఈ సర్వతోముఖాభి వృద్ధికి, ముఖ్యముగా ఆంధ్ర మహిళా జాతీయ వికాసమునకు శ్రీ వీరేశలింగం పంతులుగారే కారణభూతులని వేరే చెప్పనక్కరలేదు.

మిక్కిలి మూఢాచారములతో నిండియున్న అనాటి సంఘమును సంస్కరించి వారు రాచబాట వేయుటచేతనే అట్టి విశాలాశయ ప్రబోధ పరిపూర్ణమైన సంస్కారోద్దేశములు కలిగికూడా సాహసించలేని మా బోటి స్త్రీ లెందరమో తరువాత తరువాత జాతీయ భావములతోకూడిన సంస్థలను స్థాపించి మహిళా సంఘోద్ధరణ చేయగల్గి మమ్ములను మేము ఉద్ధరించుకొనగల్గితిమి.

కావున అట్టి నవయుగ వికాస కారణభూతుడైన ఆ పుణ్యపురుషునకు స్మారకోత్సవము కారణకమే కదా! ఈ సందర్భమునందు ఆనాటి సాంఘిక మర్యాదల ప్రభావమునందు పెరిగిన నాకు ఆనాటి సాంఘికాచార సంబంధమైన కొన్ని స్మృతులు, నా అనుభవములు ఇక్కడ వివరించుట నా విధియని తలంచుచున్నాను.

నాకపుడు సుమారు పదునైదు సంవత్సరముల ప్రాయముండవచ్చును. నేను మా పినతండ్రిగారగు శ్రీ ఉడత్త కమలనాభంగారి యింటియందుండెడిదానను. నా బాల్యమున అనగా 1901-1902 సంవత్సరములలో సంపన్నకుటుంబము లనదగిన మా బోటివారి యిండ్లలో స్త్రీలయెడల చాలా కఠినమైన ఆచారనింబంధన లుండెడివి. బయటకు ముఖము చూపుటకే మాకు అవకాశము ఉండెడిదికాదు. ఎంత సన్నిహిత బంధువులైనను పురుషులతో మాట్లాడుట చాల తప్పుగా భావించెడివారు. అందునను బాలవితంతువునైన నా బోటివాళ్ళ విషయమునందు ఈ నిబంధనలు ఎంత కఠినముగ ఉండెడివో మీరే ఊహింపవచ్చును.

అయినను ఏ పూర్వపుణ్యవశముననో, నాలో సేవా భావములు చిన్నప్పటినుండియు రేకెత్తియుండెడివి. వ్యర్థముగా ఒక నిముషమైనను కాలముపుచ్చుటకు నా కిష్ట ముండెడిదికాదు. ఎంతసేపును గ్రంథపఠనము చేయవలెననియు, ఇతరులలో ఆ విద్యను ప్రచారము చేయవలెననియు, అజ్ఞాతముగా నాలో ఊహలు ఉండెడివి. అయితే చదువుకొనుటకు గ్రంథము లెక్కడ లభించునో నాకు తెలిసెడిదికాదు. మా పినతండ్రిగారెంతో ప్రేమతో నన్నాదరించినను నాకుగల విద్యాభిలాషను వారిదగ్గర వెలిబుచ్చుటకే నాకు సాహసముండెడిది కాదు.

ఇంతలో నాకు మేనమామల కుటుంబమైన నాళంవారి కుటుంబమునందు జన్మించిన శ్రీ నాళం కృష్ణరావుగారు తమ గురువుగారిపై భక్తితో, శ్రీ వీరేశలింగ గ్రంథ భాండాగారమను పేరున ఒక గ్రంథాలయమును స్థాపించి, ముఖ్యముగా స్త్రీలలో విద్యాభిరుచిని కలుగజేయుటకు,

ఉచితముగా స్త్రీలకు ఇండ్లకు పుస్తకములు పంపించి చదివించుచున్నారనియు, అట్లు చదివిన స్త్రీలలో పోటీ పరీక్షలుకూడ నిర్వహించుచున్నారని విని పేదకు పెన్నిధి దొరికినట్లు సంతసించితిని. అప్పుడు మా నాళమువారి కుటుంబములోని స్త్రీల ద్వారానే నా పఠనాభిలాష శ్రీ కృష్ణరావుగారికి తెలియపరచి వారి గ్రంథాలయము నుండి పుస్తకములు వచ్చునట్లు ఏర్పాటు చేసికొనగలిగితిని. ఆనాడు నాలో గూడుగట్టిన కాంక్ష, విద్యాభివృద్ధికై నేను పడిన తహతహపాటు ఇట్లు ప్రయోజనకరముగా సిద్ధించి నందుకు ఎంతో సంతోషపడినాను.

అప్పటిలో శ్రీ వీరేశలింగము పంతులుగారిని నేను ఎన్నడూ ప్రత్యక్షముగా చూడకపోయినను వారి స్త్రీ జనోద్ధరణోద్యమము పట్ల నాకు చాల అభిమాన ముండెడిది. అందుచే నేను గ్రంథాలయ జవాను రాలేకపోయినను ప్రతి దినము మా జవానును పంపించి రోజు కొక గ్రంథము చొప్పున శ్రీ వీరేశలింగముగారి గ్రంథములనే హెచ్చుగా తెప్పించుకొని ఆసక్తితో, దీక్షతో చదువుచుండెడిదానను. నేను చదువుకొనుటయే గాక మా యిరుగుపొరుగు స్త్రీల కందరకు చదివి వినిపించెడిదానను. స్త్రీ విద్యకు అప్పట్లో మా పెద్దలకు చాల వ్యతిరేక భావము లున్నను, నేను బాల వితంతువు నగుటచే, నాయందు వారి కతిశయప్రేమ యుండుట చేతను, నేను కేవల సంఘ సంస్కార గ్రంథములేగాక భారత భాగవతాది ఆధ్యాత్మిక గ్రంథములను చదివి, ఎక్కువగా వాటి సారమునే యిరుగుపొరుగు వారికి బోధించుచుండుట చేతను, మా పెద్దలు యిదొక సత్కాలక్షేపముగా భావించి మిన్నకుండెడివారు.

ఇట్లు నా గ్రంథ పఠనము నిర్విరామముగా జరుగు చుండగా నేను వీరేశలింగముగారి గ్రంథములపై ఎక్కువ మక్కువ చూపించుచుండుట గమనించి, గ్రంథాలయ పరిపాలక వర్గములోని కొందరు మా బంధువులు, వితంతు వివాహ సంస్కారమునకు సంబంధించిన గ్రంథములను నాకు చదువుటకు పంపించి వితంతు వివాహము పట్ల నా యభిప్రాయములను గ్రహింపవలెనని ప్రయత్నములు చేసిరి. కాని నాకు శ్రీ పంతులుగారి స్త్రీ జనోద్ధరణము పట్లనే సహజముగా ఎక్కువ అభిమానముండుటవలనను, వితంతు వివాహ గ్రంథములను నేను తెప్పించినట్లు, గ్రంథాలయ పట్టికలో నా పేరు క్రింద ఈ గ్రంథములు సూచింపబడినట్లయిన నన్ను గురించి ఎట్టి అనుమానములు చెలరేగునో అను భయము నాకు విపరీతముగా గలిగి ఎవరూలేని సమయము చూచి, 'నేను వ్రాసిన గ్రంథములే తీసికొని రమ్ము, ఇట్టి గ్రంథములను నా కెప్పుడూ తెచ్చి యీయవద్ద'ని గ్రంథాలయ జవానును మందలించి కట్టడి చేసినాను. ఆ కాలము నాటి మా పరిస్థితు లట్టివి.

కాని వీరేశలింగముగారు తన సంస్కారోద్యమములో ఎక్కడ ఏ ఉపన్యాస మిచ్చినను, నేను తెలుసుకొని, ఆ ఉపన్యాసములు తెప్పించుకొని ఎంతో ఆసక్తిగా చదివెడు దానను.

అంతేకాక అప్పట్లో సనాతన శిరోమణియైన శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు స్త్రీవిద్య చాల అనర్థ దాయకమని, అది కూడదని వీరేశలింగము పంతులు గారికి వ్యతిరేకముగా ప్రచారము చేసేడి వారు. అప్పటి పత్రికలన్నియు, నేను తెప్పించి అతి ఆతురతతో చదివెడి దానను. కాని నా మనోభావము లన్నియు, పంతులుగారి సంస్కారోద్యమము వైపునకే పరుగిడు చుండెడివి.

అయినను నాకు స్వతంత్రత లేకపోవుట చేతను, ఆ కాలము స్త్రీ సంఘసేవకు స్త్రీలు పూనుకొని చేయదగి నంత అవకాశము కలది కాకపోవుట చేతను నే నేమియు చేయలేక పోతిని. కాని నా మనస్సునందు మాత్రము స్వతంత్ర జీవనము గడిపి, సంస్థలను పెట్టి స్త్రీ సంఘసేవ చేయవలెననే బీజములకు ఆ నాడే ఆవాపము జరిగినది.

ఇంతలో నేను ఎక్కువగా గ్రంథాలయ గ్రంథ కాలక్షేపము జేయుటయు, ఇరుగుపొరుగు స్త్రీలతో భారత

భాగవతాది సద్గ్రంథ కాలక్షేపము చేయుటయు. ఆనోట, ఆనోట ప్రాకి శ్రీ పంతులుగారి అంతేవాసినియైన శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారి చెవిబడుట తటస్థించినది. అట్లు నన్నుగూర్చి విని, నన్ను చూడవలెనని మిక్కిలి యుత్కంఠతో ఒకనాడు మా యింటికి వచ్చిరి. ఆదివరకే సీతమ్మగారి గ్రంథములైన అహల్యాబాయి మున్నగు ఉత్తమ రచనలు చదివి ఉండుటవలన వారు ఫలానా అని తెలుసుకోగానే నాకు ఎంతో సంతోషము కల్గినది. ఆమె నన్ను ఎంతో ఆదరముగా దగ్గరకు తీసికొని ఆప్యాయముగా పలకరించి పద్యములు, శ్లోకములు చదివించుకొని ఎంతో ఆనందపడిరి. ఆమె నన్ను స్త్రీ విద్యాభిమానియైన శ్రీ పంతులుగారి వద్దకు తీసికొనివెళ్ళి నన్ను వారి కెరుక పరచవలెనని చాల ముచ్చటపడినారు. వారి మాటలనుబట్టి వితంతు వివాహమునకై నన్ను ఆమె ప్రోత్సహించుచున్నటుల కూడ నే నభిప్రాయపడితిని.

అయినను మహనీయుడు, సంఘ సంస్కర్త, స్త్రీ జనోద్ధారకుడు అయిన శ్రీ వీరేశలింగం పంతులుగారి దర్శనము చేతను జన్మ తరించుననెడి గొప్ప అభిలాషచే నేను సీతమ్మగారితో వెళ్ళి ప్రార్ధన సమాజమునందు, శ్రీ పంతులుగారిని చూచుటకు మనస్సు స్థిరపరచుకొంటిని. కాని నేను ఒక్కతెను వెళ్ళినచో మా బంధువులలో ఎట్టి విపరీతాభిప్రాయములు కలుగునో యను భయముచే నా పురాణము వినుటకు వచ్చిన స్త్రీలకు వీరేశలింగముగారు గ్రామఫోను పెట్టి పాడిస్తారనియు మనమందరము వెళ్ళి వినెదమని ప్రోత్సహించి వారందరను తీసికొని వారితో బాటుగ వెళ్ళినాను. అప్పుడు సీతమ్మగారు నన్ను పంతులుగార్కి ఎరుక చెప్పెదనని చాల ఒత్తిడి చేసినారు. కాని వారితో మాట్లాడినట్లు పైకి తెలిసినచో ఎట్టి ప్రమాదములు తటస్థించి, నా జీవిత మెట్టి కష్టములపాలగునో యని నేను చాలా భయపడి "అక్కరలేదండి, నాకు చాల సిగ్గు" అని సీతమ్మగారితో చెప్పి శ్రీ పంతులుగారిని చూచి ఆ మహనీయునకు దూరమునుండే నమస్కరించి తొందరగా మా యింటికి తిరిగి వెళ్ళిపోయితిని. ఈ విధముగా శ్రీ పంతులుగార్ని చూడవలెననే అభిలాష గ్రుడ్డిలో మెల్లగా నేను నెరవేర్చుకొన గల్గితిని. అప్పటికి నాకు పదునెనిమిదేండ్లు.

తరువాత నేను మద్రాసుకు నా మేనమామలైన శ్రీ నాళము లక్ష్మీకాంతముగా రింటికి వెళ్ళిపోయి అచ్చటనే పదునాల్గు సంవత్సరములు గడిపితిని. కాని అక్కడకూడ ఏమీ అటంకము లేకుండా ఈ గ్రంథ పఠన కార్యక్రమము సాగించెడుదానను. అంతేకాక అప్పుడు బీజప్రాయముగా నాలో నెలకొనిన సేవాభిప్రాయములు నానాటికి వృద్ధి పొంది ఏదోఒక సంస్థను స్థాపించి ఏదోఒక సేవాకార్యము చేయవలెననెడి అభిప్రాయము తీవ్రమై నా మనస్సున గొప్ప పోరాటము సాగుచుండెడిది. తుదకు 1920 వ సంవత్సరమున స్త్రీ జన సేవకు మూలస్థానమైన రాజమండ్రికి చేరినగాని నేను ఏమియు చేయజాలనను నిశ్చయమునకు వచ్చి నా భావములను పైకి వెల్లడి చేసినచో నన్ను ప్రోత్సహించువా రుండరు సరికదా పైన ఆటంకములు కలుగజేయుదురని భావించి గోదావరిలో కార్తీక స్నానముల వ్యాజముతో నేను రాజమండ్రి చేరితిని. అయితే యీలోపుగా శ్రీ నాళం రామలింగయ్యగారితో నేను తీర్థయాత్రలకు వెళ్లటయు, పూనాలోని కార్వేగారి వితంతు శరణాలయమును గూర్చి వినుటయు, అక్కడ ఉండవలెననియు నాకు సంకల్పము కలిగెను. కాని శ్రీ రామలింగయ్యగా రిది గ్రహించి నన్ను పూనా తీసికొని వెళ్ళకుండా ఇంటికి పంపివేసి వారు పూనా వెళ్ళి కార్వేగారి వితంతు శరణాలయమును చూచి వచ్చిరి.

తరువాత 1920 లో రాజమండ్రి రాగానే శ్రీ నాళం రామలింగయ్యగారు తాను ఒక స్త్రీ సేవాసదనమును స్థాపింపదలచినట్లును, నేను అందులో నా జీవితమును గడుపుట కిష్టపడినచో తాను తప్పక సంస్థను స్థాపింపగల

బత్తుల కామాక్షమ్మ

ననియు నాతో చెప్పిరి. పరమేశ్వరు డీవిధముగా నా చిరకాలాభిలాషను సిద్ధింపజేయు చున్నందులకు నేను చాలా సంతోషపడి 'అట్లే నేను నా జీవితమును మీ సంస్థ యందు గడపగల'నని వారికి వాగ్దానము చేసితిని. తరువాత కొన్ని రోజులకు రాజమండ్రిలో స్త్రీ సేవా సదనము స్థాపించితిమి.

ఇట్లు నేను శ్రీ వీరేశలింగం పంతులుగారి ఆదర్శములను జీర్ణించుకొని 1920 లో స్త్రీ సేవా సంస్థను పెట్టు నప్పటికి శ్రీ పంతులుగారు 1918 లోనే కాలధర్మము జెందిరి. వారి ఆశయాలతో నేను సేవా సంస్థనుపెట్టి వారిని ఆనందముతో, స్వతంత్రముగా సందర్శించగల భాగ్యమానాడు నాకు లభించలేదని చాల బాధపడి యుంటిని. కాని వారి ముఖ్యస్నేహితులైన శ్రీ కందుకూరు వెంకటరత్నం పంతులుగార్ని కలసుకొనుట జరిగినది. శ్రీ పంతులుగారు వితంతు వివాహాలు జరుపుటకై ఆ నాటి సనాతన ధర్మపరులను ఎదురుకొనుటకు, మూఢాచారములను నిర్మూలించుటకు, ఎన్నెన్ని అవస్థలు, అవమానాలు అనుభవించి వితంతు స్త్రీ జనోద్ధరణ చేయగల్గిరో శ్రీ వెంకటరత్నంగారి ద్వారా వినినపుడు నా మనుస్సు సంభ్రమాశ్చర్యములతోను, శ్రీ వీరేశలింగము పంతులుగారి యెడల కృతజ్ఞతా భావముతోను నిండిపోయినది. 10, 12 సంవత్సరములమండి హితకారిణీ సమాజమునకు కమిటీ మెంబరుగానుండు భాగ్యము కల్గినది. ఒకప్పుడు శ్రీ పంతులుగారిచే నెలకొల్పబడిన వితంతు శరణాలయములో ఆర్థికపు యిబ్బందులవలన 16 మంది స్త్రీలకంటె ఎక్కువ మందికి భోజన, విద్యాసౌకర్యములు కల్పించు అవకాశము లేదయ్యెను. ఆ సమయమున "ఉమెన్ వెల్‌ఫేర్ సెంటర్" వారు ఇండస్ట్రియల్ సెక్షన్ ప్రారంభించి సుమారు 100 స్త్రీలకు సహకారము చేసెదమనియు, శరణాలయ ఆవరణలో స్థలము నీయవలెనని రశణాలయము వారిని కోరిరి. అప్పుడు శరణాలయమువారు ఆ సంస్థ స్త్రీ పునర్వివాహములకై పాటు పడుచున్నదనియు, వితంతు స్త్రీ జనోద్ధరణమే శ్రీ పంతులుగారి ఆశయమనియు చెప్పి స్థలము నిచ్చుటకు నిరాకరించిరి. అప్పుడు నేను కమిటీ వారితో వాదోప వాదములు జరిపి శ్రీ వీరేశలింగము పంతులుగారు కేవలము వితంతు స్త్రీ జనోద్ధరణమే లక్ష్యముగా పెట్టుకొనలేదు, అన్ని రకములుగను స్త్రీ జనోద్ధరణ జరుపుటకూడా వారి లక్ష్యమే అనియు, మరియు మనము కేవలము 16 మందికి మాత్రమే సహకారము చేయగల్గుచున్నామనియు, ఉమెన్ వెల్‌ఫేర్ సెంటర్ వారు 100 స్త్రీలకు సహకారము చేసెదమనిరి గనుక తప్పక వితంతు శరణాలయ ఆవరణలో వారికి స్థానమీయవలెననియు చెప్పగా కమిటీ వారు ఆమోదించి తీర్మానమును చేసిరి.

ఈ విధముగా ఆ మహనీయుని ఆదర్శములను ఆధారముగ జేసికొని ఎన్నియో సంస్థలు వెలసి స్త్రీ జనోద్ధరణ జేయుచున్నవి. శ్రీ వీరేశలింగము పంతులుగారి కాలమున జనానా స్కూలుగా ప్రారంభింపబడిన పాఠశాల నేడు శ్రీ వీరేశలింగం హైస్కూలుగా దినదినాభివృద్ధి చెందు చుండుట ఎల్లరకు తెలిసిన విషయమే.

ఈ నాటి వారి స్మారకోత్సవ సంచికలో వారికి నా మనఃపూర్వక కృతజ్ఞత తెలుపగల అవకాశమును లభింప జేసినందులకు కార్యకర్తలైన శ్రీ ఆవుల సాంబశివ రావుగార్కి నా ధన్యవాదములు.

# దివ్యస్మృతి

కవిరాజ
శ్రీ కొండవీటి వేంకటకవి

గద్యతిక్కన - రావుబహద్దరు - అను బిరుదముల నంది యాంధ్ర సాహిత్యమున వివిధరీతులఁ బరిశ్రమ మొనర్చెను. ఆంధ్రకవుల జీవిత చరిత్రమును దమవఱకు సమగ్రముగ వ్రాసెను. ఈ మహత్తర కార్యమే కాక ప్రహసనములు, నాటకములు, పద్యకావ్యములు, వచనకావ్యములు శాస్త్రవిచారణగ్రంథములు, ఉపన్యాసములు, భాషాంతరీకరణములు, శుద్ధాంధ్రగ్రంథములును విరచించిరి. ఇవియవి యననేల భాషావిషయమున వారు పోని పోకడలు లేవు.

సంఘసంస్కరణోద్యమమునఁ గాలిడి యుపన్యాసములమాత్ర మిచ్చి తనియు నాయకమ్మన్యులలోఁ గొందఱవలెఁ గాక తన సిద్ధాంతము నతఁరాలఁ జాటించు దిట్టయని పేరెన్నికఁ గనిరి. స్త్రీపునర్వివాహాదిక సంస్కరణముల కితఁడు మూలపురుషుఁడు. సమకాలీనులవలన వల్లమాలిన బాధల నందినవాఁడు.

గీ॥ ఆది సంస్కర్త లిడిన పునాదిమీఁద
మలపసన్న్యాసి కట్టిన మాయమేడ
నీ మహోజ్జ్వల విప్లవాగ్నికిని గూలెఁ
జిటిలిపోదు పునాది యిప్పటికిఁ గూడ.

మ॥ జనసంఘమ్మున మూఢభావముల నాశంబందఁగాఁ జేయ తే
ఖని జేపట్టితి వాంధ్రవాఙ్మయము రక్తిం గుల్కె నీకేల ; సాం
త్వన వాక్యంబులఁ జేరఁ జీరితి వనాథస్త్రీల ; నీసేవఁ గై
కొనె నాంధ్రావని నిన్నుఁ బోలఁగల దక్షుం డెవ్వఁ డిమ్మేదినిన్.

చం॥ పురుషుల పజ్జఁజేరి విరిబోణులు మేనుసెమర్ప నాట సం
బరమును జూప నీ వది యమానుషమంచుఁ దలంచి దైవమం
దిరములఁ బెండ్లిపందిరుల నీతికి దూరగులైన ద్రవ్యపా
లుర నవసౌధరాజములలోన నెదిర్చితివయ్య ధీరతన్.

గీ॥ జ్ఞానహీనుల కఠినహుంకారములకు
నదరిబెదరి విభీతమృగాతులైరి
రమణు లానాఁడు నేఁడు ధైర్యము వహించి
తమ సుధారస వాక్యౌషధముల మనిరి.

మ॥ తరుణీసంఘము లప్పువడ్డవి మహాత్మా ! యీఋణ మ్మీఁగ బం
గరుపూలం గొని వాఙ్మనఃక్రియల కేకత్వంబు సంధించి య
క్షరమాలల్ గళమందు నింపఁగను దీక్షాదక్షలై భామినుల్
శిరముల్ వంచి వినమ్రలై నిలిచి రాశీర్వాదముం జేయవే.

స॥ కలఁతఁబెట్టిరి సాంఘికప్రబుద్ధోద్దండులు
పొడిచెదమనియె దుర్బుద్ధిగణము
వెలిగిలి రేపి వాడలఁ జాటి రార్యులు
నాస్తికుం డనియె ఛాందసులమంద
కులదోషియని పండ్లుగొఱికెను నైష్కర్మ్య
మును మోపియనె సనాతనుఁ డొకండు
దౌర్భాగ్యుఁడని తిట్టెఁ దలకాయపంతులు
చపలుఁడం చనిరి లంచాల దొరలు

జగము పగఁబూని మొదలెత్త జంకుఁ గొనక
సత్యమును నిల్ప సంఘదౌర్జన్య మణఁపఁ
గంకణముఁ దాల్చితివి నమస్కారశతము
లివిగో శ్రీ కందుకూరి వీరేశలింగ.

# ఉపన్యాసములు

డాక్టర్ యస్వీ జోగారావు

## ఉపోద్ఘాతము

తన రాక సంఘసంస్కృతి కుత్తమ ప్రతీకగా, నవ్య సాహితి కెత్తిన పతాకగా ఆంధ్రజాతిలో చైతన్యము చచ్చిననాడు వచ్చిన వాడు వీరేశలింగము. చిరకాలము చీకటిలో కలలైనా రాని కటిక నిదురలో మైమరచిన ఆంధ్రజాతిని జాగృతము చేసిన నవయుగ వైతాళికు డతడు. మన సాహిత్యమును బహుముఖముగ నూత్న చైతన్య చకచ్చకితము చేసిన సరస్వతీ పురోహితు డాయన. తనలోని ప్రాణకళ ప్రత్యణువు పరహితార్ద్రైక ప్రవణముగా తన మనుగడయంతా ఒక మహోద్యమముగా, మన దేశమున కొక శాశ్వత సందేశముగా చేసి పోయిన మహానుభావుడు. ఆయన మహామేధావి. బహుశ్రుతుడు. విజ్ఞానఖని. అనుభవశాలి, కార్యశూరుడు. సర్వతంత్ర స్వతంత్రుడు. తన నిరంతర పరిశ్రమచే లోకోపకారకములైన అనేక విషయములకు సంబంధించిన విశేష విజ్ఞానము సేకరించి, వైశేషికునివలె శాబ్దప్రమాణము కంటె ప్రత్యక్షానుమాన ప్రమాణము లందే ఎక్కువ ప్రామాణ్యముంచి – అనగా ఆయన అన్నట్లుగానె అసలు వేదాదుల మీదకంటె ప్రపంచవేదము, ఆత్మవేదము అనగా తన లోకజ్ఞత, ఆలోచన, అనుభవములపై ఎక్కువ ప్రామాణ్యముంచి – ఆ విజ్ఞానము నంతా స్వీయసంస్కారములో లీయమాన మొనర్చుకొని తన మనశ్శాణముపై నొరపు దేరిన ఆ విజ్ఞాన దీధితులను కార్యరూపమునను, వాఙ్మయ రూపమునను విశ్వవిస్మృమరముగా ప్రసరింపజేసినా రాయన. ఆయన వాఙ్మయమంతా ఉత్తమ ప్రయోజనాత్మకమైనదే. సర్వసాధారణముగా ఆయనకు ఒంటబట్టని భావ మొకటీ యందుండదు. ఆచరణయోగ్యము కాని ఆశయముండదు. పేలవమైన పలుకుండదు. ఆత్మబలము, సత్యప్రత్యయము, నైతిక నిష్ఠయుగల యొక మహాప్రవక్త మహావేశమాహేశ్వరుడై హృదయముతో ఉపన్యసించు చున్నట్లుండును.

## వ్యాసము — ఉపన్యాసము

"శ్రీ పంతులుగారి కాలములో జరిగిన యొక్కొక్క సంఘటన, వారి జీవితానుభవము లోనికి వచ్చిన యొక్కొక్క విషయము, ఒక్కొక్క యుపన్యాసమునకు ప్రేరేపకమయినట్లు తోచును. ఈ యుపన్యాసములు చదివి నేర్చుకొనవలసిన విషయము లనేకము లున్నవి. శ్రీ పంతులుగారినాటినుండియే యుపన్యాస మాంధ్ర వాఙ్మయములో నొక శాఖగా పరిఢవిల్లినది. నేటి మన యాధునిక విజ్ఞానాభివృద్ధి కన్ని విషయములలోను పునాదులు వేసినవా డాయన" అని–అభిభాషించినారు మరియొక మహానుభావులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు.

అవును. విజ్ఞానాభివృద్ధి త్వరత్వరగా జరుగుచున్న కొలది, మనీషియైన మానవుడు తానార్జించిన విజ్ఞానము నెప్పటి కప్పుడు నియమబద్ధముగా వైనము వారిగా గ్రంథస్థము చేసి భద్రపరుచుకొని తక్కిన వారికి, తరువాతి తరముల వారి కందించవలె. వివిధ కోవిదోపజ్ఞములు విషయబహూళములు నగు నిట్టి వ్యాసములే ఏకప్రస్రుతిగా సాగిపోవు తరతరాల మానవ విజ్ఞానవాహిని కాలాంతరమున మన అలవికందరాక పోకుండుటకై యేర్పరుపబడిన ఆనకట్టలు.

ఆంగ్లమున వ్యాసమునకు సమానార్థకమైన పదము "Essay" అనునది. అనగా పరిశీలనాత్మకమైనదని అస లర్థము. ఒక విషయమై చెప్పుట కవకాశముగల మాటలు చెప్పిచెప్పి చివరికొాక సిద్ధాంతము చేయుటను ఉపన్యాస మని మన పూర్వులు వ్యవహరించిరి. పరమార్థమున రెండు నొకటే. ఏ మైనను నేడు వ్యాసము, ఉపన్యాసము, 'Essay' అనునవి సమానార్థకములుగనే పరిణమించినవి. (ఆంధ్రమున మాత్రము నేడు కేవల వాగ్రూపమైన దానిని ఉపన్యాస మనియు, అదే రచనాబద్ధమైనను దానిని వ్యాస మనియు వ్యవహరించు చున్నారు). ఒకప్పుడు పోప్ మొదలగు ఆంగ్లకవులు కొందరు వ్యాసములను పద్య ఘటితములు చేసియున్నను నేడది సర్వేసర్వత్ర గద్య ప్రక్రియగనే పరిగణింప బడుచున్నది. అవి సాధారణముగా విషయ ప్రధానమై, వివరణ ప్రమేయోపన్యాస పూర్వక మైన ప్రణాళిక, ప్రమాణపురస్సర ప్రవిభాగ సంవిధానము గలిగి, ప్రతిజ్ఞా హేతూదాహరణోపనయ నిగమ నే తి పంచావయవాత్మకమైన రచనా విన్యాసము. అభిప్రాయ విప్రతిపత్తి కవకాశముండు నెడ ఉభయపక్ష నిరూప ణాత్మకమై తర్కసహమైన ఉపపత్తులతో పూర్వపక్ష సిద్ధాంత విధానాత్మకమై యుండవలెను. వీరేశలింగము గారు తర్కశాస్త్రానువాదకులు నందు కృతశ్రములును మాత్రమే కాక తన సంస్కారమును తర్కపురస్కారముగా మలచుకొన్న వారు. ఆయన కీ ప్రక్రియ యంతయు కొట్టినపిండి. వారి వ్యాసము లన్నియు ప్రమాణక్రమ సమగ్రములు. అసలు ఉత్తమ విమర్శకున కుండవలసిన సమ్యక్పరిశీలనము, హేతు రీతివాద విజ్ఞానము, పక్షపాత ప్రహతము గాని సమన్వయ దృష్టి మున్నగు లక్షణములే ఉత్తమ వ్యాసకర్తకును నుండవలసిన లక్షణములు. అవి యన్నియు నొంటబట్టిన తత్త్వము లాయనకు. ఆయన వ్యాసము లన్నియు మొదట నాటి రాజమహేంద్రవర సమాజములందు, సంస్థలందును పఠింపబడిన ఉపన్యాస ములే. 1874 సం. న భాషాభివృద్ధి దేశాభివృద్ధి అను రెండు ప్రధానప్రయోజనముల నుద్దేశించి ఆయన స్థాపించిన "వివేకవర్ధని" పత్రికా ముఖమున ప్రకటితములై తెలుగు వారికి మేలుకొలుపులు పాడినవే. (ఇవి శతాధికముగ నున్నవి. రాజమహేంద్రవరము హితకారిణీ సమాజము వారు పండ్రెండు సంపుటములుగా ప్రకటించిన వీరేశలింగ గ్రంథావళిలో సం. 7, 8 - రెండు పెద్ద సంపుటములలో గ్రథితములైనవి).

## విషయ వైవిధ్యము

ఆ సంపుటు లొకపరి విప్పి విషయసూచిక చూచుసరికి మన మాశ్చర్యచకితుల మగుదుము. అబ్బ, ఎన్ని విషయ ములు ! ఎంత వైవిధ్యము ! మతము, భక్తి, తత్త్వము, నీతి, విద్య, సాహిత్యము, భాష, రాజకీయములు, బాల్య, వృద్ధ, వితంతు వివాహములు, కన్యాశుల్కము మొదలగు సాంఘిక విషయములు, వానికి సంబంధించిన సమస్యలు, సంస్కరణమార్గములు, దాంపత్యము, వర్ణము, వైరా గ్యము, ఐకమత్యము, శిశుపోషణము, అదృష్టము, దేశ భాషలు, వైద్యులు, వేశ్యలు, దయ్యములు, స్వయంకృషి, మానుషధర్మము - ఈలాగు ఎన్ని విషయా లని ! ప్రత్యేక మొక వ్యక్తిగను, సంసారము, సంఘము, రాజ్యము, దేశము అను వానిలో భాగస్వామిగను, ప్రపంచ పౌరుని గను మానవునియొక్క జీవితము నావరించుకొన్న బహు విధ భావవ్యవస్థ లాయనకు వ్యాసవస్తువులైనవి. కార్య శూరుడైన సంఘసంస్కర్తగా, కవిగా, విమర్శకునిగా, పరిశోధకునిగా ఒక వంక బహుకార్య వ్యగ్రులు, బహు గ్రంథవిధాతలునైన పంతులవారు చేసిన పని చూచినచో ఒక్క జన్మకాలములో ఇంత కార్యభార మొక మానవ మాత్రునకు సాధ్యమగునా యనిపించును. ఇట్టి వారినే కాబోలు కారణజన్ములందు రార్యులు. అద్భుతమైన దాయన ప్రతిభ. ఆధునిక యుగమున మన దేశమున

మహాభావుకులు (Great Thinkers) గా, సంఘ సంస్కర్తలుగా, ఉద్యమప్రవర్తకులుగా, యుగకర్తలుగా చెప్పదగిన కొద్ది మందిలో ప్రథమశ్రేణికి చెందిన వాడాయన.

## అభిప్రాయములు, వ్యక్తిత్వము

వివిధ విషయములపై ఆయన వ్యక్తము చేసిన అభిప్రాయము లన్నియు పరప్రత్యయనేయములు గాక ఆయన స్వతంత్రముగా తన మనస్సులో మథించినవి. జగద్ధితాశయ జాగరితములు. పరిణత హేతువాదము పాదులు. ఈనాటి నవభావుకు లందరి బుర్రలకు నందని బుద్ధీంద్రియ స్పందనములు. చిలుక పలుకుల ఛాందసులకు సరేసరి అవి వాకట్టు మంత్రములు. స్థాలీపులాకముగా కొన్నిటి నిట సమీక్షింతము :.

1. మానవునకు జన్మాంతరం లేదనియు, అంతేకాదు "పూర్వోత్తర జన్మములు లేవనుకొనుట వలనఁగలిగెడు నష్టమొక్కటియుఁగానరాకున్నది. పూర్వ జన్మకర్మలను నమ్మక పోవుటవలనఁ బ్రతిమనుష్యుఁడును దానుజేసెడు పనులకుఁదానే యుత్తరవాదినని తెలిసికొని మంచిపనులను జేయ యత్నించు''ననియు వారి యాశయము. కర్మ సిద్ధాంతపు గండభేరుండము రెక్కలు విరిగిపడిపోయినవి.

2. కన్యాశుల్కము, అతిబాల్య వివాహములు మొదలగునవి గర్హ్యములని, వితంతూద్వాహములు శాస్త్రసమ్మతములనియు సాంఘిక పరిణామముల దృష్టితోనేకాక శ్రుతి స్మృతి ప్రమాణ పురస్సరముగ నిరూపించినారు.

3. జ్యోతిషమును ముఖ్యముగా నందలి ముహూర్త భాగమును నిరసించిరి.

4. విగ్రహారాధనము కూడదని ప్రాచీన ప్రమాణములచేతనే నిరూపించుచు, దానివలన లాభములకన్న నష్టములే యెక్కువని లోకజ్ఞతాక్షమమైన చూపుతో నిరూపించిరి. సగుణోపాసన సామాన్యులకైన మంచిదను సమాధానమునుగూడ సహేతుకముగ ఖండించిరి. మన జాతి దౌర్భాగ్యమునకు, జాతీయ సమైక్య విచ్ఛిత్తికిని అది కారణమైనదని నిరూపించిరి. ''మేలు కలుగుటకయి యెప్పుడును సత్యమయిన వస్తువులయందే యర్థ విశ్వాసముంచవలె"నని తీర్మానించిరి.

5. "ఆలోచనమీద మన యంతరాత్మ బోధించెడు సత్యములు మాత్రమే యీశ్వరకృత వేదములనియు, బాహ్యవేదములన్నియు సమర్థులగు మనుష్యులచే నాయా కాలాను గుణముగా రచింపఁబడినవనియు సిద్ధాంతముచేసి కొనుటకేమి యాక్షేపణ గలదు ?" అని సవాలుచేసిరి.

6. "వేఁడిమిని విడిచి బొగ్గ ట్లగ్ని హోత్రమనిపిలువఁ బడఁదగదో యట్లే మనుష్యుఁడును నీతిని విడిచిన తరువాత మనుష్యుఁడని పిలువఁబడఁదగఁడు" అని మానుష ధర్మము నుద్ఘాటించిరి.

7. "అనుష్ఠానము లేకపోయిన పక్షమున మన యుపదేశములన్నియు నున్మత్తప్రలాపముల వంటివయి నిష్ఫలము లగును''.

8. "కార్యసాఫల్యమునకయి మన మెప్పుడును కష్టములతో పెనగులాడుచునే యుండవలెను. అదియే దేవుని యేర్పాటు. ఆ కష్టములతోడి పోరాటము వలననే మనము మనోదార్ఢ్యమునుబొంది కార్యదక్షుల మగుదుము ; మన సత్కార్యాచరణము వలన మన కిక్కడ కష్టములే కలుగుచున్నను లోకమున కయినను మేలు కలుగకపోదు."

9. పిట్టవలె ఆకసము పైపై కెగసిన కొద్దీ మనయూరు, మనయిల్లు నంతకంతకు చిన్నవిగా, ఇంకనుపోగా మనము గుర్తుపట్టలేనివై విశ్వముయొక్క విశాలత్వము నిరవధికముగా స్ఫురించును. అట్టి విశాలభావనమే జ్ఞానియొక్క ముఖ్యలక్షణము.

10. "జ్ఞాన మెట్లో నీతియు నట్లే మనుష్యునకు స్వభావ ధర్మము. రెంటిలో జ్ఞానముకంటె నీతి శ్రేష్ఠతరము.''

యస్వీ జోగారావు

11. "కొంచెమయినను వైరాగ్యము లేనివాఁడు పవిత్రమైన మనుష్యనామమును ధరించుటకే యర్హుఁడు గాఁడు ... ఇంద్రియసుఖ పరిత్యాగమే వైరాగ్య మనఁబడును ... వైరాగ్యము బొత్తిగాలేని మతము మతము గాదు. అదిలేని భక్తుఁడు భక్తుఁడునుగాడు".

12. మనుష్యునిలో మృగగుణములును, దేవగుణములును చేరియున్నవి. మృగమునకును మనుష్యునకును సామాన్యములైన కామాదులు మృగగుణములు; మనుష్యునకును, దేవునికిని సామాన్యములైన దయాదులు దేవగుణములు ... ఉత్తమ గుణముల కధమ గుణములను లోఁబఱుచుటయే నిజమయిన యింద్రియ నిగ్రహము. కేవల స్వప్రయోజనమును గూర్చిన వన్నియు నధమ గుణములు, పరప్రయోజనమును గూర్చినవి యుత్తమ గుణములు".

13. ''భక్తి లేశము గలవానికిఁ గొంచెమయిన వైరాగ్యమును, సద్వర్తనమును గలుగక మానవు''.

14 "మూఢులుగా నున్నవారికి రాజ్యాంగ స్వాతంత్ర్యముల నిచ్చుటవలనఁ బ్రయోజనములేదు''.

15. ''కాయపుష్టి కలిగి పాటుపడ శక్తిగలవారికి దానముచేసి సోమరితనమునకు బ్రోత్సాహము కలిగించుట పాపహేతువు".

16. ''స్వవిషయమునఁ గృషి చేయవలెనన్నను మనమభివృద్ధిచెంది లోకమున కుపయోగపడునట్లు చేయవలెననియేకాని వేఱుకాదు''.

18. ''చెమటయూడ్చి కష్టపడి పనిచేయువాఁడు దేహారోగ్యము కలవాడయి సుఖజీవనము చేయుటకు శక్తుఁడగుటయేకాక సాధారణముగా యుక్తప్రవర్తనము గలవాఁడు సహిత మగును''.

19. "బుద్ధిమంతులగువారు తా మొక కార్యమును జేయునప్పుడు సద్యఃఫలము మాత్రమే చూడక దానివలన ముందు కలుగబోవు ఫలములనుగూడ విచారించి కర్తవ్యాకర్తవ్య నిశ్చయము చేయుదురు".

20. "మన దేశములో నిప్పుడే వృత్తికిని పనికిరానివాఁడు బడిపెట్టుకొని బాలురకు విద్యోపదేష్ట యగుచున్నాఁడు."

21. "మనము స్త్రీలకు విద్యచెప్పించక వారిని పశువులవలెనుంచి వారితో సహవాసము చేయుచుండెడు పక్షమున మనుష్యులు పశువులతో సహవాసము చేసెడునట్లే కదా యగును."

22. ప్రాచీన ప్రమాణములను బట్టి వర్ణవ్యవస్థ స్వరూపమును నిరూపించి "వర్ణభేదము వలన మన దేశమున కిప్పటికే అనర్థము లనేకము కలిగినవనీ, ఇక నవి సమసిపోవుట మంచి"దని హితముపదేశించిరి.

23 "దేశభాషలు వృద్ధిపొందినంగాని దేశము యొక్క స్థితి యెన్నటికిని బాగుపడనేరదు. రాజకీయ భాషయెంత యభివృద్ధి గాంచినను, అది యెన్నటికిని దేశభాష కాఁజాలదు."

24. ''జనసామాన్యము యొక్క స్థితిని బాగుపరచవలెనన్నచో, తప్పక దేశభాషలలో నుపయుక్తములయిన గ్రంథములను సులభశైలిని వ్రాసి యవి యెల్లవారికిని సుబోధము లగునట్లును సులభక్రయ సాధ్యములగునట్లును చేయవలయును."

25. "దేశమును మంచిదశకు తీసికొని వచ్చి, లోకములో ప్రఖ్యాతి కెక్కెడు దేశములలో నొక దానిని చేయవలెనన్నచో మొట్టమొదట సామాన్యజనుల యొక్క స్థితిని బాగు చేయుటకుఁ బ్రయత్నపడవలయును.''

ఇలాగు ఎన్నివిషయములు! ఎన్ని అభిప్రాయములు! ఆ యభిప్రాయముల కుపబలకములుగా ఆయన చూపిన ఉపపత్తులను పేర్కొనుట కిట చోటుచాలదు. ఎక్కడ పట్టిచూచినను హేతువే ఆయన సిద్ధాంతసేతువు, ఆశయ జీవాతువు. ఇవియన్నియు సుమా రెనుబది తొంబదేళ్ళ

వెనుకటిమాటలు. విషయములు కొన్ని ప్రాతగిల్లినను, వాటి సమస్యలు కొన్ని సమసిపోయినను ఆ యభిప్రాయము లిప్పటికి నవ్యనవనీతములు, నేటికిని కొన్ని కమ్మని నేతి ధారలు. వినగలిగిన వారికా యభిప్రాయములలో ఒక పరిణత మానవుని ప్రౌఢవాణి వినిపించును. నాటికే నవయుగ వసంత వైతాళిక మగు పుంస్కోకిల గొంతుసవరించు చున్నట్లుండును. చూడగలిగిన వారి కాయన లోపలి చూపు, లోకపు చూపు నెంత లోతైనవో, ఎంత క్రాంత్యధ్వనీనములో బోధపడగలదు. ఆయన యొక మహాద్రష్ట. ఆ హృదయ మొక సువిశాల భావ సంస్థానము.

## విషయావిష్కరణము

సర్వసాధారణములైన సాంఘిక సమస్యలను అతి గహనములైన ఆధ్యాత్మిక విషయములను సమానముగా తన అసమాన వివరణకౌశలముచే విమర్శన నైపుణిచే సామాన్య పాఠకునకుసైతము కరతలామలకములు చేయగలవా డాయన. కవిత చెప్పుటలో భావశిల్పముకన్న వస్తుశిల్ప నిర్వహణము మిన్న. కాని వ్యాసవిన్యాసములో భావశిల్పమే కష్టతరము. అంటే స్థూలవస్తువుల స్వరూప స్వభావములగూర్చి చెప్పుటకన్న సున్నితములైన భావ వ్యవస్థలగురించి అర్థవాద మొనర్చుట కష్టతరమైన కార్యము. వీరేశలింగముగారి వ్యాసములలో ముక్కాలు మువ్వీస మిట్టి సామగ్రియే గలదు. ప్రాచీన భావసంస్థల కాధునిక దృక్పథముతో సమన్వయము చేయునెడ చాదస్తములేని సంప్రదాయజ్ఞతను, వ్యామోహములేని నాగరికతను ప్రదర్శింతురు. ఏదైనా హేతుబద్ధము, సంయమన శీలము, ధర్మనిష్ఠము, జగత్కల్యాణ పరాయణము నైనది వారి చూపు. విమర్శకు నిలువని విషయము విశ్వసనీయము గాదా చూపున.

## వాదనైపుణి

వాదనైపుణియందు చెప్పెడిదేమి ఆ వదావదవరేణ్యుని వైశిష్ట్యము! వైజ్ఞానికుని ప్రామాణికత, వైయాకరణుని ప్రవిభాగ సంవిధాన కౌశలము, తార్కికుని ప్రమాణజ్ఞత, ఆచార్యుని హితోపదేశము, మతప్రవర్తకుని అభినివేశము, యతీశ్వరుని సంయమనము, భక్తుని మనస్విత, ధీరోద్ధతుని నిర్భీకత, అమాత్యుని యుక్తి, యాయజూకుని నిష్ఠనియమము, ప్రాడ్వివాకుని నిష్పాక్షికత, పరిశోధకుని విషయజ్ఞత సూక్ష్మపరిశీలన, విమర్శకుని సమన్వయము ఇన్ని గుణముల ఏకత్ర సన్నివేశ మా మహామానవుని అంతఃకరణ నొరసివచ్చిన వాక్ప్రపంచమున చూడగలము. తరచు కటుత్వములేని పటుత్వమే దాని జీవలక్షణ మైనను శతాబ్దుల తరబడి దేశమున ప్రాచివట్టిన ప్రగాఢ మూఢవిశ్వాసముల నెదుర్కొనునప్పుడు మాత్రము ఆ వాక్కున కెక్కడలేని వాడి వాదరయు వచ్చిపడును. ఆ మూఢవిశ్వాసముల నెదుర్కొనుటకు హేతువాద బలమొక్కటి చాలదు. ఆత్మవిశ్వాసము తోడి ధైర్యసంపద కావలెను అది పంతులుగారి మనశ్శక్తికి తోడబుట్టువు, ఆయన జీవిత జనాశ్వమునకు ఘంటాపథము. అయితే ఎంత వాదకౌశలమున్నను ఆయన ఎప్పుడును తన సహజమైన వినీతిని కోలుపోరు. చూడుడు "జన్మాంతరము" అనే వ్యాసములో ఆ విషయముగురించి చెప్పుచు "నిర్దోషమైన సిద్ధాంతమును దేల్చుట పండితులకు సహితము సులభసాధ్యము కాకపోవుట నెఱిఁగినవాఁడనయ్యును, పండితుని బుద్ధికిసహితము గోచరము కాని యంశ మొకానొకప్పుడు చదువెఱుఁగని బాలుని మనస్సునకు స్ఫురించుట కలదుగనుకను నా వాక్యము లొకవేళ సహేతుకములుగాఁ గనఁబడి మహాజనులను రంజింపఁగలుగునేమో యను భ్రాంతి నా హృదయమును బాధించుచున్నందునను సంకోచము మాని యీ విషయమున నాకుఁగల యభిప్రాయమును నేను మీకడఁ దెలుప సాహసించుచున్నాఁడను" అని వక్కాణించిరి. ఎంత వినీతి! వివేకము! ఎంత ఆత్మవిశ్వాసము! ఆ ప్రక్కన దెంత గడుసుదనము! గమనింపుడు!

యస్వీ జోగారావు

మరియొకమాట : వాదకౌశలము లేనివానికిని స్వపక్షనిరసనము జరుగుట ఎత్తువైపునకు పోయిందేమి కాదు. కాని వీరేశలింగము గారొక విప్లవవీరుడే, కార్యశూరుడేకాని ఆయన కట్టి తెలివితక్కువ పక్షపాతాలులేవు. ఆయనకున్న దెల్లఒకటే పక్షపాతము. సత్యపక్షపాతము. విప్రతిపన్నమైన విషయమును గ్రహించి పూర్వపక్ష సిద్ధాంతములు చేయుటలో నిండైన ప్రజ్ఞ వారిది. ఎత్తుగడలోనే ఆయన ప్రతిజ్ఞ యెట్లుండునో చూడుడు : "పునర్జన్మ మెప్పుడును ప్రత్యక్షమగునదికాదు గనుకను కనబడనివి లేవనియే నెప్పుడు ననుమేయము గనుకను, ఎవ్వరు పునర్జన్మ మున్నదని వాదింతురో వారిమీదనే తమ పక్షమును స్థాపించుకోవలసిన భారమంతయు నౌరగియుండును''. చూచితిరా వాదమునెంత అసిధారా వ్రతముగా నడుపుదురో ఆయన! ఒక్కకొక్కొండ వారి విగ్రహతంత్రమును విమర్శించును వ్రాసిన వ్యాసములో మాత్రము వారి వాక్కు వల్గదశ్వమువలె చౌకశించినది. అందులో హాస్యవగ్రమైన పంతులుగారి వ్యంగ్య ధోరణి చాల వాలకములు వేసినది. అయితే ఆ వెటకారములో నెంత కటుత్వమున్నను ఆయన చేసిన విమర్శ ప్రత్యక్షరము సత్యసన్నిహితము, గుణోద్ఘాటనముతోడి శుభాశంసనమును గలది. కనుక పంతులుగారి ధోరణి "నిండు మనంబు నవ్యనవనీత సమానము, పలుకుదారుణాఖండల శస్త్రతుల్యము" అని సరిపెట్టుకొన వచ్చును. ఆంధ్రశబ్ద చింతామణి కర్తృత్వము మొదలగు మరికొన్ని సాహిత్య విషయములపై ఆయన వ్రాసిన వ్యాసములు ప్రౌఢ పరిశోధక ప్రజ్ఞకు నికషోపలములు.

## శైలి

ఇక వారి శైలి విషయ మొండు రెండు మాటలు. పంతముపట్టి పంతులుగారు వారి సంధి విగ్రహ శైలిలో గాఢబంధమును ప్రదర్శించియున్నను, ప్రాచీనకాలమున శబ్దజాల జాంగలికులైన ప్రబంధ కవులు గద్యయందును ప్రదర్శించిన జటిలపద జంఝూటమును పరిహరించి అతి సరళము, సలక్షణము, సర్వతస్సుందరమునైన భాషలో నీ వ్యాసములు రచించి శైలీ సౌలభ్య మ్మట్టిపడ గద్యను సర్వోపగమ్యముగా తీర్చి దిద్దిరి. "A good style should show no sign of effort" అన్నాడు శ్రీ సోమర్సెట్ మామ్. దానికి చక్కని తార్కాణ వీరి శైలి. ఎంతెంత ఉన్నతములైన భావములను సున్నితములైన భావములను సున్నితమైన భాషలో సుప్రసన్నముగా చెప్పగల చేవ వీరి సొత్తు. అదే వీరి గద్యతిక్కన బిరుద పరమార్థ మనుకొందును. విషయ విస్ఫూర్తికై ఒక్కొకచో వాక్యచాలనము చేయుచు, అన్యమత గత దోషదూషణము చేయునపుడువచ్చు సాత్త్వికావేశమున అవధారణార్థము వాక్యవిన్యాసమున ప్లుతవల్లిత రేచితములు పచరించుచు, సిద్ధాంతము చేయునెడ స్తిమితపడినట్లు సూక్తి సుందరముగా సూత్రప్రాయమైన రచన చేయుచు శైలిలో సౌలభ్యముతో పాటొక వైవిధ్యమును సాధించినా రాయన. (ఉదాహరణలకు మీద చూచునది). విషయ ప్రధానమైన రచన యనగా నట్లే యుండవలెను.

## నిగమనము

ఆంధ్రమున ఏవం విధమైన రచనా వ్యాసంగమునకాయన ఆద్యుడగుటయేకాదు, తాదృశమైన భావనా పద్ధతికిని సమకాలికులకు ఆర్వాచీనులకును ఆదర్శ మార్గదర్శకుడాయెను. పూర్ణప్రజ్ఞుడు, కార్యశూరుడునైన ఆ మహానుభావుని జీవితోపదేశముల ప్రభావ మీ వరకే ఆంధ్రజాతి నాలింగనము చేసికొన్నను, ఎట్టి యాశయము లవలంబనీయములో ఎఱుకమాలిన స్థితిలోనున్న నేటి మన విద్యార్థులు రేపుత్తమ పౌరులుగా పరిణతి పొందుటకుగాను వానిని పునశ్చరణ మొనర్చుట యొక కర్తవ్యముగా తోచుచున్నది.






శ్రీ వీరేశలింగం పంతులు

చిత్రకారుడు :- శ్రీ బుజ్జాయి



ఇన్నీసుపేట పార్కులో ప్రజలు నిర్మింపజేసిన

శిలాప్రతిమ



బెంగుళూరు అరుళ్‌పేటలో పంతులుగారు నిర్మింపజేసిన

బ్రహ్మసమాజ ప్రార్థనా మందిరము

# జోతలు

శ్రీ జాషువ

వీరేశాఖ్యుడు సత్యనిష్ఠిత కళావేశుండు సత్కావ్యముల్
నూరుల్ గూరిచి జాతిదేవతకు కన్నుందోయి నర్పించుచున్
క్రూరాచార మహాపిశాచి కెదురై క్రొంగొత్తఖడ్గాలచే
కోరల్ ద్రెంచిన యోద్ధ కాంధ్రసుకళాక్షోణుల్, ఋణగ్రస్తముల్.

తెలుగుశారదకు నత్తులు ముంగెరలు డుల్చి
క్రొంగొత్త తొడవులు గుస్తరించి
పరిహాసమన్న కోపముచేయుగడ్డలో
నవనీతహాస్య వాఙ్మయమునాటి
పసివితంతువుల దుర్భరదీనతకు గుంది
కూలిపోయినకాపురాలు నిలిపి
గడనచేసిన చిల్లిగవ్వతోసర్వంబు
శరణాలయాలపై జిల్లివైచి

మరణమునకుదక్క మరి తీరుబడిలేక
కలముదించనట్టి కవివరుండు
కందుకూరికులుడు కాలు మెట్టిన చోట
కాలు మెట్టలేదు కలుషలవము.

నన్నయమున్నుగాగల సనాతన సత్కవి జీవితంబులన్
కన్నులగాంచిన ట్లమృతఘంటమునన్ వెలయించి భాషకున్
జిన్నెలువన్నెల న్నిలిపి నేడు మహాకవు లైనవారి కిం
తన్నముబెట్టి పోయిన మహాత్ముని దేశము విస్మరించునే ?

ఒకవంకన్ బదివేల కంఠములతో
హుంకారముల్ సల్పి, సాం
ఘిక శార్దూలము చప్పరించుటకు
లంఘింపన్ రవం తేని జం
కక, దీక్షారథమున్ మరల్పక కళా
క్షాత్రంబు రూపించు ధా
ర్మిక వేదండుని యుక్కుగుండెలు
మహేంద్రీ ! నీకు నాదర్శముల్.

చిలకమర్తి నారసింహాస్కవి నీకు
శిష్యుడయి ప్రసిద్ధిజెందినాడు.
మ్రొక్కి నీ పదాలు ముద్దాడు కతమున
రాణ్మహేంద్రపురము రాణకెక్కె.



"శ్రీ వీరేశలింగం పండితులు నిశ్చయముగా మహా పురుషుడు. సాహిత్యములో నాటకశాఖను ప్రారంభించి, సంఘములో పురోభివృద్ధి పంథా లేవదీసిన మాన్యుడు. ఇది మిగుల కష్టతరమైన పని. తెలుగు దేశపు సేనాధిపతులైన వంశపురుషుల రక్తము ఆయనలో ప్రవహించుచున్నది. కనుకనే వారిలో సాహసము, నిశ్చలత్వము కనబడతవి."

గురజాడ అప్పారావు
(మహాకవి డైరీలు పుటలు 181-182)

# వ్యావహారిక భాష

శ్రీ తెలికిచర్ల వెంకటరత్నం, ఎం. ఏ., ఎల్. టి.

వీరేశలింగం పంతులుగారు వ్యావహారికభాషా వాది. సంఘసంస్కరణానికి సాధనంగాను, వినోదము గలిగించడానికిన్ని ఆయన వ్యావహారిక భాషలో నాటకములు, ప్రహసనములు, హాస్యప్రసంగాలున్ను వ్రాసి వ్యావహారిక భాషకుగల ప్రయోజనము ఎంత బలీయమో, విస్తృతమో నిరూపించారు. 1919వ సంవత్సరములో "వర్తమానాంధ్రభాషా ప్రవర్తక సమాజము" నెలకొల్పి, తానే దాని కధ్యక్షుడై వ్యావహారిక భాషోద్యమము నడపడానికి పూనుకొన్నారు. గ్రాంధికభాషలో అసంఖ్యాకమైన రచనలు చేసినా, ఇతర గ్రాంధిక భాషావాదులవలె ఆయన వ్యావహారిక భాషోద్యమాన్ని ఎన్నడూ వ్యతిరేకించక ఎల్లప్పుడూ సానుభూతితోనే ఉండేవారు.

వీరేశలింగం పంతులుగారు సంస్కారప్రియులు. సాంఘిక దురాచారములు, మూఢవిశ్వాసాలు, అవినీతి, వంచన, దంభము మొదలయిన దుష్టశక్తులు ప్రబలి ప్రజా జీవితము కుంటువడిపోగా, వాటిని రూపుమాపి, తోడి మానవసమాజాన్ని ఉద్ధరించేతలపుతోనూ, విద్యా విజ్ఞాన వ్యాప్తిచేసి ప్రజలను ఉత్తమ పౌరులనుగా రూపొందించే ఉద్దేశముతోనూ ఒక మహోద్యమము నడిపి, కృతకృత్యుడైన దేశనాయకుడు. ప్రజా సమూహానికి ఉపకరిస్తుందని తోచిన ఏపనినయినా, ఇదీ అదీ అనక, ఆయన ఆదరించారు. ఆయన తలపెట్టిన సంస్కరణోద్యమము సర్వతోముఖము.

వీరేశలింగం పంతులుగారు విద్యార్థిదశలో ఉన్నప్పుడే శతకరచనతో పద్యకావ్యాలు వ్రాయడము ప్రారంభించారు. తరువాత సన్నిహిత పూర్వులూ సమకాలికులూ అయిన కవులను ప్రతిభ పాండిత్యాలలో అతిక్రమించవలెననే పట్టుదలతో "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము" మొదలైన పద్యకావ్యాలనూ, గద్య కావ్యరచనలో చిన్నయసూరి నీతిచంద్రిక కంటె ప్రౌఢముగా వ్రాయసంకల్పించి శబ్దాలంకార భూయిష్ఠముగానూ, దీర్ఘసమాసాలతోనూ 'విగ్రహతంత్ర'మున్ను వ్రాశారు. ఇట్టి రచనలు చేయడానికి పరిసరముల ప్రభావమూ, కాలప్రభావమూ కారణాలు. ఆ రచనలన్నిటినీ పండితలోకము వేనోళ్ల పొగడినది; విద్యావేత్తలు, కవులు, పండితులు, పత్రికాధిపతులు మున్నగువారి ప్రశంసా పరంపరలు మిన్నుముట్టినవి. అయితే ఒకటి రెండేళ్లలోనే, ఒకవంక ప్రశంసలింకా అందుతూ ఉండగానే వారిలో లోలోన ఉన్న సంస్కరణ బీజములు మొలకలెత్తాయి. ఆయన ప్రవృత్తిలోను దృక్పథములోనూ గొప్ప మార్పులు వచ్చాయి. దేశాభిమానము, ప్రజాభిమానము, వాటిని పురస్కరించుకొని దేశోపకారకములయిన పనులు చేయవలెననే దీక్ష వారిలో ప్రగాఢమయినాయి. సామాన్యపాఠకులకు తా నదివరకు రచించిన గ్రంథాలు దురవగాహములనిన్నీ, కొద్ది మంది పండితులకే వాటి అర్థము తెలుస్తుందనీ గ్రహించి, అది మొదలు పూర్వపద్ధతికి విముఖులై, ప్రజల కందుబాటులో ఉండేలాగున సులభ వచనములో గ్రంథాలు వ్రాయవలెనని ఆయన నిశ్చయించుకొన్నారు. ఈ విషయము ఆయన తన స్వీయచరిత్రలో ఇట్లు స్పష్టపరిచారు :-

"భాషవలని ప్రయోజనమేమి ? జనులు తమ యభిప్రాయముల నొండొరులకు దెలుపుకొనుట. భాషలోని గ్రంథములవలని ప్రయోజనమేమి ? తమ భావనలను

దూరమున నున్నవారికిని, రాబోవు తరమువారికిని సులభముగా తెలుపుట - అట్టి సౌలభ్యము 'విగ్రహము'వంటి పుస్తకములవలన గలుగునా? కలుగదు. అందలి పదములయొక్కయు వాక్యములయొక్కయు నర్థమును దెలిసికొనుటకయి సామాన్య జ్ఞానముగలవారికి నిఘంటువులయొక్కయు పండితులయొక్కయు సాయము కావలెను. ఇంతకష్టపడి యర్థము గ్రహింపగలిగినను వారిందు క్రొత్తగా నేర్చుకున్నదేమి? సులభవచన రూపమునను‌న్న పంచతంత్రములో నున్నదానికంటె విశేషమేదియులేదు. అట్లయినచో గ్రంథములెట్లుండవలెను? అందరికి దెలియునట్లు సులభముగా నుండవలెను; అని నాలో నేనాలోచించుకొని ముందువ్రాసెడు పుస్తకములను విగ్రహమువలెగాక సుగమముగా నుండునట్లు వ్రాయ నిశ్చయించుకొని నా యభిప్రాయమును నాలోపలనే యుంచుకొనక పత్రికాముఖమున దెలిపితిని." స్వీయ చరిత్ర — ద్వితీయభాగము — పుట 173.

ముందుచూపుతో, కాలముకంటె ముందు పరుగిడే స్వభావముగల వీరేశలింగం పంతులుగారు ఇట్టి పత్రికా ప్రకటనము చేయగానే నాటి పండితలోకములో తీవ్రమయిన అసంతృప్తితోకూడిన కలవరము జనించినది! భాషకూ సాహిత్యానికీ దుర్దినములు రాబోతున్నవనే భయముకలిగింది. ఆ పరిస్థితులనుగురించి పంతులుగారు స్వీయచరిత్రలో ఇట్లు వ్రాశారు :—

"పండితులు నాతో నేకీభవింపక యట్లుచేసినచో భాషయొక్క గౌరవమే పోవుననియు, బోసినోటివాడు బొక్కవలసిన పేలపిండివలె నిస్సారముగా నుండుననియు, పేలవముగానుండుటచేత రసికులయినవారి కిట్టి వ్రాతలు రుచింపక చప్పిడిపాకమువలె నగ్రాహ్యముగా నుండుననియు నిరసించుచు, పరిహసించుచు నానావిధముల నెకసక్కెము లాడ జొచ్చిరి. ఆంధ్రభాషా సంజీవన్యధిపతులు (కొక్కొండ వెంకటరత్నంగారు) గ్రంథములు మాత్రమేకాక వార్తాపత్రికలు సహితము కఠినమైన గ్రాంధికశైలినే యుండవలెనని వాదింపజొచ్చిరి. అందుపైని నేను నా పత్రికలో నీక్రింది పద్యమును వ్రాసితిని:—

"సీ. భాషాభివృద్ధియే పత్రిక ఫలమని
చెన్నపురంబున నున్న తెలుగు
పత్రికా లేఖకుల్ ప్రకటించిన వచన కా
వ్యములట్ల పత్రికల్ వ్రాయుమనిరి;
నాదు మతం బదికాదు; భాషాజ్ఞాన
మలవర్చుకొంటకు గలవు పెక్కు
పద్యకావ్యంబులు, గద్యకావ్యంబులు;
పత్రికల్ గ్రాంధిక ఫణితినున్న
బండితులు గానివారికి బనికిరావు,
పత్రి కోద్దేశమే కొఱవడును దాన;
గాన నెపుడు సర్వజనోపకార మొదవ
పామరులకును దెలియంగ వ్రాయవలయు.''

(స్వీయ చరిత్రము. ద్వితీయ భాగము, పుట 173-174.)

ఆ కాలములో సుప్రసిద్ధములైన పత్రికలు (అప్పుడు దినపత్రికలు లేవు) కఠిన గ్రాంధిక భాషలోనే వెలువడుతూ ఉండేవి. బళ్ళారిలో ''శ్రీ యక్షిణి'' అనే పత్రిక, బందరులో "పురుషార్థ ప్రదాయిని", రాజమహేంద్రవరములో ''పశ్చిమ గోదావరీ విద్యాప్రబోధిని", మద్రాసులో "తత్త్వబోధిని", ''వర్తమాన తరంగిణి'', ''సుజన రంజని'', "ఆంధ్ర భాషాసంజీవని" అనేవిన్ని కఠిన శైలిలో గద్యపద్యములలో ఉండేవి. పండితులైనవారే రచయితలు, తమ పాండిత్యము ప్రకటించుకోవడము కోసమే వ్రాసేవారు. ఒకరినొకరు పొగడుకొనడమో తెగడుకోవడమో తరుచు వాటిలోని విషయాలు. ఆంగ్ల విద్యా ప్రవీణు లెవరూ తాము నేర్చుకొన్న కొత్తవిషయాలు ప్రజాసామాన్యానికి తెలియజెప్పడానికి వ్యాసాలు వ్రాసేవారు కారు. పండితుల రచనలతో తులతూగే

భాషలో వ్రాయడానికి జడిసి, ఎవరేమి తప్పులు పడతారో అని భయపడి వారు పత్రికలకు వ్రాసేవారు కారు. తొలుత వీరేశలింగం పంతులుగారు నాటి పత్రికలను కొనియాడినా, వారిలో మార్పువచ్చిన తరువాత వాటిలోని రచనలు నచ్చక పామరులకుకూడా తెలిసేలాగున సర్వజనోప కారక రచనలు పత్రికలలో ఉండవలెనని వాదించారు. వారింకొక అడుగుకూడా ముందుకువేసి గ్రామ్యములో కూడా గ్రంథాలు వ్రాయవచ్చునని ప్రకటించారు. చూడండి:

"గ్రంథములను సాధారణముగా సలక్షణమైన సులభ శైలిని రచింపవలెననియే నా యభిప్రాయమైనను విష యానుగుణముగా తత్తదుచితరీతిని గ్రామ్యభాషయందు సహితము గ్రంథములను వ్రాయవచ్చుననికూడ నా యభి ప్రాయము. పూర్వ వ్యాకరణములన్నియు బద్యకావ్య రచనకొఱకే. వచన కావ్యములు లేనికాలములో పుట్టిన వగుటచేత నందలి లక్షణము లనేకములు వచన కావ్యాభి వృద్ధికి తగవనియు, నిప్పటి కాలమునకు దగినట్లుగా వ్యాకరణమును మార్చుకోవలెననియు నేననుకొని యీ కాలమునకును, వచన రచనాభివృద్ధికిని తగినట్లుగా నొక నూతన వ్యాకరణమును వ్రాసి దానికి లక్ష్యముగా నొక వచన కావ్యమును జేయవలెనని పలుమారు తలపోసితిని." (స్వీయ చరిత్ర-రెండవ భాగము 174 వ పుట)

వ్యావహారిక భాషకు వ్యాకరణము వ్రాస్తే అదిన్నీ సలక్షణ భాషఅయి గ్రామ్యత్వదోషానికి పాలుపడకుండా ఉంటుందనీ, ఆ భాషలో విద్యావంతులందరూ ప్రజోప యోగకరమైన సమస్త విషయముల గూర్చిన్నీ బాహాట ముగా రచనలు చేయడానికిగల ఆటంకము తొలగిపోతుం దనీ వారు భావించారు; గాని వారి సంకల్పము నెరవేర లేదు, వారా వ్యాకరణము వ్రాయలేదు.

హూణ విద్యాపారంగతులై, నూతన విద్యా విజ్ఞాన విషయాలలో ఆరితేరి, ప్రజలకు కొత్త సంగతులు బోధించ గలిగిన్నీ ఆ నాటి విద్యావంతులు ప్రజలకోసము గ్రంథ ములుగాని పత్రికా రచనలుగాని చేయకపోవడానికి భాషా కాఠిన్యమే కారణమని గ్రహించి వీరేశలింగం పంతులు గారు సులభవచనము వ్రాయదగునని పలుమారు తమ ప్రసంగాలలోనూ పత్రికా వ్యాసాలలోనూ ప్రబోధించారు; తాను మార్గదర్శకముగా ఉండేరచనలు అసంఖ్యాకంగా "వివేకవర్ధని" మున్నగు పత్రికలలో ప్రకటించారు. చూడండి వారి ప్రబోధ వాక్యాలు :-

వివేకవర్ధని రెండవభాగములో "దేశభాషలు" అనే శీర్షిక క్రింద 123 వ పుటలో వీరేశలింగం పంతులుగారిట్లు వ్రాశారు :

"పండితుల మనుకొనువారును హూణ విద్యాగంధమై నను లేనివారును పుస్తకములు రచించుచు వచ్చుటవలన అట్టి గ్రంథములలో కఠిన పదములును, దీర్ఘ సమాసము లును కుప్పతిప్పలుగా నుండుటతప్ప ఉపయుక్తాంశము లంతగా నుండవు. కొందరు పుస్తకములను తమ పాం డిత్యమును కనబరచుకొనుటకే రచించి యుండుటవలన నవి గద్యకావ్యములేయయినను కాఠిన్యమున పద్యకావ్యము లకు మించి యుండును". ఆ సందర్భములోనే ఆదేపుటలో "ఏమి కాలకర్మ దోషముననోగాని మనదేశమునందు హూణ భాషయందు విశేష పాండిత్యము కలిగి, బహుపరీక్షలిచ్చి మెప్పువడసిన వారెవ్వరును దేశభాషయందు మంచి పుస్త కములను వ్రాసి జన సామాన్యమును మంచిదశకు తీసికొని వచ్చుట కించుకయు ప్రయత్నింపకున్నారు" అనిన్నీ; ఆ వ్యాసముచివర 126 పుటలో "దేశ భాషలలో నీతి బోధ కములును ప్రకృతి శాస్త్రజ్ఞాన బోధకములును నయిన వచన గ్రంథములను రచియింప బ్రయత్నింతురని నమ్ముచు వారిని (హూణ విద్యాభ్యాసము చేసిన విద్యావంతులను) ఇందు మూలమున బ్రోత్సాహ పరచుచు వారికట్టి బుద్ధి నుదయింపజేయ నీశ్వరుని ప్రార్థించుచున్నాను" అనిన్నీ వ్రాశారు. వివేకవర్ధని రెండవ భాగములో "స్త్రీ విద్య" అనే శీర్షిక క్రింద 14 పుటలో "స్త్రీలు చదువు గ్రంథ

ములు సులభశైలిని మధురముగా వ్రాయబడి స్వాభావిక మైన జీవచరిత్రములవలె నుండు వచన గ్రంథములుగా నుండవలె"ననీ, అందులోనే "సంఘ విద్యాభ్యాసము''అనే వ్యాసములో - (62వ పుట) "నీతిబోధకములగు పుస్తకములను, చరిత్రములను, ప్రకృతి శాస్త్రములను కృషి శాస్త్రాదులను దేశభాషలలో సులభశైలిని వచనరూపమున వ్రాయుట ముఖ్య కర్తవ్యము'' అనిన్నీ హెచ్చరించారు. వివేకవర్ధని మూడవ భాగములో 'ఆంధ్ర భాషాభివృద్ధి' అనే వ్యాసము (10వ పుట)లో ''వార్తాపత్రికా విలేఖరులు కూడ సాధ్యమైనంతవరకు తమ పత్రికలయందట్టి (జనుల యభివృద్ధి సమకూర్చు) విషయములను సకల జనులకు సుబోధముగా నుండునట్లు ప్రచురించుట యావశ్యకము." అని పేర్కొన్నారు. అవకాశము చిక్కినప్పుడెల్లాను, తగిన అవకాశము మాటిమాటికీ కల్పించుకొని కూడాను సులభవచన గ్రంథముల ఉత్పత్తిని గురించి వీరేశలింగం పంతులుగారు నిరంతరమూ విద్యావంతులను ప్రోత్సహిస్తూనే వచ్చారు.

"దేహారోగ్య ధర్మబోధిని'' అనే గ్రంథానికి వ్రాసిన పీఠికలో "దేహారోగ్య ధర్మములను బోధించెడు గ్రంథములు తెలుగుభాష నంతగాలేవు. ఉన్నవిసహితము బాలురకును బాలికలకును సుబోధములు కాకున్నవి. కాబట్టి యెల్లవారికి నుపయోగపడునట్లుగా మిక్కిలి సులభశైలితో నేనీగ్రంథము రచించితిని." అని పేర్కొన్నారు. ఆ గ్రంథ మీ రీతిగా ప్రారంభించారు :

"అన్నపానములు లేక కొన్నిదినముల వరకయినను బ్రతుకఁగలముగాని గాలిలేక కొన్ని నిమిషములయినను జీవింపలేము. తల్లి గర్భమునుండి జారి భూమి మీదపడిన తోడనే మనము మొట్టమొదటచేయుపని పయిగాలిని లోపలికి పీల్చుటయు, మన మీభూమిని విడిచిపోవునప్పుడు కట్టకడపట చేయు పని లోపలిగాలిని పయికి విడుచుటయు అయి యున్నది. పుట్టినదిమొదలుకొని చచ్చువరకును మేలుకొనియున్నను నిద్రపోవుచున్నను మన మీ నడుమ నెల్లప్పుడును చేయుచుండు వ్యాపారము గాలినిపీల్చుచు విడుచుచు నుండుటయే. కాఁబట్టి వాయువే మనబ్రతుకునకు ముఖ్యాధారము.''

ఈ సులభశైలి వ్యావహారికభాషకు చాలా దగ్గరగా ఉన్నది. మాట్లాడేటప్పుడు సహజముగావచ్చే పదజాలము, పదక్రమము, వాక్యములకూర్పు ఈ రచనలో కానవస్తుంది. సలక్షణమైన భాష వ్రాయవలెననే నియమము ఆయన పెట్టుకొన్నారు గనుకనో, సమకాలిక మర్యాదలను అతిక్రమించకుండానే సులభరచన చేయవచ్చునని చూపడానికిన్నీ, అట్టిరచన ఎల్లవారున్నూ చేయవచ్చునని సూచించడానికిన్నీ వ్యాకరణాను సారమయిన నామక్రియా ప్రత్యయములుచేర్చి ఇట్లు వ్రాసినారు. రచన గ్రాంధికమైనా అతి సహజముగాను, జాతీయముగాను ఉన్నది.

సంఘ సంస్కరణోద్యమము తలపెట్టిన పంతులుగారికి సులభ గ్రాంధికముకంటె గ్రామ్యమే ఎక్కువ సమర్థమైన సాధనమనితోచింది. అకృత్రిమము, అతి సహజముఅయిన మాట్లాడే భాష చదవగానే, కాక, వినగానే, సూటిగా హృదయములో నాటుకొని రచనను అత్యంత సార్థకము చేస్తుందని ఆయన గ్రహించారు. తననాటివారెవరూ అట్టి భాష వ్రాయకపోయినా, సాటివారు హేళనచేయవచ్చునని తోచినా ఆయన అవి ఏమాత్రమూ గణించక గ్రామ్యములోనే వ్రాయబూనుకొన్నారు. ఆయన ఈ సందర్భంలో ఏమన్నారో చూడండి :

''ఏ విషయమున నయినను నేనితరులుచూపిన దారినే పోవువాడనుగాక మనసుతిరిగినప్పుడు నా దారిని నేను నడచువాడనగుటచేత సులభవచన రచనావిషయమయి యితరులమాటలను పాటిచేయక నా నూతనమార్గానుసారముగా సంభాషణరూపమున బ్రాహ్మవివాహమును వ్రాసి 'హాస్యసంజీవని' మొదటి పత్రికలో కొంతభాగమును ప్రకటించితిని. ఆ వరకు సంభాషణరూపమున

పుస్తకములు లేకపోవుటచేతనో అందరి విషయ నూతనత్వముచేతనో పురుషులును, స్త్రీలును, పండితులును, పామరులును, బాలురును, వృద్ధులును గూడ దాని నత్యాసక్తితో జదువజొచ్చిరి, బ్రాహ్మవివాహమును సాధారణముగా జనులు "పెద్దయ్యగారి పెండ్లిపుస్తక"మని వాడుచు వచ్చిరి...''హాస్యసంజీవని"లో బ్రాహ్మవివాము ముగిసినతరువాత ''వ్యవహార ధర్మబోధిని" యనుపేర మరియొక గ్రంథమును గ్రామ్యభాషలో వ్రాసి ప్రచురించితిని. దీనిని గూడ జనులు విశేషముగా జదువుచు "ప్లీడరునాటక''మని దీనిని పిలువజొచ్చిరి(స్వీయచరిత్ర, ద్వితీయభాగము — పుటలు 175—176 ...) ''అట్టి వ్రాత కదియే (బ్రాహ్మవివాహము) తెలుగు భాషయందు మొదలగుటచేత నాదినములం దెక్కడజూచినను మూకలు గట్టి జనులు హాస్యసంజీవనిని, ముఖ్యముగా నందులో బ్రాహ్మవివాహమును జదివి యానందించుచు వచ్చిరి.'' అని స్వీయచరిత్ర — ప్రథమభాగము 103 వ పుటలో పేర్కొన్నారు పంతులుగారు.

స్వీయచరిత్రలోని ఈ రచనలనుబట్టి 1876 లో వీరేశలింగంపంతులుగారు బ్రాహ్మవివాహము వ్రాసేటప్పుడు వారి పూర్వులు వ్యావహారిక భాషలో వందలకొద్దీ, వేలకొద్దీ గ్రంధములు రచించినట్లుగాని అవి మిక్కిలి వ్యాప్తిలో ఉన్నట్టుగాని వారికి తెలియనే తెలియదని స్పష్టపడుతున్నది. అయితే తెలుగు దేశములో అనాదిగావస్తూ ఉన్న వచనరచనా సంప్రదాయము పండితులు మాట్లాడే భాషలో — అనగా వ్యవహారిక భాషలో — వ్రాయడమే. ఈ సత్సంప్రదాయము 1853 లో చిన్నయసూరి నీతిచంద్రిక కావ్య భాషలో, అనగా గ్రాంధిక వచనములో వ్రాసి ఒక కొత్తశైలి ప్రవేశపెట్టడముతో తారుమారయింది. చిన్నయసూరి నీతిచంద్రిక వ్రాయక పూర్వము సర్వ విధములయిన వచనమూ — కథ, వ్యాసము, చరిత్ర భూగోళము, ప్రకృతిశాస్త్రములు, తత్త్వము, భాషా లక్షణము, జ్యోతిషము, వైద్యము, ధర్మశాస్త్రము, భరతశాస్త్రము, కైఫీయత్తు, క్షేత్రమహాత్మ్యము, పురాణములు, జాబులు, వార్తాపత్రికలు — సర్వమూ వ్యావహారిక భాషలోనే ఉండేవి. క్రైస్తవ మత గ్రంథాలు, పాశ్చాత్య విద్వాంసుల రచనలూ కూడా అల్లే. అప్పటి ప్రభుత్వము నియమించిన "ఉపయుక్త గ్రంథమండలి" (అనగా Text Book Committee) ఆమోదించిన బడి పుస్తకములన్నీ వ్యావహారిక భాషలోనే ఉండేవి. 1853 వరకూ ఇదే సంప్రదాయము. చిన్నయసూరి ప్రవేశపెట్టిన కృత్రిమగ్రాంధిక వచనము పండితులను ఆకర్షించినది. నాటి విద్యావేత్తలు పలువురు వ్యాకరణయుక్తంగా వచనము వ్రాయడము తగదని ప్రతిఘటించారు. గాని పండితులు సూరిగారి పద్ధతినే అనుకరించారు. తాము గ్రాంధికవచనము వ్రాయడముతో సంతృప్తిపడక వ్యావహారిక రచన ఎక్కడా కనరాకూడదని ఆదివరకు వ్యావహారిక భాషలో ఉన్న గ్రంథాలను తిరిగి ముద్రించవలసి వచ్చినప్పుడు వాటిని గ్రాంధిక భాషలోనికి మార్చి అచ్చు వేయించారు. 1843 లో రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు "పంచతంత్రమును" వాడుకభాషలో వ్రాశారు. ఉపయుక్త గ్రంథమండలి ఆమోదముతో అది బడులలో పాఠ్య గ్రంథమై చిరకాలము వాడుకలో ఉండి పదిసార్లు పునర్ముద్రణము పొందింది. 1871 లో దానిని ముద్రించిన వారెవరో గ్రాంధిక భాషలోనికి మార్చివేసి మరీ అచ్చు వేశారు. (చూడండి: గద్యచింతామణి, 92 వ పుట). చాలా గ్రంథాలు పునర్ముద్రణ దశకు రాకుండా అంతరించడమువల్లనూ, కొన్ని పునర్ముద్రణములో గ్రాంధిక భాషలోనికి పరివర్తనము పొందడమువల్లనూ పూర్వ వచనరచనా సంప్రదాయము వీరేశలింగం పంతులుగారికి తెలియరాదు. అందువల్లనే ఆయన మాట్లాడే భాషలో — గ్రామ్యములో — ఆదివరకు ఎవరూ రచన చేయలేదనీ తాను సంభాషణరూపములో వ్రాసిన "బ్రాహ్మవివాహము"

ఆట్టి రచనలలో తొలుతటిదనీ పేర్కొన్నారు. చదువర్ల కున్నూ అది సరికొత్త పద్ధతిగా తోచి అత్యంతాకర్షక మైనది. ప్రతిభావంతులు గనుక వీరేశలింగం పంతులు గారు లోకానుభవమువల్ల, తనంతటతానే వాడుక భాషలో వ్రాస్తే రచన బహు జనామోదము పొంది సార్థకమవు తుందని గ్రహించారు. వాడుకభాష సంఘ సంస్కరణోద్యమానికి ప్రబల సాధనముగా ఉపకరిస్తుందని ఆయన స్వయంగా గ్రహించి దానిని చేపట్టారు.

వీరేశలింగం పంతులుగారు తమ స్వీయ చరిత్ర రెండవ భాగము 153 వ పుటలో ఇట్లు వ్రాశారు : "వచన కావ్యమని చెప్పదగినది చిన్నయసూరిగారి నీతిచంద్రిక యొకటి యున్నది. అదియు పూర్తిగాక యర్ధమే యయి యున్నది. విక్రమార్కుని కథలు, పంచతంత్రము, కాశీ మజిలీలు అను గ్రామ్య గ్రంథములు కొన్ని యున్నను వానిని పామరులేకాని పండితులు చదువకుండిరి" — అని. దీనినిబట్టి రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు వ్యావహారిక భాషలో వ్రాసిన "పంచతంత్రము" "విక్రమార్క చరిత్ర" గ్రంథముల పాతప్రతులున్ను "నిజమయిన కాశీమజిలీలు" అనే గ్రంథము ప్రతులున్ను అప్పటికింకా వాడుకలో ఉన్నట్లున్ను, వాటిని పామరులు మాత్రమే చదువుతూ ఉన్నట్లున్ను పంతులుగారికి తెలిసిన విషయమే అని మనము గ్రహించాలి.

బ్రాహ్మ వివాహము, వ్యవహార ధర్మ బోధిని అనే నాటకములు వాడుక భాషలో వ్రాసి, ఆ రచనలు బహుజనామోదము పొందడము చూచిన తరువాత వీరేశలింగం పంతులుగారు చమత్కార రత్నావళి అనే నాటకములో వాడుకభాష పరిమితముగా ప్రవేశపెట్టారు. అందులోని స్త్రీ పాత్రలూ, నీచపాత్రలున్ను వాడుకభాషలో ప్రసంగించినట్లు వ్రాశారు. సంస్కృత నాటకాలలో అట్టి పాత్రలు ప్రాకృతములు వాడుక చేస్తవి; ఆ పద్ధతిని పంతులుగారు ఈరీతిగా అనుకరించినట్లు తోస్తుంది. కళ్యాణ కల్పవల్లి అనే నాటకములో మాత్రము నీచపాత్రలకే వ్యావహారిక భాషపరిమితము చేసి తక్కిన పాత్రల సంభాషణలన్నీ గ్రాంథికములో రచించారు. ఇతర నాటకాలన్నీ—వచనమూ పద్యముకూడా — పూర్తిగా గ్రాంథిక భాషలోనే వ్రాశారు పంతులుగారు.

వీరేశలింగం పంతులుగారి గ్రంథ సంపుటాలలో మొదటిది యావత్తూ వ్యావహారిక భాషలోనే ఉన్నది. అందులో "అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము" మొదలగు పదునాలుగు ప్రహసనాలున్ను, "హాస్య సంజీవని" అనే శీర్షికక్రింద మూడు భాగాలలో ఇంచుమించు 50 సాంఘిక విషయాలను గూర్చిన హాస్య సంభాషణలున్ను వ్రాశారు. వాటిలో కొన్ని శీర్షికలు — ఆచారము, అపాత్ర దానము, వేశ్యావిషయ సంవాదము, స్వర్గలోక సుఖము, కన్యాశుల్కమున్ను; మ్యునిసిపల్ నాటకము అనే మూడు అంకముల నాటకమున్ను ఈ రచనలలో ఉన్నవి.

ప్రహసనాలలో వీరేశలింగం పంతులుగారు ఎట్టి భాష వ్రాశారో తెలియడానికి మచ్చుకి ఈ క్రిందిది ఉదాహరణముగా ఇస్తున్నాను — అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనములోని చివరిపంక్తు లివి :—

రామాకాంతం పంతులు : అన్నీ అబద్ధాలాడేవాడవు నీవు యిందులో మాత్రం నిజం చెప్పి వుంటావా ?

కరటకరెడ్డి (సేవకుడు) : యీవేళ నేను నిజం చెప్పడానికి ఆరంభం చేసినాను. దేవరవారు నేను యిఖ గృహస్థ బ్రహ్మచారినిగా వుండవలసిన ఆవశ్యకం లేకుండా చేస్తే నేను నేటినుంచి సత్యహరిశ్చంద్రుణ్ణి అవుతాను.

రామా : కరటకా ! ఇందాకటి నీ అవస్థ తలుచుకుంటే నాకు నవ్వువస్తూవున్నది. ఇప్పుడు జరిగిన దంతా మరిచిపోయి మీరుయిద్దరూ యిక మా యింట్లో సుఖముగావుండవచ్చును. నేను యిఖముందు నీవుచెప్పిన గృహస్థ బ్రహ్మచారులను నిజమయిన గృహస్థులనుగా

చెయ్యడానికే ప్రయత్నం చేస్తాను. లోపలికి పోదాము రండి.

కర : అలాగయితే మాకు యిదివరకు జరిగిన వివాహం వివాహం కాదు. ఇప్పుడు మీరు జరిగించినదే వివాహము. నా బ్రహ్మచర్యం వదలి మీదయవల్ల నేను యిప్పుడు నిజమయిన గృహస్థుడ నవుతున్నాను."

పైని పేర్కొన్న ప్రథమ సంపుటములోని ప్రహసనములు మొదలయిన రచన లన్నింటిలోనూ సంభాషణలు వ్యావహారిక భాషలో ఉండడ మొక విశేషము. ప్రసంగించే విషయాన్నిబట్టి పదజాలములోనూ, మాటల కూర్పులోనూ, శైలిలోనూ కొంత భేదము ఉండవచ్చును గాని పాత్రనుబట్టి భాష, శైలి భిన్నముగా ఉండడము ఎక్కడోకాని కనబడదు. పాత్రోచిత భాషా ప్రయోగము పంతులుగారి ఉద్దేశమైనట్లు కనబడదు.

అయినా వైదిక బ్రాహ్మణులు – పురుషులుగాని, స్త్రీలుగాని పాత్రలుగాఉన్న కొన్నిసందర్భాలలో "వస్తావషే" (టే) ఉంఛాను (ఉంటాను) వంటి ఏ రెండోమూడో భేదాలతో సామాన్యంగా ప్రహసనములలో వాడే సంభాషణ భాషే వాడుక చేశారు. ''హాస్య సంజీవని'' తృతీయ భాగములో ''మునిసిపల్ నాటకము''లో వచ్చే ఒక మహమ్మదీయ పాత్ర, "ఖాదర్ సాహెబ్'' మాటలలో మాత్రం పాత్రోచిత భాష వ్రాసిన ప్రయత్నం కొన్నిచోట్ల కనబడుతుంది.

ఖా : భంఛోత్! మీకీ యేమీ దొరికేదోకాని మాకీ పావలా బేడాకంటె యెప్పుడూ యెక్కువా చేతులో పెట్ట లేదు. అప్పుడూ మీరే అంతా దోచుకు దొబ్బేవారు.

బుచ్చయ్య పంతులు : సాహెబుగారూ! మనలోమనం దొమ్ములాడడం న్యాయంకాదు. మనం యెంత తిన్నా తిన్నవాళ్ళమే. మన మందరమూ యేకముగావుంటే ఇప్పుడు విస్తారం దొరకకపోయినా యిఖ దొరుకుతుంది.

ఖా : భాంఛోత్, నేను యేమి అన్నానయ్యా. నాకీ నెలకీ పది రూపాయిలు ఇస్తానని దస్తావేజు వ్రాసి యియ్యి, నేను యెందులో దస్కత్ చెయ్యమంటే అందులో చేస్తాను.

"హాస్య సంజీవని'' ద్వితీయ భాగంలో ''గొట్టాలమ్మ సభ" అనే ప్రసంగంలో (పుట 57) మాదిగ మల్లిగాడు, గమళ్ళ గాకిగాడు అనే పాత్రలు ఆడిన మాటలనుబట్టి వారి భాష పాత్రోచితము కాదని స్పష్టపడుతుంది.

"మల్లి : బాబూ తప్పకుండా నిలపాలండి, మాకు డప్పుల పని లేకపోవడంచేత కల్లునీళ్ళకి చచ్చిపోతున్నాము. మా మాదిగవాళ్ళ నందరినీ పోగుచేస్తాను. తప్పకుండా వుత్సవం చేయించండి. యీ మూలంగానైనా మాకు నాలుగుడబ్బుల సొమ్ము దొరుకుతుంది.

గాలి : అవునండి తప్పకుండా చెయ్యవలసిందే. మాదిగ వాళ్ళకి మాత్ర మేకాదు మాకూ నాలుగుడబ్బుల సొమ్ము దొరుకుతుంది. ఇప్పుడు మనవూళ్ళో యెంతమంది కల్లుతాగేవాళ్ళువున్నా యీ వుత్సవదినాలలోవలె యెప్పుడూ ఖర్చుకాదు. కావలిస్తే మా వాళ్ళనందరినీ పోగుచేసి వుత్సవానికి కావలసినంత సరంజాం చేయిస్తాను. ఇచ్చుకోమంటే తలా రెండణాలూ చందా యిచ్చుకొంటాము."

ప్రహసనాలు, హాస్యప్రసంగాలు, కొంతవరకు నాటకాలున్నూ వ్యావహారిక భాషలో వ్రాశారు వీరేశలింగం పంతులుగారు. ఈ రచనలన్నీ ఇంచుమించుగా సంఘ దురాచారాలను విమర్శించేవి. హాస్యము, వినోద సంభాషణము–వీటికి వ్యావహారిక భాష నప్పినట్లు గ్రాంధికము నప్పదు. పొగడడానికీ తెగడడానికీ అతిసహజమయిన నోటిమాట పనిచేసేటట్లు గ్రాంధిక భాషాప్రియులకయినా వ్యావహారిక భాషలోనే రావడము సహజము. ఈ రచనలన్నీ సులభ గ్రాంధిక భాషలో వ్రాసిఉంటే ఇంత హృద

యంగమంగా ఉండేవికావు, వ్యావహారిక రచన వీటిలో సార్థకమయింది.

ఇతర రచనలన్నీ – వ్యాసములు, ఉపన్యాసములు, జీవిత చరిత్రలు, నవలలు, స్వీయ చరిత్ర, కవి జీవితములు, అనువాద నాటకాలు, కొన్ని స్వతంత్ర నాటకాలు, శాస్త్రములు, ఇతర రచనలు అన్నీ సలక్షణమైన భాషలో వ్రాశారు పంతులుగారు. తొలి గద్య పద్య రచనలు కాక మిగతావన్నీ సులభమైన సలక్షణ భాషలో వ్రాశారు. ఆయన ఏదో నియమము పెట్టుకొని తదనుసారముగా గ్రాంధిక వ్యావహారికములు వాడుక చేసినా ఆయన వ్యావహారిక భాషోద్యమాన్ని ఎన్నడూ వ్యతిరేకించలేదు.

వివిధ సాంఘిక విషయాలలో సంస్కరణోద్యమము సమర్ధతతో సాగిస్తూ, ప్రజాసేవకే జీవిత సర్వస్వమంతా సమర్పణచేసి నిరంతర కృషి చేస్తూ వచ్చిన వీరేశలింగం పంతులుగారు ఇంతో అంతో తమవలెనే ఉన్నతాదర్శాలు పెట్టుకొని, ప్రజాభ్యుదయ కాంక్షతో. ప్రజలలో విద్య సర్వవ్యాప్తము కావలెననే తలంపుతో, భాషా రంగములో ప్రజోద్యమము నడుపుతున్న గిడుగు రామమూర్తి పంతులుగారి కృషిని వ్యతిరేకిస్తారా? రామమూర్తి పంతులుగారికి వీరేశలింగం పంతులుగారి సానుభూతి సహకారాలు ఎల్లప్పుడూ ఉండేవి. వారిరువురూ అప్పుడప్పుడు కలుసుకొంటూ సంప్రతించుకొంటూ ఉండేవారు. తరుచు వారినడుమ ఉత్తర ప్రత్యుత్తరాలు నడుస్తూ ఉండేవి.

1919 వ సంవత్సరం ఫిబ్రవరి 28 వ తేదీని రాజమహేంద్రవరములో వీరేశలింగం పంతులుగారి ఆనందాశ్రమంలో ఒక విద్వత్సభ జరిగింది. వీరేశలింగం పంతులుగారే అధ్యక్షులు. నాటి సభలో జరిగిన చర్చ ఫలితంగా "వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజము" అను పేర ఒక నూతన సంస్థ నెలకొల్పారు. దాని ఆశయాలు ఇవి :–

I. వ్యావహారిక భాషకును గ్రాంధిక భాషకును ఇప్పుడున్న వ్యత్యాసము సాధ్యమైనంతవరకు తగ్గించి భాష సులభము చేయుట.

II. జ్ఞానాభివృద్ధికై వ్రాయు గ్రంథములలో సాధ్యమైనంత వరకు వ్యవహారములో ఉన్నరూపములే ఉపయోగించి వ్యవహారములో లేనివి విడిచి పెట్టుట.

III. వ్యవహారములో ఆవశ్యకములుకాకుండ ఉపయోగించుచున్న అన్యదేశ పదములను విడిచి ఆవశ్యకములైన పదములను చేర్చుకొనుట.

IV. పై ఉద్దేశముల ననుసరించి గ్రంథములు వ్రాయుట.

ఈ కొత్త సంస్థకు వీరేశలింగం పంతులుగారు అధ్యక్షులు. గిడుగు రామమూర్తి పంతులుగారు, జయంతి గంగన్నగారున్ను కార్యదర్శులు; సభా కార్యక్రమములో పాల్గొని ఈ ఆశయాలను ఆమోదించిన సభ్యులంతా సభ్యులుగా చేరారు.

ఈ సభ జరిగిన మూడు నెలలకే వీరేశలింగం పంతులుగారు పరమపదించారు. వారింకొక నాలుగు కాలాలపాటయినా జీవించి ఉంటే వ్యావహారిక భాషా వాదానికి నాడే ఆ మహానాయకుని నాయకత్వంవల్ల ఎంతో ఉపకారం జరిగిఉండేది. ఆయన వ్యావహారిక భాషలో ఆదర్శప్రాయమయిన కొత్త గ్రంథాలు వ్రాసి దేశాన్ని ఉత్తేజపరచేవారు. వాడుకభాషకు వ్యాకరణము ఏర్పడి ఉండేది. వారు లేకపోయినా వారి ఆశీర్వాదము వ్యావహారిక భాషోద్యమానికి లభించింది.

ఈ ఉద్యమము ఈ నాడు ఫలప్రదమయినందుకు స్వర్లోకవాసి వీరేశలింగం పంతులుగారి ఆత్మ సంతుష్టమై ఆనందానుభూతి పొందుతూ ఉంటుంది. ★

# మణిదీపం

శ్రీ సి. నారాయణ రెడ్డి

పరవాణి యను గండు దొరసాని మ్రోల మన
బాస బానిస పిల్ల పగిది ఒదిగిన వేళ;

మడ్డి గట్టిన సంఘ మర్యాదలకు కట్టు
వడి పెద్దలే బుద్ధి ముడుపు గట్టిన వేళ;

చిన్న నా పొట్టకే శ్రీరామ రక్ష యని
ఎవని గోతమ్ము వాడే నింపుకొను వేళ;

పూత గౌతమి గడ్డలో తలెత్తిన జో దెవండు ?
వేరెవరు ? మన కందుకూరి వీరేశ విబుధుండు.

ఓ కందుకూరి వంశోదధి శశాంక మూర్తి
విశాల కీర్తి — నీ వన్న

నాచిన్న గుండె సంద్రము వోలె వికసించు
కెరటాలుగా పొంగి సరిగమలు వినిపించు.

నా తెలుగు జాతి పుణ్యాలు పండిన రూపమా
మణి దీపమా — నీ వన్న

నా పిట్ట కలము సింగముభంగి లంఘించు
సటలెత్తి భావ సంపుటములు విజృంభించు.

వెల వెలందులతోడ కులుకుటే గొప్పయని
అను కొన్న ఘనుల గుట్టును బయట పెట్టితివి.

ధనము కోసము గడ్డి తినెడు అధికారులను
కలము పోటులతోడ గజ్జు మనిపించితివి.

రాయిరప్పల పూజసేయుటను నిరసించి
మంచి మనసె దైవ మందిర మ్మన్నావు.

సత్య వాక్కే మహాస్త్రముగా ప్రయోగించి
కుత్సితమ్ముల నాభి గూళ్ళు చీలిచినావు.

నీ చేతి చలువతోనే వితంతువులు తమ
తలలపై నీలాలు నిలుపు కొన్నారయ్యా

నీ కటాక్షమ్మొ తండ్రీ ! బెరడు గట్టి పో
యిన అనాథల బ్రతుకు లిగురింపజేసినది.

నీవు కాసె బిగించినందున దురా
చార భూతముల బండారమ్ము తెలిసినది,

సగము చచ్చిన సమాజమ్ము నీ సంస్కార
బలము పుంజుకొని జంగలు సాచి నడచినది.

ఆంధ్ర భారతి కూపిరాడనీయని అలం
కార భారమ్ము గని కంట తడి పెట్టితివి.

క్రొత్త వెల్తురు లేక కుంచితమ్మగు మాతృ
భాషాలతకు పైడి పందిళ్లు వేసితివి.

పెంకులుగ కన్పడు కవి చరిత్రముల ద్రవ్వి
తులలేని రత్న రాసులను పైకెత్తితి.

కటు కౌషధము వంటి జటిల శాస్త్రాంశముల
తేనెలూరెడు పచ్చి తెలుగులో పంచితివి.

ముక్కుపై కోపమ్ము ముసురుకొను నీ పెట్లు
రచనలందున హాస్య రసము చిల్కితి వయ్యా ?

వట్టి అలిపిరి ప్రాణివైన నీ వే రీతి
బండ్లకెత్తెడి గ్రంథ పటలి నల్లితి వయ్యా ?

పశు బలమ్మున కదరి వశము దప్పని వాడ !
డబ్బు ఎర జూచి బోల్తా పడని మొనగాడ !

కందుకూరి కులమ్మొ కాదు నాలుగు కోట్ల
తెలుగు వంగడము వెల్గులు చిందె నీ వల్ల.

అందు కోవయ్యా తాతయ్యా ! వేనకు వేల
మనుమల శుభాభినందన గుళుచ్ఛము లెల్ల.

★

# పవిత్ర స్మృతులు

శ్రీమతి నాళం సుశీలమ్మ

ఆంధ్రప్రదేశములోని ఈనాటి వికాసమునకు కారణ భూతుడైన శ్రీ వీరేశలింగంగారి వర్ధంతిని ఈ నాడు మన ఆంధ్ర ప్రభుత్వముచేయడానికి – సంకల్పించడం ఆంధ్రులందరకూ చాలా సంతోషకారణం.

శ్రీ వీరేశలింగంగారి శుభనామాన్ని సంస్మరించుట తోనే ఆనాటి సంఘమునందు బాగా వ్రేళ్ళూతన్నుకొని పోయివున్న సనాతన మతాచారపద్ధతులు, ఆ పద్ధతులను అతిక్రమించి నడువలేకపోయిన మాబోటివారి అశక్తత నాకు బాగా జ్ఞాపకం వస్తూ ఉన్నది.

అందులో సంఘసంస్మరణాది సమస్త కార్యాలలోను, శ్రీ వీరేశలింగం పంతులుగారి అంతేవాసి శిష్యరత్నము లని ప్రసిద్ధిపొందిన శ్రీ నాళం కృష్ణారావుగారు, నా భర్తగా రగుటవలన, ఆనాటి సంఘ సంస్కారోద్యమము వలన పరమ సనాతనాచారములో పుట్టి పెరిగిన నా అనుభ వము చాలా చిత్రముగా ఉండేది.

ఆనాడు ఏవిధంగాను నేను శ్రీ వీరేశలింగంగారి ఉద్యమాలతో జోక్యం కలిగించుకొన్న దానిని కాకపో వడమే కాక నా భర్తగారితో నేనేమీ సహకరించిన దానను కూడ కాదు. అయినను ఈనాడు నాబోటి పెద్దవాళ్లంకూడ సంఘసేవ చేస్తూ అదే పరమార్థమని భావించకల్గుతున్నా మంటే, ఆనాటినుండి శ్రీ పంతులుగారి సంఘ సంస్క రణోద్యమము, స్త్రీ జనాభ్యుదయ సేవా భావములు మాలో అంతర్లీనముగా నుండి క్రమ పరిణామాన్ని కల్గించడానికి పూర్తిగా కారణా లయ్యాయనే చెప్పాలి. ఆనాటి నా అనుభవాలంటే మావారితోబాటు నే న ను భ వి ం చి న సంఘటనలే మీముందు వివరించగల్గేది.

నా కిప్పుడు 75–76 సంవత్సరాల వయస్సు, నాకు 12 వ సంవత్సరమునవే పెండ్లి అయినది. నా పెండ్లి నాటికే మావారికి బ్రహ్మ సమాజంతోను, వీరేశలింగం గారి వితంతు వివాహోద్యమాలతోను సంబంధం కొంచెముగా ఉండేదట. కాని, మా పుట్టింటివారైన మోతే వారికి ఆ విషయాలు తెలియవు. ఆవిషయాలు పెండ్లి నాటికి తెలియనందున పిల్ల నియ్యడం జరిగినదని ఇప్పుడు ఇట్లా బాధలపాలు కావలసి వచ్చిందని నన్నూ, మావారినీ రాజమండ్రిలో వెలివేసినప్పుడు ఏలూరులో అనుకోవడం నేను విన్నాను.

అటు మా పుట్టింటివారైన మోతేవారు, ఇటు అత్తవా రైన నాళం వారు చాలా సనాతనమైన కుటుంబాలు. ఆడపిల్లలకు చదువు లక్కరలేదనే రోజు లవి. అయితే నన్ను ఏలూరులో మంచి గుణములుగల ఒక నాయుడు గారి వీధి బడికి పంపేవారు. అప్పుడు ఎక్కువగా స్కూళ్ళు లేవు. పెద్దపెద్ద క్లాసులు చదివిన పిల్లలు కూడ లేరు. కాని అప్పట్లో నాలుగో క్లాసులోనే భారతము, రామాయణమును మాకు చెప్పేవారు. మా పెత్తండ్రిగారి కుమారులు సుప్రసిద్ధ దేశభక్తులైన మోతే నారాయణరావు గారి తండ్రిగారైన మోతే సుబ్బయ్యగారికి మంచి సంస్కార భావా లుండేవి. ఆయన చాలా కళాప్రియుడు. ఆయన నాకు, తన భార్యకు ఇంగ్లీషు దొరసానిని పిలిపించి ఆంగ్ల మున్నూ, మగ మాష్టరుగారిచేత చాలా రహస్యంగా సంగీతమున్నూ చెప్పించేవారు. అయినా, అది యెట్లాగో పైకిపొక్కి మోతేవారింట్లో సానిపెట్టి (హార్మోనియం) చెప్పిస్తున్నారని, జనంఅంతా విడ్డూరంగా చెప్పుకొనినారు.

సుబ్బయ్యగారు పెద్దవాళ్ళకు తెలిసిన ఏమందురోయని, మాష్టర్లకు జీతము క్రింద, తాను పనిచేయుచున్న వారి బియ్యంమిల్లులోని బియ్యం ఇచ్చేవారు.

ఆ పరిస్థితుల్లో నేను అత్తవారింటికి రాజమండ్రి వచ్చాను. నా చదువు నాలుగోక్లాసుకంటె పైకి రాలేదు. మొదట్లో మావారు, తన సంస్కారోద్యమాలలో తనకు సహకరించవలసినదిగా నన్ను చాలా ప్రోత్సహించేవారు. కాని, నాదగ్గరనుండి ఎటువంటి అనుకూల్యము లభించక పోయేటప్పటికి వారు నాకు ఏమీ చెప్పేవారు కాదు. అంతతో అది ఆగినా బాగుండును కాని, తరువాత తరువాత, నాకుగల సహజ సనాతన మతాభిమానము, సంస్కారోద్యమముపట్ల గల వ్యతిరేక భావము మావారికి నాపై చాలా కోపభావాన్ని కల్గించాయి. వారు ఇంటివద్ద భోజన సమయమున, నిద్ర సమయమున తప్ప ఉండేవారు కారు. లైబ్రరీ పనులతో, టౌను కాంగ్రెసు సెక్రటరీ పనులతో, ఈ వితంతు వివాహ సంస్కార కార్యక్రమాలతో వారికి విరామం లేదు కాబోలునని నేను సరిపెట్టుకొనేదాన్ని. కాని వారి సంస్కారోద్యమాలపట్ల నేను అనుకూలత చూపకపోవడంచేత నాపట్ల వారికి కల్గిన విముఖ భావం యొక్క ఫలితమేనని తెలిసినప్పుడు నేను చాలా బాధ పడ్డాను. అయినా, నేను స్వతంత్రించి వారికి నా సహకారం ఇయ్యలేకపోయినాను. మా అత్తగారు లక్ష్మీదేవమ్మ గారు, సాక్షాత్తు లక్ష్మీదేవమ్మగారే. ఆమె కుమరుని పల్లెత్తుమాట అనేదికాదు. మా ఆడపడుచు ఒకామెమాత్రం అయన భోజనమునకు ఇంటికి వచ్చినప్పుడు ఆ సమయమున 'ఏరా కృష్ణయ్యా, ఇట్లా ఇల్లు పట్టించుకోకుండా తిరిగితే ఎట్లారా' అని మందలించేది. 'వాడు ఇంటికి వచ్చేదే భోజనానికి, ఆ భోజనంకూడ సరిగ్గా చెయ్యకుండా నీ వెందుకు మందలిస్తావు' అని మా అత్తగారు ఆమెను మందలించేవారట. ఇవి నేను కాపురమునకు రానప్పటి సంగతులు. నేను వచ్చిన తరువాత, అన్నదమ్ములుకూడ ఏమీ అనేవారుకాదు. ఇంకాపైగా ఉద్యమాల కోసంగాని, తన ఖర్చుకోసంగాని, మావారు ఏ కొట్లో ఎంత అప్పుగా తీసుకొన్నా అన్ని బాకీలు తమ్ముని కోపపడకయే చెల్లించివేసేవారు. ఇంట్లో ఎవ్వరి ఆటంకాలు లేక పోవడంతో వారు ఇంకా యధేచ్ఛగా, తన ఉద్యమాలకు అర్పిత మయిపోయినారు. ఉదయం ఇల్లు విడిస్తే మధ్యాహ్నం భోజనానికితప్ప మరల ఇంటికే రాక, రాత్రియైన తరువాత ఇంటికి చేరే వారి పట్టుదలకు కారణం ఏమిటోకూడ నాకు అప్పట్లో అర్థంకాక చాలా బాధ పడేదాన్ని.

ఇంతకూ చెప్పవచ్చేదేమంటే—శ్రీ వీరేశలింగం పంతులుగారి అన్ని ఉద్యమాలలోను, ఈయన కుడిభుజం వలె పనిచేసి వారికి సహకరించుతూ ఉండడంచేత, ఈయన వారి సహచరుల దండు (రామదండు అని ఆ దండుపేరు) నకు దళవాయిగా ఉండే అవకాశం కల్గడంచేత ప్రొద్దస్తమయమూ ఆ పనులలోనే ఉండి దీక్షగా దేశమాతను సేవించే అవకాశం శ్రీ పంతులుగారు వీరికి కల్పించారు. వీరితో దేశరాజు పెద్దబాపయ్యగారు, శ్రీ కామరాజు హనుమంతరావుగారు, పెద్దాడ సుందర శివరావుగారు, శ్రీ పాలపర్తి నరసింహంగారు, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు మొదలైన పెద్దవాళ్ళంతా ఇట్లాగే పాటుపడుతూ ఉన్నారని కర్ణాకర్ణిగా వినేదాన్ని. కాని ఎప్పుడూ ఇంట్లోంచి బయటికి వెళ్ళడం అలవాటు లేక పోవడంచేత ఎవరినీ అప్పట్లో నేను చూచి యెరుగను. అయితే, అప్పట్లో చాలా వ్యాప్తంగా ఉన్న దురాచారాలైన భోగం మేళములు మాన్పించుచు, సంఘ కార్యక్రమాల కొరకు ప్రాణాలు అర్పించవలసివచ్చినా వెనుదీయకుండా ఉన్నారు. కలలోకూడ అబద్ధమాడకుండుట, నిత్యమూ పరిమిత వేళలలో దైవ ప్రార్థనలు జరుపుట, విగ్రహారాధన విసర్జించుట మొదలైన దీక్షలు పట్టించి, ఈ యువ తరం వారి నందరనూ శ్రీ వీరేశలింగం పంతులుగారు

నుశిక్షితులుగా తీర్చి దిద్దారనికూడ నేను విన్నప్పుడు మాత్రం నాలో నేనే ఆనందించి వెయ్యి దేవుళ్ళకు నమస్కారాలు చేశాను.

ఆజన్మాంతమూ, ఈ నియమాల నన్నింటినీ తూచా తప్పకుండా మావారు పాటించారు. ఎంత గొప్ప దేవాలయమైనా వారు శిల్ప దృష్టితో అంతా చూచేవారు. కాని గర్భగుడి లోనికి అడుగు పెట్టేవారుకారు. ఈ సంఘ సంస్కారోద్యమ తీవ్రతలో తనకు అనుకూలురాలను కాదనే భావంతో నన్ను విడచి ఎవరో వితంతువును, వారు తిరిగి పెండ్లి చేసుకుంటారనే వదంతులు నేను కాపురమునకు రానప్పుడు కలుగగా, మా పుట్టింటివారు చాలా ఆందోళనపడి రాజమండ్రికి వచ్చి వారిని బ్రతిమలాడుకొన్నారు. తరువాత నేను కాపురమునకు వచ్చిన కొత్తలో, ఇద్దరమూ బొంబాయికి వెళ్ళినాము. అప్పుడు నేను మా పినతండ్రితో బొంబాయినుండి ముందు వచ్చినాను. తరువాత 3-4 దినములకు మావారు రాజమండ్రి వచ్చి, కలకత్తా బ్రహ్మ సమాజములోనికి వెళ్ళవలెనని ఉద్దేశముతో ఇంటికి రాక, ఎక్కడనో ఉన్నారు. అప్పుడు వారి అక్కగారు, ప్రియమైన వదినగారు ఒక ఆమె బజారులో ఉండగా వెళ్ళి బ్రతిమలాడి ఇంటికి తీసికొనివచ్చినారు. ఆసమయమున నేనక్కడలేను. కాని తరువాత, 'మా వదినమూలాన ఇంటికి వచ్చానుగాని, నీ మూలాన రాలే'దని నన్ను కోపదృష్టితో అనేవారు. ఎలాగైతేనేమి నాకు దక్కినారని సరిపుచ్చుకొనే దాన్ని. ఆ పైన వితంతువును పెండ్లి చేసికొనే వదంతికి మావాళ్లు వద్దంటే చెప్పిన జవాబు ఏమనగా 'నా కటువంటి అభిప్రాయము లేదని, పెండ్లి అనేది ఒక జీవితానికి ఒక స్త్రీతోనే జరగాలితప్ప, ఇంకొకరితో జరగడానికి వీలు లేదన్న పవిత్ర భావము, వైవాహిక జీవితంపట్ల తనకు ఉన్నద'ని మావారు మా పుట్టింటివారికి ప్రత్యుత్తర మిచ్చి పంపివేశారు. శ్రీ వీరేశలింగం పంతులుగారు తన సహచరులను కేవల కర్మవీరులనుగా మాత్రమే కాక ప్రాచీన పవిత్ర భారతీయ సంస్కృతికి చెందిన ధర్మ వీరులుగా కూడ తీర్చి దిద్దిఉన్నారనేది నేను గ్రహించగలిగినప్పుడు నాలో ఒకవిధమైన చైతన్యం కలిగిందని చెప్పాలి.

ఇప్పటికీ ఆ తరం వారంతా ఆ విధంగానే నిష్కామకర్మ వీరులుగాను ధర్మదీక్షా పరాయణులుగాను త్యాగప్రియులుగాను ఉండడం మనం చూస్తూనే ఉన్నాం. ఆ నాటి ఈ జాతికి యీ నైతికబలాన్ని ప్రసాదించిన మహానుభావులు శ్రీ వీరేశలింగంగారే. ఆయన ఇంకెన్ని విధాలుగా శ్రమించి ఈ ఆంధ్రజాతిని సంస్కరించడానికి పూనుకొన్నారో అవన్నీ నేనిక్కడ వ్రాయడం అనవసరం. కాని వారి సేవల వలననే ఈ నాటి మహత్తరమైన ఈ ఆంధ్రజాతి కింత వికాసము కలిగిందనే విషయంలో సందేహము లేదు. అందుచేతనే ఆయన యుగపురుషులైనారు.

తరువాత తరువాత నేను మావారి ప్రీతికోసం స్త్రీల ప్రార్థన సమాజానికి ఎప్పుడైనా వెళ్లేదాన్ని. అక్కడ శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారితోకూడ నేను అట్టే పరిచయం కల్గించుకోలేకపోయినాను. సభలకు వెళ్ళినప్పుడు శ్రీ పంతులుగారిని మూడు నాలుగు పర్యాయములు చూడడం తప్ప నేను వారితో ఎన్నడూ మాట్లాడి యెరుగను. ఇంట్లో కొన్నాళ్ళు పూజలు కూడా మాని వేశాను. పర్వదినాలలో గోదావరి స్నానం కూడ మాని వేశాను. అయితే ఇట్లాంటి వెన్ని చేసినా మా వారి ప్రీతి కొరకే కాని, నాకు సహజంగా ఆ పనులలో అనుకూల భావం ఉండేది కాదు. సుమారు అరవై సంవత్సరాల తరువాత చిన్ననాటి జీవితాన్ని తలంచుకుంటే నాకేమీ సిగ్గుపడవలసిన సమయము కనబడడం లేదు. ఎందుకంటే ఆ రోజులలో ఉండే సనాతనా భావప్రభావం అది. ఒకప్పుడు శ్రీరామానుజాచార్యుల సహధర్మచారిణి తంజమాంబ కూడా శ్రీరామానుజాచార్యుల సంస్కార ప్రియత్వానికి

నాళం సుశీలమ్మ

సహకరించలేదని విన్నపుడు నా ప్రవర్తన ఎడల సాను భూతి కలిగిందే తప్ప ఏమీ సిగ్గుపడవలసినదిగా తోచడం లేదు.

తరువాత జందెం తీసేసినందుకు, సర్వమత భోజనాలు ఏర్పాటు చేయించి అందులో తిన్నందుకు మావాళ్ళు మా వారిని వారితోపాటు నన్నూ వెలివేశారు. రాజమండ్రిలో మమ్ములను చాలా పాట్లు పెట్టినారు. మా పుట్టింటి వారు యేలూరు తీసికొని వెళ్ళి మా వారికి వూళ్లో పెద్దలందరి చేత ఈ సహకారోద్యమం మానమని ఎంతో చెప్పించారు. ఎంతో డబ్బు ఆశచూపారు. అయినా వారు తమ దీక్షను వదలిపెట్ట లేదు. ఇంతా, దృఢదీక్షా బలమంతా, శ్రీ వీరేశ లింగం పంతులుగారి శిక్షణే. ఈ వెలి బాధకు మాకంటే కూడ శ్రీ దేశరాజు పెద్దబాపయ్యగారు ఎక్కువ కష్టాలు పడ్డారు. అయినా ఆ కాలంలో శ్రీ పంతులుగారి శిష్యులైన వారు ఎవ్వరూ కూడా కష్టాలకు జంకేవారు కారు. పైగా చాలా ఆనందంతో స్వీకరించే వారు.

తరువాత వచ్చిన, గాంధీగారి ఉద్యమ ప్రబోధాలతో యావద్భారత దేశానికీ కనువిప్పు కల్గింది. పంతులుగారి నిరంతర ప్రబోధంవలన అప్పటికే కొంచెం కొంచెంగా సంఘసేవకు సుముఖత కనపరుస్తూ ఉన్న మా బోటివారికి తరువాత ధైర్యసాహసాలు కల్గడం, మేమంతా దేశహిత కరములైన ఉద్యమాలలో పాల్గొనడం జరిగింది. మాబోటి వారిలోని ముఖ్యంగా నా లోని యీ క్రమచైత్యానికి, ఆనాడు ఇల్లు విడిచి బయటికి రాలేకపోయిన నేను ఈనాడు ఆంధ్రమహిళా గాన సభ అనే పేరుతో ఒక సంస్థను నడపకల్గుతూ ఉన్నానంటే ఈ సేవా కార్య క్రమాలకు శ్రీ వీరేశలింగంగారి నిరంతర ప్రబోధమే కారణమని నిస్సందేహముగా చెప్పగలను.

మూగ జీవాలకు ప్రాణముపోసి నేటి జాతీయ వికాస మునకు నాందిగీతం పాడిన యుగ పురుషుడు, మహ నీయుడు, శ్రీ వీరేశలింగం పంతులుగారికి నా కృతజ్ఞతా వందనాలు.

---

"ఏదైన నొక కార్యము చేయుద మను సంకల్పము నా మనస్సునం దుదయించెనా అది కార్యరూపము దాల్చు వరకును నాకు దోచదు. సంకల్పమునకు సత్కా ర్యారంభమునకును వ్యవధానము గూడ నుండదు."

— వీరేశలింగం

# నాటి విదుషీమణులు

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

నేను 'ఆంధ్ర కవయిత్రులు' గ్రంథరచనకు పూనుకొన్నపుడు కవయిత్రుల గ్రంథాల నన్వేషించడంలో 'భారతి'లోని అకారాది వాఙ్మయసూచిక నుండి చాలామంది కవయిత్రులపేర్లు సేకరించగలిగాను. పేర్లయితే సేకరించాను. కాని వారి గ్రంథాలుమాత్రం చాలావఱకు నాకు లభించలేదు. 19 వ శతాబ్దపు అంత్యభాగంలోనూ, 20 వ శతాబ్దపు మొదటి భాగంలోనూ వెల్వడిన గ్రంథాలు పభై, అరవై ఉన్నప్పటికీ నేను ఆ గ్రంథాలను సంపాదించలేకపోయానే అనే బాధతో, నేను గ్రంథ రచన ప్రారంభింపదలచుకొని రాజమండ్రి వెళ్ళాను. అక్కడకు వెళ్లగానే మానాయనగారు కీ. శే. నాళం కృష్ణారావుగారు "అమ్మాయీ, ఇదిగో యీ యీ గ్రంథాలు నీకు దొరికాయా?" అంటూ ఒక ఇరవై ముప్పై గ్రంథాల పేర్లు చెప్పారు. అవన్నీకూడా నేను దొరకవని నిస్పృహ పడిన 'భారతి' వాఙ్మయ సూచికలోనివే. "లేదండీ, అవి నాకు దొఱకలేదు" అని అనేటప్పటికి "ఔను. అవి యెక్కడా దొఱకవు. అదంతా శ్రీ వీరేశలింగంగారి ప్రబోధ మూలంగా స్త్రీలలో కలిగిన చైతన్య ఫలితంగా అవతరించిన మహిళా వాఙ్మయం, నేను ఆ వాఙ్మయాన్నంతా మన గౌతమీ గ్రంథాలయంలో జాగ్రత్త చేశాను." అన్నారు. అప్పుడు నేను గౌతమీ గ్రంథాలయానికి (ఇది 1898 లో శ్రీ వీరేశలింగంగారి పేరుమీదుగా 'శ్రీ వీరేశలింగ గ్రంథ భాండాగారం' అనే పేరుతో మానాన్నగారిచేత స్థాపింపబడినది.) వెళ్లి అక్కడ దొఱకిన కొన్ని గ్రంథాలను తెచ్చుకోగలిగాను.

అవి తెచ్చి చదువగానే ఆ సారస్వతం మీద నాకు అపూర్వ గౌరవం కల్గింది. దీనికి కారణమేమంటే ఆ సాహిత్యమంతాకూడా చాలావఱకూ మహిళా విద్యా విజ్ఞాన ప్రబోధాత్మకంగా ఉండడమే.

అసలు ఆంధ్ర వాఙ్మయములోనే 19 వ శతాబ్దం క్షీణయుగంగా పేర్కొనబడినది. అంధయుగమనే ఈ బిరుదు స్త్రీ సారస్వతంపట్లకూడా అన్వర్థమైనదే అని వేరే చెప్పనక్కరలేదు.

ఈ సారస్వతాంధకారాన్ని విరియింపజేసిన తొలి క్రాంతి శ్రీ వీరేశలింగం పంతులు, శ్రీ గురజాడ అప్పారావుగార్లే. అందులోనూ ఈ ఇరవయ్యవ శతాబ్దంలో ఇప్పుడు ప్రచారంలో ఉన్న సమస్త సాహిత్య ప్రక్రియలకూ ప్రప్రథమముగా సరిక్రొత్త పద్ధతులతో ఆకర్షణీయములైన విన్యాసములతో ప్రారంభ పూజ చేసి ఆంధ్రభారతికి అపూర్వాలంకారములను సమర్పించిన తొలి పూజారి శ్రీ వీరేశలింగం పంతులుగారే.

అంతేకాక ఆ మహాపురుషుడు చేసిన విశిష్ట కార్యాలు స్త్రీ జనోద్ధరణము, సంఘ సంస్కారము అనేవి. ఆయన సంఘ సంస్కార సేవలోకూడా బాల్యవివాహ నిషేధ, బాల్యవితంతు వివాహాది స్త్రీ జనోద్ధరణ కార్యాలు ఎక్కువగా పాలుతీసుకొన్నాయి అనే విషయం అందఱెరిగినదే. ఇక వారు కావించిన స్త్రీ విద్యా ప్రచారరూపమైన మహోద్ధరణ మనేది చాలా మహాకార్యం అనడాని కేమీ సందేహంలేదు.

శ్రీ పంతులుగారి కాలంలో స్త్రీలకు విద్య అనేది చాలా నిషేధం అనే అంశం కూడా అందరకూ

తెలిసినదే. సంఘంలో సమాన ప్రతిపత్తితో కూడిన భాగస్వాములైన స్త్రీపురుషులలో స్త్రీ విద్యావిహీనురాలై ఉండుటచేతను, స్త్రీలకు సరియైన విజ్ఞానాన్నీ, ఆస్తిక్య భావాన్నీ ప్రసాదింపగల ప్రోత్సాహం వాఙ్మయంలో తక్కువగా ఉండుటచేతను సంఘమంతా పతనావస్థలో ఉన్నదనే విషయం శ్రీ పంతులుగారు గ్రహించి, గ్రహించడంతో ఊరుకోక ఆ అవిద్యాంధకారాన్ని పటాపంచలు చేసి, స్త్రీసంఘంలో విద్యాభివృద్ధీ, ఆస్తిక్య భావాభిరతీ కల్గించడానికి కంకణం కట్టి నిర్మాణాత్మకంగా చర్యలు జరిపారు. నా దృష్టిలో పంతులుగారి అన్ని సంస్కరణలకంటె కూడా ఈసంస్కరణమే ఎక్కువప్రయోజనకరమైనది.

ఆస్తిక్య భావ ప్రబోధానికి వారు స్త్రీలకు వేరే ప్రార్థన సమాజాన్ని నెలకొల్పి స్త్రీలలో దైవ చింతనను, ప్రార్థనా శీలాన్నీ పెంపొందింప జేయడానికి కృషి చేశారు.

ఇక స్త్రీ విద్యా ప్రబోధ కార్యక్రమంలో పంతులుగారు చేసిన కృషి మూడు విధములుగా కనబడుతూ ఉన్నది. విదుషీమణులచే గ్రంథములు వ్రాయించుటకు ప్రోత్సాహం ఇయ్యడమనేది—ఆ కార్యక్రమాల్లో ఒక భాగం.

ఈ రచనోద్యోగ ప్రోత్సాహానికి అప్పట్లో ఒక నిర్ణీతపథకంలో కొన్ని కార్యక్రమాలు నిర్వహించబడినవి. వాటినిగూర్చి కొద్దిగా ఇక్కడ పేర్కొనడం అప్రస్తుతం కాబోదు.

శ్రీ పంతులుగారి స్త్రీ విద్యా విధానాన్ని అందుకొని వారి శిష్యులు కొందఱు కొన్ని కార్యక్రమాలతో వారి ఆశయాలకు రూపులుదిద్దారు. అందులో అప్పట్లో నరసాపురంలో శ్రీ బుద్ధరాజు రామచంద్రరావుగారిచే ప్రారంభింపబడి నిర్వహింపబడిన స్త్రీల వ్యాసరచనా పోటీపరీక్షలు, నాళము కృష్ణరావు గారిచే వారి వీరేశలింగ గ్రంథ భాండాగారపక్షముగా నిర్వహింపబడిన గ్రంథ పఠన, వ్యాసరచనపోటీలు మొదలైన సేవా కార్యక్రమాలు చేరి ఉన్నవి. ఇక వారే స్వయముగా ఇంటివద్ద స్త్రీ వయోజనపాఠశాల పెట్టించి, పత్రికలలో ప్రబోధంచేసి 'జనానా' అనే పత్రికను స్థాపించి నిర్వహించిన సేవ అపారం.

ఈ విధంగా నిరంతర దీక్షతో స్త్రీ సంఘాన్నుద్దేశించి నిర్వహింపబడిన ఆస్తిక్య ప్రచారమూ, అవిద్యానిర్మూలనా ప్రచారమూ అప్పుడు సృష్టింపబడిన స్త్రీ వాఙ్మయంలో స్పష్టంగా పేర్కొనబడి ఉండడంచేతనే నాకు ఆనాటి స్త్రీల సారస్వతంపై అపూర్వగౌరవం కల్గిందని వ్రాశాను.

శ్రీ పంతులుగారి శిష్యగణంలో స్త్రీలలో ముఖ్యురాలు వారి సతీమణి శ్రీ రాజ్యలక్ష్మమ్మగారే. శ్రీ పంతులుగారు తన స్త్రీ విద్యా ప్రచారాన్ని ముందు తన భార్యదగ్గఱనుండే ప్రారంభించడం గమనింపదగింది. ఆమె భర్తగారికి అన్ని ఉద్యమాలలోనూ కుడిభుజంవలె సహకరించి సహాయంచేసి నిజంగా అర్ధాంగి, భారతసతి అనిపించుకొన్నారు. వారి జనానా పాఠశాలకు ఆమెయే మొదటి ఉపాధ్యాయురాలు. స్త్రీ ప్రార్థనా సమాజానికి ఆమెయే ప్రథమ నిర్వాహకురాలు. ఇట్లాజరిగిన నిరంతర విద్యా సాహచర్యబలంతో ఆమె బ్రహ్మసమాజ పద్ధతిని ప్రార్థనా కీర్తనలను రచించగల్గినారు.

వారి రచనలలో నాకు లభించిన మంగళహారతి:—

ప॥ మంగళము శ్రీ సృష్టిరక్షకా నీకు జయ
మంగళము శ్రీ భక్తపాలకా।

చ॥ తల్లితండ్రివంచు నమ్మితి దేవాదిదేవ
తనయను నను రక్షింప వేడితి
ఉల్లమందు నీదు ప్రేమ నెన్న తరముగాదు
చల్లని కృప నాపై చల్లవె కరుణాకటాక్ష ॥మం॥

చ॥ కనికర మెద నుంచవేల
కరుణను నను వీక్షింపవేల
ప్రణయమునను కందుకూరి
రాజ్యలక్ష్మి నేలవేల? ॥మం॥

పూర్వపద్ధతిగా భగవంతుని 'అచ్యుత, గోవింద' అను నామములతో సంబోధించకుండుటయు 'సృష్టి పాలకా' ఇత్యాది గుణవాచకములతో సంబోధించుటయు, "తనయను రక్షింప వేడితి" అనుచోట పరమేశ్వరునకు మనకునుగల పితృ, పుత్ర, పుత్రికా భావమును వాచ్యముగా జేసి వర్ణించుటయు ఆనాటి ఏకేశ్వర ప్రార్థనా గేయములలోని ప్రధాన పద్ధతులని ఆ సాహిత్యమును పరిశీలించినవారికి తెల్లము కాగలదు.

తరువాత పంతులుగారి అంతేవాసినియైన శ్రీ కొటికలపూడి సీతమ్మగారి రచన లీ యుగంలో చాలా ప్రధానములైనవి. ఆమెకూడా పంతులుగారి జనానా పాఠశాలలో ఒక గౌరవోపాధ్యాయిని, స్త్రీ ప్రార్థనా సమాజానికి ఒక నిర్వాహకురాలు. శ్రీ పంతులుగారి స్త్రీ విద్యాప్రచారకాండలో శ్రీ సీతమ్మగారికి ప్రధానపాత్ర ఉన్నది.

ఆమె 'అహల్యాబాయి, సాధురక్ష శతకము, పద్య భగవద్గీత, భక్తి మార్గములు, లేడీ జేన్‌గ్రే, సతీధర్మములు మున్నగు కావ్యములను రచించినారు.

అహల్యాబాయి కావ్యప్రారంభమున:—

"స్త్రీలు విద్యనేర్వఁ జెడిపోదు రనుమాట।
కల్ల యనుచు దోప నెల్లఅకును।
విశదపఱుతు నొక్క విద్యావతి చరిత్ర।
సంగ్రహముగాగ చదువుడయ్య।

అని స్పష్టముగా ఆనాటి స్త్రీ విద్యా పరాఙ్ముఖత్వమును వెల్లడించి యుండిరి.

వీరు తన 'సాధురక్ష శతకము'న ఆత్మ ప్రబోధ రూపముగా శీలనిర్మాణము సంఘమునకెంత ముఖ్యమో నిరూపించినారు.

"కోపము మెండు నాకెపుడు కుచ్ఛితబుద్ధి
యఖండ వృత్తితోఁ
గాపురముండు నామదిని, గల్మష మింక నశింప
దయ్యో నా
పాపపుఁ జిత్తవృత్తులను భస్మము చేయగదయ్య
వేగ సం
తాపహరుండ! భక్తవరదా! శరణాగత!
సాధురక్షకా॥"

ఈ శతకమంతా ఇంత ఉజ్జ్వలముగానుండి ఆస్తిక్య చింతనకు, ఆ ప్రబోధమునకు మూలకందముగా విరాజిల్లినది.

1913 వ సంవత్సరమున బాపట్లలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభతోబాటుగా జరుపబడిన మహిళా సభకు అధ్యక్షత వహించే మహాభాగ్యం శ్రీ వీరేశలింగం పంతులుగారి ప్రముఖ శిష్యయైన శ్రీ కొటికలపూడి సీతమ్మగారికి లభించింది.

తరువాత ఆంధ్ర వాఙ్మయానికి మిక్కిలి గొప్ప సేవచేసి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ రచనకు ప్రప్రథమంగా శ్రీకారంచుట్టిన శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి సోదరి శ్రీ భండారు అచ్చమాంబగారు 'అబలా సచ్చరిత్ర రత్నమాల' అనే వచన కావ్యాన్ని రచించారు. అందులో–రుద్రమ్మ, అహల్యాబాయి, ఆనందబాయి జోషి, తరిగొండ వేంకమాంబ, నాబీ మొదలైన ప్రముఖ నారీ రత్నాల చరిత్రలను ప్రబోధాత్మకంగా ప్రౌఢరమణీయమైన శైలిలో వర్ణించారు. తరువాత సుప్రసిద్ధులైన శ్రీ దాసు శ్రీరాములుగారి తనయ శ్రీ వేమూరి శారదాంబగారి రచనాపాటవం పేర్కొనదగినది. ఈమె గొప్ప కవయిత్రి. 1881 లో

జన్మించి 1899 లో పుగానే మరణమందినారు. ఈ చిన్న వయస్సునందే 'నాగ్నజితీ స్వయంవరము, మాధవ శతకము' అను రెండు గొప్ప రచనలు చేసినారు. ఈమె తన పదకొండవయేటనే వ్రాసిన నాగ్నజితీ స్వయంవరములోని రచనా సౌమనస్యము శైలీ ప్రౌఢత్వమును గాంచుడు.

"వీరులు నీతిచారులు, గభీరులు, ధీరులు, నర్థి
కోటి మం
దారులు, ఖడ్గధారులును, ధర్మ విచారులు,
వజ్రహారులున్
శూరులు, ప్రేయసీ హృదయ చోరులు, నింక
గడు న్మనోహ రా
కారులు, తత్పురంబునను గల్గిన రాజకుమారు
లెంతయున్॥

ఇక మాధవశతకమునందలి—

"గొల్లది చల్లవాడుకిడ గోడల గీతలు గీసి లెక్కలన్
దెల్లముసేయు, జాకలిది తెచ్చిన బట్టలవైచు
లెక్కకున్
బల్లవపాణి తాడునకు బాగుగవైచును, విప్పు,
ముళ్ళు, దా
సల్లలితంబుగా చదువజాలని చిన్నియ లెన్న
మాధవా॥

అనే పద్యాన్ని గమనించినచో ఆనాడు చదువురాని స్త్రీలు పాలుపద్దు గుర్తుంచుకోవడానికీ, చాకలి బట్టలు లెక్క తేల్చుకోవడానికి పడిన పాట్లు మనకు ఎంతో విచారాన్నే కాక, జాలినికూడా కల్గిస్తాయి

మిక్కిలి రమణీయమైన రచనాశక్తి కల యీ మె దీర్ఘాయుష్మతియై మనగల్గినచో ఇంకా ఎన్నో చక్కని కావ్యాలు వ్రాసి ఆంధ్రుల సాహిత్యసంపదను ఇంకా ప్రతిభావంతంగా దిద్దగలిగి ఉండేవారు. ఆ భాగ్యానికి ఆంధ్రులు నోచుకోలేదు.

తరువాత బుర్రా సూరమాంబగారి రచనోద్యోగం కూడా ప్రశంసింపదగినదే. ఆమె సావిత్రీ విజయమను కావ్యాన్ని, ప్రహ్లాద నాటకమును, ఇంకా యెన్నో శతకాలను చేశారు.

పిఠాపురం మహారాజుగారైన శ్రీసూర్యారాయల వారి ధర్మపత్ని శ్రీ రాణీ చిన్నమాంబగారు తాను స్వయముగా కొన్ని గ్రంథములను వ్రాయుటయేగాక శ్రీ కోటికలపూడి సీతమ్మ, శ్రీ జూలూరి తులసమ్మ మొదలగు విదుషీమణులతో కొలువుదీరి సమస్యలను పూరించుట, కావ్యరచనా పఠనా పూర్వకమైన సాహిత్య గోష్ఠులను జరుపుట మున్నగు విద్యా వినోద కార్యక్రమములు నిర్వహించేవారట! వారి రచన లేమైనవో తెలియుటలేదు.

శ్రీ జూలూరి తులసమ్మగారి రచనలైన పద్మావతీ విజయము, సుమతి చరిత్ర, రాణీ భవాని, భారతేతి హాసములు, ధర్మవిజయము, గులేబకావళి నాటకము, ఉపనిషత్స్త్రీలు మొదలైనవి చాలా ప్రసిద్ధములు. ఇందులో వీరి గులేబకావళి రంగస్థల ప్రయోగ ప్రసిద్ధి కూడా పొంది ఉండడం గమనార్హం. మోతీలాలు నిర్యాణవార్త విన్నపుడు వీరు హిందూసుందరి పత్రికలో ప్రకటించిన పద్యములు బాగున్నవి ఇట్లాకాలమునాటి స్త్రీలు జాతీయ ప్రబోధ రచనలను కూడా చేసియుండిరి. వీరి రచనలు చాలావరకు హిందూసుందరిలో ప్రచురితములైనవి

శ్రీ వెన్నెలగంటి హనుమాయమ్మగారి సంస్కృత కావ్యరచన విశిష్టమైనది. శ్రీ శంకర భగవత్పాద పూజావిధి, శ్రీ శంకర భగవత్పాద సహస్ర నామావళి మొదలగు వీరి గ్రంథములు మిక్కిలి ప్రసిద్ధములు శ్రీ జగద్గురు శంకరాచార్యులవారికి ప్రప్రథమముగా సహస్రనామములు వ్రాసిన ఖ్యాతి వీరికే దక్కినది.

వీరి గ్రంథములకు ఉత్తర దేశమున చాలా గొప్ప ఖ్యాతియు, ప్రచారమును కలవు.

సుప్రసిద్ధ భాషాసేవకులైన సెట్టి లక్ష్మీనరసింహం గారి సోదరి శ్రీ సీరము సుభద్రయాంబగారు గొప్ప విద్వత్కవయిత్రి. ఆమె నవలలు, శతకములు, వచన కావ్యములు, నాటకములు, కావ్యములు మొత్తము పది గ్రంథములు వ్రాసియున్నారు. వీరి సుభద్రా రామాయణము మహాకావ్యము :— 18158

ఎట్టెటుతెల్పుమా సఖుడ! ఎవ్వరితో నని
సంభవించె? నా
చిట్టి యనుంగుతమ్మునకు? జెప్పు! మరాతుల
మంద జేసి, భూ
మట్టమొనర్తు, భూపజనముం, దగ, నాశ
మొనర్తు జూడ, ని
ప్పట్టున నస్మ దస్త్రు బలపాటవముల్ గని
మెచ్చ నిర్జరుల్"

అనే పద్యంలో లవుని భ్రాతృప్రేమ, యుద్ధమునందలి సహజాభిలాష, ఉబలాటము ఎంతోచక్కగా చిత్రించారు. వీరి జాగిలము అనే నవలకు బహూకరణము కూడా లభించినది.

సనాతన శిరోమణియై, వీరేశలింగము పంతులు గారి సంఘ సంస్కారోద్యమమునకు వ్యతిరేక పక్షమువారైన శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి శిష్యురాలైన శ్రీమతి పులుగుర్త లక్ష్మీ నరసమాంబ గారు గొప్ప కవయిత్రి. వీరుకూడా ఆనాటి సాహిత్య ప్రక్రియ లన్నింటిలో రచనలు చేశారు. వామనపురాణ వచనాంధ్రీకరణ మం దొకటి. ఆనాడు సావిత్రి అను తొలి స్త్రీ మాసపత్రికను రచించిన గౌరవ మీమెదే. వీరు కాకినాడలో ప్రప్రథమముగా ' స్త్రీ విద్యార్థినీ సమాజము ' ను స్థాపించి నిర్వహించినారు. 'స్త్రీల మంగళహారతి శతకము ' అను వీరి మంగళహారతుల రచన మిక్కిలి ఉత్కృష్టమైనది.

వీరు కొన్నాళ్లు నిర్వహించిన తర్వాత బాలాంత్రపు శేషమ్మగారు ఆ సమాజాన్ని నడపడమేగాక 'హిందూసుందరి మాసపత్రిక' ను కూడా నడిపినారు.

ఆసమయమునందే వింజమూరి లక్ష్మీనరసింహకవి గారి ధర్మపత్నియు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి సోదరియునైన శ్రీ వింజమూరి వెంకటరత్నమ్మ గారు ' అనసూయ ' పత్రికను నడపుటయేకాక కొన్ని రచనలుకూడా చేసినారు.

బాలాంత్రపు శేషమ్మగారి కుమార్తె కాళ్ళకూరి మహాలక్ష్మిసుందరి ఆంధ్రాంగ్లములలో కవిత్వముచేసిన విదుషి. ఈమె ఎమ్. ఏ. కూడా.

చాట్రాతి లక్ష్మీనరసమ్మగారు ఝాన్సీచరిత్ర మొదలైన కావ్యాలు వ్రాయడమేకాక బాపట్లలో ఆంధ్రమహాసభా ప్రబోధ ఫలితముగా శ్రీ చోరగుడి సీతమ్మ, చంద్రమౌళి, అన్నపూర్ణమ్మగార్లు స్థాపించిన మహిళా సమాజమునందు ఉపాధ్యాయినిగా నుండి సేవచేసినారు. చోరగుడి సీతమ్మగారును రచయిత్రియే.

ఈ కాలమున పైవిధముగా జరిగిన రచనలన్నీ ఒకపెట్టు, శ్రీ అవధూత జ్ఞానమాంబగారి రచన లొకపెట్టు అనవచ్చును. నిరంతర భగవత్సంకీర్తనా తన్మయురాలైన జ్ఞానాంబగారి రచనలైన ' దేవుడు, విజ్ఞానామృతము, కాశీప్రసాదిని, రంగావధూత, సత్ప్రభూ శతకము, గార్గి, మొదలైన రచనలు చేసియున్నారు. ఆస్తిక్యభావ ప్రచారమున అన్నియు అన్నివాణీశిరోరత్నములే. శ్రీ పంతులుగారి ఆస్తిక మత సాంప్రదాయములు వీరి రచ[illegible]లా కనుపించును.

ఈటుకూరి లక్ష్మీకాన్తమ్మ

" అక్కరో దేవదేవు డెవ డాత డెక్కడుండు ?
చేత లెట్టి వాకార మేరీతి దమ్మ "

అని తనకుతానే ప్రశ్నించుకొని యెన్నియోవిధముల చర్చించి తుదకిట్లు వ్రాసిరి :—

" ప్రేమ కేమైన రూపంబు బెట్టినామె ? ప్రేమ
నెఱుగనివార లీ పృథివిఁగలరె ?
కన్నులకు ప్రేమయెట్టిదో కానరాదు
కుక్క కూడను ప్రేమను గుఱుతువట్టు
ప్రేమధాముని దేవు దర్శింపలేదె ? "

అని తానుపొందిన పరమాత్మానుభవమును మనకును కల్గింపజేసినారు.

తరువాత అనేకములగు నవలలు రచించి గోపిసెట్టి లక్ష్మీనరసమ్మ, శ్రీనివాసమ్మ, చిల్లరిగె రమణమ్మ, కృపాబాయి సత్యనాథన్, కళ్లేపల్లి వెంకటరమణమ్మ మొదలైనవారును, అధ్యాత్మ రామాయణము ద్విపదగా రచించిన మామిడన్న సుభద్రమ్మగారును సుస్మరణీయలు. ఇందు కృపాబాయి సత్యనాథనుగారు సత్యనాథన్ అను కలెక్టరుగారి సతీమణి. ఆమె 'విద్యావతి' అనే పత్రికనుకూడా నడిపియున్నారు.

డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు ఆనాటి ప్రబోధ ఫలితముగా చేసుకొన్న రజస్వలానంతర వివాహాన్ని అభినందిస్తూ గూడపాటి లక్ష్మీనరసమ్మగారు 'స్వయంవరము' అనే ఏకాంకిక వ్రాశారు. ఇంకను శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి వంశస్థులైన కొందఱు మహిళామతల్లులు, కావ్యప్రణేత్రులు కొందఱు కనిపించుచున్నారు. కందార్థములువ్రాసిన వారొక రున్నారు. ఇంకను ఆనాటి అనేకవిధములైన రచనాప్రక్రియలలో ఈ యుగమున మహత్తర కృషిసల్పిన మహిళామణులు ఎందరో ఉన్నారు. వీరిలో భారతిపట్టిక ప్రకారమే నాకు దొఱకనివే ఇరవై, ముప్పైవఱకు ఉన్నవి. వారందఱుకూడా ఈనాటి వికాసపూర్ణములైన మహిళారచనలకు దారిచూపిన దీపసుందరులే. వారందఱకు ఈ యుగమువారు ఋణపడియున్నారనుమాటమాత్రము తథ్యము. ★

---

"చీకటితో పడిపోతోంటే
ఆకటితో చనిపోతోంటే
దూరపు వెలుగు తెచ్చిన దెవరో !
తీరని యాకలి తీర్చినదెవరో !"

శ్రీ విశ్వనాథ

# ప్రణతి

శ్రీ పి. గణపతిశాస్త్రి

వీరేశలింగా ! జోహారు !
వీరాధి వీరా ! జోహారు !
విపులాంధ్రావని మేల్కొలిపిన
ఓ కవీ ! మహాత్మా ! జోహారు !

నీ లేఖిని వజ్రాయుధమై దుర్నీతి
భస్మముగ నొనరింప,
నింగి వెలుగు మా నేల ధగ ధగా
నిండించిన ఓ ప్రభారూప !

వీరేశలింగా ! జోహారు !
వీరాధి వీరా ! జోహారు !

అనద లార్తితో పలవించుటకే
అడలిన ఆ నాడు,
కన నేరని శిలకై మానవ హృది
బలియగు నా నాడు,

త్రినేత్ర సమ దృష్టి ! నీ హుంకృతి
దివ్య వాణియై మొరసె నోహో !
దీన దయామూర్తి ! నీ యాకృతి
త్రిశూలాగ్రమై మెరసె నోహో !

మత దురహంకృత మాన్యమ్మై, పెర
మానిసి హింసించే నేడు !
సతత వర్ణకుల సంక్షోభము, మము
పతితుల నొనరించే నేడు !

ధృతి నిశితము, ధృవ తారకమై, భవ
దీయమూర్తి మెరయును గాక !
శత శతాబ్దముల కయినా మాకై
గతి దర్శక మగు గాక !

★

# నివాళులు

శ్రీ "అడ్సుమిల్లి"

సంస్కరణకు కందుకూరి
వ్యాఖ్యానం బాయెను

ఆధునిక యుగాని కతను
వైతాళికు డాయెను.

రాణ్మహేంద్రవరము నందు
వేగు జుక్క బుట్టెను

ధాత్రికి దశదిశలకు నది
వెలుగుల నందించెను.

పండితమ్మన్యులు కొంద
రాయనను శంకించిరి

అభివృద్ధి నిరోధకు లంద
రాయనను దూషించిరి

గర్జించెను కవికేసరి సం
స్కరణ శంఖ మూదెను

భళిర ! పతితల యనాథల సం
కెళ్ళు త్రెంచ మనియెను.

నవ యువ భావాలకు నా
స్వాగత మని చాటెను

మానవతకు విలువ నిచ్చి
క్రాంతిని నినదించెను.

పావన గౌతమీ జలధు
లెగసి పాడె ప్రగతిని

పరవశమున ప్రకృతియె
నర్తించె కళాగీతులు.

ఓ యన నోహో యనియెను
ఆంధ్రావని యొక్కటయి

కందుకూరి ప్రవక్త కిక
నందించె నివాళులు !

# విరామమెరుగని దినచర్య

పాలపర్తి నరసింహం

శ్రీ వీరేశలింగ పండితుడు ఉద్యోగమును విరమించుకొన్నాడు. పింఛను పుచ్చుకొన్నాడు. స్వస్థలము చేరినాడు. ఆనందారామములో నివాసము. డబ్బుకు లోపము లేదు. సుఖముగా శాంతముగా కాలక్షేపము చేయవచ్చు. కాని అట్టి జీవితము వీరేశలింగమునకు గిట్టదు. ఆయనకు కావలసినది సేవ, ముమ్మాటికి సేవ. పనిలేకున్న ఆయనకు నిద్ర పట్టదు. జాగ్రదావస్థలో ఉన్నంత పర్యంతం పనే; ఎల్లప్పుడూ పనే.

అది శీతకాలము. నాల్గు గంటలు టంగ్ టంగ్ అని కొట్టింది గడియారం. ప్రక్కమీదినుండి లేచినాడు వీరేశలింగ యోగి. భార్యను మేలుకొల్పినాడు. ఆ వృద్ధదంపతులు ఏకహృదయముతో ఈశ్వరుని ప్రార్థించినారు. ఏమని? భోగభాగ్యము లిమ్మనికాదు! దీర్ఘాయురారోగ్యము లిమ్మని గూడ కాదు. పేరుప్రతిష్ఠ లిమ్మని కాదు. "స్వామీ నిరతము నీ సేవ చేసి మేము ధన్యులమగునట్లు కటాక్షింపు'' మని.

వీరేశలింగం మేడమీదనుండి క్రిందికి వచ్చినాడు. చెట్లకు నీరెత్తుచున్న మోత వినవస్తున్నది.

వీ : రామయ్యా! అన్ని చెట్లకు నీరందు చున్నదా? మొన్న కట్టించిన తూములు చక్కగా పనిచేస్తున్నవా? తగినంత నీరు లేకున్న మొక్కలు చచ్చిపోతవి సుమా? లేతమొక్కలు చిన్నబిడ్డల వంటివి.

రా : అవునండీ బాబయ్యగారు. తూములు బాగానే ఉన్నాయి. అన్ని మొక్కలకు నీరు బాగానే అందుతున్నది. కాయలు చూచారా ఏలాగున్న వో. ఇది తొలికాపు. మొక్కలను జాగ్రత్తగా చూడాలి అని నాకు తమరు చెప్పాలా బాబయ్యగారూ! ప్రాణంతో సమానంగా చూచుకొంటున్నాను మొక్కల్ని.

వీ : రామస్వామీ (బండివాడు)! నీ వేమి చేస్తున్నావు?

రా : ఎద్దుకు గడ్డివేసి వస్తూన్నా బాబూ!

వీ : శరణాలయంవైపు మన మొకసారి వెళ్ళుదాం రా. మనం జాగ్రత్తగా కనిపెడుతూ ఉండకపోతే కొంచెకుంక లేమైనా అల్లరి చేయవచ్చు.

రా : అల్లరే బొత్తిగా! తమరంటే ఈ జాంపేట వాళ్ళందరికి హడల్. ఎంతో భయం భక్తీ కూడా.

వీ . సుబ్బమ్మగారూ! లేచారా? పిల్లలు చదువుతున్నట్లు వినబడదేం?

సు : రాత్రి పదిగంటలదాకా చదువుకొని పరున్నారు. ఈ రోజు ఆదివారం గనుక తెల్లవారుజామున లేవడానికి బద్ధకించారు.

వీ : వాళ్ళ మొఖంగాదూ! ఆదివార మేమిటి, శనివార మేమిటి? తెల్లవారుజామున లేవడం అలవాటు చేసుకోవాలి. 5 గంటలు దాటింది కదా! ఇంకా నిద్రేమిటి? లేపండి. పూర్వమెట్లున్నా శరణాలయమునకు వచ్చిన తరువాత బాలికలు మంచి అలవాట్లు నేర్చుకోవాలి. సదభ్యాసాలు పట్టువడితే ఉత్తమగృహిణులుగా వారు తయారవుతారు. లేచి ప్రార్థనకు సిద్ధంకమ్మనండి. సరిగా 7 గంటలకు అందరిని కళ్యాణమండపానికి తీసికొనిరండి.

వీ : కమలమ్మా! "నిను సేవింపని పుట్టువ దేనికి నిఖిల జగదధీశా! ఈశా" అనే పాటను పాడు. నీవు ప్రారంభిస్తే తక్కినవాళ్ళు అందుకుంటారు.

క : బాబుగారూ! ఈ పాటతో ఆపమంటారా మరేదైనా పాడమంటారా?

వీ : వద్దు. నేను ప్రార్థించి నాలుగుముక్కలు చెబుతాను. నిశ్చల చిత్తముతో ప్రార్థనలో పాల్గొనండి.

"బిడ్డలారా ! ఇప్పుడు పాడిన పాటను విన్నారుగదా ? భావాన్ని బాగా గ్రహించండి. ఈశ్వరుని సేవింపక పోయినచో మన జన్మము వ్యర్థమన్న సంగతి మీరు గుర్తించండి. తోడి మానవులకు మన మనేక విధముల సేవ చేయవచ్చు. భగవంతుడు మనకు కరచరణాద్యవయవములను బుద్ధ్యాది శక్తులను మానవసేవకొరకే ప్రసాదించాడని గ్రహించండి. కేవలము స్వార్థ పరాయణులమై కాలము గడపడం ఈశ్వరోద్దేశ్యము కాదని తెలుసుకోండి; సేవయే జీవిత పరమార్థం. కమలమ్మా ! మంగళగీతం పాడు."

## సత్యవాదిని పత్రిక

వీ : సత్యనారాయణా ! ఏమి విశేషము ?

స : నాల్గుపేజీలు కొట్టినారు. నిన్న యిచ్చిన ప్రూఫూ మరి కొంత మ్యాటరు వెంటనే తీసుకొని రమ్మన్నారు.

వీ : ఇవిగో దిద్దిన ప్రూఫులు. ఇదిగో కొత్త మ్యాటరు. ఇంక ఏమైన కొరవడితే నాకు తెలియజేస్తే మ్యాటరు పంపుతాను. రేపేగా సత్యవాదిని వెలువడవలసిన దినం; ఒక్క తప్పు పడగూడదు సుమా! సాయంకాలం నేను అట్లా ప్రెస్ ఆఫీసుకు వస్తాను. వెళ్ళు, త్వరగావెళ్ళు, సైకిలు ఉన్నదిగదా.

## గ్రంథములు

వీ : వెంకట్రావు ! పుస్తకం ఎంతవర కయింది ?

వెం : నిన్న దిగిన ఫారంతో పది ఫారాలు అయినట్లు. కొత్తమ్యాటరు తీసుకొని రమ్మన్నారు.

వీ : మ్యాటరు కేమి, ఇస్తాను. పని మాత్రం అతినెమ్మదిగా సాగుతున్నది. ఈ జీసస్సు చరిత్ర పూర్తియైతే మరొక సాహిత్య గ్రంథంగూడా మీకే ఇవ్వాలనని చూస్తున్నాను. గున్నేశ్వరరావుగారితో పని తొందరగా అయ్యేటట్లు చూడమని చెప్పు. ఇదిగో మరో రెండు ఫారాలకు సరిపొయ్యే మ్యాటరు. ప్రూఫులు ఎప్పుడు పంపుతారు ?

వెం : రెండు రోజుల్లో అందిస్తాము.

## హితకారిణీ సమాజం

వీ : వీరభద్రరావుగారూ ! కుశలమా.

వీర : తమ దయవల్ల అందరము కుశలమే.

వీ : విశేష మేమి ?

వీర : ఆనడుమ మన శరణాలయములోని విమలమ్మకు సంబంధము వచ్చింది గదా ! వరుని గూర్చి విచారించి రమ్మని నేను మనిషిని పంపించాను. సంబంధము మంచిదిగానే తోస్తుంది. వరుడుగూడ వచ్చాడు. క్రింద నున్నాడు. మేడమీదికి రమ్మంటారా ?

వీ : మీరు విచారించారు గదా. సంబంధం మంచిదైతే చేసేదే. వివాహ మెప్పుడు జరగాలని ఉద్దేశం ?

వీర : వరుడు ఉద్యోగంలో ఉన్నాడు. మాటిమాటికి సెలవు కావలెనన్న దొరకదట. వీలైతే రేపో ఎల్లుండో వివాహం చేసుకొని వెళ్ళవలెనని అతని తలంపు.

వీ : సరే అయితే. శుభస్య శీఘ్రం. ఈ రెండుమూడు రోజులలో లగ్నా లున్నాయా ?

వీర : లగ్నాన్నిగూర్చి తనకు పట్టింపులేదనీ, వివాహం త్వరగా కావడమే తనకు ప్రధానమనీ అతను అంటున్నాడు.

వీ : అయితే పూర్ణయ్యగారిని పిలిపించి, వివాహ మెప్పుడు జరిగితే బాగుంటుందో చూడండి. ఇదిగో ఖర్చుల కోసం సొమ్ము. తీసికొని వెళ్ళి కావలసిన సామగ్రిని తీసికొని రండి.

వీర : వరుడు తమ దర్శనం చేయడానికి వచ్చాడు.

వీ : (వరునితో) సరే. మంచిది. మీ యిష్టానుసారమే వివాహానికి ఏర్పాట్లు చేస్తారు. మా హితకారిణీ సమాజ

కార్యదర్శి వీరభద్రరావుగారు చాలా మంచివారు. మళ్ళీ మీరు వారిని కలసికొని మాట్లాడవచ్చు. శుభమస్తు.

## హైస్కూలు

వీ. ఏం కృష్ణారావుగారూ! పనిమీద వచ్చారు?

కృ : హైస్కూలు భవన నిర్మాణార్థమై స్థలముకోసమై మనము పెట్టిన దరఖాస్తులు సబుకలెక్టరుగారు త్రోసి వేసినారు. ఇదుగో చూడండి. ఆ విషయమై యింక మన మేమి చేయాలి?

వీ : సబుకలెక్టరుగారు చెప్పిన కారణాలు సబబుగా ఉన్నాయి అంటారా?

కృ : Nonsense, సబబేమిటి? ఇది ఆ ప్రక్కనున్న దివాను బహదూర్ చేస్తున్న mischief తప్ప మరేమీ గాదు. పై అధికారులతో మీరు స్వయముగా వెళ్ళి మాట్లాడితే సబుకలెక్టరు తిక్క కుదురుతుంది; ఆ సలహాయిచ్చే దివాను బహదూర్ తిక్కకుదురుతుంది. అబ్బా! ఎంత ద్వేషమండి!

వీ : అట్లయితే నేను రేపే కాకినాడ వెళ్ళి కలెక్టరుతో మాట్లాడుతాను. అవసరమైతే నేను చెన్నపట్నంగూడ వెళ్ళి అధికారులను కలుసుకుంటాను.

కృ : మనము గట్టిప్రయత్నం చెయ్యాలి. మన హైస్కూలుకు అంతకంటే అనుకూలమైన స్థలం రాజమహేంద్రవరములో ఇంకొక్కటి దొరుకదు.

## కోర్టు వ్యవహారాలు

వీ : శ్రీరాములుగారూ! (ప్లీడరు) అయ్యో తమరేవచ్చారా? ఎవరిచేతనైనా కబురుపంపితే నేను రానా?

వీ : ఆ దావా విషయం ఏంచేశారు?

శ్రీ : చిన్నతనంచేత ఏవో వెర్రి వెర్రి వ్రాతలు వ్రాశారు. వాటిని గమనించనట్టు మనం ఊరుకుంటే సరిపోదా?

వీ : ఆ విధంగా మనం ఎన్నటికిని ఉపేక్షించరాదు. వాళ్లు చిన్నవాళ్ళా? కుక్కకాటుకు చెప్పుదెబ్బ. మనం పరువు నష్టానికి దావా వేయవలసిందే. అన్యాయంగా దోషారోపణం చేసినపుడు మనం ఊరుకుంటే లోకు లేమనుకుంటారు? మౌనం అర్ధాంగీకారం క్రిందికి రాదా? మీకు సొమ్ము ఏమైనా కావలసివుంటే నాకు తెలియజేయండి.

శ్రీ : సరే. సెలవు.

## చూడవచ్చేవారు

వీ : దయచేసి కూర్చోండి. తమ దే వూరు? నామధేయం?

నా : మాది బెంగుళూరు. నా పేరు నారాయణప్ప. నేను సిటీ బ్రాహ్మసమాజ సభ్యుడను, హరిజనుడను. తాము పేదలమగు మాకు ఉపాసనామందిరమును కట్టించి ఇచ్చి మహోపకారము చేసినారు. మీ పేరు చెప్పుకొని మేమందరమును కుటుంబములతో సహా అందుజేరి ఉపాసనలు చేసుకుంటున్నాము. కార్యాంతరము మీద నేనిక్కడికి వచ్చినాను. ఇక్కడకు వచ్చి తమను దర్శింపకుండ వెళ్ళుటెట్లు?

వీ : దయఉన్నది గనుక నన్ను చూడడానికి వచ్చారు. ఉపాసనామందిరము కట్టించి యివ్వడము ఒక గొప్ప పనిగాదు. అందుకు నేను ఖర్చుపెట్టిన సొమ్ము స్వల్పం. మీరందరును అందుజేరి పరమేశ్వరుని ఆరాధనము చేసుకొంటున్నారని విని సంతోషిస్తున్నాను.

నా : వచ్చే వేసంగికి తాము బెంగుళూరు వస్తారా? వస్తే మా సమాజానికి వస్తారు గదా?

వీ : నిస్సంశయముగా వస్తాను. అంతకంటె నాకు సంతోషకరమైన కార్యము మరేమి ఉండును? తోటలోనికి పోదాము రండి. చూచినారా యీ మొక్కలు? ఇవి బెంగుళూరునుండి తెచ్చినవి. మా వేడికి తట్టుకొని బ్రతికి ఏవిధముగా మిసమిసలాడుతూ పెరుగుతున్నవో చూడండి. చిత్తము - రాత్రి మీరు నా ఆతిథ్యమును గ్రహించాలి.



పాలపర్తి నరసింహం

# వీరేశలింగోదాహరణము

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

*1*

ఆఱని సౌరభంబు భరతావని నాల్గు చెఱంగులందుఁ బొం
గారెడు తీరుగా శత శతాబ్దులు నెండని నిండు సేలులై
పాటి రసజ్ఞ చిత్తములు పండువు సేసిన "కందుకూరి" మం
దార మరందముల్ తెనుఁగు నాట నెలర్చిన జీవ బిందువుల్.

*　　*　　*　　*

జాతిలో నొక్క విశ్వాసమ్ము నొదవించి
నీతి సంస్కృతి నూత్న నియతులు వెలయించి
భావ వైశాల్య మేర్చఱచి దేశమునందు
జీవ కల్యాణ సవిత్రికి నెటివిందు
సంతరించిన మహాశయులలోఁ బ్రథముండు
పంతమ్ముగల బుద్ధి పరులలోఁ బ్రథితుండు
భవ్యసంస్కార రూపక మహా రంగము
నవ్యసారస్వత నాంది శ్రీ లింగము.

*　　*　　*　　*

సహన శక్తిని దేర్చి ప్రహసనంబులు గూర్చి
పుడమిలోఁ గల మరక కడిగి వేసెడి యెఱుక
గలిగి పొల్చినవాఁడు తెలుఁగు తీర్చినవాఁడు
తెలివి మెచ్చినవాఁడు వెలుఁగు దెచ్చినవాఁడు.

*2*

ఒక కంటన్ మన తెన్గువారి ప్రకృతాయుర్నాడి గుర్తించె; వే
ఱొక కంటన్ మన తెన్గు శారద జయోద్యోగంబుఁ గాంక్షించె; సాం
ఘిక సారస్వత నైతికోన్నతుల కేకీభావముం బెంచెఁ; గొం
చక తా నమ్మిన దానిఁగొల్చిన కవిస్వామిన్ ప్రశంసించెదన్.

*　　*　　*　　*

సొగసుఁ గప్పురములో సొగియు చందనములో
ముగుద తెమ్మెరలలో మురియు నందనములోఁ
పొలపమ్ము నొలయఁ జూపులకు విందులు గూర్చి
యలఁతి పల్కుల గద్య మలరించి యెడలూర్చి
యానాఁడు తిక్కన యూహరించిన పల్కు
లీనాఁడు కృతులలో నెదుటనే రసమొల్కఁ
జిల్కి కవిరాజశేఖరు నెదలోన
వెలయఁ జేయుట మేలివేడుక మనలోన.

* * * *

రహిమీఱ నొక క్రొత్తరంగు పోకడ హత్తఁ
బ్రాకటంబుగ నెదల్ సోఁక ముద్దులు పొదలు
వచనశైలికి మంచిరుచియు వన్నెయుఁ బెంచి
యమృతుఁడైన కవీంద్రు నమరఁ గొల్చుట విందు.

### 3

చివురించెన్ గవితాతరుల్; విరియఁబూచెం; గాచె వీరేశలిం
గ వసంతోదయ మాధురీ రుచిర సంక్రాంతిన్ మహాంధ్రావనిన్
గవితా కల్పము కొమ్మకొమ్మ దెసఁ బైకశ్రీ సుధా కంఠముల్
సవరింపంబడెఁ గందుకూరి కవిచేఁ జారు ప్రసారంబునన్.

* * * *

యుగయుగంబులకేని యొఱపు మాఱని వాసి
యుగము వాఙ్మయమున నుదయింపఁగాఁ జేసి
పెఱ వాఙ్మయపుఁదీరు పెంపు తెల్గున దింపె
సరస భావనకుఁ బ్రచారమ్ము నొగి నింపె
స్త్రీ బాల వృద్ధ సుధీగణ ధ్యేయమ్ము
గా, బాసలో నూత్న గతి శ్రవః పేయమ్ము
రచన పద్ధతి బంధురము సంతరించెను
సుచరిత్ర గతులు మెచ్చుగ రంగరించెను.

* * * *

అతనిచే నొకవెల్గు నతనిచే మన తెల్గు
అన్యఖండములందు నన్యసీమలయందు
పారదంబయి విరిసి పాఱె; నా పసఁ దెలిసి
లెండు ! బంగరు పంట పండఁ జేయుఁడు వెంట.

*4*

తెనుఁగుంగబ్బము సంతరించిన కవుల్ తెల్గన్న, తిమ్మన్న, లిం
గన లంచున్ గొనియాడి నిండిన మదిన్ గేల్మోడ్చె వీరేశలిం
గనకై కబ్బములోన నాఁడల సుధీగణ్యుండు "కొక్కొండ" పో
త్తనఁగా; నుత్తర దక్షిణ ధ్రువము లొండై యుండె నన్నట్లుగన్.

* * * *

అననురూపమ్ముగా నారఁ గప్పిన కారు
తునక మబ్బుల నూఁదఁ దొడరిన తన తీరు
తరతరంబుల దాఁకఁ దెఱుగక విఱుగక
తిరముగా నిలిచి నర్తించును దఱుగక
యెదిరి పాముల దెంద మేఁచు కాటులకునై
మది నసిలేని సోమరుల పోటులకునై
పిల్లల కంకర పెద్ద రువ్వులకునై
యెల్ల సత్యమును మాయించు నవ్వులకునై.

* * * *

ఎన్ని మందులు మ్రింగి యెన్ని సందుల వంగి
యెన్ని యద్దులు కట్టి యెన్ని గడ్డలు నెట్టి
బ్రదికెనో నీఱుపేద బ్రతుకు; పేరిమి లేద
యా మహాత్ముని యెడలఁ బ్రేమ గౌరవ మెడల.

*5*

పొలపము దక్కి పుర్వులకు బోనము వెట్టెడి తాటియాకుఁ గ
ట్టలఁబడి బూజు పట్టుచుఁ జెడం జెడియున్న పురామహాకవీ
శుల కవితామణీ గణరుచుల్ వెలిసేసి, తదీయ సాధు గా
థలకు వెలుంగు సూపిన యుదారునివల్లఁ జరిత్ర మేల్కొనెన్.

* * * *

శ్రీమద్రపురి ప్రాచ్య కృతిశాల కురిచీలు
భూమతంజా మహాపురి మంజుల శ్రీలు
"వేద విలాస" పవిత్ర మందిర భిత్తి
చేదోడు వాదోడు సేయ నద్భుత వృత్తిఁ
దాళ పత్త్రిముల కాంతారమ్ములోఁ బడి
మేలిదారులు తీసి మెఱయించి, ప్రాఁబడి
పడియున్న కవులకుఁ బ్రపనిల్పె నా జోదు
పుడమి నాతనిఁ బట్టి పొడమని కథ లేదు.

*　　*　　*　　*

అతని సత్కృతు లెల్ల నతని సత్యము నెల్లఁ
దిరుగఁ దోఁడి తెనుంగు ధరణిలోన వెలుంగు
వెలయఁ జేయుట నేఁటి విధిగ నెంచిన మేటి
విభుతకు జోహారు వెట్టరే యెవ్వారు !

*　　*　　*　　*

## 6

మొత్తము మీఁద వాఙ్మయపుఁ బోకడ లెన్నియొ యాకళించి, క్రొం
గ్రొత్తగఁ దాను బన్నుకొని తుణ్ణము సేయని తెన్ను లేదు; తా
నెత్తిన దారిలో నడచియే కవులై రల 'చిల్కమర్తి' వి
ద్వత్తముఁ డాదిగా మహితు లమ్మహనీయునకుం గృతజ్ఞులై.

*　　*　　*　　*

మృతిలేని జీవిత మెసలారు జననంబు
శతవార్షికాధి కోత్సవ సమాచరణమ్ము
పడయుటగా; దాంధ్రభాష యుండినదాఁక
వెడఁగు పోకడ లవ్వి కడచి పోయెడిదాఁకఁ
గలకాలమ్మును గాలకాలమ్ము దీపించు;
నిలిచి దేశంబున వెలుఁగు చూపించు;
ఒక యుపాధ్యాయున కొక బాపనయ్యకు
నొక పేద జియ్యకు నొక ముసలయ్యకు.

*　　*　　*　　*

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

ఔర ! యెంతటి శక్తి ! యౌర ! యెంతటి సూక్తి
ఒక్క పీనసరోగి కొక్క సంస్కృతిరాగి
కెట్టి యద్భుత శక్తి యిట్టి యుత్సవ రక్తి
తెలుఁగు ధారుణిలోన వెలయు టెన్నఁడుఁగాన.

## 7

ఒక్కటికాదు; భారతము నూపిన సర్వసమస్యలందుఁ జే
రెక్కిన యట్టి నేర్పరి; మహిన్ మన సాహితిసొంపు చాటి, పెం
పెక్కిన యట్టి తీరుపు రహించిన కూర్పరి; కందుకూరి స
మ్యక్కవితా కళా రతునియందుఁ గృతజ్ఞము సర్వలోకమున్.

*       *       *       *

అచ్చ తెనుంగు కావ్యముల కూరుపు నేర్పు
మెచ్చుగా నవలలు మెఱయించు బలుతీర్పు
మధుర కథావి నిర్మాణంబులోఁ దీరు
ప్రథిత నాటక కృతి గ్రథనంబులో సౌరు
కవి కథా సంధాన కరణమ్ములో శక్తి
నవరీతిఁ బరిశోధనంబులో ననుషక్తి
యొకటి కా దెన్నియో యుదయించి పెంపొందె
సకలంబు వీరేశ సాహిత్య ఖని యందె.

*       *       *       *

కొన్ని దారులు చూపెఁ గొన్ని దారులు మాపెఁ
దెలుఁగు సాహితిలోనఁ దెలుఁగు సంఘములోనఁ
గందుకూరి కవీంద్రు నందు నాంధ్రుల విందు
కడలిలోపలఁ బెట్టు తొడరుతేనియ బొట్టు.

*       *       *       *

పరమ పవిత్రశీత శతవార్షిక వార్షుక బిందు బృంద బం
ధురతకుఁ జాతకంబులయి నోరులు విచ్చిన తెన్గు జాతిపైఁ
గురియుము నీ కటాక్ష రస గుంఫన మో యమృత ప్రథా సహో
దర హృదయాంబుజా ! సరి యుదాహరణంబులు లేవు నీ కెటన్.





రాజమహేంద్రవరములో

పంతులుగారు జన్మించిన పితృగృహము



పంతులుగారు రాజమహేంద్రవరములో

నిర్మింపజేసిన "పురమందిరము"

వితంతు శరణాలయము
ప్రస్తుతము శ్రీ వీరేశలింగం ప్రభుత్వ మహిళా సముద్ధరణాలయ,
బాలికల వసతిగృహముగా నడుపబడుచున్నది



శ్రీ వీరేశలింగ ఆస్తిక మహోన్నత పాఠశాల
భవనములు

# పంతులుగారి సంస్థలు

## శ్రీ కామరాజు హనుమంతరావు

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు ఆంధ్ర దేశ నవయుగ పురుషుడు; అసాధారణ మేధావంతుడు; అధర్మమును ఛేదించిన 'వీరాగ్రేసరుడు; ధర్మమును ప్రతిష్ఠించిన ప్రతిభావంతుడు. "ధర్మము తనతో నారంభము కావలెనను న్యాయమునుబట్టి మొదట నేను చేయగలిగినది చేసి పిదప ధర్మము నిమిత్త మితరులను బ్రార్థింపవలయునని యింతవరకు నుపేక్షించితిని" అని పంతులుగారు తమ సంపత్తి దానవిషయమున వ్యక్తీకరించిన జీవిత సూత్రము వారుచేసిన జీవన దానమువరకుగల సర్వ దానము లందు మూర్తీభవించి వారిని సంపూర్ణ త్యాగశిఖామణిగ జేసెను. వారు తమ సంస్కరణోద్యమముల నిర్వహించుటకై నెలకొల్పిన వివిధ సంస్థలనుగురించి యించుక పరిశీలింతము. వారి యాత్మోన్నత్యము గుర్తింతము.

### పత్రికా గ్రంథ ప్రచురణాలయ సంస్థ

వారు ఆంధ్ర సంస్కృతాంగ్ల భాషలందు విశేష పాండిత్యము గడించిరి. తెనుగున స్వతంత్ర రచనలనేకము గావించుటయేగాక సంస్కృతాంగ్ల గ్రంథములు గొన్ని అనువదించిరి. అవియు స్వతంత్ర గ్రంథములవలె దోచును. మొదట వారు ప్రౌఢ శైలిలో కొన్ని పుస్తకములు వ్రాసిరి. కాని వారి ఆశయము దేశాభ్యుదయ మగుటచే జనబాహుళ్యమున కుపయోగపడునట్లు సులభమైన శైలిలోనే పద్య గద్యరూపమున వివిధరచనలు గావించిరి. గద్య తిక్కనయని ఖ్యాతిగాంచిరి. వారి ధర్మసమరములలో వారికి లేఖినియె ముఖ్యాయుధము.

వారు తమ పత్రికలు, గ్రంథములు అచ్చువేయించుటకై తమ ప్రచురణాలయమున ముద్రణాయంత్రమునుకూడ నెలకొల్పిరి. తన్మూలమున వారి గ్రంథములు వేర్వేరుగనెగాక అవియు వారి పత్రికావ్యాసములును, ప్రసంగములును కలిపి పది పెద్ద సంపుటములుగ ప్రచురించుటకు సాధ్యపడెను. వారి జీవిత అంతిమ భాగమున ముద్రణశాఖను నిర్వహించుట కష్టముగా నుండినందున నెత్తివేసిరి. తమ యనంతరము తమ ఆస్తులను సంస్థలను పాలించుటకై ట్రస్టు డీడుద్వారా ప్రతిష్ఠించిన హితకారిణి సమాజముపై తమ గ్రంథ ప్రచురణ భారమును మోపిరి.

### పురమందిరములు

1. పత్రికా గ్రంథ రచనలద్వారా పంతులుగారు తమ సంస్కరణోద్యమముయెడ జనులను సుముఖులుగ జేసికొన తీవ్ర కృషి సలుపుటయేగాక తన్నిమిత్తము 1879 వ సం॥ నుండి యుపన్యాసము లొసంగుటకుగూడ పూనుకొనిరి. ఆ సంవత్సరము వారియ్యదలచిన వితంతు వివాహ విషయకోపన్యాసములకు స్థలము సులభముగ దొరకనందున రాజమహేంద్రవరమున పురమందిరము స్థాపింప సంకల్పించిరి. 1880 వ సం॥లోను 1887 వ సం॥లోను మందిర నిర్మాణమునకై రెండు పర్యాయములు యత్నించిరి. కాని వలసిన ధన సాహాయ్యము పురప్రముఖులు

చేయకపోగా "ఆచరణ సాధ్యములుకాని చిత్ర విచిత్రాభిప్రాయముల నియ్యకొొచ్చి" రట! తుదకు 1889 వ సం॥లో అదివరకు తాము సొంతసొమ్ముతో కొన్న ప్రదేశములో కొంత ద్రవ్యము అప్పుచేసి దానికి సొంత సొమ్ముచేర్చి పెద్ద పురమందిరమును పట్టణ మధ్యమున నిర్మింపగలిగిరి. దానిచుట్టుసున్న చిన్నచిన్న స్థలము లయిదింటిని కొనిరి. 1720 చదరపు గజముల యావరణలో ఏడువేల రూపాయల వ్యయముతో అది నిర్మితమాయెను. చెన్నపురి ప్రెసిడెన్సీ కాలేజి సంస్కృతోపాధ్యాయులు రంగాచార్యులుగారిచే 1890 సం॥న తెరువబడెను. అప్పులు తీరిన తరువాత 1897 వ సం॥న దానికొరకు ప్రత్యేకముగ నొక ట్రస్టుడీడు వ్రాసి దానిని ధర్మకర్తల యధీనము చేసిరి. కొన్ని యుదాశయములతో పాటు, సర్వమతములవారును, జాతులవారును సభలు మొదలైనవి జరుపుకొనుటకై మందిరము వినియోగపడుటకుగాను ధర్మకర్తలెల్లరు సాధ్యమైనంతవరకు గ్రాడ్యుయేట్లు అయియుండుటయేగాక వారిలో నొక క్రైస్తవుడు, ఒక మహమ్మదీయుడు, ఒక వైశ్యుడు, ఒక శూద్రుడు ఎప్పుడు నుండవలెనను నీమము కూడ పెట్టిరి.

2. ఇట్టి మహదోద్దేశములతోనే పంతులుగారు తాము చెన్నపురిలో నుపాధ్యాయులుగ పనిచేయుచుండిన కాలమున పరశువాకమందు సంఘ సంస్కారమందిరము కట్టించి యిచ్చిరి.

## ప్రార్థన మందిరములు

1. పంతులుగారు రాజమహేంద్రవరములో పురమందిరమునకు జేర్చి ఒక ప్రార్థన మందిరము నిర్మించిరి. ఇది మేడ యాకారమున క్రింద నొక హాలును పైన నొక హాలును కలిగియున్నది. పైభాగము ప్రార్థనాదికములకు, క్రింది భాగము పుస్తక భాండాగారమునకు వినియోగపడు చున్నవి. "పుర మందిరమునకువలె ప్రార్థన మందిర నిర్మాణమున కయిన వ్యయముల నన్నిటిని నేనొక్కడనే (పంతులుగారే) భరింపలేదు. వ్యయములలో విశేషభాగము చందాల మూలమున సమకూర్పఁబడినది." ప్రార్థన మందిరము కట్టుటకు 1500 రూపాయలు వ్యయమాయెను. 1897 వ సం॥న అది శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారిచే తెరువబడెను. దానిని సద్వినియోగ పరచు బాధ్యత హితకారిణి సమాజమునకు పంతులుగా రప్పగించిరి. సర్వమత సమ్మతమును సర్వజన సౌభ్రాత్రమును పాటించు ఏకేశ్వర మానసికారాధనకు మందిర ముపయోగపడవలెను.

2. రాజమహేంద్రవరములో పంతులుగారి స్వగృహావరణమందు స్త్రీలకొరకు ప్రత్యేకముగ కట్టబడినట్టి ప్రార్థన మందిరమున పంతులుగారి సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారు స్త్రీ సమాజము స్థాపించి ఆమె జీవించి యున్నంతవరకు ప్రార్థన సభలను తదితర కార్యములను జరుపుచు వచ్చిరి. ఆమె పంతులుగారితో చెన్నపురిలోనున్న కాలమందును ఆమె యనంతరమును ప్రార్థనాదికములు స్త్రీ సమాజమువారె గావించుచుండిరి. ఈ ప్రార్థన మందిరము కూడ హితకారిణి సమాజ యాజమాన్యమున నుంచబడెను.

3. బెంగుళూరు అరుళపేటయందలి బట్టల నేతగాండ్రు తమ యిండ్లలోనే చాల యిబ్బందితో ప్రార్థనలు జరుపుకొనుచు నుండిరి. వారొకతూరి తమ ప్రార్థనసభ కాహ్వానింపగా పంతులుగారును వారి ధర్మపత్నియు వెళ్ళి వారి యవస్థను గాంచిరి. ఆ బీద సమాజికుల సౌకర్యమునకై 1,200 రూపాయలు వెచ్చించి ప్రార్థన మందిరము నిర్మించి యిచ్చిరి.

## వితంతు శరణాలయము

పంతులుగారు సంస్కరణవాదు లైనప్పటినుండియు ముఖ్యముగా విద్యద్వారా స్త్రీజన సముద్ధరణము గావించుటకై అవిరామకృషి సలిపిరి. 1874 వ సం॥న ధవళేశ్వరములో తామచటనున్న కాలమున జనుల తోడ్పాటుతో ఒక బాలికా పాఠశాలను నెలకొల్పిరి. అట్లే 1881 వ సం॥న రాజమహేంద్రవరము ఇన్నీసుపేటలో మరియొక బాలికా పాఠశాలను స్థాపించిరి. ఇవి రెండును వృద్ధిలోనికి వచ్చినవి. వింతతూద్వాహములు 1881 వ సం॥నుండి జరుప ప్రారంభించిరి. వివాహము నిమిత్తము తనవద్దకు వచ్చు వితంతువులుకూడ వివాహమగువరకు వారు చదువుకొనుటకై తగిన యేర్పాటులు చేయుచుండిరి.

పంతులుగారి గృహమె మొదట వితంతు శరణాలయముగ నుండెను. 1897 వ సం॥నుండి 1905 వ సం॥వరకు వారు చెన్నపురిలో నున్న కాలమున వితంతువులకొరకు ప్రత్యేకముగ గృహము నిర్మించిన తరువాత వారి నందుంచిరి. చదువుకొను నిమిత్తము ఉపాధ్యాయినుల బోధనాభ్యసన పాఠశాలకు పంపుచుండిరి. పంతులుగారు విశ్రాంతిగైకొని రాజమహేంద్రవరమునకు తిరిగి వచ్చినపిమ్మట శరణాలయమునకై సుమారు ముప్పదియకరముల తోట కొనిరి. అందు శ్రీ ములుకుట్ల అచ్యుతరామయ్యగారు అయిదువేల రూపాయలు వ్యయపరచి భవనమును కట్టించి దానముగా నిచ్చిరి. పంతులుగారు వితంతువులను ఆ భవనములోనుంచి వలసిన వసతులన్నియు నేర్పరచిరి. వారి యధ్యక్షతనె 1908 వ సం॥న దాని ప్రవేశోత్సవము జరిగెను.

రాజమహేంద్రవరమునకు పంతులుగారు తిరిగి వచ్చినతరువాత సుమారు రెండు సంవత్సరములు ఊరిలోనున్న తమ స్వంత మేడ యింటిలో నివసించుచు మేడక్రింది భాగమంతయు శరణాలయ బాలికల వినియోగమునకై యిచ్చిరి. ఆ బాలికలు, ఊరిలోని బాలికలు విద్య నభ్యసించుటకై అచటనే పాఠశాల నడుప మొదలిడిరి. అది స్త్రీల ఉన్నత పాఠశాలగా వృద్ధినొందింప సమకట్టి యుపాధ్యాయినుల జీతములు మొదలుగాగల ఖర్చులకుగాను తమ చేతి సొమ్ము 1,700 రూపాయలు వెచ్చించిరి. కాని ఫారముల చదువునకు బాలికలు బయటనుండి వచ్చుట సంఘాచారమునుబట్టి కష్టముగా నుండెను. ప్రాథమిక బాలికా పాఠశాలలు ఊరిలోగలవు కాన, తమ పాఠశాలను తీసివేసిరి. ఇక తోటలో శరణాలయమందే వసించు బాలికలు ఉన్నతవిద్య సాధ్యమైనంతవర కభ్యసించి పై ఫారములలో చేరు నర్హత బడయుటకై ట్యుటోరియల్ స్కూలు నడపిరి. అందు ఇతరోపాధ్యాయులతోపాటు తాము ను పాఠములు చెప్పుచుండిరి. వారి భార్య బాలికల యోగక్షేమములు విచారించుటయేగాక వారికి పాటలు నేర్పెడివారు. అగతికులయిన స్త్రీల నిమిత్తము పంతులుగారు అగతిక రక్షణశాలకూడ నడపుచుండిరి. అందు చేరు వనితలు నయితము విద్య నభ్యసింపవలెను. అవివాహిత బాలికలుకూడ వితంతు శరణాలయమున చేరి చదువుకొనుటకు పంతులుగారు వీలుకల్పించిరి. కేవల వివాహ స్వాతంత్ర్యము స్త్రీలకు కలిగించినంత మాత్రమున, స్త్రీల దైన్యత తొలగదని, విద్యమూలముననె తొలగగలదని పంతులుగారి దృఢాభిప్రాయము. అయినను వివాహము కావలెనని కోరిన వితంతువులకు వరులను వెదకి తెచ్చి వివాహముచేసి పంపువారు. స్త్రీ పునర్వివాహములు శరణాలయమందు గాక గృహస్థుల యిండ్లలోనే జరిగినచో అవి త్వరలో సంఘామోదము బడయగలవను తలంపుతో 1905 వ

కామరాజు హనుమంతరావు

సం॥న రెండు వివాహాము లట్లు ఇన్నీసుపేటలోని మిత్రుల యిండ్లలో జరిపించిరి.

## ఆస్తికోన్నత పాఠశాల

"సత్కార్య బీజములను హృదయ క్షేత్రముల యందు నాటించి సఫలమగునట్లు జేయుటకై బాల్యా వస్థయే యుత్తమమైనది. అందుచేత బాలురకు భగ వద్భక్తియు పరోపకారాసక్తియు బోధించెడు పాఠ శాల యుండినయెడల శీఘ్ర కాలములో దేశాభివృద్ధి కలుగునని మొదటనుండియు నానమ్మకము." అని పంతులుగారు చెప్పుకొని యున్నారు. అట్టి గాఢ విశ్వాసముకల వా రగుటచేతనే, శ్రీ ఏలూరు లక్ష్మీ నరసింహముగారు స్థాపించి 1889 వ సం॥ వరకు నడపియుండిన ఆస్థిక పాఠశాలకు ప్రోత్సాహ మొసంగిరి. అటుపిమ్మట తన్నిమిత్తము తమ జీవిత ముల నమర్పింతుమన్న పట్టభద్రుల చేరదీయుచుండిరి. తమ ప్రయత్నములకు దొరతనమువారి తోడ్పాటు లేనందున వాటిని కొంతకాలము చాలించవలసి వచ్చెను. చిట్ట చివరకు దొరతనమువారికి తృప్తి కలిగించు కమిటీని పెట్టి వారి యామోదము బడసిరి. 1907 వ సం॥న శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు నడపుచున్న మాధ్యమిక పాఠశాలను తమ యధీనము చేయగా, దానిని ప్రాతిపదికగ జేసికొని యావశ్యకమైన తాత్కాలిక వసతులను గావించి క్రమక్రమముగా 4, 5, 6 ఫారములుకూడ నేర్పరచి సంపూర్ణోన్నత పాఠశాలగ జేసిరి. "స్థలమున కయిన నేమి, మందిర నిర్మాణమున కయిననేమి యుపకరణముల సంపాదన కయిననేమి యీవరకీ పాఠశాల విషయమున శ్రీ పిఠాపురపు రాజుగారు డెబ్బదివేల రూపాయలను వ్యయపెట్టిరి." వారంతటి భూరి విరాళమిచ్చి పంతులుగారికి గొప్ప సాయము జేసిరి. ఆస్తికశాభిమానులలో మరి కొందరుకూడ ధన సాహాయ్యము జేసిరి; ఇంకను ఇతర విధముల తోడ్పడిరి. ఆ తీరున నతిసుందరముగ తయారైన విశాల భవనము 1911 వ సం॥న కలకత్తా సిటీ కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ హేరంబ చంద్రమైత్రగారిచే తెరువబడెను. వితంతు శరణాలయ బాలికలు తమ యాలయములోనె గల ట్యుటోరియల్ స్కూలులో కొంత చదివిన తరువాత పై తరగతుల చదువున కయి ఆస్తికోన్నత పాఠశాలకు పంపబడుచుండిరి. ఇది తెరువబడినప్పటి నుండియు శ్రీ పిఠాపురపు రాజుగారి కోరిక ననుసరించి 'వీరేశలింగాస్తికోన్నత పాఠశాల' యను నామమున పిలువబడుచు ప్రసిద్ధి జెందినది.

పాఠశా లోద్దేశము లివి:— 1. "పురుషులతోడి పాటుగా విద్యాభిలాష గల స్త్రీలనుగూడ జేర్చు కొనుట." 2. "పంచమ బాలురనుగూడ న్యాయా తరగతులలోఁ జేర్చుకొనుట" 3. "బాలికలకువలెనె మొదటి ఫారము మొదలు పయి తరగతులలోఁ జదువు పంచమ బాలురకును జీతములు గైకొనక ధర్మార్థముగాఁ జదువు చెప్పుట" 4. "అది పేరున మాత్రమె గాక క్రియయందు గూడ నిజమైన యాస్తిక పాఠశాలయగుట". పంతులుగారు ప్రప్రథ మమున మన ప్రాంతముల నారంభించిన స్త్రీ పురుషు లను కలిపి చదువుచెప్పు పద్ధతియు స్త్రీలకును హరి జనులకును నుచితముగ చదువుచెప్పు పద్ధతియు కాల క్రమమున ఇతర పాఠశాలలోను అనుసరింపబడి పరి పాటి యయినవి. సర్వమత సమ్మతమగు ప్రార్థనను తయారుచేసి పాఠశాలలో ప్రవేశ పెట్టిరి. సాధ్య మైనంతవరకు నుదార భక్తిపరాయణుల నధ్యాప కులుగ నెన్నుకొనిరి; మరియు నుదార ధర్మముల బోధించు నుపాధ్యాయుని ప్రత్యేకముగ నియమించిరి.

## హితకారిణీ సమాజము

పంతులుగారు తమ యావదాస్తి మూడు వేల రూపాయల నగదుతో సహా ఆ కాలమున 41500 రూపాయల విలువగలది 1908 వ సం॥న తమ సంస్థల నడుపు నిమిత్తము హితకారిణి సమాజ మనుపేర ధర్మకర్తల సంఘ మొకటి స్థాపించి దాని యధీనము చేసిరి. దాని నిర్మాణ క్రమము (Constitution) చాల కట్టుదిట్టముగ నేర్పరుపబడినను, పంతులుగారి యనంతరము మెజారిటీ బలముతో సమాజ నియమావళిలోనే పెద్ద మార్పులు చేయబడినవి. ఇక సమాజ కార్యములపట్ల జరిగిన విషయములను గురించి చెప్ప నక్కరలేదు.

## భవితవ్యము

కాని యిటీవల భారత సంఘ సంక్షేమము వారు తాము తలపెట్టిన కార్యములతోపాటు వితంతు శరణాలయ కార్యములుకూడ నిర్వహించెదమని చెప్పగా, హితకారిణి సమాజము శరణాలయమును దాని చుట్టునున్న కొన్ని యకరముల భూమియు సంఘ సంక్షేమమువారి కిచ్చివేసిరి. కావున స్త్రీల సర్వతో ముఖాభ్యుదయమునకు తగిన కృషి జరిగి పంతులుగారి యాశయము బాగుగ నెరవేరునని తోచుచున్నది. ఆస్తికోన్నత పాఠశాల మన రాష్ట్ర ప్రభుత్వాధికారుల అజ్మాయిషీక్రింద నడువవలెనుగాన అదియు క్రమముగా సాగుచుండునని యాశింప వచ్చును. రాజమహేంద్రవరము లోని ప్రార్థన మందిరములును పంతులుగారి గ్రంథ ప్రచురణాలయమును వారి యాస్తులును హితకారిణి సమాజ యాజమాన్యమున ప్రస్తుత మున్నవి. సమాజము రిజిష్టరు చేయబడెను. కనుక మన రాష్ట్ర ప్రభుత్వము శ్రద్ధ వహించినచో సమాజము తనకు మిగిలియున్న పనుల చక్కగా నిర్వహించునని చెప్పవచ్చును. మన రాష్ట్రప్రభుత్వము వారు తమ బాధ్యతనుబట్టి యేమి, పంతులుగారు ట్రస్టుడీడులో తెలిపిన కోరికనుబట్టి యేమి పంతులుగారి సంస్థలన్నిటిని మహోన్నత దశకు తెచ్చి వారి యాత్మకు తృప్తి కలిగింతురుగాక !

---

" భాషారచన యందు స్వాతంత్ర్యము వహించి
తీయని వాకిండ్లు తీసినాడు "

శ్రీ రాయప్రోలు

# హితకారిణి సమాజము

## శ్రీ పొన్నాడ వేంకటాద్రి

ప్రస్తుతము జనబాహుళ్యముచే హితకారిణి సమాజమని పిలువబడే 'రాజమండ్రి హితకారిణీ సమాజము' ను, నవ్యాంధ్ర నిర్మాత, యుగపురుషుడు, ప్రఖ్యాత సంఘ సంస్కర్తయైన కీ॥ శే॥ రావు బహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు, రాజమహేంద్రవరమున స్థాపించి, ది 15-12-1906 తేదీని సొసైటీల అక్టు 21/1860 ప్రకారము రిజిస్టరు చేయించినారు.

ఈ సమాజముయొక్క ముఖ్యోద్దేశములు విద్యా విషయక, సాంఘిక సంక్షేమములకు చెందిన ప్రజోపయోగకార్యముల నిర్వర్తించుటయే. ఆ రోజులలో అత్యవసరమైన స్త్రీ విద్యను ప్రోత్సహించి, వితంతు శరణాలయములు, అగతిక శిశు సంరక్షణశాలలు, బాలబాలికలకు పాఠశాలలు, వృత్తివిద్యాశాలలు స్థాపించుటయే ప్రధానాశయములు.

సమాజస్థాపన కాలమున కార్యనిర్వాహక వర్గముగా వ్యవహరించిన ప్రముఖులు :—

అధ్యక్షులు :— రావుబహద్దరు కందుకూరి వీరేశలింగం పంతులుగారు, రాజమండ్రి గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి రిటైర్డు తెలుగు పండితులు.

ఉపాధ్యక్షులు :— రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు, ఎమ్. ఎ. యల్. టి., కాకినాడ పిఠాపురం రాజావారి కాలేజి ప్రిన్సిపాల్.

కార్యదర్శి :— కారుమూరి వీరభద్రస్వామిగారు, బి.ఎ. రాజమండ్రి మ్యునిసిపల్ కార్యదర్శి.

ఇతర సభ్యులు :— ధార్వాడ వెంకటకృష్ణారావుగారు బి. ఎ. బియల్., నాళము కృష్ణారావుగారు, కనుపర్తి శ్రీరాములుగారు, గంటు లక్ష్మన్నగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, దేశరాజు పెద బాపయ్యగారు, కె. కామరాజుగారు, మొక్కపాటి సుబ్బారాయుడుగారు పిఠాపురం రాజావారి అంతరంగిక కార్యదర్శి.

సమాజ ఆశయములతో సహకరించగల ప్రతివ్యక్తి యిందు సభ్యత్వమున కర్హులు. సభ్యత్వము రెండు విధములు. జీవిత సభ్యులు (ఒక్కసారిగా రు 100.00లు చెల్లించినవారు), సాధారణ సభ్యులు (నెల చందా దారులు). శ్రీ పంతులుగారు ది 2-5-1908 వ తేదీని అప్పటికి రు 41,500. లు విలువగల తమ స్థిరచరాస్తులను "ట్రస్టు డీడు" ద్వారా యీ సమాజమున కర్పించియున్నారు.

సమాజ ఆశయముల ననుసరించి పంతులుగారి తోటలో కీ॥ శే॥ ములుకుట్ల అచ్యుతరామయ్యగారు సుమారు రూ 5000 లు విలువ గల పెంకుటి యిల్లు, అనాథ యువతుల వసతికై కట్టించి యిచ్చిరి. దాని పేరు "విక్టోరియా వితంతు శరణాలయము". ఇందు ఎందరో, చదువులు, వృత్తివిద్యలు నేర్చుకొని, వివాహముల చేసికొని, తమ జీవితములను సుఖవంతము చేసికొనిరి.

కీ॥ శే॥ ములుకుట్ల అచ్యుతరామయ్యగారే కాక, స్వర్గీయులు చామర్తి సత్యనారాయణగారు, దుగ్గి

రాల సూర్యప్రకాశరావుగారు, వేమూరి రామకృష్ణా రావుగారు భూరి విరాళముల నిచ్చి సంస్థకు తోడ్పడిరి. శ్రీ నాభి రామకృష్ణారావుగారు శ్రీ పంతులు గారి గ్రంథ ప్రచురణకు విరాళమిచ్చిరి.

స్త్రీ జనాభ్యుదయమే తమ పవిత్రాశయముగా గల సమాజమువారు ఇదే ఆశయ సిద్ధికై పూనుకొన్న ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ స్త్రీ జనాభ్యుదయశాఖ వారికి శ్రీ పంతులుగారి తోటలోని సుమారు 17 ఎకరముల భూమిని, అందుగల కట్టడములను 25 యేండ్లకు సాలుకు రూ. 1 అద్దెకు యిచ్చియున్నారు. 1958 ప్రారంభము నుండి ఆ శాఖవారే 'శరణాలయము, పారిశ్రామిక పాఠశాల' మొదలగు సంస్థలను నిర్వహిస్తున్నారు.

సమాజమువారు నడుపుచున్న మరియొక ముఖ్య సంస్థ "వీరేశలింగ ఆస్తికోన్నత పాఠశాల" మూడేడ్లనుండి యీ పాఠశాల మహోన్నత (Higher Secondary) పాఠశాలగా నడుపబడుచున్నది. ఈ పాఠశాల మొదట చిలకమర్తి లక్ష్మీ నరసింహము పంతులుగారిది. దానిని వీరేశలింగం పంతులుగారు తీసికొని, పిఠాపురము మహారాజా వారు కట్టించిన ప్రస్తుతమున్న భవనములోనికి ది. 27-11-1911 న మార్చిరి. ఈ పాఠశాలలో 1000 మందికి పైగా బాలబాలికలు చదువుకొనుచున్నారు. ఆంధ్ర ప్రదేశములో వేరెన్నికగన్న పాఠశాలలలో నిది యొకటి.

1948 సం॥నకు ముందు యీ సమాజమునకు పెక్కు యిక్కట్లు సంభవించినవి. ఆ సంవత్సరములో కీ॥ శే॥ దంగేటి నారాయణస్వామిగారు సమాజ కార్యదర్శిగా ఎన్నుకొనబడిరి. వీరు శిథిలావస్థలో నున్న పంతులుగారి నివాస గృహములు, మేడ, శరణాలయము కళ్యాణ మండపము మొదలగు వానికి మరమ్మతులు చేయించి మంచి స్థితిలోకి తెచ్చిరి. అంతేకాక వీరేశలింగము పంతులుగారి గ్రంథములన్నింటిని పునర్ముద్రించిరి. 1957 లో రు 35,000 లు నూతన కట్టడములకు, రు 1,000 లు ప్రహరీ గోడలకు, 1961 లో రు 11,000 లు మేడ పైగదికి, రు 15,000 లు ప్రహరీలకు వెచ్చించి; పాఠశాలకు వసతి హెచ్చించడమైనది.

ఈ సమాజముచే నిర్వహింపబడుచున్న మరోసంస్థ వీరేశలింగ ఆస్తిక గ్రంథాలయము. ఈ గ్రంథాలయము పంతులుగారు ప్రజలకై కట్టించిన పురమందిరమునకు పడమటి భాగముననున్నది. ఈ గ్రంథాలయ పైభాగమున ప్రార్థనాసమాజ మందిరము కలదు.

ఈ సమాజము నిబంధనలు 1928 లోను, తిరిగి 1949 లోను సవరింపబడి 20.9.49 న సొసైటీల రిజిస్ట్రేషను ఆక్టు 21/1860 క్రింద రిజస్టరు చేయబడినది.

1907 వ సంవత్సరమునుండి నేటివరకు అనేక ప్రముఖులు ఈ సమాజమునకు, అనుబంధ సంస్థయైన పాఠశాల నిర్వహణకు కార్యదర్శులుగానుండి తోడ్పడిరి. అందు ముఖ్యులు కీ॥ శే॥ కా. వీరభద్రస్వామి, రా॥ బ॥ కం॥ వీరేశలింగము పంతులు, డి. వి. కృష్ణారావు, పెద్దాడ సుందరశివరావు, కనుపర్తి శ్రీరాములు, పాలకోడేటి గురుమూర్తి, కుందూరి వెంకటరత్నం, దంగేటి నారాయణస్వామిలున్ను, సర్వశ్రీ అవసరాల రామారావు, పెద్దాడ సీతాపతిరావు, రెబ్బాప్రగడ సుబ్బరామయ్య, నరహరిసెట్టి వెంకటరత్నం, మద్దాలి వెంకటాచలము, మద్దూరి శివరామకృష్ణయ్య, యాసం రెడ్డి వెంకట్రావు, దామెర్ల వెంకట్రావు, మొంద్రేటి లక్ష్మీపతి మున్నగువారు.

నేటి సమాజ కార్యనిర్వాహక వర్గము :—

అధ్యక్షులు :- శ్రీ నిడమర్తి వెంకట నరసింహము, (పురపాలక సంఘాధ్యక్షులు).

పొన్నాడ వేంకటాద్రి

ఉపాధ్యక్షులు :- శ్రీ ఇనుమర్తి వీరభద్రరావు, (చెయిర్మెన్ గుంతకల్లు కో. స్పిన్నింగు మిల్లు).

గౌ. కార్యదర్శి :- శ్రీ పొన్నాడ వెంకటాద్రి.

ఇతర సభ్యులు :- సర్వశ్రీ దొంతంశెట్టి తాతాచార్యులు, మేడూరి సత్యనారాయణ, మద్దూరి శివరామకృష్ణయ్య, సప్పా సూర్యనారాయణ, అనాల వెంకటప్పారావు, ముత్తంగి జగ్గారావు, కొవ్వూరి నాగిరెడ్డి, దంగేటి లక్ష్మణరావు, పల్లా నరసింహారావు, బత్తుల కామాక్షమ్మ, మొంద్రేటి లక్ష్మీపతి, పైడి వెంకట్రావులు,

పాఠశాల పాలకవర్గము :- సర్వశ్రీ మొంద్రేటి లక్ష్మీపతి కార్యదర్శి, నిడమర్తి వెంకట నరసింహము, ఇనుమర్తి వీరభద్రరావు, మేడూరి సత్యనారాయణ, కోకా శివనాథశాస్త్రి, కూచిమంచి కామేశ్వరరావు (ప్రథానోపాధ్యాయులు).

శ్రీ పంతులుగారు తమ గ్రంథముల కాపీరైటును సమాజమున కర్పించియున్నారు. సమాజమువారు 1951 లో వారి గ్రంథములన్నిటిని తిరిగి ముద్రించుటయేగాక, అవసరము వెంబడిని, రాజశేఖరచరిత్ర, అభిజ్ఞాన శాకుంతలము, స్వీయచరిత్ర, స్వీయచరిత్ర సంక్షిప్త ప్రతి తదితరములు ముద్రించి యున్నారు. కవుల చరిత్రను పరిష్కరింపజేసి ముద్రణకు సిద్ధపరచి యున్నారు.

శ్రీ. పంతులుగారి ఆశయములు నెరవేర్చుటకును, వారు నెలకొల్పిన సంస్థల నిర్వహించుటకే యీ సమాజము నిరంతరము పాటుబడుచున్నది, ★



చ॥ వడి వడి బారుదెంచి యొకపైదలి యూర్పులు పుచ్చి నవ్వినన్
బడతుక యోర్తు చాలిపుడె నవ్వకు మంతయు జెప్పె గట్టిగా
గొడుకుల తల్లి వౌదు కొంచెము నాటికి దాచుకొమ్మ నా
నుడికి నెలంతయుం గడుపు లుబ్బగ నవ్విరి కొమ్మ లందరున్.

(శుద్ధాంధ్రోత్తర రామాయణము)

# యుగపురుషుడు

శ్రీ 'ఆరుద్ర'

తెలుగు జాతిని తెరలు తెరలుగ
కారుచీకటి క్రమ్మి నప్పుడు
మూఢ ఛాందస గాఢ రుగ్మత
మూలుగుల్లో చొచ్చినప్పుడు

కాంతి ఖడ్గం కరుణ వైద్యం
కార్యవాదిగ కావ్యశీలిగ
జాతి జనుల సముద్ధరించగ
జననమొందెను తెనుగుగడ్డను

వెలుగు చదువుల వివిధ శాస్త్రా
లరసినేర్చెను కవితగూర్చెను
జ్ఞాన నేత్రం తెరచిచూచెను
జాతి దుస్థితి చూచి కుమిలెను.

ముక్కు పచ్చలె ఆరకుండా
ముద్దు ముచ్చట లారిపోతే
పసితనమ్మున నొసటికుంకుమ
వగచి పెద్దలు తుడిచివేస్తే
ఆడపిల్లలు ఆలపించే
ఆర్తగీతుల నాలకించెను.

"లలన నిర్మల లలాటమ్మును
లసత్కాంతులు విసర్జించుట
సంఘజీవిత మందు ప్రొద్దుటి
సవిత పొడచి అస్తమించుట"

అనుచు చిత్తము లోన నెంచెను
అతడు మంచిని మదిని నించెను
దిక్కు తోచని దీన వనితల
ప్రక్క నిలబడి బాసటాయెను
కొదమ వయసున కోలుపోయిన
కుంకు మార్వక హారికిచ్చెను.

దురాచారము సిరాచేసుకు
దుఃఖ భాజకమైన బ్రతుకును
పడతి నుదటను బ్రహ్మ వ్రాస్తే
వ్రాలు చెరిపే వీలు చూపెను.

మగువ హైన్యత మగువ దైన్యత
మాపి పొందెను తాను ధన్యత
అభ్యుదయ పంథా కాది పురుషుం
డతని సంస్మృతి కూర్పు సంస్కృతి.

# ఆంధ్ర గ్రంథాలయోద్యమ జనకులు

శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యా

## సంకల్పము

ఆన "1879వ సంవత్సరమునందు వితంతు వివాహ విషయమున నే నియ్యదలచుకొన్న కొన్ని యుపన్యాస ములకు తా వొకపట్టున లభింపక పోయినప్పటినుండియు- సర్వజనులకు నుపయోగపడెడి యుపన్యాస సభాభవన మొకటి పట్టణమున నుండిన బాగుండును గదా యన్న సంకల్పముతో తత్సిద్ధి యెట్లు కలుగునా" యని శ్రీ వీరేశలింగం పంతులుగారు ఆలోచింపసాగిరి.

ఆ యాలోచనమే ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము నకు పునాది యైనది.

ఆనాడు పాఠశాలలకెల్ల విద్యా విచారణకర్తగానున్న కర్నల్ మక్డనాల్డుగారిపేర పురమందిరము కట్టింప వలెనని 1880వ సంవత్సరమునను, విక్టోరియారాజ్ఞిగారి జ్యూబిలీ మహోత్సవ సందర్భమున పురమందిరమును కట్టింపవలెనని 1887వ సంవత్సరమునను శ్రీ వీరేశ లింగం పంతులుగారు ఇతరులతోగూడి చేసిన ప్రయత్న ములు ఫలోన్ముఖము గాలేదు.

పిమ్మట 26-3-1889వ తేదీన, శ్రీ పంతులుగారే స్వయముగా ధర్మగ్రంథాలయముతో గూడిన పురమంది రమును కట్టించుటకు సంకల్పించి, దాని నిర్మాణమును పూర్తిజేసి, 23-10-1890 తేదీన అందు ప్రవేశమహో త్సవమును జేయించిరి. అందులోనే వీరేశలింగం పంతులు గారి ఆస్తిక గ్రంథాలయముకూడ స్థాపింపబడి, నేటికిని యథాతథముగా నిర్వహింపబడుచున్నది. ఈ సంస్థలు, జాతి-మత-కుల-భేదములతో నిమిత్తము లేకుండ సర్వ జనులకు ఉపయోగ మయ్యేలాగున శాశ్వతముగా నిర్వహింపబడుటకు కావలసిన యేర్పాట్లను గూడ జేసి, పంతులుగారే నిక్షేప పత్రము (Trust deed) ను గూడ వ్రాసి యిచ్చిరి.

అయితే 1886వ సంవత్సరమున విశాఖపట్నము నందు సరస్వతీ నిలయమను నామమున సార్వజనిక గ్రంథాలయ మొకటి మంతెన ఆదినారాయణమూర్తి యను వీధి బడిపంతులు స్థాపించినప్పటికి, స్థిరత్వములేక కొద్ది సంవత్సరములలోనే అది యంతరించినది.

పిమ్మట పరంపరానుగతముగ అనేక సార్వజనిక గ్రంథాలయములు ఆంధ్రదేశమునం దంతటను ఏర్పడినవి.

## శ్రీ పంతులుగారి పేర

ఆనాడే, శ్రీ వీరేశలింగం పంతులుగారి త్యాగము - సేవా నిరతి - సచ్ఛీలము - లను దేశీయు లందరు గుర్తించి అభినందించిరి. ఏ తత్ఫలితముగా, శ్రీ వీరేశలింగం పంతులుగారి పేరున, వారి భార్య రాజ్యలక్ష్మమ్మగారి పేరున, అనేక గ్రంథాలయములు ఆంధ్రదేశమునం దంతటను స్థాపింపబడినవి. అట్లు స్థాపింపబడిన వానిలో పేరెన్నిక గన్నది 22-6-1897వ తేదీన, పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకా కుముదపల్లి యను గ్రామంలో "శ్రీ వీరేశలింగ కవిసమాజ''మను పేర స్థాపింపబడినది, గ్రంథాలయోద్యమ భీష్ములని ప్రఖ్యాతి గాంచిన భూపతి రాజు తిరుపతిరాజు గారను యువకులు దానిని ఆనాడు స్థాపించిరి. స్వంతభవనము - నిత్యావసరములకు భూవసతి గలిగి, దినదినాభివృద్ధి నొందుచు, ఆ గ్రంథాలయము గ్రామ మంతటికిని తలమానికమై ఇప్పటికిని ప్రజాసేవ జేయుచు, తన ధ్యేయమును నిర్వర్తించు చున్నది.

ఈ కుముదపల్లి గ్రంథాలయము యొక్క పదియవ వార్షికోత్సవమునకు 9-10-1907 వ తేదీన శ్రీ పంతులు గారు ఆ గ్రామమునకుబోయి అధ్యక్షత వహించిరి. అప్పటికే ఆయన రావుబహద్దరు బిరుదమును పొంది యుండిరి. ఆ వార్షికోత్సవమునకు భీమవరం, నర్సాపురం, తణుకు తాలూకాలలో 24 గ్రామములనుండి గ్రంథాలయ ప్రతినిధులు విచ్చేసిరి. చుట్టుప్రక్కల గ్రామములనుండి రెండు వేలమంది ప్రేక్షకులును విచ్చేసిరి. స్వదేశోద్యమ ప్రచారకులగు అవటపల్లి నారాయణరావు, బోడి నారాయణ రావు, కోనశీతారామారావు గారులు మచిలీపట్నమునుండి విచ్చేసిరి. సుప్రసిద్ధ "వందేమాతరం" కవి మంగిపూడి వేంకట శర్మగారు "పిప్పర"నుండి విచ్చేసిరి. బ్రహ్మ సమాజ ప్రచారకులు పాలావర్ఝుల లక్ష్మీనారాయణగారు భీమవరంనుండి, బుద్ధిరాజు పానకేశ్వరరావుగారు నరసా పురమునుండి విచ్చేసిరి.

ఆ వార్షికోత్సవమునకు అధ్యక్షులుగా శ్రీ పంతులుగారు తమ తుది యుపన్యాసమునందు, మన దేశము అభివృద్ధికి రావలెనన్న మత సాంఘిక రాజకీయ విషయములలో నొక్కసారిగా సంస్కరణములను చేసుకొనవలసిన దనియు, ఇందు ఒక్క విషయమునందు మాత్రమే అభివృద్ధిని పొందినయెడల అది అభివృద్ధియే కాదనియు, మన మందరమును వాక్శూరులమేగాక కార్యశూరులముగా కూడ నుండవలయుననియు, మన దేశము యొక్క అభివృద్ధికొరకు మన అర్థమును శరీరమును అవసరమైన యెడల ప్రాణమును సహితము అర్పించుటకు సిద్ధముగా నుండవలెననియు, మనము సులభముగా నెర వేర్చుకొనగల సంఘసంస్కరణమును ముఖ్యముగా చేయవలయుననియు శలవిచ్చిరి.

అదే రోజున పంతులుగారు ఈ సమాజమును గూర్చి తమ అభిప్రాయమును వారి స్వదస్తూరితో ఈ క్రింది విధముగా వ్రాసిన దానిని ఇప్పటికి భద్రముగా దాచిపెట్టిరి.

"ఈ క్లబ్బు వారు చేయుచున్న పనికి నాకత్యంతానంద మగుచున్నది; వీరు సమస్త విషయములలోను జనుల కభివృద్ధి కలిగించుటకయి పాటుపడు చున్నారు.

"ప్రార్థన సమాజమునుంచి జనులలో పరిశుద్ధాస్తిక మత సిద్ధాంతములు వ్యాపింపజేయుటకై కృషి జేయు చున్నారు. రాత్రి పాఠశాలను బెట్టి పగలు పనిచేయుచు చదువుకొనుట కవకాశము లేని బీదవారిలో విద్యాభివృద్ధి చేయుటకు ప్రయత్నించు చున్నారు. సాంఘిక విషయము లందును రాజ్యాంగ విషయములందును ప్రజలకు తమ స్వాతంత్ర్యములకును వారి యభివృద్ధికిని తోడుపడు చున్నారు. సంపూర్ణదేశాభిమానులయి సమస్త విధముల దేశాభివృద్ధికయి నిరంతర కృషి చేయుచున్న యీ సమాజము వారు, తమ సమాజమునకు నా పేరు పెట్టుట నాకత్యంత గౌరవావహమని భావించి సంతోషించు చున్నాను. భక్తాభీష్ట ప్రదాతయైన పరమేశ్వరుడు వీరి సదుద్యమములనెల్ల సఫలము చేయుచు ఈ సమాజమును చిరకాలము వర్ధిల్ల జేసి, దీనివలన దేశమునకు శ్రేయోభి వృద్ధిని కలిగించుగాక !"

## స్వయంతీర్ణః పరాంస్తారయతి

తాను బాగుపడి తోటివారలను బాగుచేయవలయుననెడి తీవ్రవాంఛ మనుష్య స్వభావమున నిగూఢముగా నున్నది. ఏ కాలమందైన ఏ దేశమునందైన-మానవకోటి ఉద్ధరణకు గాని దేశసౌభాగ్యమునకుగాని పాటుబడిన మహనీయు లందరు అట్టి వాంఛచేత ప్రేరితులైనవారే. అట్టి మహ నీయుల కోవకు జెందినవారే శ్రీ వీరేశలింగంపంతులుగారు.

## ఆంధ్ర గ్రంథాలయోద్యమ స్వరూప స్వభావములు

ఆంధ్రాభ్యుదయమునకు దోహద మొనర్చి, ఆంధ్ర సంస్కృతికి ఉత్తేజము నొసంగిన మహోద్యమముల కెల్ల గ్రంథాలయోద్యమము మూలకందము. ఇతరదేశము

లందలి విజ్ఞానోద్యమములన్నియు మనుజుని మేధాశక్తిని మాత్రము వృద్ధినొందించుటకే ప్రయత్నము లొనర్చు చుండ ఆంధ్ర గ్రంథాలయోద్యమమున మనుజుని సంపూర్ణ మానవతత్వమును వ్యక్తీకరించుటకు తగిన సాధన సామగ్రి యంతయు నిమిడియున్నది. దేశము నలు మూలల జ్ఞానబీజముల నిక్షేపించి మానవుని ఆధ్యాత్మిక శక్తుల నుద్దీపింపజేసి యాతని జీవయాత్ర పవిత్రముగను పురుషార్థ సాధకముగను ఒనరించుట మన యుద్యమము యొక్క పరమాశయము.

ఇదియే ఆంధ్ర గ్రంథాలయోద్యమము యొక్క స్వరూపము_స్వభావము.

ఇట్టి మహోన్నతమైన ఆశయములచే ప్రేరితులై జ్ఞానజ్యోతిని వెలిగించి శ్రీ వీరేశలింగం పంతులుగారు తన జీవితమును దేశమున కంకితము గావించిరి.

అజ్ఞానములో, అఘాయకత్వంలో, జీవిత సంస్కారమేలేని ప్రజాసామాన్యానికి_విద్య, విజ్ఞానము, సంస్కారము, సమానత్వములను ప్రసాదించుటకై_సాంఘికముగ రాజకీయముగ జరుగుచున్న అన్యాయములను ధైర్యముతోను స్థైర్యముతోను ఎదుర్కొను ఉత్తేజమును జనుల యందు రేకెత్తించుటకై – శ్రీ పంతులుగారు సర్వవిధముల తన జీవితము నంతను ధారబోసిరి.

## నూతన శక కర్త

1870 వ సంవత్సరము మొదలు 1900 వ సంవత్సరము వరకు గల మూడు దశాబ్దములు ఆంధ్రదేశములో గ్రంథాలయ శక మని చెప్పవచ్చును. నవ్యాంధ్ర జాతీయ వికాసానికి అభ్యుదయానికి అది యొక విశిష్టమైన కాలము. పందొమ్మిదవ శతాబ్దాంతమున ఇరువదియవ శతాబ్ద ప్రారంభమున ఆంధ్రదేశమునందు ఆవిర్భవించిన అభ్యుదయోద్యమము లన్నింటికి శ్రీ వీరేశలింగం పంతులుగారే పునాదులు వేసినారు.

ఈనాడు ఆంధ్రదేశమునందు జరుగుచున్న వైజ్ఞానిక – సారస్వత – రాజకీయ – ఆర్థిక – సాంఘిక విప్లవము లన్నింటికి శ్రీ పంతులుగారే నాందిని పలికినారు.

ఆంధ్ర ప్రజయొక్క సర్వతోముఖ వికాసానికి పంతులుగారి కృషి అనన్యము, అసమానము, నూతన చైతన్యమునకు దోహదము.

ఆ గ్రంథాలయ శక కాలమున దేశము ఆర్థికముగ హీన స్థితిలో నున్నదని_విదేశీయుల యంత్రాల పోటీకి ఆగలేక గృహపరిశ్రమలు నశించినవని – విదేశీయుల నుండి వస్తువులను దిగుమతి చేసికొనుటవలన మనదేశములో దరిద్రము తాండవించుచున్నదని – మనకు అవసరమైన వస్తువులు మనదేశములో మనమే తయారు చేసికొనుటకు ధనవంతులు ముందుకు రావలెనని – ఆయన శంఖారవ మొనరించినారు.

మన దేశంలో కరువు తిష్ఠవేసికొన్న దని – వ్యవసాయము చేయదగ్గ భూమి చాలా బంజరుగా నుండిపోయినదని – వ్యవసాయ పద్ధతులు శాస్త్రీయంగా రూపొందించి పంటల నభివృద్ధిపరచి కరువులనుండి దేశమును రక్షింపనగునని వారు ప్రబోధం చేసినారు.

ప్రభుత్వోద్యోగులలో ప్రబలిపోవుచున్న లంచగొండితనమును రూపుమాపినగాని, దేశాన్ని నైతిక పతనము నుండి రక్షింపలేమని, కనిపెట్టి, అందుకై స్వయముగ కష్టములకు పాల్పడినను ప్రబోధమును మానలేదు.

దేశంలో గొప్ప ఉద్యోగాలను దేశీయులకు ఇచ్చిన గాని, స్వపరిపాలనాభిలాష పెంపొందదని నిర్భయముగ వాదించినారు.

జాతి మత ద్వేషములు లేకుండ ఐకమత్యము – నిష్పాక్షిక దృష్టి – ఏర్పడినయెడల జాతీయ సమైక్యము సులభసాధ్యమని నిరూపించినారు.

ఇండియన్ నేషనలు కాంగ్రెసునకు, ఆది స్థాపించిన మూడవ సంవత్సరము (1887) లోనే ఆయన ప్రతినిధిగ

బోయి, కాంగ్రెసు మహోద్యమమును బలపరచి, ప్రచారం చేసినారు.

దేశంకోసం తమ కాలాన్ని — ధనాన్ని — ప్రాణములను సైతము — పూర్తిగా త్యాగం చేసి పనిజేసే దేశ సేవకులు కావలెనని ఉద్బోధించినారు.

దేశస్థితి బాగుపడవలెనంటే — జనులయందు ఉత్తేజము కలగవలెనంటే — అందుకై జనసామాన్యమునందు విజ్ఞానము వ్యాపించాలని, ఆ విజ్ఞానము వ్యాపించడానికి విద్యా ప్రచారం అత్యంతావశ్యకమని పంతులుగారు కనిపెట్టినారు. అందుకై పగటి పాఠశాలలు, వయోజనులకై ప్రత్యేకము రాత్రి పాఠశాలలు పెట్టించినారు. ఇండ్లు వదలలేని గృహిణులకై ప్రత్యేక తరగతులను గూడ నడిపించినారు. మరియు ఇట్టి సేవాకార్యములను నడుపుటకై జనులు తరుచు కలియుటకొరకు — ఆయా విషయములను గూర్చి ఆలోచించుట చర్చించుట మొదలగు కార్యములను ఆచరించుటకు — సంఘములను, సమాజములను, గ్రంథాలయములను స్థాపించినారు.

## నవచైతన్య దోహద గ్రంథముల కొరత

ఆ కాలమున ఆంధ్రభాషయందు పురాణములు, ప్రబంధములు, శతకములు మొదలైన ప్రాచీన సాంస్కృతిక గ్రంథములేగాని, నూతన శకమునకు అగత్యములైన గ్రంథములు లేకుండెను. అట్టి గ్రంథములలో గూడ పండితులేగాని, జనసామాన్యము అవగాహన చేసికోదగిన సులభశైలి గ్రంథములు లేనేలేవు.

చిన్నయసూరి నీతిచంద్రిక — విక్రమార్కుని కథలు — పంచతంత్రము — కాశీమజిలీలు — ఇవియే అప్పటికి తెలుగులోనున్న వచన గ్రంథములు. స్త్రీలు, బాలురు, సామాన్య జనులు చదువుకొనుటకు అర్థముజేసికొనుటకు పంతులుగారు వచన వాఙ్మయమును సృష్టించినారు.

నవీన కాలానుకూలముగ జన్యములైన సమస్యలను, నూతన దృక్పథములను గూర్చిన గ్రంథములు — జనుల జీవిత సమస్యలను గూర్చిన గ్రంథములు — బొత్తిగాలేవు. జనులయందు విజ్ఞాన తృష్ణను పెంపొందించి గ్రంథాలయములను స్థాపించినారు; పిమ్మట, వారికి తగిన గ్రంథములను గూడ సమకూర్చవలెనని పంతులుగారు తలపెట్టినారు.

జనులఅభివృద్ధికి విజ్ఞానము అవసరము; విజ్ఞానమునకు విద్య అవసరము — విద్యకు గ్రంథములు అవసరము, అన్నిగ్రంథములు అందరకు అందుబాటులో నుండుటకు గ్రంథాలయములు అవసరము. ఇటుల అవి యన్నియు అవినాభావ సంబంధమును గలిగియున్నవి.

అందుచేత వీరేశలింగం పంతులుగారిదృష్టి ఆంధ్ర వాఙ్మయమువైపునకు మరలినది; దేశమును ఉఱ్ఱూతలూగించుచున్న సమస్యలన్నియు పంతులుగారి దృష్టి ముందర తాండవింపజొచ్చినవి. ఆంధ్ర వాఙ్మయమును విషయములనుబట్టి వర్గీకరణముజేసి జూచిరి. పూరించవలసిన కొరతలేమో తేలినవి.

ఇట్టి దశయందు ఆధునిక ఆంధ్ర వికాసమునకు అగత్యములగు గ్రంథములన్నింటిని రచించుటకు—ఆంగ్లేయ సంస్కృత భాషలనుండి అనుకరించుటకు, భాషాంతరీకరించుటకు పంతులుగారు పూనుకొనిరి.

ఒకవంక పండితులుగూడ మెచ్చురీతి పాండిత్యమును వైదుష్యమును ప్రకటించు పద్యకావ్యములను వ్రాసినారు; మరియొకవంక జనసామాన్యమునకు గూడ అర్థమగురీతిని దేశచరిత్రలు—జీవిత చరిత్రలు—ప్రహసనములు—కథలు—నవలలు — నాటకములు వ్రాసినారు. ఇతర భాషల యందున్న వేదాంతము మొదలగు నిగూఢ శాస్త్ర విషయములనుగూడ, సులభశైలిని, సర్వులకు అర్థమగుశైలిని అందరికి అందించినారు — స్త్రీల యుపయోగమునకై ప్రత్యేకముగ గ్రంథములను వ్రాసినారు. బాలుర అవసరములనుగూడ వారు మరచిపోలేదు.

అయ్యంకి వేంకటరమణయ్య

వారు వినోదమునకై వ్రాసిన గ్రంథములందు సైతము విజ్ఞానమును పరమార్థమును సమ్మిశితము చేసినారు.

మొత్తము వారు నూటఇరువది గ్రంథములకుపైగా వ్రాసి, గ్రంథాలయములకు జ్ఞానభిక్ష పెట్టినారు.

వారు వ్రాసిన గ్రంథములవలన ఆంధ్ర జాతీయ జీవనమునందు నూతన శకము ఆవిర్భవించినది.

వారు స్పృశించి అలంకరింపని విజ్ఞానశాఖ లేదనియే చెప్పవచ్చును. వారి గ్రంథములన్నియు కలిసి ఒక విజ్ఞాన కోశము (Encyclopaedia) కాగలదు.

నాడుమొదలు నేటివరకు, ఆంధ్రదేశమున వారి గ్రంథసంచయములేని సార్వజనిక గ్రంథాలయమే లేదు.

## వారి పత్రికలు

గ్రంథాలయములకు పుస్తకములు ప్రధానములే; అయినను పత్రికలు అంతకంటె ఎక్కువ ప్రధానములు—నిత్య జీవిత సమస్యలను పత్రికలో వ్యాసముల రూపమున ప్రముఖులు చర్చించుచుందురు. ఆ చర్చలను చదువుట వలన, చదువరులు తమసమస్యలను పరిష్కరించుకొనుటకు—తమ ఊహలకు దోహద మొసగగల విషయములను (అనగా మెదడునకు మేతను) సంపాదించుకొన్నవా రగుదురు. ఇదీ గాక, పత్రికలలోని వ్యాస పరంపరలలో నూతన పరిశోధనలు—నూతన సమస్యలు—నూతన దృక్పథము—నూతన పరిష్కారములు—నిత్య నూతనముగ అవగతమగుచుండును. అట్టివి గ్రంథస్థములగుటకు చాలకాలము పట్టవచ్చును; మరియు అట్టివి కొన్ని గ్రంథస్థములు కాకుండ విస్మృతములగుటయు గూడ సంభవింపవచ్చును..

జనుల నిత్యజీవిత స్రవంతికి పత్రికలు చేయగల ప్రాముఖ్యమును గనిపెట్టి పంతులుగారు వివేకవర్ధని—సతీహిత బోధిని—హాస్య సంజీవిని—చింతామణి—అను మాసపత్రికలను, సత్యవాదినియను వారపత్రికను ప్రచురించినారు. తన యుద్యమములకు ప్రతి కక్షకులైన వారి వాదములను ఖండించుటకు—తన అభిప్రాయములను అభిమతములను నిర్భయముగా వెల్లడించుటకు పత్రికలు వారికి ఎంతయు నుపయోగించినవి.

## మన భాగ్యవిశేషము

ఈ రీతిగా కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఆంధ్ర గ్రంథాలయోద్యమ జనకులై వెలయుట మన భాగ్య విశేషము.

## వీరేశలింగంగారి గ్రంథములు

శ్రీ వీరేశలింగం పంతులుగారు రచించిన గ్రంథములలో కొన్నిటిని ఇచట ఉదహరించుచున్నాను :

### ప్రహసనములు

అభాగ్యోపాఖ్యానము
సరస్వతీ నారద విలాసము
బ్రాహ్మ వివాహము
తిర్యగ్విద్వన్మహాసభ
మహారణ్య పురాధిపత్యము
మహామహోపాధ్యాయ ప్రహసనము
యోగ నిద్రా ప్రహసనము
మహావంచక ప్రహసనము
అసహాయ శూర ప్రహసనము
కలిపురుష శనైశ్చర్య విలాసము
వేశ్యా ప్రియ ప్రహసనము
యోగాభ్యాసం

### నవలలు

రాజశేఖర చరిత్ర
సత్యరాజు పూర్వ దేశయాత్రలు

### పద్య కావ్యములు

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము
శుద్ధాంధ్ర భారత సంగ్రహము

శుద్ధాంధ్రోత్తర రామాయణము
అభాగ్యోపాఖ్యానము
పథిక విలాసము
రసిక మనోరంజనము
జాన్‌గిల్పిన్

## స్త్రీలకై ప్రత్యేక గ్రంథములు

సత్యవతీ చరిత్ర
చంద్రమతీ చరిత్ర
సత్య సంజీవని
నీతి కథామంజరి
దేహారోగ్య బోధిని
పత్నీహిత సూచని
పతీ హిత బోధిని
స్త్రీ నీతి దీపిక
సత్యా ద్రౌపదీ సంవాదము
చమత్కార రత్నావళి

## నా ట క ము లు

అభిజ్ఞాన శాకుంతలము
మాళవికాగ్నిమిత్రము
ప్రబోధ చంద్రోదయము
రత్నావళి
ప్రహ్లాద
వివేకదీపిక
దక్షిణ గోగ్రహణము
సత్యహరిశ్చంద్ర
కళ్యాణ కల్పవల్లి
కామడీ ఆఫ్ ఎర్రర్సు

## చ రి త్ర లు

ఆంధ్ర కవుల చరిత్ర
స్వదేశ సంస్థానముల చరిత్ర
జీసను చరిత్ర
విక్టోరియారాణి
ఉత్తమ స్త్రీ చరిత్రలు
శంకరాచార్య చరిత్రము
స్వీయచరిత్రము

## ఉ ప న్యా స ము లు

సత్యవాదిని
వివేకవర్ధని
ఉపన్యాసమంజరి
దేశీయ మహాసభ – దాని యుద్దేశములు

## వివిధ మతములు

అద్వైత మత సంగ్రహము
ద్వైత మత సంగ్రహము
విశిష్టాద్వైత మత సంగ్రహము

## నీతి గ్రంథములు

విగ్రహము
సంధి

## శాస్త్ర గ్రంథములు

ఆంధ్ర వ్యాకరణము
కావ్యసంగ్రహము
ఆంధ్ర తర్క సంగ్రహము
పదార్థ వివేచకశాస్త్రము
శారీరశాస్త్రము
జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము
జంతు స్వభావచరిత్ర
భౌతిక భూగోళ శాస్త్రము
ఖగోళ శాస్త్రము



అయ్యంకి వేంకటరమణయ్య

# గద్యతిక్కన

శ్రీ 'దయానిధి'

కందుకూరి తాతా - వం
దనమిదె కొనరాదా !
విధవల వేధనలు మాయు
విధము జూపితీవె కదా ॥

లోకులు పలుగాకులుగా
చీకటిలో బాకులుగా
అమాయకుల జీవితాల
నాహుతిగొన జూచువేళ
ఆర్తత్రాణ పరాయణత
నవతరించినావు గదా
విధవల కన్నీటి చెఱల
విడిపించితి వీవుగదా ॥

పది యేడుల బాలిక - డె
బ్బది యేడుల ముదుసలిచే
తాళిని గట్టించుకు - ఉరి
తాడుగ భావించుకొని
పసుపు కుంకుమకు వెలియై
పశువృత్తికి తాబలియై
విలపించెడు అనదల - క
న్నీటి కతల గతిమార్చిన ॥

భాషా భేషజము మాని
భావము, నవ జీవమూని,
కరదీపిక చేత బూని
కదలిన యోధుడవు నీవు

శిథిలములౌ సాంఘిక - ఆ
చారసౌధముల దీరిచి
జవ సత్వము లొనగూర్చిన
నవయుగాంధ్ర నిర్మాతవు ॥

# మహాయోధుడు

శ్రీమతి ఆ. భాస్కరమ్మ

ఒక శతాబ్దము క్రిందట పంతులుగారికి పూర్వము, పంతులుగారి కాలములోను ఆంధ్రదేశము - ఆంధ్ర దేశమే యననేల మొత్తము భారతదేశ మందలి ప్రజ లందరు అజ్ఞానాంధకారములో మునిగియుండిరి. మూఢ నమ్మకములు, దురాచారములు మిక్కుటముగా నుండెను. దయ్యముల పిచ్చి-జాతకాలు-స్త్రీలకు విద్యకూడదను వాద నలు-ఎఱుక యందలి నమ్మకములు-బంగారం చేసెదమని చెప్పే మోసగాళ్ళు-బైరాగులు-గ్రహముల పూనకములు-ముఖస్తుతుల కుబ్బిపోయి అప్పులపాలగుట-పెండ్లి సంభా వనలలో విపరీత ధనవ్యయము-ఆపద మ్రొక్కులు-అతి బాల్య వివాహాలు-అతివృద్ధ వివాహాలు-నిర్బంధ వైధ వ్యము-కన్యాశుల్కములు-నిర్భయ జారత్వము-భోగం మేళములు-ఆమేళముల కొరకు డబ్బు వసూళ్ళు-స్వాములవారల విపరీత చర్యలు-విగ్రహారాధన-శకున ములు-మోసగాళ్ళ మోసములు-శాస్త్రులు-పండితులు-బైరాగులు-భూతవైద్యులు మొదలగువారియొక్క స్వాభి మానములు-ఈ మొదలైన అనేకములగు మూఢవిశ్వాస, దురభిమానములతో దేశమంతా అధోగతిలో నుండెను.

శ్లో॥ యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మనం సృజామ్యహమ్॥

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే॥

— అన్నాడు శ్రీకృష్ణభగవానుఁడు. అధర్మం, అన్యాయం, అక్రమాలతోకూడిన కౌరవసేనలతో ధర్మపరులు, న్యాయ మూర్తులు, సత్యసంధులు ఐన పాండవులచేఁత యుద్ధము చేయించి ద్వాపరయుగంలో ధర్మాన్ని నిలబెట్టాడు కృష్ణ పరమాత్మ.

క్రీ. పూ. అయిదవ శతాబ్దంలో ఆ కాలములో గల యజ్ఞములు - మత వైషమ్యములు - బహువిగ్రహముల నారాధించుట-ఎక్కువ కులములవారు తక్కువ కులముల వారిని బాధించుట మొదలగు అనేక అధర్మ అన్యాయ కార్యములను పిచ్చి నమ్మకములను తన జ్ఞానబోధలతో ప్రజలలోగల అజ్ఞానమును పోగొట్టి జ్ఞానమును ప్రసా దించాఁడు బుద్ధభగవానుఁడు.

క్రీ.శ. 16వ శతాబ్దములో హిందూదేశములో ముఖ్య ముగా ఉత్తర ప్రదేశములో నరబలులు - శిశుహత్యలు - మొదట పుట్టిన బిడ్డలను గంగపాలుచేయుట-శక్తిపూజలు-సహగమనము మొదలైన అనేక దురాచారములు, మూఢ నమ్మకములు ప్రబలి ప్రజలు అత్యంత అధమ స్థితిలో నున్న కాలములో వంగదేశమున జన్మించి వీటిపై ఘోర యుద్ధమునల్పి ప్రజల కన్నుతెరచి బ్రతికియుండగనే చని పోయిన భర్తతోపాటు అగ్నిహోత్రున కాహుతికావలసిన స్త్రీల నుద్ధరించుటయేగాక తక్కిన దురాచారములనుకూడ మాన్పగలిగాడు రాజా రామమోహనరాయలు.

19వ శతాబ్దములో ఆంధ్రదేశములో నవతరించి దక్షిణ దేశప్రజలతో ఘోరసమరమునల్పి దక్షిణదేశమునంతటిని వెలుగు బాటలోనికి తీసికొని వచ్చిన మహావీరుఁడు వీరేశలింగం పంతులుగారు.

ఈయన విస్తారము ధనికుఁడుకాఁడు. సామాన్య కుటుంబమునకు చెందినవాఁడు. శరీరము దారుఢ్యవంత

మైనది కాదు. అర్భకుఁడు. ఆరోగ్యమా అసలే లేదు. చిన్నతనము నుండి ఉబ్బసపు దగ్గుతో బాధపడుతూ ఉండే వారు. ఆ దగ్గు చివరివరకు ఆయనను విడువనే లేదు. పట్టభద్రుఁడు కాని, గొప్ప ఉద్యోగి కాని కాదు. సామాన్య స్కూలు మేష్టరు.

ఇన్ని బలహీనతలతో కూడియున్న ఈయన సంఘములోగల లోపముల నన్నింటిని యెదుర్కొని ప్రజలను సరియైన పథములో నడిపించుటకు పూనుకున్నారంటే ఈయనలో ఏదో గొప్పశక్తి యుండవలె.

ఆయనకు శరీరబలము లేకపోయినను గొప్ప మనోబలమున్నది. సాటిలేని ధైర్యశాలి. అతిసాహసము గలవారు. పీడని పట్టుదల, కార్యదీక్ష కలవారు. స్వార్థత్యాగి. సత్యసంధుడు. వీనికితోడు నైతికబలము, దైవభక్తి, ఆత్మవిశ్వాసము వీరిలో నధికముగా నుండెను. ఇంతియే కాదు – గొప్పకవి, పండితుడు – ఈయనలో గల ఉత్తమోత్తమములైన ఈ శక్తులే ఆయనను సంఘము నెదుర్కొన పురికొల్పినవి.

ఈ విప్లవకారుని యుద్ధానికి ఆయుధాలు – కలము, వాక్కు. ప్రజలలోగల మూఢనమ్మకములు, దురాచారములు, అక్రమములు, అన్యాయములను ఖండించుచు నిర్భయముగా ననేక ప్రహసనములు, నవలలు, వ్యాసములు రచించిరి. పత్రికలను ప్రచురించిరి. అనేక సభలలో గంభీరోపన్యాసముల నొసఁగియు, వాదోపవాదములు సల్పియు, ప్రతిపక్షుల నోళ్ళనణచుచుండిరి. ఈయనకు ప్రతిస్పర్థులు చాలమంది యుండిరి. అందు కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు ముఖ్యులు.

స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహములలో పంతులుగారు వాటి కనుకూలముగా "పురుషార్థ ప్రదాయిని", వేంకటరత్నంగారు ప్రతికూలముగా "ఆంధ్రభాషా సంజీవని", "హాస్యవర్ధిని", పంతులుగారు "హాస్య సంజీవని", "కోదు భాషా సంజీవని" అను పత్రికలతో హోరాహోరీని పోరాడుచుండేవారు. ఆ రోజులలో ఆ పత్రికలు వినోద విజ్ఞానదాయకములుగా నుండేవి.

అప్పుడు దయ్యముల నమ్మకము మిక్కుటముగా నుండెను. పంతులుగారి తల్లికే తరుచు దయ్యము పట్టి పీడిస్తూ ఉండేది. ఆమెను తృప్తిపరచుటకొరకు ఒక భూతవైద్యుని తమ యింట నుంచుకొనినట్లును, ఆయన పంతులుగారు తన మాయలో పడ్డారనుకొని ఆయననుండి అమితముగా ధనము లాగుటకై ఆయనను బెదిరించినట్లును, ఆ బెదరింపుల కాయన లొంగక భూతవైద్యుని యింటినుండి గెంటించినట్లును, పంతులుగారి ధైర్యసాహసములు చూచి ఆ భూతవైద్యుడే బెదరిపోయి పంతులుగారు తనమీద 'శరభసాళ్వ మంత్రము'ను ప్రయోగించారని అనుకొని చావసిద్ధముగా నుండగా పంతులుగారు తనకు నమ్మకము లేకపోయినా అతనిని తృప్తిపరచుటకు ఆ మంత్రప్రయోగమును తీసివేసినట్లు నటించి ఆయనన్ను బ్రతికించినట్లును పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాసిరి.

ఆయన వ్రాసిన "రాజశేఖర చరిత్ర" అను నవలలో రాజశేఖరుఁడుగారి పెద్ద కుమార్తె రుక్మిణియొక్క భర్త చనిపోకుండగనే చనిపోయాడనే వార్త కిట్టనివారివలన తెలియగా వీరు అల్లుడు చనిపోయాడనే భావించిరి. మన దేశములో భర్త పోయినవారి దుస్థితి యెట్లుండునో చూచుచుండిన రుక్మిణి ఆ వార్త విన్నది మొదలు రాత్రి పగలు గదిలోనుండి వెలుపలకు రాక నిద్రాహారములు మాని కృశించుచుండెను. దానికితోడు నేదియో వ్యాధికూడ నాశ్రయించెను. ఆమె స్థితిని చూచి యిరుగుపొరుగువారు ఆమె నేదో భూతము ఆవరించినదని చెప్పగా తానుకూడా నట్టి నమ్మకము కలవాడే కావున రాజశేఖరుడుగారు ఒక భూతవైద్యుని పిలిపిస్తాడు. ఆ భూత వైద్యుడు ఆమెను చనిపోయిన భర్త పట్టుకొని పీడించుచున్నాడని చెప్పి చేసిన హంగామాను, తరువాత కొంతకాలమునకు దేశాటనము నుండి రుక్మిణి భర్త నరసింహము తిరిగిరాగా అతను

దయ్యమై వచ్చా డనుకొని రాజశేఖరుడు, అతని భార్యా భయపడి అతని పాదములు భూమిమీద నానియున్నవో పైగా నున్నవో, ముందుకున్నవో, వెనుకకున్నవో పరిశీలించి తరువాత నల్లుని ఆదరించినట్లును చక్కగా చిత్రించి చూపిరి.

రాజశేఖరుడుగారి యొద్దకు ఒక బైరాగి వచ్చి తాను బంగారము చేసెదనని చెప్పి అమాయకుడగు రాజశేఖరుని నమ్మించి మోసముచేసిన విధము, ముఖస్తుతులకు లోబడి రాజశేఖరుఁడు ఆదాయమునకు మించిన వ్యయము చేసి అప్పులపాలగుట, రుక్మిణికి జబ్బు చేసినప్పుడు తల్లి మ్రొక్కుకొనుట, ఒకటననేల ఆ కాలములో పై జెప్పబడిన మూఢ నమ్మకాలు, దురాచారాలు, దురభిమానాలు ఏలాయుండేవో ఒక్క రాజశేఖరచరిత్రలోనే కళ్ళకు కట్టినట్లు చక్కగా చూపారు పంతులుగారు.

రెండవది "సత్యరాజు పూర్వ దేశయాత్ర" అను నవల. ఇది రెండు భాగాలు. ఒకటి సత్యరాజు లంకా ద్వీప యాత్ర, రెండవది సత్యరాజు ఆడమళయాళ యాత్ర.

లంకాద్వీప యాత్రలో మన పురాణము లందలి అతిశయోక్తులు హాస్య రసంగా యెత్తి చూపారు. ఇందలి నాయకునకు సత్యరాజు అను పేరుపెట్టుటకు కారణము — సత్యహరిశ్చంద్రుని వలె అతడు సత్యసంధుడు. అతను చెప్పేదంతా యదార్థమేకాని అందు అబద్ధ మెంతమాత్రము లేదు అని చెపుతాడు సత్యరాజు.

ఆడమళయాళ యాత్రలో ఇక్కడ మన దేశములో స్త్రీల విషయములో జరిగే అన్యాయములన్నీ అక్కడి పురుషులకు జరుగుచున్నట్టు వ్రాశారు. ఇక్కడి స్త్రీలకిట్టి అన్యాయములు జరుగుచున్నవని గాని, వారిట్టి బాధ లనుభవించుచున్నారని గాని ఎన్నడూ అనుకోని, తలచనైనా తలచని వారికి ఆ గ్రంథం చదువుతూఉంటే చాలా నవ్వుగాను, హాస్యంగాను ఉంటుంది.

అందులో స్త్రీలదే సర్వస్వతంత్రం. పురుషుల కేవిధమైన స్వతంత్రంగాని, స్వేచ్ఛగాని యుండదు. పురుషులను చదివించకూడదు. వారు చదువుకొనిన యెడల చెడిపోదురు. పురుషుల విద్య విషయమై వాదోపవాదాలు, వారిని చదివించిన స్త్రీలకు వెలి. చిన్నతనంలో భార్య పోయిన వారికి ముక్కు కోయుట — ఏబది యేండ్లు దాటిన తరువాత భార్య పోతే ఆ భార్యతోబాటు భర్త సహగమనము చేయుట.

సత్యరాజు ఒకరోజున తన గురువుతో పాఠశాలకు వెళ్లుచుండగా పెద్ద మేళతాళములతో స్త్రీల గుంపొకటి కనపడుతుంది. అందు పత్నీ వియోగము పొందని పుణ్య పురుషులును కొంద రుంటారు. ఒక వృద్ధ స్త్రీ శవమును వాహకులు మోయుచుండ ఆమె భర్త సర్వాభరణ భూషితుఁడై విలువగల బట్టలను ధరించి ఆ శవము ననుసరించి నడుస్తూ ఉంటాఁడు. వారందరూ స్మశాన వాటికకు చేరిన తరువాత ఒక పెద్ద గోతిలో ఆ స్త్రీ శవమును బోరగిల పరుండపెడతారు, తరువాత ఆ పురుషుఁడు సంతోషంగా ఆమె ప్రక్కను బోరగిల పరుండును. మొదట పంద్రెండుగురు స్త్రీలు గంపలతో వారిమీద మట్టి పోయగా తక్కినవారందరూ మట్టితో గోతిని నింపుతారు. ఆ మట్టి పోసిన స్త్రీలకు, ఆ దృశ్యమును చూచిన వారికి పుణ్యము లభించునని వారి నమ్మిక.

ఒకసారి ఆడ మళయాళమునకు స్త్రీ స్వాములవారు వస్తారు. ఆమెకు అందరిండ్లలోను భిక్షలు జరుగుతాయి. ఒక యింట భార్య పోయిన ఒక బాల విధురు డుంటాడు. ఆతనికి ముక్కుంటుంది. ఆ విధురునకు ముక్కు తీసివేయకుండా యింట నుంచుకొన్నారు గనుక వారి భిక్ష తానంగీకరించ నంటుంది. ఆ స్వాములవార్కి అప్పుడు వారు క్షమాపణ కోరి వారి యింటనున్న బాల అపత్నీకునకే కాక తక్కిన యిండ్లలోని వారికికూడా నాసికా మహోత్సవము చేస్తారు. అంటే బాలవిధురులైన పురుషులకు ముక్కులు

ఆ. భాస్కరమ్మ

కోస్తారు. జుట్టు తీసేస్తే మళ్ళీ మళ్ళీ వస్తుంది. తరుచు మంగలివాని అవసర ముంటుంది. ముక్కు కోసేస్తే యిక తిరిగి రాదు. విరూపులను చేయుట కేదైతేనేమి అని వారి వాదన.

అక్కడి పురుషులు వంటచేయుట మొదలగు పనులు చేస్తో ఇంట్లోనే ఉండాలికాని బయటికి రాకూడదు. భార్య భర్తను తనతోకూడా యెక్కడకూ తీసికొని వెళ్ళకూడదు. ఈమాదిరిగా సత్యరాజు పూర్వ దేశ యాత్రలు అను నవలలో ఎన్నో విషయాలు చాలా హాస్యరసంగా వ్రాశారు.

ఆయన ప్రహసనములలో ప్రజలలోగల శకునముల పిచ్చి, గ్రహణములు, ఒకటననేల ప్రజలలోగల మూఢ నమ్మకాల నన్నిటినీ హాస్యరసంగా ప్రజల హృదయాలకు నాటి సిగ్గుపడునట్లు వ్రాశారు. అందు ఒకటిరెంటిని యెత్తి చూపెదను.

## నారద సందర్శనం

ఇందులో ఒక సోమయాజులుగారు, ఒక శాస్త్రిల వారు, ఒక ఆచార్లుగారు కూర్చుని యుండగా నారదులవారు వస్తారు. ముల్లోక సంచారియగు ఆయనను వీరు స్వర్గలోక విశేషా లేమిటని అడుగుతారు. "అక్కడ మీ పితృదేవతలు మీతో చెప్పమన్న విషయములను చెపుతాను –

"మృతులయొక్క భార్య లందరూ చనిపోయిన తరువాత స్వర్గలోకానికి వచ్చి తమ భర్తలతో స్వర్గసుఖ మనుభవిస్తారను సంగతి శాస్త్రములను బట్టి మీకు తెలిసి యున్నదికదా ? మీరు వారికందరికీ తల వెంట్రుకలు తీసి వేయించుటచేత మాకు స్వర్గంలో బోడి భార్యలు వస్తోన్నారు. ఈబాధ లేకుండా చేయ"మని మీతో చెప్ప మన్నారు.

"మరియొక విషయం – 'మీరు మా పేరు చెప్పి బ్రాహ్మణులకు పెట్టేదేమియు మాకు ముట్టడంలేదు. మేము దానధర్మములకు, నిత్యకృత్యములకు డబ్బు లేక చాలా ఇబ్బంది పడుతోన్నాము. ఘడియ ఘడియకు మళ్ళీ స్వర్గం నుంచి వచ్చేవారెవరూ ఉండరు గనుక ఇప్పుడే మీ యొద్ద నున్న డబ్బంతా యీ నారదుని చేతికిచ్చి పితృ ఋణ విముక్తులు కావలసింది.' అని చెప్పమన్నారు.''

## శకునములు

పాపయ్యశాస్త్రి అనునొకాయనకు ఉద్యోగమునకు ఆర్డరు వస్తుంది. ఆయన ఉద్యోగములో ప్రవేశించుటకు బయలుదేరుతాడు. ఆరోజు అమావాస్య, మంచిదికాదు. రెండవరోజు అమావాస్య వెళ్ళిన పాడ్యమి అసలే పనికి రాదు. మూడవనాడు శుక్రవారం. నాల్గవరోజున తీరా బయలుదేరుతో ఉండగా ఎవరో తుసుక్కున తుమ్మారు. అయిదవరోజు పిల్లియెదురౌతుంది. ఆరవరోజున వర్జం, వారం, నక్షత్రం అన్నీ చూచుకొని బయలుదేరేసరికి ప్రక్కయింటినుండి ఒక విధవ స్త్రీ యెదురుగా వస్తుంది. ఈలా శకునములు చూసుకొంటూ అలస్యము చేయుటచేత ఆ ఉద్యోగంకాస్తా పోతుంది. తనకు ఏలినాటి శని ఉన్న దని, జాతకం చూపిస్తే ఆ సంవత్సరం తనకు ధననష్ట మవుతుందని జ్యోతిష్కుడు చెప్పాడని చెపుతాడు.

ఆ కాలంలో భోగంవాళ్ళ పిచ్చి చాలా ఉండేది. ఒక గొప్ప ఉద్యోగస్థుడు ఏదో యొకకార్యం తలపెట్టి దానికి భోగంమేళం పెట్టడం, అతని తాబేదార్లందరూ ఆ మేళానికి తప్పకవెళ్ళాలి. వెళ్ళి వాళ్ళకేదో ముడుపుచెల్లించాలి. ఆలా యెవరైనా వెళ్ళకపోయినా, వెళ్ళి డబ్బీయకపోయినా ఆతని యుద్యోగానికి నీళ్ళు వదులుకోవలసిందే. పెద్ద యుద్యోగస్థులన్నవారు, ధనవంతులూ తప్పక భోగందాన్ని ఉంచుకోవాలి. ఆలా ఉంచుకోనివారు పురుషులేకారు. వారికి సంఘములో గౌరవం లేదు.

ఈ విధంగా సంఘములోగల ఈ మూఢ విశ్వాస దురాచార దురభిమాన ఘోర పిశాచంతో పోరాటమలా యుండగా అన్నిటికంటే గడ్డయిన సమస్యమరియొకటి. అది వితంతు బాలికలకు తిరిగి వివాహముచేయుట మహాపాతకమనే నమ్మిక.

ఈ పై విషయముల నన్నిటినీ గురించి ప్రహసనములు, నవలలు, పత్రికలు, వ్యాసములు, ఉపన్యాసములు, వాగ్వాదముల ద్వారా ప్రజలలో గొప్పసంచలనము, పరివర్తన తీసికొనిరావచ్చు. వితంతూ ద్వాహమట్టిదికాదు. క్రియచేసి చూపాలి. వితంతు బాలికలను తీసికొనివచ్చి వివాహములు చేయాలి. అయిదేండ్లు, మూడేండ్లు, రెండేండ్లు, ఏడాది, చివరకు నెలలబిడ్డలకుకూడా వివాహాలు చేయటం, పేద వారు తమ బాలికలను పది పంద్రేండ్డేళ్లవరకు పెంచి అరువది, డెబ్బది, యెనుబది యేండ్ల యే మూడవ నాల్గవ పెండ్లివానికో ధనముతీసికొని, వివాహము చేయటం; ఆ బాల పెండ్లికొడుకులు ఏ బాలారిష్టములవలననో, ఈ ముసలి పెండ్లికొడుకులు ఏ వార్ధక్య జబ్బువలననో మృతి నొందితే ఆ బాలికలు యావజ్జీము వైధవ్యమునను భవించవలసినదే. వారికి పంద్రెండేండ్లురాగానే జుట్టు తీసివేయించి బోడులనుచేసి కూర్చోపెట్టడం. కొన్ని నిమిషాలతో వదిలిపోయే సహగమనబాధను రామమోహనుఁడు పోగొడితే యావజ్జీవ నిర్బంధ వైధవ్యబాధ బాలవితంతువులు అనుభవించవలసి వచ్చింది. ఇదికొన్ని నిమిషముల చితికాదు, యావజ్జీవచితి. ఇది చూస్తోన్న పంతులుగారికి చాలా కష్టంగాఉండేది. బాలవితంతువుల నెలా ఉద్ధరించడం? సహగమన విషయంలో రామమోహను డెంతకష్టపడెనో అంతకష్టమూ పంతులుగారు పడవలసియున్నది. దాని కొరకు పంతులుగారు శృతులు, స్మృతులు, శాస్త్రములు, ఉపనిషత్తులు బాగాచదివి అవగాహన చేసికొన్నారు. ఆయన ఈ వివాహాల విషయమై పత్రికలలో వ్రాసినప్పుడు, ఉపన్యాసము లిచ్చునప్పుడు శాస్త్రులవార్లు, పండితులు ఆయునతో హోరా హోరీని వాదిస్తో ఉండేవారు. పంతులుగారు శాస్త్రములనుండి, శృతి స్మృతులునుండి స్త్రీ పునర్వివాహములు శాస్త్రసమ్మతములేనని ఉదాహరణములద్వారా చూపినప్పుడు వారు తమ వాదనలను సమర్ధించుకోలేక కోపించి పంతులుగారిని తిట్టడం, కొట్టబోవడం కూడా ఉండేది. కాని పంతులుగారు చాలా పట్టుదలగల మనిషి. తాను పూనిన మంచి కార్యమును ఎట్టి ఆటంకములువచ్చినా, ఎట్టి కష్టములువచ్చినా చివరకు తన ప్రాణంమీదికివచ్చినా వదిలిపెట్టువారుకాదు. వితంతూద్వాహముల కొరకు వితంతు బాలికలను రహస్యముగా నెత్తుకొని రావలసి వచ్చేది. ఈ విషయములో వారి విద్యార్థులే వారిసైన్యము. పిల్లలను తీసికొని వచ్చేటప్పుడు ఎన్నోకష్టములను, ఆటంకములు ఎదుర్కొనవలసివచ్చేది. ఒక్కొక్క సమయములో పోలీసువారి సహాయంకూడా కావలసియుండేది. వివాహములు జరిపేటప్పుడు పూర్వాచార పరాయణులగు ప్రజలు వీరిని వెలివేసి చాకలి, మంగలి, దాసీ, నీళ్ళుపోసేవాళ్ళు, వంటవాళ్ళు ఎవరూ వారికి పనిచేయకుండా చేసియు, ఇంటిముందు, వీధిగుమ్మం తలుపులమీద అశుద్ధము వేసియు, ఇంటిమీద రాళ్ళురువ్వియు ననేక విధముల బాధించు చుండేవారు.

"శా॥ నీతిప్రౌఢ విహారులైన నిపుణుల్ : నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ: గాఢంబుగా సాగనీ
ఘాతం బప్పుడ కలుగనీ నియతిమై : కానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపథంబు దప్పరుకదా।నిత్యంబు ధీరోత్తముల్."

ఇట్టి ధైర్యశాలి పంతులుగారు. ఆయన అనుయాయి స్నేహితులుచేయు స్తోత్రములకు ఉబ్బిపోలేదు. ప్రతిపక్షులుచేయు నిందలకు, ఆటంకములకు బెదిరిపోలేదు. ధనములేదని వెనుదీయలేదు. ధనముకొరకు ఎవరినీ యాచించలేదు. తాను తలపెట్టినకార్యము నెరవేరుటే ఆశయము. సంఘమునందలి మూఢ విశ్వాస రాక్షసిని పారద్రోలి ప్రజలను రక్షించి, వారిని యుక్తాయుక్త వివేచనాపరులనుగా చేయుటయే ఆయన ఏకైక కార్యదీక్ష. అందుకొరకే చివరవరకూ పోరాడారు. చరితార్థులయారు. సాంఘిక విప్లవకారుఁడు,మహాయోధుడు పంతులుగారు. ★

అ. భాస్కరమ్మ

# వీరేశలింగస్మృతి

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

చీకటిలో పడిపోతుంటే
ఆకటితో చనిపోతుంటే
దూరపు వెలుగు తెచ్చినదెవరో
తీరని యాకలి తీర్చినదెవరో !

మురుగు కాలవల ముంచువాసనలు
తరిగేస్తోంటే గర్భగోళములు,
తూములెత్తి మురుగంత సముద్రపు
దారిపట్టించిన సరదారులు నెవరో !

ఒకటే పాత ఒకటేరోత,
కకవికలైన ప్రపంచం బెల్లను
చికిలిచేసి క్రొమ్మెరుపులు తెచ్చిన
శిల్పియెవరో శ్రీ జల్పియెవ్వరో !

మిన్నున నా వెలుగున్నది కానీ
మన్నున నా వెలుగున్నదొ లేదో
మన్నున పంటలు పండించుమురా
మిన్ను వెలుగుకై వెతపడకుమురా
అన్న మేలిమాటలు చెప్పినదెవరో !

మారినకాలం, తీరనిమోహం,
జారిన ధీమా, కోరినదాహం,
తెలియక, సొలయక, నడవండంచును
పలికిందెవరో ! పలికిందెవరో !!

రామమోహనుడు రాచినదారులు
కోమలాత్మకులు కొల్చినదారులు
ప్రేమమృదాత్ములు విల్చినదారులు
తెరిచినదెవరో ! తీసినదెవరో !!

క్రొత్తక్రొత్త మార్గమ్ములుతీసీ
క్రొత్తక్రొత్త దుర్గమ్ములుతెరచీ
క్రొత్తక్రొత్త సర్గమ్ములుచేసీ
చిత్తమెక్కి విహరించినదెవరో !

నటశివ సంధ్యారోచి
ర్జటా పటల నిటలాంతఃపాతి
స్ఫుటవినీల కేశచ్ఛవియై
కుటిలపరచినది యెవరో ! యెవరో !!

ఇదియే మంచిది ఇదియే మంచిది
అదిమంచిది యప్పటి కప్పటి
కదిమంచిది వానికి వానికి
ఇదిరహస్యమని చూపినదెవరో !

ఒకవైపున సృష్టియు జరుగును
ఒకవైపున లయమూ జరుగును
స్థితి యీ రెండింటి నడుమన యుండును.
ఒకకాలమ్మున నన్నియుండునూ
మహాప్రళయ నటరాజాంశ
ప్రహారమైయొక తేజఃకణమది
విహారముగ వెడలినదోయన
సహాయమై వచ్చినదెవరో !

# ప్రకృతి శాస్త్రములు

## శ్రీ వసంతరావు వెంకటరావు

మానవుని సమగ్ర పురోగమనానికి ఆత్మ జ్ఞానము, భౌతిక జ్ఞానముకూడ అత్యంతావశ్యకమే. అవే జ్ఞానవిజ్ఞానాలుగా వ్యవహరింపబడుతున్నాయి. ఏ కారణం చేతనో కాని మానవుడు ముందుగా ఆత్మజ్ఞానాన్ని పొంద కలిగేడు. దేశదేశాల ప్రాచీన చరిత్ర ఈ విషయాన్నే బలపరుస్తుంది. మనోబుద్ధి చిత్తాల ఏకాగ్రదీక్ష మూలంగా ఆత్మజ్ఞానం లభ్యమైతే పంచేంద్రియాలవల్ల, పంచేంద్రియాల కవగతమయేటట్లు బహువిధ యంత్రాలు ఉపకరణాలు సంపాదించిన జ్ఞానంవల్ల భౌతికవిజ్ఞానం పెరుగుతుంది. కాంతారవాసులై ప్రకృతి శక్తుల తీవ్రపీడనాలకు గురియౌచుండిన ఆదిమానవులు ప్రకృతిపై దండయాత్ర చేయడంకంటె మనస్సును అంతర్ముఖం చేసికొనడమే ఉత్తమ మార్గంగా భావించేరేమో! ఇండియా, ఈజిప్టు, గ్రీసు, చైనా దేశాలలో ఆత్మజ్ఞానాన్వేషణమే ప్రప్రథమంగా గోచరిస్తుంది.

2,500 ఏండ్ల క్రిందటినుండి భౌతికవిజ్ఞానం చూచాయగా గోచరిస్తున్నప్పటికి 400 ఏండ్లనుండి ప్రపంచ వ్యాప్తమైన జ్ఞానభాగంగా పెంపొందుతూంది. భౌతిక విజ్ఞాన పురోగమనానికి ఎక్కువగా పాశ్చాత్యదేశాలే తోడ్పడుతున్నాయి. ప్రాచ్యదేశాలు అంతగా ముందంజ వేయలేదంటే బాధపడవలసిన అవసరం లేదు. గురుత్వాకర్షణ సిద్ధాంతంతో మొదలుపెట్టి పరమాణు విచ్ఛేదం వరకు సాగిన, సాగుతున్న, విజ్ఞానయాత్రలో పాశ్చాత్యులు ముఖ్యపాత్ర వహించడంచేత పాశ్చాత్య భాషలలో విజ్ఞానం అనేకవిధాల పలువురిచేత చక్కగా వివరింపబడింది. దేశకాలానుసారంగా దాస్యశృంఖలాలకు చిక్కి పరభాషా ప్రభావానికిలోనై మొన్నమొన్నటివరకు కృశించిన భారతీయ భాషలలో విజ్ఞానానికి స్థానమే లేకపోయిందంటే ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. అయినప్పటికీ ఒక శతాబ్దం క్రిందటనే భారతీయులకు విజ్ఞానాన్ని అందజేయాలన్న తీవ్రమైన సంకల్పం ఆ నాటి మేధావంతులకు కలిగింది. చిన్నచిన్న వైజ్ఞానిక పుస్తకాలు భారతీయ భాషలలో అక్కడక్కడ ప్రచురితమయేవి.

యుగపురుషుడైన శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారుకూడ ఆ భావంచే ప్రబోధింపబడ్డ మహామహులు; తెలుగు సరస్వతికి రకరకాల అమూల్యాభరణాలు సమర్పించిన మేధావి, బహుముఖ ప్రజ్ఞాశాలి. విజ్ఞాన విషయాలపై వారు వ్రాయడానికి ముఖ్యకారణం ఇంగ్లీషు రాని తెలుగువారికి విజ్ఞానం అందలేదన్న తపన. మహత్తరమైన ప్రకృతిశాస్త్రాలు జనసామాన్యానికి తెలిసేటట్లు సులభశైలిలో వ్రాయడానికి వారుద్యమించారు.

అయితే వారి రచనలను సమీక్షించినపుడు వారే ఆశయాలతో అట్టిపనికి పూనుకొన్నారో కొంతవరకు విశదమౌతుంది. వైజ్ఞానిక గ్రంథాలు తెలుగులో చాల స్వల్పంగా నుండుటచేత ఆ కొరత తీర్చడం ఒకటి; ఏ విషయంపై వ్రాసినా దానికి సంబంధించిన ఇంగ్లీషు పుస్తకాలు చదవడమేకాక దానికి అనుగుణమైన మన ప్రాచీన శాస్త్రాలను శోధించి సమన్వయ పరచడం రెండు; విజ్ఞానం సులభగ్రాహ్యమైన జ్ఞానభాగం కాకపోవుటచేత విషయ విస్తరణకు అనువైన చిత్రాలు సాధ్యమైనంత ఎక్కువగా చేర్చడం మూడు; సరియైన జ్ఞానం లేని కారణంచేత ప్రజలలో నాటుకొన్న మూఢవిశ్వాసాలను

పారద్రోలడానికి యుక్తమైన జ్ఞానాన్ని జనసామాన్యానికి అందజేయడం నాలుగు,

1878 లో ప్రారంభించి పదేండ్ల తరువాత 1888 లో పూర్తిచేసిన "శరీర శాస్త్ర సంగ్రహము"లో ఉపోద్ఘాతమున శ్రీ పంతులుగారు ఇట్లు వ్రాసేరు: "...In the preparation of this book I have consulted several English works in Anotomy and Physiology. I have also studied those portions Smruta, Ashtanga, Hrithaya and other Sanscrit medical works which treat of Physiology.. విదర్శన పూర్వకముగ పరీక్షించినంగాని కొన్ని యంశములను పూర్ణముగా తెలిసికొనుట యసాధ్యముగా గానబడినందున, నా మిత్రుడయిన యొక వైద్యశాలా సహాయుని సాహాయ్యమున మేకయొక్క హృదయము శ్వాసాశయము మొదలయిన యవయవములను వాని వాని స్థానములను వాని యందలి భాగములను నతడు ఛేదించి చూపగా నావరకు దురవగాహములుగా నుండిన యంశము లనేకములు గ్రహించితిని." నాటి మేధావుల కార్యదక్షత ఆర్జవము వీరి రచనలలో ప్రతిబింబిస్తాయి.

1895లో ప్రచురించిన "జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము"లో పంతులుగా రిట్లు వ్రాసేరు. "...ఈ గ్రంథమును రచించుటకై నే నింగ్లీషు భాషలోనున్న కొన్ని జ్యోతిష గ్రంథములను జదువుటయేకాక సంస్కృత భాషలోనున్న సూర్య సిద్ధాంతము, సిద్ధాంత శిరోమణి, పంచసిద్ధాంతిక మొదలయిన సిద్ధాంత గ్రంథములను సహితము చదివినాను... ఈ శాస్త్ర జ్ఞానము వ్యాపించిన పక్షమున జనులలో నిప్పుడు గల మూఢ విశ్వాసము లనేకములు తొలగింపవచ్చును. As illustrations are absolutely necessary in a work of this nature to convey an accurate idea of facts to the reader, I have got about 50 diagrams needed in the book engraved in England at a great cost."

ప్రకృతి శాస్త్రములు

1896 లో ప్రచురితమయిన "జంతు స్వభావ చరిత్రము"లో శ్రీ పంతులుగారు ఇట్లన్నారు: ..."మావి నుండి పుట్టి పిల్లలకు స్తన్యమిచ్చెడి యీ కడపటి జాతి జంతువులను గూర్చియే ఈ భాగమునందు గొంత వ్రాసి యున్నాను. ఇటువంటి పుస్తకము లీవరకు తెలుగు భాషలో నంతగా లేవు...హిందూదేశమునందుగల ముఖ్యమైన జంతువుల గూర్చియు ఖండాంతరమునందుగల కొన్నిటిని గూర్చియు నిందు ముఖ్యాంశములను దెలిపి యున్నాను. ఈ గ్రంథ రచనకయి కష్టపడి సావకాశముగా పెక్కు గ్రంథములను శోధించుటయేగాక యిటువంటి గ్రంథములలో పటములు లేక విశేష ప్రయోజనము కలుగ నేరదని యెంచి వ్యయ ప్రయాసముల కోర్చి యీ భాగమునందే యరువది కంటె నధికముగ జంతు పటములను సహితము చేర్చి యున్నాను."

జ్యోతిశ్శాస్త్రజ్ఞానము మానవునికి శ్రేయస్కరమని గుర్తించిన శ్రీ పంతులుగారు ఆ గ్రంథమందు ఇట్లంటారు. "...అనంతకోటి బ్రహ్మాండ భాండము లీ విధముగా నమేయమైన యాకాశాంతరాళమున నిరాధారముగా నిలచి, యాకర్షణాది సుస్థిరనియత ధర్మములకు లోబడి నడచుచుండగా గనులార చూచుచు వాని నట్లునడిపెడి యద్భుతాప్రమేయ బుద్ధి మహిమగల నియంత యొక్కడున్నాడని తెలుసుకొని యా సృష్టికర్త యొక్క యచింత్యాద్భుత శక్తి కాశ్చర్యపడి యానందింపకుండు వాడొక్క జడుడు దక్క లోకములో మరి ఎవ రుండును! ఇటువంటి వింతల ననుదినము గనుగొనుచు భావంబునం దలపోయు వివేకి ఎవ్వడు, భయాద్భుత ప్రమోదములపాలయి యసంఖ్యగోళ కోటులను సృజించి శాసించుచున్న సర్వ శక్తుడగు పరమేశ్వరుని భక్తి గౌరవములతో స్మరింపకుండ నేర్చును?" (రెండవ ప్రకరణము)

తోకచుక్కల గురించి వ్రాయుచు..."...మౌఢ్య దేవత యింకను విడిచిపోనందున మన దేశమం దిప్ప

టికిని తోకచుక్క వలన దేశమున కేదో గొప్ప యుప ద్రవము వచ్చునన్న పిచ్చి భయము జనులను బాధించు చునే యున్నది. ఒకానొకప్పుడు తోకచుక్క వచ్చిన సంవత్సరమున క్షామాది బాధలలో నేదియైనను రా దట స్థించినను అది దానివలననే వచ్చి నదనుకొను బుద్ధి హీనతను విడిచి మన వారీశ్వర సృష్టి మహిమలను జూచి యద్భుతపడి యానందింప నేర్చుకొందురుగాక !... ధూమకేతువులవలెనే యుల్కాపాతములను దేశారిష్ట సూచకములని భావించి మన దేశమునందు జనులు మౌఢ్యముచేత సమస్తాపదములను వాని కారోపించు చున్నారు. శాస్త్రజ్ఞానము జనులలో వ్యాపించి, యిట్టి మూఢ విశ్వాసమును శీఘ్రకాలములోనే మన దేశమునుండి పాఱ దోలునుగాక !' (ఎనిమిదవ ప్రకరణము)

"శరీర మాద్యంఖలు ధర్మసాధనం" అను భావాన్ని పురస్కరించుకొని తోటి మానవుల అనారోగ్య స్థితికి పరితపించిన శ్రీ పంతులుగారు "యెల్లవారికి నుపయోగ పడునట్లుగా సులభశైలిలో దేహారోగ్య ధర్మబోధిని" ని 1889 లో వ్రాసేరు. దేహారోగ్యానికి ఆవశ్యకములయిన వాయువు, జలము, భోజనము, దేహ గృహ పరిశుభ్రతలు దేహపరిశ్రమ విశ్రాంతుల గూర్చి అందులో సంగ్రహంగా చర్చించేరు.

దేశీయులు విజ్ఞానవంతులయితే కాని నిజమయిన దేశాభ్యుదయం కలుగదని శ్రీ పంతులుగారు ఆనాడే గుర్తించారు. ఆ విశిష్ట భావాన్ని "సకాయ కష్టకర్మలు"లో ఈ విధంగా వెలువరించేరు. "...శాస్త్రీయ సారముగా సేద్యముచేసి పిత్రాచారమును బట్టియే యెప్పుడు నేక రీతిగా వ్యవసాయము చేయువానికంటె ద్విగుణముగాను త్రిగుణముగాను ఫలమునొందవలెనన్న వాడు రసవాద శాస్త్రము మొదలయిన వాని నెన్నిటినో నేర్చుకొన వలయును. కాలువలు త్రవ్వి నీరు నడుపువారు, జలము యొక్క ధర్మములను తెలియుటకియి జలశాస్త్రమును జల యంత్రశాస్త్రమును నభ్యసింపవలయును. అద్దములు మొదలయిన వానిని జేయువారు తాముచేసెడి పనిని క్రమక్రమముగా నభివృద్ధిచేయ నపేక్షించిన పక్షమున తదను గుణములయిన జడ పదార్థములను బోధించెడు ప్రకృతిశాస్త్రముల నవశ్యముగా గ్రహింపవలెను."

ఇంగ్లీషు మాట్లాడడమంటే ఎంతో మోజుగానున్న కాలంలో, ప్రాంతీయ భాషలకు గౌరవస్థానమే లేనట్టి కాలంలో, సుమారు 80 ఏండ్ల క్రిందట, తెలుగులో విజ్ఞాన ప్రచారానికిసైతం మార్గదర్శకులైన శ్రీ పంతులు గారు సాంకేతిక పదజాల విషయంలో అనుగమించిన మార్గం మహోత్తమ మయినది. దాదాపు 700 సాంకేతిక పదాలకు సూటిగా అర్థవంతములైన తెనుగు పదాలను విని యోగించారు. ఇప్పటికీ సాంకేతిక పదాల సమస్య తీరలేదు. కాని శ్రీ పంతులుగారి వైజ్ఞానిక పుస్తకాలు చదివిన వారికి ఆ సమస్య యదార్థమయినది కాదని, ప్రాంతీయ భాషకు విజ్ఞానలోకంలో సముచితస్థాన మివ్వ డానికి మనస్కరించని ఆత్మవంచకులు సృష్టించిన పెను భూతమని స్పష్టమౌతూంది. మనం పెరిగితే భాషకూడా పెరుగుతుంది. ఆ సత్యాన్ని శ్రీ పంతులుగారివంటి ద్రష్టలు సులభంగా నిరూపించేరు.

వసంతరావు వెంకటరావు

# ఆస్తికత

## శ్రీ నాళి జగన్నాధరావు

నవయుగ భావుకులలో అగ్రశ్రేణికి చెందిన Bernard Shaw (బెర్నార్డుషా) ఒకానొక సందర్భమున "Civilisation needs a religion as a matter of life and death." నాగరికత నిలదొక్కుకొనుటకు జీవన్మరణ సమస్యగా ఒక ధర్మమును ఆలంబనము చేసికొనవలసి యున్నది అని వ్రాసియున్నారు. ఆ ధర్మము ఎటువంటిదో నిరూపించుటకు "Adventures of a Black girl in search of God" అను గ్రంథమును రచించి యుండెను. గ్రంథ విస్తరణభీతిచే వివరములు తెలుపుటకు సాధ్యపడదు కాని దానిలోని సారాంశమును బరోడా గయిక్‌వాడ్, ఆస్తిక మహాసభ అధ్యక్ష పీఠమునుండి పలికిన ఈ వాక్యములు స్పష్టపరచును. "Religion needs decoding that the modern man may understand and then debunking that the modern man may respect it". నవీన మానవుడు ధర్మమును గ్రహించుటకు శాస్త్ర శృంఖలములనుండి విడిపింపవలయును. నవీన మానవుడు ధర్మమును గౌరవించుటకు దానిపేర జరుగు మోసమును క్షాళనము చేయవలయును. Bernard Shaw (బెర్నార్డుషా) ఏ ధర్మమునుగురించి అన్వేషణ జరిపి యుండెనో గయిక్‌వాడ్ ఏ ధర్మమును సామాన్య మానవులు అర్థముచేసుకొని గౌరవించవలెనని ఆకాంక్షించియుండెనో అట్టి ధర్మమును అన్వేషించి ప్రచారములోనికి తెచ్చుటయే శ్రీ వీరేశలింగం పంతులుగారి జీవిత సాధనము.

సీ॥ భాషా రచనయందు స్వాతంత్ర్యము వహించి
తీయని వాకిండ్లు తీసినాడు
విజ్ఞానదృష్టి మాపిన శాస్త్రములు జీల్చి
జన మనోదాస్యంబు బాపినాడు,
కులమత ద్వేష శృంఖలాలను ఛేదించి
జాతీయ భావంబు జాటినాడు
కుహనా మతాచార కుటిలకృత్యము లాపి
పరమాస్తిక వ్యక్తి నెరపినాడు
ఆ దయావ్రతి మాతృదేశాభిమాని
సంఘ సంస్కార భార దీక్షా తపస్వి
యలరు శ్రీ వీరేశలింగ మహర్షి యొకడె
ప్రస్తుతాంధ్రోద్యమమునకు బ్రహ్మ యగుచు.

[ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు.]

పై పద్యములో ఆచార్య సుబ్బారావుగారు శ్రీ పంతులుగారి సమగ్ర జీవితమును చిత్రించి మనయెదుట ప్రదర్శించిరి. వివిధ రంగములలో వారు చేసినకృషి స్థూలదృష్టికి భిన్నముగా కనబడినప్పటికీ కొంచెము లోతుగా పరిశీలించిన వారి సకల వుద్యమములు ఒకే సూత్రముపైని సాగినవని తెలియగలదు. బ్రహ్మసమాజ స్థాపనాచార్యులైన రాజర్షి రామమోహనరాయలకును, శ్రీ పంతులుగారికిని విశేష సామ్యము కలదు. పత్రికా రచనయందు, ధర్మగ్రంథ భాషాంతరీకరణమునందు, సులభమైన గద్యశైలిని రూపొందించుటయందు స్త్రీ జనోద్ధరణయందు, రాజర్షిని ఏ "Inense Thteistic passion" ప్రగాఢమైన ఆస్తిక్య వుత్తేజము, ప్రేరేపించెనో శ్రీ పంతులుగారియందుకూడ అచంచలమైన ఆస్తిక్య బుద్ధే సమస్త సదుద్యమములకు కారణభూతమైనది. పరిశుద్ధ ఆస్తిక ధర్మమునకు ఈశ్వర పితృత్వము మానవ సౌభ్రాత్రము ఆధ్యాత్మికోపాసన మూలసూత్రములు. సత్యమును ప్రతిష్ఠించి జ్ఞానమును ప్రచారముచేసి, ఆనందము సమకూర్చుటయే సత్యజ్ఞానా

నంద స్వరూపుడైన పరమేశ్వరుని వుపాసించుటయని పంతులుగారి విశ్వాసము. భాషారచనయందు 'పొట్టలుబ్బగ నవ్వుపుట్టించునేగాని చురకలుగదె నీదు సూక్తులెల్ల' అని శ్రీ పంచాగ్నులవారు ప్రస్తుతించిన అనేకములైన ప్రహసనములు, హాస్యసంజీవనలు, సత్యరాజు పూర్వ దేశ యాత్రలు, స్త్రీల కుపయోగించు కథలు అన్నియు కుహన మతాచార కుటిల కృత్యములు ఆపి సత్యధర్మమును ప్రతిష్ఠించుట కుద్దేశింపబడినవే.

జనులకు విజ్ఞానదృష్టి కలిగించుటకు శారీరక జ్యోతిష శాస్త్రములు రచించుటమాత్రమే గాక సతీ హితబోధిని, పత్నీ హిత సూచినీ, దేహారోగ్య ధర్మబోధిని మొదలైన గ్రంథములు సైతమును వ్రాసి జన మనోదాస్యముబాపి జ్ఞానస్వరూపుడైన పరమేశ్వరుని ఆరాధించారు. నిరాకారోపాసనము జనులకు సులభము, సాధ్యము అని తెలుపుటకు శ్రుతిస్మృతి పురాణేతిహాసములలోనిఅనేకప్రమాణ వాక్యములను ఉదహరించి హేతువాదనపై సమన్వయ పరచి, విగ్రహారాధనపై సునిశితమైన దండయాత్ర సలిపియుండిరి. ఈ సందర్భమున ఆయన చేసిన వాద ప్రతివాదములయందు కటువు అయిన భాషను ప్రత్యర్థులపై నుపయోగించెనని అపవాదు కలదు, కాని ఆర్యసమాజ సంస్థాపకులైన దయానంద సరస్వతి రచించిన సత్యార్థ ప్రకాశిక అను గ్రంథముతో సరిపోల్చి చూచినయెడల పంతులు గారి భాష అతి సరళమైనదని గ్రహింపకపోరు.

సర్వమానవ సౌభాత్రమునకు కులమత ద్వేషములు ప్రతిబంధకములని, వర్ణము అను శీర్షికక్రింద ప్రత్యక్ష అనుమాన శాస్త్ర ప్రమాణములలో జాతిభేధము సమర్ధనీయము కాదని స్పష్టపరచెను. శ్రీ గురజాడ అప్పారావుగారు దేవుడు అను శీర్షిక క్రింద

"మనిషిచేసిన రాయి రప్పకు
మహిమ కలదని సాగి మ్రొక్కుతూ
మనుష లంటె రాయి రప్పల
కన్న కనిష్టము
గాను చూస్తావేల బేల!"

అని జాతిబేధమును తెగడియున్నారు. శ్రీ కృష్ణశాస్త్రి "చీకటి గదులునైన్ను జగదీశ్వరాలయములోన" అనియు

"గుణములేనివాని దే కులమైతేనేమి తృణమైతేనేమి శ్రీ చరణ మంటునేని" అని వ్రాసి ఈశ్వర రాజ్యములో జాతిబేధములకు తావులేదని నిరూపించియున్నారు.

ఆజన్మాంతము ఉబ్బస రోగముతో బాధపడుచూ, దుర్బలశరీరులైన శ్రీ పంతులుగారు "సంఘ సంస్కార భార దీక్షా తపస్వి" ఎటుల కాగల్గిరని సంశయాత్ములు శంకింపవచ్చును. దుర్బలులైన మహానుభావులకు దైవ బలము ప్రసాదింపబడి ఎట్టి బరువులనైనను మోయుటకు తగిన సామర్థ్యము ప్రసాదించుచుండును.

వారు శతాధిక గ్రంథకర్త. సకల సంస్కరణల ఉద్యమములయందు నాయకత్వము వహించెను. సామాన్య వేతనమును సంపాదించు తెలుగు పండితుడయ్యు ముప్పై సం॥లకు పూర్వము 40 వేల రూప్యములు విలువచేసే ఆస్తిని హితకారిణీ సమాజము ధర్మకర్తలపరము చేసి ఆచంద్రతారార్కము చిరస్మరణీయులు కాగల్గిరి. ఈ నాడు ఆ ఆస్తి విలువ మూడులక్ష లగును. ఇది యంతయు ఎట్లు సుసాధ్యము కాగలదని పర్యాలోచన చేసినప్పుడు ఒక సత్యమును మనము గ్రహింపగల్గుదుము. తన కాలము, తన ధనము, తన సర్వశక్తులు ఈశ్వర ప్రసాదితములని గుర్తించి దుర్వినియోగము కాకుండా జాగ్రత్త తీసుకొనుటచే దుస్సాధ్యమైనది సాధ్యము కాగల్గెను. అందుకనియే ఓ కవి —

"దర్ప శయ్యను చేరెడు దనుకగూడ
జేసె భాషావధూటికి సేవ నతడు" అని వర్ణించియున్నాడు. అవసాన దశయందు సైతము తాము రచించిన ఆంధ్ర కవుల చరిత్ర Proof ను దిద్దుచూ పరమపదించెను.

ఆస్తికత

1906 సం॥లో గుంటూరులో విద్యార్థిగా నున్నప్పుడు శ్రీ పంతులుగారి దర్శనభాగ్యము లభించినది. విపరీత మగు ఉబ్బసముతెరచే బాధపడుచున్ననూ మాటతప్ప లేక సంఘ సంస్కరణ మహాసభ అధ్యక్షపీఠమును అలంకరించిరి. వారు చదువు వుపన్యాసముకంటె దగ్గులే ఎక్కువగా వినపడినవి. దుర్బలమైన శరీరమునందు ఎంతదృఢమైన కర్తవ్యపరాయణత యిమిడియున్నదో గ్రహించినపుడు నా ఆశ్చర్యమునకు మేరలేదు. మరొక సారి 1908 సం॥ ప్రాంతములో వితంతు వివాహము జరిపించుటకు శ్రీ పంతులుగారు బరంపురము వచ్చి యుండిరి. ఆనాడు యిటువంటి వివాహములకు వచ్చి తాంబూలము పుచ్చుకొనుటకు సైతము పెద్దలు భయపడు చుండిరి.

వివాహానంతరము తన శిష్యకోటిలో చేరిన నా పితృదేవుని చూచుటకు మా గృహమునకువచ్చి "మీరు వివాహమునకు వచ్చినట్లులేదే" అని సూటిగా వారిని ప్రశ్నించిరి. లజ్జావనత వదనముతో మా తండ్రిగారు "నా తరపున మాఅబ్బాయి (నేను) వచ్చెను"అని చెప్పి తప్పించుకొనిరి. వయసుతోగాని, పదవితోగాని, పెద్దరికముతోగాని, ప్రమేయము లేకుండా తన హృదయములోని భావములనునిష్కర్షగా వెలిబుచ్చుట పంతులుగారి ప్రత్యేకత.

వారి శిష్యపరంపరకు మితము లేదు. వారందరికన్నను మిన్నగా ప్రకాశించినది వారి అర్ధాంగియగు రాజ్యలక్ష్మమ్మ గారు. అతి బాల్యముననే వివాహమైనను పంతులుగారివద్ద విద్యాబుద్ధులను అలవరచుకొని వారి సమస్త సదుద్యమము లలో తోడు నీడయై సహకరించుచూ ఆమె లేకున్న పంతులుగారు యిన్ని మహత్కార్యములు సాధింపగల్గి యుందురా యని సంశయము జనించునట్లు నడచుకొనిరి. జీవితమునందు మరణమునందు ఆమె సహధర్మిణియైన రాజ్యలక్ష్మి ప్రమదావనములో వారి జీవితావశేషములు నిక్షిప్తములు జేయబడినవి.

మహమ్మదు ప్రవక్తచే విరచింపబడెనని చెప్పబడు పవిత్ర ఖురాను గ్రంథముయొక్క అధ్యాయము (సుర) "In the name of God the most compassionate and merciful" అనే వాక్యముతో ప్రారంభించినటుల అచంచల ఈశ్వర విశ్వాసముగల వీరేశలింగం పంతులు గారు సైతము తమ ప్రతి వుపన్యాసములో ఈశ్వరాశీర్వాదమును వేడుకొని ముగించు చుండిరి. శ్రీ పంతులుగారి ఆస్తిక్యతకు యింతకన్న యితర ప్రమాణము వేరేది యుండగలదు!

---

తాత ముత్తాత లెంతెంత ధనము కూడ
బెట్టి పెట్టెలు నిండంగ బెట్టియున్న -
గష్టపడి తాను న్యాయమార్గమున బడియు
స్వార్జితం బొక్క గవ్వతో సమముగాదు.

— శ్రీ వీరేశలింగం

# ప్రహసనాలు

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

పిచ్చి నమ్మకాలు విపరీతపు పూర్వాచారాలు రాజ్యం చేస్తూవుండే కాలంలోపుట్టి హేతువాదమనే ఆయుధాన్ని పట్టుకుని అరటినరకుడువంటి విధ్వంసానికి ఉద్యుక్తులై నారు వీరేశలింగము పంతులుగారు. వారి సంస్కారోద్య మానికి వ్యాసాలూ ఉపన్యాసాలూ ప్రహసనాలూ త్రిశూలముల్లాగ పనిచేశాయి. అయితే మొదటి రెండింటికీ వారికితరిఫీదు అవసరము కాలేదుగాని మూడో ప్రక్రియకు కావలసి వచ్చినది. ఆంగ్లభాష (ఇంటరు మీడియేటు వరకూ) చదివినవారు కనుక ఆంగ్లములోని ప్రహసనము లను పరిశీలించారు, తమకు అలవాటుకావడము కోసము కాబోలు తెనిగించారు. ఇలా తెనిగించడములో పేరులను కొంతకథను తెనుగువారి కనుకూలముగానుండులాగున మార్చిచేసినారు.

పేరులు కొన్నిటిని ఆయాపాత్రల గుణములను సూచించునట్టివిగా మార్చుకున్నారు-కరటకరెడ్డి, మోహిని, ధనకోటిరాజువంటి వాటిని. కాని మొత్తముమీద పేరులు భారతీయ సంప్రదాయానుసారంగా చంద్రిక, కమల అని పెట్టినవే. కథాసరళిని అంతగా దిద్దుకోకపోయినా, సమకాలికుల అవగుణాలు చదువరులకు స్ఫురించవలెనని గోదావరిదాటి కొవ్వూరు వెళ్ళడమూ, రివెన్యూ అధికారుల కోసము ఫెర్రీ స్టీమర్లు కనిపెట్టుకొని వుండడమూ వంటి స్థానిక విపరీతములను చేర్చారు ధారాళంగా. కథా వాతావరణాన్ని వీలైనంతవరకూ భారతీయం చేశారుగాని యువతీ యువకుల బాహాట ప్రేమవంటి యూరపుదేశపు టలవాట్లు మన రచనలలోకి విశ్వసనీయంగా దిగిరావు. వీటి ననుసరించి వుండే ప్రాణేశ్వరీ, ప్రియురాలావంటి విజాతీయ సంబోధనలూ కౌగిలింతలూ ముద్దులూ పలుకుబడులుకూడా తప్పిజారి వింతలుగానే దిగిపోతూంటాయి అక్కడక్కడ: 'ఇందులో వీడుచెప్పినది వక్కాక్షరమయినా నిజంకాదనడానకి లేశమైనా అవకాశంలేదు'. 'ఈ ఇద్దరిలో యెవరికయినా ధనపాలుడు మొగుడుకావడం తటస్థమయితే నాకయినట్టు దుఃఖపడతాను' అన్నవి రెండు ఉదాహరణలు. [ఇంగ్లీషు ప్రహసనాలను తెనుగు లోనికి తేవడము బహుకష్టమని చెప్పడమేకాని పంతులు గారి శక్తిని సందేహించడముకాదని మనవి. వారివలె ధారాపాతమయిన వచనము వ్రాసిన వారెంతమందీ?] ఇంగ్లీషులో అన్నప్పుడు తేలిగ్గా దాటిపోయే ఛలోక్తులు తెలుగులో బరువైన అశ్లీలాలుగా తయారౌతాయి కూడాను.

అయితే మనకు అపరిచితమైన ఇతివృత్తపు టల్లిక ఒకటి చక్కగా కనబడుతుంది ఈ ప్రహసనాలలో. అపూర్వ బ్రహ్మచర్యమూ విచిత్రవివాహమూ మహా బధిర ప్రహసనమూ పునర్మరణమూ బలాత్కార గాన వినోదమూ కలహప్రియ మహా మహోపాధ్యాయ యోగ నిద్రా మహావంచక అసహాయశూర ప్రహసనా లన్నవి పదీ ఆంగ్లమూలానుకరణములట. చిరకాలముగా ప్రగతి మార్గంలో సుదూరము పయనించిన ఆంగ్ల రచనలలో బిగుతూ వైచిత్రీ ఎక్కువగానే వుంటాయి. వుండవామరి? మొదటిది వినండి: రమాకాంతము పంతులు స్త్రీ జనాభిలాషి అని తెలిసిన అతనిసేవకుడు కరటకరెడ్డి తన భార్యను ఆతడుచూచే అవకాశమే లేకుండా తనకు వివాహమేకాలేదనిచెప్పి గడుపుతాడు. తనకు చనువైన పర

కాంత పుట్టింటికి పోతున్నదని విని రమాకాంతము ఆమెను కలుసుకోడానికి ఫెర్రీస్టీమరుకు ప్రయాణమవుతాడు. [గుమస్తా భీమారావు తనభార్యతో రమాకాంతము నడిపే సరసాన్ని తగ్గించాలని కరటకరెడ్డితో ఆలోచించి పుట్టినింటికివెళ్ళిన రమాభార్యకు అందేటట్టుగా రమాకు పాము కరచినదని ఉత్తరము బనాయిస్తాడు.] రమా ఇల్లువదలి వెళ్ళునుకదా అని కరటకరెడ్డి ఆ యింట్లో రమా పడక గదిలో విలాసము చెయ్యడానికి తనభార్యను ఆ టైముకు రమ్మనిచెప్పి. రమా యిల్లువిడవగానే తోటమాలిని మిఠాయితెమ్మని పంపుతాడు. స్టీమరుకు చేరే రమా దిక్కులు చూస్తూండగా రమాయింటికి బయలుదేరిన కరటకుని భార్య మోహిని అతనికంట బడుతుంది. ఆమె అనుపానులు కనుక్కోవాలని రమా ఆమెను వెతుకుతూండగా స్టీమరు కదలి వెళ్ళిపోతుంది. ఆమె కానరాక స్టీమరూ తప్పిపోయి రమాకాంతము ఇల్లు చేరేసరికి ఆమె అక్కడ కనబడుతుంది! రమా స్నేహయత్నమూ, కరటక రెడ్డి ఆరాటమూ. తోటమాలి మిఠాయితో రావడంతో కొంతఆగి, మిఠాయి తనకోసం తెప్పించినందుకు రమా కటకరెడ్డిని అభినందించి తోటమాలిని పొమ్మనడంతో, తిరిగిలేచి, రమాభార్య కంగారుగా రావడముతో మళ్ళీ ఆగుతాయి. ఈ కథను ఆంగ్ల రచయిత ఎవరో చక్కగా అల్లినాడు. మిగిలిన తొమ్మిదీకూడా, పాత్రపోషణమూ సన్నివేశ నిర్మాణ చాతుర్యమూ నిండి వుండేటట్టివే.

హాస్య మన్నది అసందర్భపు పనులలోని తెలివితక్కువ ప్రేక్షకులకు గోచరించడమువల్ల కలుగుతుంది. ఈ అసందర్భము అన్నది వ్యక్తుల ప్రత్యేక గుణాలవల్ల వచ్చేటిదీ కావచ్చును, పరిస్థితుల కలగలపువల్ల వచ్చేటిదీ కావచ్చును. పరిస్థితుల కలగలుపువల్ల సమకూడే హాస్యము ఉత్తమమైనది. పై కథలో రమాకాంతము తన భార్యను చూచి నాడే అని కరటకరెడ్డి పడే తడబాటూ, మిఠాయి తన కోసమేనని రమాసంతోష సన్నివేశాలు, సమయానికి రమా భార్య రావడమూ సహజ సన్నివేశాలు. యజమాని దగ్గర భార్యే లేదని బొంకిన రెడ్డి తన విలాసాన్నంతటినీ తన పూరియింటనే వెలయించక యజమాని పడకగదిలోనే వెలయించ నిశ్చయించినాడు. ఇది అణచబడిన అతని సుఖాభిలాష. లక్ష్యాన్నిమించి ఎగిరినఎగురు. దానికి పరిస్థితులు ఎదురు తిరిగినట్టే సాగుతాయి. రమా తన స్త్రీ చాపల్యము చేతనే స్టీమరును దాటబెట్టుకొని ఈ దురోమని ఇంటికివస్తే ఆ మోహిని ఇక్కడ ప్రత్యక్షం : ఇది కరటకరెడ్డి చాపల్యంవల్ల. ఈరీతిగా వ్యక్తుల తిక్కవల్ల పుట్టుకొచ్చే సహజ సన్నివేశాల్ని సృజించడము చక్కని నేర్పు. ఆ వ్యక్తుల తిక్కలనేవి ఎంత సహజముగా ఉంటే అంత ఎక్కువగా హాస్యము పుట్టుకొస్తుంది.

చక్కని ప్రహసనాల్ని ఎంచి వాటిని తెలుగులో ఇస్తూ రచనా కౌశలాన్ని పెంచుకోడానికే అభిలాషపడిన పంతులుగారు స్వంత ప్రహసనాలు వ్రాయడము ప్రారంభించేసరికి ఆయనగారి దేశికత్వము ఆయన లేఖిని నెత్తిమీదకు ఎక్కి కూర్చున్నది. గురజాడవారు అన్నట్లుగా లోకం అనే తెరమీద చిత్ర విచిత్రంగా ఆడే జనుల తీరును గమనించ గలిగిన నిరంజనత్వం వుండాలి హాస్య రచయితకు. 'స్నేహమూ ప్రేమా' అన్న వెలుగులు ప్రసరించి కాంచవలెను ఆ బొమ్మలాటను. అప్పుడు 'వింత వింత సొగసులు బయలుదేరుతవి.' వీరేశలింగముగారు కలము పట్టేసరికి భూత ప్రేత పిశాచాల్లాగ ఆడేరు సమకాలిక 'హిందూ' ప్రజ ఆయన మనోనేత్రం ముందు. వ్యాసాల్లో, ఉపన్యాసాల్లో, వారి అవగుణాల్నీ విమర్శించారూ. ప్రహసనాల్లో — కార్టూనులలో లాగ — ఆ అవగుణాల్ని పెంచి చూపించి అవహేళన చేశారు పంతులుగారు. కనుక వారు ప్రహసనములని రచించిన నాలుగూ — కలిశనైశ్చర విలాసము, వేశ్యాప్రియా ప్రహసనమూ, కౌతుకవర్ధనీ, వినోద తరంగిణీ అన్న స్వకపోల కల్పిత రచనలు — అవహేళనలే అయికూర్చున్నవి. పంతులు

గారు సమకాలిక లోకాన్ని నిరంజనుమై దర్శించలేదు. కసితో విమర్శించారు. కనక హాస్యము కాక అవహేళనే పుట్టింది వారి ప్రహసనాలలో.

కలిశనైశ్చర విలాసములో హిందువుల నమ్మకాలను దేవతల ప్రసిద్ధ గుణములనూ వెక్కిరించేటట్టుగా ప్రదర్శించారు. వేశ్యా స్త్రీలు లేకుండా యీ లోకంలో దేవతలకు యెవరికీ వుత్సవాలైనా జరగవు; దేవతలు తమ భక్తులు ఏమి తప్పిదం చేసినా క్షమిస్తారు; దేవతలకు స్వభార్యలు వుండరు గనుక పర స్త్రీ సాంగత్యము వల్ల వారికి దోషం లేదు—వంటి దెబ్బలు ఈ ప్రహసనంలో వున్నాయి. వీటికి తోడు శనికి కల్లు త్రాగించీ, సుర అన్న పేరును సురలతో కలిపి యెద్దేవా చేసీ, (కలము పేర్లు సూచించే గుణాలకు వ్యతిరేక గుణాలు సూచించే పేర్లు వారి శిష్యవ్యక్తులకు పెట్టీ), కలికీ శనికీ వివాదము పెట్టీ, చాలాచాలా ఎక్కువగా వెక్కిరించారు ఆ పురాణ వ్యక్తులనూ, తద్వారా పురాణాలనూ.

తక్కిన మూడు ప్రహసనాలలోనూ పాత్రల పేర్లు ఆయా వ్యక్తుల గుణ సూచకాలుగా ఉండేటట్లు విటేంద్ర రావు, గ ణి కా ప్రా ణ నా థ రా వు అంటూ పెట్టేరు. ఆ రోజులలో నాటకాలూ, సంభాషణ రూపంలో వుండి అంతమాత్రము వల్లనైనా ధ్వనిపూర్వకంగా చదువరులను హె చ్చ రి ం చే రచనలూ లేవు. ఈ ప్రహసవానాలను చదువుతూ ఆనాటి చదువరులు 'గణికాప్రాణనాథరావు' అన్న పేరు చదివీ, వినీ, అక్కడ ఆగి వినోదించి, సమకాలిక వ్యక్తికి ఎవరికి ఈ పేరు సరిపోతుందా అని ఆలోచించి, ఈ పేరులోని 'అ' కార 'ఉ' కార 'మ' కారములు ఎవరి పేరులో ఏ అక్షరముగా ఉన్నవీ అని విచారిస్తూ ఉంటే 'హాస్యప్రియుడు' అయిన (చూ. ప్రహసనములు 420 పుట) పంతులుగారు నవ్వుకుంటూ ఈ రకపు రచనలు సాగించినారు. వీటిని చదివేటప్పుడు ఇవి రచించబడ్డ కాలమును—అచ్చు కూటములూ, నాటక రంగస్థలాలూ లేని కాలమును—ఊహించి మనము ఆ కాలానికి వెళ్ళి చదవాలి. ఆ పరిస్థితు లిప్పుడు మట్టుకు లేనివా? అని అడిగితే అదే మన దౌర్భాగ్యము అని జవాబు. సంస్కారాభిమాని అయిన వీరేశలింగముగారి ఖడ్గము మూరేండ్లకు కూడా మొక్క పోలేదంటే అది మన జడత్వానికి చక్కని నిదర్శనము అనే అనుకోవాలి.

వేశ్యా ప్రియప్రహసనమన్నది వేశ్యా ప్రియుల కూటమినీ, వారిఆశలనూ ఆశయాలనూ బయటపెట్టే ప్రహసనము. ఆ రోజులలో వేశ్యల నుంచుకొనుట రసికలక్షణమని అనుకునేవారూ ఉండేవారు. వేశ్యల పాటలు వినడమూ, వ్యభిచారము చెయ్యడమూ, వేశ్యల యిళ్ళలో పానభోజనాదులు చెయ్యడమూ, పెండ్లిండ్లలో భోగము మేళములు పెట్టడమూ, ఇతరులకు బోధపరచడమూ, పరువూ ప్రతిష్ఠా పేరిట భోగంమేళాల్ని పెట్టి ఇల్లూ ఒళ్ళూ గుల్లచేసుకోడమూ, శిష్టాచారమూ మంగళప్రదమూ అన్నవాదాలతో ఆ దురాచారాన్ని సమర్థించడమూ విరివిగా ఉండేవి. అది దురాచారమని వాదించేవారూ ఉండేవారు. కన్యాశుల్క నాటకంలో కరటకశాస్త్రి చెప్పినట్లు అలాంటి ఆంటీనాచ్చిలలోకూడా రకరకాలవారుండేవారు. భో గ ం వా ళ్ళ లో ముసలివాళ్ళు "ఆడవాళ్ళ కూడు పాడుచెయ్యకండి" అనీ, "మీరు ఎన్నిమీటింగులు చేసినా, మాయిళ్ళకువచ్చేవారు వస్తూనే వుంటారూ, మాకిచ్చేవి ఇస్తూనే వుంటారు" అనీ వాదించేవారు. వేశ్యాప్రియులే ఇతరులమీద అసూయతోనూ కోపంతోనూ సమయానుకూలముగా ఆంటి నాచ్చిలతోచేరి తమలాంటివారిని దూషించి హేళనచేసి సంతోషించుకునే వారు.

ఆచారము పేరిట మేము గొప్పవారమని డాబులు చెప్పేవారుకూడా వేశ్యలయింట భోజనపానాదులు చేసేవారు. దేవతా ఉత్సవాలకి మేజువాణీలకు వచ్చేవేశ్యలు తాగుడు బుడ్డీలను గరుడవాహనాది దేవాలయ వస్తువుల చాటున దాచుకునేవారు. ఈ రహస్యాలు గమనించిన పిల్ల

కాయలు ఆ ద్రవము ఎలాగుంటుందో చూతామని తామూ త్రాగి పారిపోయేవారు. సంఘములో పెద్దమనుష్యులమని తిరిగేవారు వేశ్యలను వుంచుకొని, ఆ వేశ్యలు చేరివుండే మేళములకు సాయపడుతూ, వారిని పెండ్లిండ్లు చేయ బోయేవారికి సిఫారసుచేస్తూ ఉండేవారు. ప్రజలు ఆ మేళ ములకు ఆ పెద్దమనిషి పేరుపెట్టి 'ఫలాని వారిమేళము' అని వ్యవహరించేవారు!

వేశ్యాప్రియ ప్రహసనములో ఈ విచిత్రాల నన్నిటిని బయటపెట్టి ప్రేక్షకులను నవ్వించి, వీటిని మాయము చెయ్యవలెనన్న ప్రయత్నము చేశారు పంతులుగారు. మొదటి రంగములో 'భోగం మేళమే లేకపోతే ఇఖ పెళ్ళేమిటి?' అనీ, రెండో రంగంలో 'బట్టలూ నగలూ పెట్టినిండా బూజుపట్టే' ఇళ్ళలోకూడా పెళ్ళిళ్ళకి భోగం మేళం పెట్టే గొప్పలు వినబడుతున్నాయి అనీ, మూడో రంగంలో 'పెం కు లు యె గి రి పో యే ట' ట్టు వేశ్యలను సమర్థించే ఉపన్యాసా లిచ్చేవారు వొక్కనాడూ వేశ్యల పాట వినిఉండలేదనీ విద్యార్థులుకూడా వేశ్యాసహవాసానికి యెగబడి చెడిపోతున్నారనీ చెప్పి, నాలుగో రంగముసభా మందిరములో వేశ్యాపక్షంలో స్వపక్ష నిర్ధూమధాముల్నీ ఎదిరి పక్షంలోని వారికితోడు ఇవతలనుంచి కొందరు విభీషణుల్ని మాట్లాడించి 'భోగం మేళాల్ని పిలవకుండా వుండడానికిన్నీ భోగం మేళం వున్నచోటికి తాము వెళ్ళ కుండా వుండడానికిన్నీ' రిజల్యూషను చేయించినారు. ఈ సభా కథతోపాటు సమానాంతంగా పెంచిన పేద పెండ్లి లోని భోగం మేళం కథను చివ్వరి రంగంలో ఛిన్నా భిన్నం చేశారు తాగుడు ఫలితాన్ని చూపించి. ఇది యెవర్నిగురించీ కాదంటూ, యెవరెవరో ఇది తమమీదనే అని సంప్రతించుకుంటూన్న 'ఉపసంహారము'ను చేర్చారు!

దీనిలోని కథ గాలిని పోగుచేసి నిర్మించినట్టిది. వ్యక్తుల మనస్సులోని కుళ్ళుచూపే యత్నమేకాని కథ నిర్మిద్దా మన్న ఉద్దేశ మున్నట్టు కానరాదు. మాయాచార్యులనే సార్థకనాముడి పాత్రను దిద్దితీర్చే ప్రయత్నములో, తొలి రంగంలో "మీరు వివేకాచార్యులతో మనయింట్లో పెళ్ళికి భోగం మేళం లేకుండా చేస్తామన్నారటే" అన్న ప్రశ్న రాకడలోనూ దీని కనుకూలంగా చివరి రంగంలో ఆ మాయాచార్యులచేత "మేళం లేకపోతే మానేను కాని" అన్న సలహా ఇప్పించడములోనూ కొంత కానవచ్చినా అతడనే మాటలు ఈ పక్షమూ ఆ పక్షమూకూడా సమ ర్థిస్తూ అతణ్ణి అసందర్భపు వ్యక్తినిగానే తయారుచేశాయి. సంభాషణలో బిగుతుకోసము పలికినట్టే కనపడుతుంది గాని ఏర్పడిన వ్యక్తులు తమకు సహజంగా వుండేరీతిగా పలికినట్టు కానరాదు.

కౌతుకవర్థని అన్న రెండో ప్రహసనము గతీ ఇదే. వేశ్యాప్రియ ప్రహసనంలో చెప్పడము మరచిపోయిన విశేషాలతో ఈ ప్ర హ స న ము ప్రారంభమౌతుంది. మొదటి రంగంలోని ఇద్దరూ పెద్దమనుష్యులు. "పెద్ద వుద్యోగాలలో వుండేవారు నలుగురూ ముండలను ఉంచు కోవడంచేత ఇతరులకు వారిని వెళ్ళి అనుసరించకుండా జరగదు" అనీ, "ఆ పెద్దమనుష్యుల అనుగ్రహం సంపా దించుకోవలెననే వారందరూ భోగంవాళ్ళచేత సిఫారసులు చేయించుకుంటేనే గాని వారి అనుగ్రహం రాదు" అనీ సంప్రతించుకుంటూ, ఊళ్ళో సభ చేయించాలని నిర్ణ యించుకుంటారు. రెండో రంగంలో గణికా ప్రియులు ముప్వురుచేరి ఆ సభను గురించి ప్రస్తావిస్తూ డిఫమే షనుకు దావా తేవాలనీ, ఫలాని మేళములోని పద్దాలుగేళ్ళ కుఱ్ఱది మహా బాగావున్నది కనుక దానికి వారిలో ఒకరు కన్నెరికము పెట్టాలనీ, సుఖరోగాలచేత చచ్చేవాళ్ళు ఆయువు మూడినవాళ్లేననీ, వ్యతిరేకపు సభ చెయ్యబోయే వారి రోగం కుదర్చాలనీ నిర్ణయించుకుంటారు. మూడో రంగములో వేశ్యమాతబోధకు విరుద్ధంగా వేశ్య తనను వుంచుకున్న గంగాధరశాస్త్రికి రాయబారిగా సాయపడిన రామయ్యను వదలనంటుంది. శాస్త్రులు తొలిరోజుల్లో

తనకు కాపలాపెట్టిన వాడు తన కెలా లొంగిపోయినాడో చెపుతుంది. ఈ రంగాన్ని పూర్తిగా తీసివేసినా కథకు నష్టములేదు. అయితే గణికలచేతనే వారి వృత్తి రహస్యాల్ని చెప్పించారు పంతులుగారు ఈ రంగములో. వేశ్య డబ్బు యిచ్చే విటునివద్ద కూడా జబ్బు పడినట్టు నటించడము ఆ జిత్తులలో ఒకటి అనడం విచిత్రాన్ని కలిగిస్తుంది. ద్వితీయాంకములో సభ. పెక్కురువాదులు, ప్రతివాది ఒక్కడే. మీటింగు వాయిదాపడుతుంది. ఈ రంగమూ అక్కర లేకుండా వచ్చినదే. తీసివేస్తే కథకు నష్టమేమీలేదు. అయితే ఇలాంటి రంగములను నిర్మించడము ఒక లోపముగా పరిగణించబడినట్టు కానరాదు ఆ రోజులలో. చిలకమర్తివారి గయోపాఖ్యానంలో నాలుగో అంకం తగ్గించేస్తే నష్టమేమీలేదు. సంభాషణా పూర్వకంగా వున్న రచన అవటంచేత తమ రచన ప్రజానుమోదం పొందినట్లు పంతులుగారే స్వీయచరిత్రలో వ్రాశారు. వైవిధ్యమేలేని వాఙ్మయంలో ఈ వైవిధ్యము ఆకర్షణమే కదా?...తరవాతి రంగము చక్కని వాదన. "లోకంలో సుఖపడేది యెట్లాగు? బ్రతికిన నాలుగు రోజులూ సుఖమనుభవించి మరీ చద్దాము. వెంటనే ఏ నష్టమూలేదు కదా? స్థిరంగా వక్కదాన్ని వుంచుకొని దానితో వుంటే యీలాటి చెప్పుడూ తటస్థించవు. ఎవ్వరూ వుంచుకోకపోతే భూమిలో భోగం కులం వుంటుందా? వాళ్ళు లేకపోతే సంగీతం యేలాగు వృద్ధి అవుతుంది? హరికీర్తనలు పాడిస్తే...తాంబూలాలకు పిలిచిన పెద్దమనుషులు బాగానే వస్తారు. వాళ్ళ సంగీతం విన్నవాళ్ళంతా చెడిపోతాం?" అన్నవాదాలన్నిటికీ వీరభద్రుడుగారు ఒకరే సమాధానాలు చెప్పేస్తారు. తరవాతి రంగంలో ఛాందసుల అసందర్భపు వాదనలను క్రితము రంగములోని సంస్కారాభిమానుల వాదాలకు (అటువైపు) తూగుడుకోసము కాబోలు చేయించారు. ఈ రంగమూ కథకు అత్యవసరము కాదు. ఈ 'ప్రహసనము' నకు శీర్షిక కౌతుకవర్ధని. ఈ వాదము అందుకు పనికివస్తుంది. తృతీయాంకంలో ఇదివరకు రెండవసభలో వీరభద్రుడుగారు చెప్పిన వాదానికి ఉదాహరణ—వేశ్యా సహవాసం క్రమంగా చేసిన—బాపిరాజుగారి సంగతి చెప్పించారు. ఆఖరి రంగంలో అనుభవజ్ఞుడిచేత వేశ్యాలంపటత్వము దోషమని చెప్పించారు.

పంతులుగారి పరహితాకాంక్ష ఉపదేశప్రియత్వమూ చేరి ఈ రచనను సంభాషణ రూపంలోవున్న వ్యాసాన్ని చేసినవి. ఆ వ్యాసానికి కొంత సామరస్యముకూడా ఉన్నది: సమస్య, వామపక్షమూ, అసలుసరుకూ, కుడి పక్షమూ, చాదస్తమూ పతనమూ తీర్మానమూ అన్నవి ఈ కౌతుకవర్ధనిలో వరుసగా నడిచినవి. చాదస్తాన్ని తగ్గించేసినా ఈ వరుసకు కుంటితనమురాదు. వీరి ప్రహసనాలు హసనముకోసము కాదనీ సంస్కారము కోసమేననీ ఈ కౌతుకవర్ధని విశదము చేస్తుంది.

మూడోరచన హాస్యతరంగిణి. మొదటి రంగము ముసలి మగడూ పడుచుపెండ్లామూ విరస భాషణము. రెండోది ఆ పడుచు మగని శిష్యునితోనడుపు వర్తనమును చక్కగా ధ్వనించు సంభాషణము, మూడోది అవధానులుగారు బిడ్డను ప్రసవించిన సంగతిని తాసీల్దారుగారు తర్జన భర్జనచేసే రంగం. తక్కినదంతా బీభత్సం. వ్యభిచారమూ, శిశుహత్యా, అవినీతీ తాండవిస్తాయి, పంతులుగారు కలము పట్టినారంటే. ఒక ఇతివృత్తమూ, నడకా, కాపీ అంటూ సాగిపోయేపద్ధతులు వారికి చాలవు. సంఘము తగలబడిపోతోందని నెత్తీనోరూ కొట్టుకుని మొరబెట్టే రాయన. ఆ మొరలకు పంజరాలు చాలలేదు, వీధినిబడి లౌడ్ స్పీకర్లలో చెప్పినట్లు చెప్పేరు.

హాస్య సంజీవని కూడా చాదస్తపు టూహలనూ దురలవాట్లనూ పెంచి చూపించి వాటిమీద సామాజికులకు ఏవగింపు పుట్టడానికి రచించిన సంభాషణలే. ప్రహసనాలలోని రంగాలలో మంది చేరియుండినప్పటికీ మాట్లాడే వాళ్ళు ముఖ్యంగా ఇద్దరే కనబడుతూంటారు. పంతులుగారి

ఆశయము నాటకత్వచమత్కారాన్ని చూపడము కాదు. ఆయన దేశికుడు. నూటికి నూరుపాళ్ళూ సంఘాన్ని దిద్దడానికే ఆయన జీవితమూ లేఖనీ అంకితములు. హాస్యసంజీవనిలో ఆచారము పేరిటి ఛాందసాలూ, దానము పేరిటి కులాభిమానాలూ, గురుశుశ్రూష పేరిటి వెట్టిచాకిరీలూ, వైద్యం పేరిటి అఘాయిత్యాలూ, పూర్వాచారపుటసహ్యములూ, పిచ్చినమ్మకాల ధాష్టికాలూ, మూఢస్వార్థపరత్వపుటవతారాలూ—తో పాటు ఒకపట్టాన పట్టుబడని యోగాభ్యాసాలూ భారతీయ తత్త్వశాస్త్రపు వైవిధ్యమూ కూడా ఆయన వెక్కిరింపులకు గురి అయినవి.

ఈరీతిగా ప్రహసనమన్నది ఒక రచనా ప్రక్రియగా రూపొందుటకు పంతులుగారి ప్రహసనాలు పనిచేసినవి. ఆంగ్ల వాఙ్మయ వైవిధ్యాన్ని తెలుగువారికి చూపించవలెననీ, తెలుగువారికి విజ్ఞాన వికాసమూ మానస సంస్కారమూ కలిగించాలనీ సంకల్పించి పంతులుగారు రచన చేసినారు. వారి సంకల్పము వెనువెంటనే ఫలించి విజ్ఞాన చంద్రికా గ్రంథమాలా, హితకారిణీ సమాజమూ యేర్పడ్డాయి. వారు ప్రారంభించిన రచనా ప్రక్రియలను వారి ప్రియ శిష్యులు చిలకమర్తి వారు చేపట్టి మెరుగు పెట్టినారు. ప్రహసనము చిలకమర్తివారి చేతిలో ఇతివృత్త సృష్టినీ హాస సన్నివేశములనూ చక్కగా పెంచుకొన్నది. 

---

సీ. దయమాలి తుదముట్ట దలకట్లు నిగిడించి
ధీరుడై నన్ను బాధించు నొకడు;
పాదంబులోపల బాదంబు లిమిడించి
వీరుడై నన్ను నొప్పించు నొకడు;
ప్రాసంబుపై బెక్కు ప్రాసంబు లడరించి
పోటుబంటయి నన్ను బొడుచు నొకడు;
బెండుపల్కులు గూర్చి నిండించి నగలంచు
దిట్టయై చెవులు వేధించు నొకడు;

ఖడ్గ చక్రాదిరూపము ల్గానిపించి
వర్ణముల్ మార్చి నను జిక్కుపరచు నొకడు;
కుమతు లొడలెల్ల విరిచి ప్రాణములు తీయ
నొడలి పసలేక శుష్కించి యున్నదాన !

వీరేశలింగం

["సరస్వతీ నారద విలాపము" నుండి ]

# సమకాలికులు - సహచరులు
# శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు

శ్రీ కె. రామశాస్త్రి అనే 'తారకం'

ఆధునిక ఆంధ్ర ప్రదేశ అభ్యున్నతికి సర్వతోముఖమైన నిర్మాణ కార్యక్రమమును సాధించిన యుగ పురుషుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు. వారి కన్నివిధముల సహకరించిన సమకాలికులలో తమ సహధర్మచారిణి రాజ్యలక్ష్మమ్మగారికన్న మిన్నయైనవారు లేరని చెప్పవచ్చును. పంతులుగారి ప్రభావమువలన, వారు లేవదీసిన ఉద్యమము లన్నిటికిని చేదోడుగా నుండి, చరితార్థులైన వారిలో సాహితీపరులు, సంస్కరణ ప్రియులు, అధ్యాపకులు, దానశీలురు, ఎందరో మహానుభావులున్నారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహం, రాయసం వెంకట శివుడు, నాళం కృష్ణారావు, దేశిరాజు పెదబాపయ్య, రెబ్బాప్రగడ పాపయ్య, కోరుకొండ లింగమూర్తి, న్యాపతి సుబ్బారావు పంతులు, జయంతి గంగన్న, కాశీనాథుని నాగేశ్వరరావు, పిఠాపురం రాజా సూర్యారావు బహద్దర్ మున్నగువారు ఆస్వర్ణ యుగంలో వీరేశలింగంగారికి సమకాలికులై, సహకరించిన సేవాపరాయణులు, త్యాగశీలురు.

పంతులుగారిని తమ నాయకులుగా పూజించి, అనుక్షణము వారికి అండగా నుండి, ఆధ్యాత్మికముగా తమకత్యంత సన్నిహితులుగా, సహచరులుగా పంతులుగారిచే గౌరవింపబడి, అగ్రశ్రేణికి చెందిన మహనీయులు, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు. పంతులుగారు, నాయుడుగారు ఆంధ్రమాత కవల బిడ్డలు.

అది క్రీ॥ శ॥ 1862 సం॥రం, 'మహార్నవమి'. అవి బందరు ఉప్పెనరోజులు. మచిలీ సైనిక స్థావరంలో సుబేదార్ అప్పయ్యా నాయుడుగారింట ఒక పుత్ర రత్నం జన్మించాడు; తల్లి శేషమ్మగారి పూజాఫలం. మహావిద్వాంసుడై, పరమ భాగవతోత్తముడై, జీవితంలో ఎన్నో తుపానుల నెదుర్కొని, వీరేశలింగం పంతులుతోపాటు నవ్యాంధ్ర నిర్మాతలలో అగ్ర శ్రేణికి చెందిన వాడైనాడు ఆ బాలుడు—రఘుపతి వెంకటరత్నం నాయుడు.

చిన్నతనంలో తండ్రిగారి పటాలం ఎక్కడికిపోతే అక్కడ నాయుడుగారి విద్యాభ్యాసం జరిగింది. ఉత్తర హిందూస్థానం 'ఛాందా' లోను, పిమ్మట దకన్ హైదరాబాదులోను చదివి మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. 'చాందా' లో చదువుకొనే టప్పుడే "రామమోహనరాయ్ సహగమన దురాచారాన్ని మాన్పి, బ్రహ్మసమాజాన్ని స్థాపించిన గొప్ప భారతీయుడ " ని పుస్తకంలో చదివి, ఆ వ్యక్తినిగూర్చి శ్రద్ధాభక్తులతో తెలుసుకున్నాడు. ఆనాడే బ్రహ్మ ధర్మబీజాలు ఆయన హృత్క్షేత్రంలో నాటుకున్నాయి. 1885 లో చెన్నపురి క్రైస్తవ కళాశాలలో డాక్టరు మిల్లరువద్ద చదివి పట్టభద్రు లయ్యారు. మిల్లర్ ఆయనకు 'గురుదేవులు', వీరేశలింగం పంతులుగారు వారికి 'నాయకులు'. 1891 లో ఎం యే; 1897 లో ఎల్. టి. డిగ్రీలను పొంది, "లా" చదువు ప్రారంభించి విరమించారు.

నాయుడుగారికి 27 వ యేట పత్నీవియోగం కలిగింది. ధీరోదాత్తులై, ఏకపత్నీవ్రత దీక్షతో అర్ధ శతాబ్దం ఇహలోకయాత్ర సాగించారు.

'బ్రహ్మప్రకాశిక', 'ఫెలోవర్కర్', 'పీపుల్సు ఫ్రెండ్' అను పత్రికలను ఆంగ్లములో ప్రచురించి 1886 మొ॥ 1898 వరకు ఏలూరు, రాజమండ్రి, బందరు సికింద్రాబాద్, మద్రాసు పట్టణాలలో ఉన్నత పాఠశాలల్లో, కళాశాలల్లో ఉపాధ్యాయులుగా పని చేశారు. ఎక్కడ ఉద్యోగం చేసినా జీతంమాట యేమిటనే ధ్యాసే వుండేదికాదు. ఎంత గంభీరమైన జ్ఞానమో, మేధస్సో, అంత నమ్రత, నిరాడంబరం వుండేవి ఆయనలో. 1904 వరకు సికింద్రాబాద్‌లో మహబూబ్ కాలేజీ ప్రిన్సిపాల్ గా పనిచేసి 1905 నుండి 19 వరకు కాకినాడ కళాశాల ప్రధానాచార్యులుగా నుండి, అసమాన ప్రతిభతో స్వీయధర్మాన్ని నిర్వహించి ఉద్యోగం విరమించారు. విద్యార్థులను నీతిపరులైన పౌరులుగా తయారుచేయడమే నాయుడుగారి లక్ష్యం. ఆ కాలేజీ విద్యార్థినులకు, నిమ్నజాతులకు ఉచిత విద్యాదానం చేయించారాయన. విద్యారంగంలో నాయుడుగా రాక్రమించిన స్థానాలలో ఉన్నతమైనది మద్రాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవి. ఎంతో నేర్పుతో ఆ బాధ్యతను నిర్వహించి, ద్రవిడభాషకు తగిన గౌరవపీఠాన్ని ఏర్పాటుచేయడం, పరిశోధనలకు సౌకర్యాలు కల్పించడం మొదలైన క్రొత్త సంస్కరణలను ప్రవేశపెట్టినారు శ్రీ నాయుడుగారు. అఖిలభారత ఆస్తిక సభాధ్యక్షులుగా నుండి స్థానిక సభలయందు, శాసన సభలందు, సెనేట్ సభలందు, సాంఘిక సమావేశములందు, ఎన్నో ప్రజాహిత సంస్థలందు ప్రధాన సభ్యులుగావుంటూ, ఒక తరంపాటు తెలుగునాడును తమ ఉపన్యాస ఝరితో నాయుడుగారు ఉఱ్ఱూత లూగించారు. శ్రీ పిఠాపురం రాజాగారిచే అనేక సంస్థలకు ధనసహాయం చేయించడమే కాకుండా, బ్రహ్మధర్మ ప్రచారకనిధి, బ్రహ్మోపాసనా మందిరం, అనాథ శరణాలయం నెలకొల్పించారు. నాయుడుగారు 1939 మే 26 వ తేదీన నిర్యాణం పొందినారు.

"నాయుడుగారు అన్న నామానికి ప్రేమ, మానవత్వం, కరుణ, భక్తి (ఇవన్నీ ఒకటే) పర్యాయ పదాలైనాయి. ఏబది సంవత్సరాలు ఆంధ్ర యువకులను సత్యసాన్నిధ్యమున నిలబెట్టిన సోక్రటీసు నాయుడుగారు, పురాణేతిహాసములను, పారసీక భక్తుల ప్రవచనములను, షేక్స్పియరు, వర్డ్సువర్తు, గెటీ, కార్లైల్, మిల్టన్, టెనిసన్ మున్నగు పాశ్చాత్య ప్రవక్తల విజ్ఞానమును తన్మయులై వినిపించు తరి, ఎదురుగా తేజస్తంభమువలె కన్పట్టెడువారు నాయుడుగారు. వారి కాళాశాల గురుకులము. ఆ గురుదేవుడే ప్రతి శిష్యునకు తండ్రి, తల్లి" శ్రీ కృష్ణశాస్త్రి గారు ఈ మాటలతో తమ గురుదేవులను చిత్రించారు. "ఆంధ్రుల గురుపీఠం నాయుడుగారు" అన్నారు రామలింగరెడ్డిగారు. "నాయుడుగారిచేతికి ఎముక లేదు" అన్నారు చిలకమర్తివారు. "కుడిచెయ్యి ఇచ్చేది ఎడమచెయ్యి ఎరుగదు" అనే సామెత నాయుడుగారి గుప్త దానాలకు బాగా చెల్లుతుంది. పరీక్ష ఫీజులకు, నెల జీతాలకు, ఆహార వస్త్రాలకు ఎన్నింటికో ఎందరెందరు పేద విద్యార్థులో నాయుడుగారి ఉపకృతులను పొందేవారు. గురుదేవులు డాక్టర్ మిల్లర్‌గారి పేరట విజ్ఞాన ప్రబోధం నిమిత్తం 10 వేల రూపాయల నిధిని యేర్పాటు చేశారు. తమ షష్టిపూర్తి కానుకగా శిష్యగణం సమర్పించిన సర్వస్వం ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టప్రదానోత్సవాలలో ఏటేటా విద్యార్థులకు బహుమానాలివ్వడానికి ఇచ్చివేశారు.

వ్యక్తిలోను సంఘంలోను కూడ నీతి నియమా లున్ననాడే దేశాభ్యుదయం అన్న విశ్వాసాన్ని ఆయన ప్రచారం చేశారు. వేశ్యావృత్తి నిర్మూలనానికి ఆయన అవిరామ ప్రచారం చేశారు. పొన్నేరి స్టేషన్‌లో కనబడిన నలుగురు అనాథ బాలికలను, తరువాత మరికొందరిని కన్న బిడ్డలకంటె ఎక్కువగా పెంచి పెద్దవారిని చేశారు. ఆయన గృహం వారికి పుట్టినిల్లు అయింది. "మీరు లేకపోతే వాళ్ళంతా యేమయ్యే వారు ?" అన్నారట ఒక మిత్రుడు. "వాళ్లు లేక పోతే, నే నేమయ్యే వాడనో!" అన్నారు నాయుడు గారు. తోడి మానవుల ఆర్తిని తీర్చడం, రోగులు, శ్రమ జీవులు, స్త్రీలు, బాధితులైన ఎవరికైనాసరే చేయగలిగిన సహాయం చేస్తూ వుండటమే నాయుడు గారి నిత్య జీవితం. చిన్నపిల్లలంటే ఆయనకు అపార ప్రేమ పరిహాసాలతో, పిట్టకథలతో వాళ్ళను నవ్విస్తూ, వాళ్ళు కోరినవి తెచ్చి యిస్తూ, వాళ్ళతో కాలక్షేపం చేస్తూ వుండేవారు. చుట్టలు కాల్చడాన్ని, కల్లు త్రాగడాన్ని నిషేధించే కార్యకలాపం, హరి జనోద్ధరణ, కళావంతుల సంస్కరణ మొదలగు నిర్మా ణాత్మక కార్యక్రమనిర్వహణకు ఆయన తన జీవితాన్ని అంకితం చేశారు. అప్పటికి ఈ కార్యకలాపాన్ని కాంగ్రెస్ చేపట్టనేలేదు.

నాయుడుగారి మతానికి పేరులేదు. అది 'ప్రేమ' సాంప్రదాయాలకూ, సిద్ధాంతాలకూ, ఆచారాలకూ అతీతమైనది. ఆత్మోప లబ్ధికి ఈశ్వర ప్రార్థనే ఆయ నకు పట్టుకొమ్మ.

దేశం దురాచారాలతో నిండి, అజ్ఞానాంధ కారంలో వున్నపుడు పంతులుగారు, నాయుడు గారు—వీరిరువురు లోకానికి సుస్థిరమైన పునాదులు వేసిన నవ్యాంధ్ర ధీరోదాత్తులు. మన నాయకులందరు వారి ఆధ్యాత్మిక సంతతికి చెందిన వారలే. ఆంధ్రు లకు ఒక్కరే 'పంతులుగారు', ఒక్కరే 'నాయుడు గారు'—విప్లవ వీరులు, విశ్వాస ధీరులు, అమర జీవులు, దివ్యజ్యోతులు. పతాకం పట్టినవారొకరు. పాంచజన్యం పూరించినవారొకరు. ఒకరు కలం పట్టారు. ఒకరు వేదిక నెక్కారు.

సర్వతోముఖ సంస్కరణానికీ, ఆధ్యాత్మిక నవ జీవనానికి బీజాలు చల్లేరు. ఒకరు వ్యాసధాటిలో, ఒకరు ఉపన్యాసఝరిలో, తెలుగువారిని ఉఱ్ఱూత లూగించేరు, మేలు కొల్పేరు. బాహ్య ప్రకృతిని బట్టి చూస్తే నాయుడుగారు, పంతులుగారు అన్ని విష యాలలోను విరోధి గ్రహాలలాగ ఉండేవారు. అంత రంగిక దృష్టితో పరిశీలిస్తే ఇద్దరూ ఒక్క పీఠం దగ్గరే ఆరాధకులు.

నాయుడుగారు ఆజానుబాహువు.
పంతులుగారు సన్నని బలహీనులు.
నాయుడుగారు ఆంగ్లభాషావేత్త.
పంతులుగారు ఆంధ్రభాషా కోవిదులు.
నాయుడుగారు వక్తృత్వవిశారదులు.
పంతులుగారు వ్యాసరచనాగ్రేసరులు.
నాయుడుగారు రసాలము.
పంతులుగారు నారికేళము.
నాయుడుగారు ప్రేమసింధువు.
పంతులుగారు దీనబంధువు.
నాయుడుగారు బృందావనములో వేణువు.
పంతులుగారు అంధకారములో ప్రళయభేరి.
నాయుడుగారొక దివ్యజ్యోత్స్న.
పంతులుగారొక మార్తాండ తేజము.
నాయుడుగారొక మలయవీచిక.
పంతులుగారొక ఝంఝామారుతము.
నాయుడుగారొక బ్రాహ్మణోత్తముడు.
పంతులుగారొక క్షత్రియపుంగవుడు.

కె. రామశాస్త్రి అనే 'తారకం'

నాయుడుగారు ఆంధ్రలోకాని కొక తల్లి.
పంతులుగారు తెలుగుతనయ కొక తండ్రి.
నాయుడుగారు హిమవన్నగము.
పంతులుగారు అగ్ని పర్వతము.
నాయుడుగారు ప్రాక్పశ్చిమములకు అమర వారధి.
పంతులుగారు సనాతన ఆధునికులకు దివ్య సేతువు.
నాయుడుగారు అమృతకలశము.
పంతులుగారు వీరఖడ్గము.
నాయుడుగారిది భక్తియోగము.
పంతులుగారిది కర్మయోగము.
'దానం' నాయుడుకారు.
'ధర్మం' పంతులుగారు.
ప్రార్థన చేయండని నాయుడుగారి సందేశం.
ధర్మం నిలబెట్టండని పంతులుగారి ఆదేశం.
నాయుడుగారి మూర్తి "సుందరము"
పంతులుగారి రూపము "సత్యము"
నాయుడుగారు శివస్వరూపము.
పంతులుగారు రుద్రమూర్తి.
అనాధల ఆర్తనాదము నాయుడుగారికి ఆహ్వానము.
వియోగినుల దీనాలాపము పంతులుగారికి వీరావేశము.
జీవితేశ్వరునితో నిరంతర సంయోగము నాయుడుగారికి జీవిత సర్వస్వము.
ఆత్మేశ్వరుని ఆజ్ఞా పరిపాలన పంతులుగారికి జీవిత పరమావధి.
హృదయస్పందనము నాయుడుగారి వైఖరి.
శివతాండవము పంతులుకారి పంథా.
అనాధ శరణాలయం నాయుడుగారి సాధన క్షేత్రము.
వితంతు ఆశ్రమం పంతులుగారి కర్మభూమి.
విద్యాలయము నాయుడుగారి తపోనిలయము.
గ్రంథాలయము పంతులుగారి సాధన కుటీరము.
ఆర్యఋషి నాయుడుగారు.
కురుక్షేత్ర యోధుడు పంతులుగారు.

---

క. తెలియదు సుమ్మిప్పుడు నా
పలుకుల యర్థంబు నాకె భావము లేమిన్
వెలసొమ్ములుగా కవి సం
కెలలయి కడునాదు మేనికి న్వెతనించున్.

*వీరేశలింగం*
("సరస్వతీ నారద విలాపము" నుండి)

# స్త్రీ పునర్వివాహోద్యమము

శ్రీ తెలికిచర్ల సూర్యప్రకాశం

స్త్రీ పునర్వివాహోద్యమముతో నా కంత ప్రత్యక్ష సంబంధము లేదు. కాని కీ. శే. శ్రీ రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగం పంతులుగారిని వారి కడపటి జయంత్యుత్సవంలో గాబోలు వారి ఆనందోద్యానవనంలో చూచే భాగ్యం నాకు కలిగింది. ఎంతటి నిరాడంబరజీవి! వారి చూపులు ఎంత తీక్ష్ణమైనవి! పంతులుగారు స్థాపించిన విక్టోరియా వితంతు శరణాలయము మొదలుగాగల అనేక సంస్థలతో నాకు సన్నిహిత సంబంధము కలిగి ఉండేది. కొన్ని వివాహోత్సవాలను గూడ నేను చూచేను. అనేక విఖ్యాత స్త్రీ పునర్వివాహ కుటుంబములతో చాలా దగ్గర సంబంధము నాకుంది. ఒకే ఒకటయినా నేను స్వయంగా ఆచార్యత్వమును వహించి జరిపిన స్త్రీ పునర్వివాహము శ్రీ పంతులుగారి తోటలోని వివాహమంటపము లోనే జరిగింది. ఈ వ్యాసాన్ని వ్రాయడానికి నాకుగల అర్హత ఇంతవరకే

మా కుటుంబములో అన్ని రంగాలలోనూ ముందంజ వేసి అత్యద్భుత ధైర్య, శౌర్య, సాహసాలు చూపి శ్రీ వీరేశలింగం పంతులుగారి మత సాంఘికోద్యమాలన్నింటిలోనూ పాల్గొని ప్రజ్ఞ చూపించినవారు మా చిన్నన్నయ్య, కీ. శే. తెలికిచర్ల రామమూర్తిగారు. మేము చదువుకునే రోజుల్లోనే బ్రహ్మసమాజంతోను, సంఘ సంస్కరణోద్యమాలతోను మాకు పరిచయం ఏర్పడింది. మానవ సేవే జీవితానికి పరమ లక్ష్యంగా రూపొందింది. సంఘానికి పునాది స్త్రీ. స్త్రీ జాత్యుద్ధరణ సంఘోద్ధరణే అవుతుంది. ఆ నాటి స్త్రీల స్థితి అతి నికృష్టంగా ఉండేది. చదువు శూన్యం, ఆర్థిక స్వాతంత్ర్యం నిండు సున్న. బాల్యంలో తలిదండ్రులకు, వివాహమైన తర్వాత అత్తమామలకు, వృద్ధాప్యంలో తన సంతానానికీ పూర్తిగా లొంగి ఉండవలసినదే. కట్నాలజాడ్యం నేటికన్న అనేక రెట్లు ఘోరం. బాల్య వివాహాలు ఆనాడు సర్వసాధారణం కావడంవల్ల, బాల వితంతువుల సంఖ్య విపరీతం. బాల వితంతువులు కుటుంబాలకి బానిసలే! అతి నీచపు క్షుద్రపు బ్రతుకు బ్రతకవలసిన వారే. బ్రతుకు వారికి ఎడారి, బందిఖానా, చిత్రవధాస్థలి. ఈ దృశ్యాన్ని చూచి ఏ ఆదర్శ మానవుని గుండె కరగదు? మానవులలో అత్యాదర్శ మూర్తి అయిన శ్రీ వీరేశలింగం పంతులు స్త్రీ జాత్యుద్ధరణకు కంకణం కట్టుకొని, తన ఉజ్జ్వలమైన ధర్మదీక్షతోనూ, నిశితమైన ధీశక్తితోనూ, అమలమైన పవిత్ర వర్తనముతోనూ, స్త్రీ జాత్యుద్ధరణను పలు రంగాలలో సాధించేరు. కట్నాలని,బహుభార్యత్వాన్ని, వేశ్యావృత్తిని పోషించే మేళతాళ వ్యవస్థను, దేవదాసీ సంస్థను పంతులుగారు తన అద్భుత మంత్ర సామగ్రినంతను వినియోగించి ఎదుర్కొని, నిర్మూలించ ప్రయత్నించేరు. హృదయాల్ని కంపింపచేసే ఉపన్యాసాలు, ఎదిరిపక్షాన్ని ఛేదించే ఘాటైన వ్యాసాలు, హాస్య ధోరణితో నైచ్యాన్ని రూపుమాపే ప్రహసనాలు, వివేకవర్ధని మొదలైన పత్రికలు, వారి సాధన సామగ్రి. నిర్మాణకృషిలోని భాగములు నేటికిని నిలచి ఉన్నవి. ఉన్నత విద్యకోసం ఉచిత విద్యను స్త్రీలకు బోధించే ఉన్నత పాఠశాల – శ్రీ వీరేశలింగ ఆస్తిక ఉన్నతపాఠశాల. అనాథలైన వితంతువుల శరణ్యానికి విక్టోరియా వితంతు శరణాలయం. ధర్మదీక్షను, పవిత్ర జీవితాన్ని, ఉదార ఆదర్శాలను పెంపొందించడానికి ప్రార్థన

సమాజము. ఈ సంస్థల నన్నిటిని పోషించి వృద్ధిలోనికి తెచ్చేందుకు హితకారిణీ సమాజం. వీటి అన్నిటిద్వారా పంతులుగారు కొలదికాలంలోనే ఆంధ్ర సంఘంలో ఒక పరివర్తనాన్ని, ఒక విప్లవాన్ని తీసికొనివచ్చేరు. ఈసంఘ సేవా ప్రణాళికలన్నిట్లో అతి ప్రాముఖ్యాన్ని వహించింది స్త్రీ పునర్వివాహోద్యమము.

ఈ ఉద్యమాన్ని గురించి తెలుసుకోవాలంటే శ్రీ పంతులుగారి స్వీయ చరిత్రే చదవాలి. ఎంత పట్టుదల ఈ కార్య నిర్వహణకు అవసరమైందో, ఎంతటి సాహసాన్ని పంతులుగారు చూపించేరో, ఎంతటి త్యాగాన్ని చేయవలసి వచ్చిందో ఆ చరిత్ర చదివితే మనకు స్ఫురిస్తుంది, 'స్ఫురిస్తుంది' అని అనడానికి కారణం అనుభవించినదానిలో చాలా తక్కువభాగమే స్వీయచరిత్రలో వ్యక్తమవుతుంది. ఈ చిన్న వ్యాసంలో వితంతూద్వాహోద్యమంతో, నాఅనుభవాలుమాత్రమే reminiscences మాదిరిగా వ్రాస్తాను.

స్త్రీ పునర్వివాహాల గురించి మొట్టమొదట నే విన్నది మా నాన్నగారివద్దనుండి—ఏభై ఏళ్ళక్రితం. మా నాన్నగారికి అన్న వరస అవుతారు కాబోలు, కీ.శే. పార్నంది రామచంద్రరావుగారు. ఈయన ఖరగపూర్ నివాసి, అక్కడ రైల్వే కార్ఖానాలో పనిచేసేవారు. ఆయన గురించి చెప్తూ ఆయన చాలా మంచివాడనీ, సంస్కరణ వివాహం చేసుకోవడం వల్లనే మా కప్పటికి కొంచెం దూరమైనాడనీ, ఎంతో అభిమానంతో చెప్పేవారు. పంతులుగారు జరిపిన మొదటి రెండు వివాహాలలోనే ఆయనదొకటి. వారి సంతానం చాలా వృద్ధిలోకి వచ్చేరు. వారి మూడో కుమారుడు, శ్రీ పి. డి. పి. రావు (మద్రాసులోని Films Division లో పెద్ద ఉద్యోగి), మా అన్నగారి అల్లుడు శ్రీ రామచంద్రరావు గారున్నూ, కీ. శే. శ్రీ బండారు దండపాణి గారున్నూ, ఖరగ్‌పూర్ జనాభాలో నూటికి 75 వంతులు ఆంధ్రులు ఉండడానికి కారకులు. ఈ ప్రథమ శ్రేణిలో జరిగినదే కీ. శే. శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారి వివాహము. వధువు బాలవితంతువు సీతమ్మగారు. ఈ దంపతుల ప్రథమ సంతానము శ్రీమతి వసుంధరాదేవి. ఇక్కడ ఎం. ఏ. ప్యాసయి, లండన్ స్త్రీల కళాశాలలో B.Sc.(Hons.) ప్యాసయి, గుంటూరు స్త్రీల కళాశాలకు ప్రిన్సిపాల్‌గా రిటైరైన ఈమె నా మరదలు. వీరి సంతానము అత్యున్నతస్థాయి నందుకున్నదే!

శ్రీ పంతులుగారి తోటలోని కళ్యాణమంటపంలో జరిగిన వివాహాలన్నింటిలో అత్యంత వైభవంగా జరిగిన వివాహము 28-12-28 న జరిగినది. వధువు, కీ.శే. ఎఱ్ఱగుంట సుబ్బారావుగారి ఏకైక పుత్రిక రంగనాయకమ్మ బి. ఎ. ఎల్. టి. వరుడు మా తమ్ముడే, వెంకటరత్నం. ఆచార్యులు దివాన్ బహదుర్ సర్. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు. ప్రేక్షకవర్గం, రాజమహేంద్రవరంలోనేగాక పలుప్రాంతాలనుండి వచ్చిన శిష్టజనం. అప్పటికే వితంతూద్వాహాలు సంఘ మర్యాదను పొందనారంభించేయి. మరికొన్ని సంవత్సరాలకు మా పెద్దన్నగారు, రైల్వే ఉద్యోగి, మా పెద్దవదినెగారిని కోల్పోయినవారై, ద్వితీయ వివాహాన్ని పంతులుగారి శరణాలయంలోనే జరిపించుకున్నారు. స్త్రీ పునర్వివాహోద్యమంతో మా కుటుంబానికిట్లు సన్నిహిత సంబంధ మేర్పడింది. ఇది మాకు అత్యంత గర్వకారణం.

ఈ ఉద్యమానికి తమ జీవితాన్ని ముడిపెట్టిన రెండు ప్రముఖ కుటుంబాలతో సన్నిహిత సంబంధం మాకు కలగడం మే మొక అదృష్టం అనుకుంటాం. బ్రాహ్మ మత ప్రచారానికి, ధర్మజీవితానికి తమ సర్వస్వమును అర్పించుకొన్న అత్యంతాదర్శ జీవులు, పరమ పూజ్యులు, యోగులును అయిన శ్రీ కామరాజు హనుమంతరావుగారు, శ్రీ పాలపర్తి నరసింహం గారును. వీరి మనుమరాలు మా కోడలు. వీరి గృహిణుల జీవితాలు ఎంతటి శోభను, ఆనందాన్ని, మాధుర్యాన్ని విలసిల్ల జేసేయో తలచు

కుంటే ఈ యుద్యమ విశిష్టత బాగా వ్యక్తమౌతుంది. వీరి వివాహాన్ని శ్రీ పంతులుగారు ఎంతో ఆదరణతో జరిపినారు. బంగాళాదేశంలో పండిత విద్యాసాగరులవలె శ్రీ పంతులుగారు ఆంధ్రలో గావించిన ఈ సేవ ఊషర క్షేత్రంలో నందనవనాన్ని వెలయించడమే గదా!

ఈ యుద్యమంలో పంతులుగారి దీక్షవంటి దీక్షను వహించి, త్యాగాన్ని చూపించి, సాహసాన్ని ప్రకటించిన వ్యక్తి మా చిన్నన్నయ్య రామమూర్తిగారు అని చెప్పేను. మా చిన్న వదినెగారు రాజ్యలక్ష్మిగారివలె సహకరించేవారు. తన గృహమే వితంతు శరణాలయం. గుంటూరులో ఉపాధ్యాయుడుగా యుంటూ ఎన్నో వితంతూద్వాహాలను చేయించేరు. ఒక్కొకటి ఎంతో శ్రమకి ఫలితం. వివాహాలు చేయించడం ఒకవంతు, వాటిని నిలబెట్టడం అనేక వంతులు శ్రమకోరేవి. మా అన్నగారు ఏర్పరిచిన స్త్రీ పునర్వివాహాలలో అత్యున్నత శ్రేణికి జెందినది మా సహాయోపాధ్యాయులు, గౌతమీ కోకిల, శతావధాని, కవిశేఖరులు శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారిది. కీ. శే. ధర్మసేవకులు, ధర్మశాస్త్ర పారంగతులు శ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారి పుత్రిక వధువు. ఈ వివాహములోని విశిష్టత మీరు గమనించాలి. తండ్రి రాష్ట్రమంతటా ధర్మ సదస్సులను గావించి, వివాహ ధర్మసూత్రముల విమర్శలు జరిపించి, పునస్సంధానముతోనే వివాహకర్మ పూర్తి అవుతుందనిన్నీ, అంతకుముందు వరుడు గతించిన వధువు కన్యాత్వాన్ని కోల్పోదని నిరూపించి, తనకుమార్తె వివాహమును జరిపించుటకు ధర్మసదస్సుయొక్క అనుమతిని పొంది, తాను స్వయముగ తనయింటనే కుమార్తె వివాహాన్ని జరిపించేరు. ఈ కుటుంబముతో మాకు సన్నిహిత సంబంధము ఉంది. ఇది మా అదృష్ట మనుకుంటాము. శ్రీ మల్లయ్యశాస్త్రిగారివద్ద మేము చదువుకున్నాము గూడ.

నేనొక సంవత్సరం (1943 - 44) శ్రీ వీరేశలింగం హైస్కూలులో ఉపాధ్యాయుడుగా పనిచేసేను. ఆ సంవత్సరంలో రెండు వివాహాలను శ్రీ పంతులుగారు ఏర్పరచిన వివాహ విధానాన్ని అనుసరించి జరిపేను. ఇందులో ఒకటి స్త్రీ పునర్వివాహమే. వరుడు ప్రప్రథమ వివాహ కుటుంబము సంతతివాడు. నాకీ అవకాశం కలగడం ఎంతో ఆనందానికి కారణమైంది.

మా చిన్నన్నయ్య రామమూర్తిగారు జరిపించిన వివాహాల్లో మొదటిది శ్రీ భైరి సీతారామమూర్తిగారిది. వీరు ఖరగ్‌పూరు రైల్వేకార్ఖానాలోని ఉద్యోగులు. వధువు బాల వితంతువు జయమ్మ. ఈ వివాహం మా యింట్లోనే జరిగింది. వీరి సంతానం ఎంతో వృద్ధిని గాంచింది. వారి యిల్లు, పిల్లలు, మనుమలు, మనుమరాండ్లు - వీరినిచూడ ఎంతో ముచ్చట అవుతుంది. మొన్న ఆదివారంనాడే వారిని చూచివచ్చేము కూడా. ఇంకో వివాహం పండితులు భారతుల మార్కండేయ శర్మగారిది. ఇదిగూడా మా యింట్లోనే జరిగింది.

విజయవాడలో జరిగిందింకొక ఆదర్శ స్త్రీ పునర్వివాహము. వరుడు శ్రీ దాసరి బాపయ్య, అగ్రికల్చరల్ ఆఫీసరు. గుంటూరునుండి అనేక కుటుంబాలు తరలి వెళ్ళేయి - ఆ వివాహానికి. వరునితల్లి అమాయకురాలు. ఆమె యెరుగని బాధను పడటంచూచి మేము నివ్వెరపోయినాము. ఆ తంతు అయిపోయిన వెంటనే ఆమె హృదయం కుదుటపడింది.

ఇంకా అనేకులు, ఈ సంస్కరణ వివాహాలు జరుపుకున్నవారితో మా పరిచయం ఎంతో సంతోషాన్నిచ్చేది. 1927 మేలో కాబోలు శ్రీ పంతులుగారి వర్ధంత్యుత్సవ సందర్భంగా రాజమహేంద్రవరం పంతులుగారి తోటలో పెద్ద సమావేశం జరిగింది. ఇది స్త్రీ పునర్వివాహ కుటుంబముల సమ్మేళనము. ఒక వంద కుటుంబాలు వచ్చేయని నా జ్ఞాపకము. మా కుటుంబము ఆ సమావేశానికి అతిథులుగా వెళ్ళేము. ఈ కుటుంబాలలో ప్రథమస్థానం వహిం

తెలికిచర్ల సూర్యప్రకాశం

చినది కీ. శే. శ్రీ కోకా వెంకట సుబ్బారావు గారిది. వీరు అప్పటి పుతాపురం దివాన్‌గారు. అనేక బీదకుటుంబాలకి అండగా ఉండేవా రీయన. మాకు గుంటూరులోగూడా అనేక కుటుంబాలుండేవి. 'దేశాభిమాని' పత్రికా సంపాద కులు వీరిలోపెద్దలు. అధరాపురపు సంజీవరావు గారొకరు. ఈ సంస్కరణ కుటుంబాలన్నింటిని కని పెట్టి, వారి అక్కరలను తీర్చి, ఆదుకునే ప్రముఖులు మా మిత్రుడు. కీ. శే. చట్టి దుర్గాప్రసాదరావుగారు. వీరు గుంటూరులో స్త్రీ పునర్వివాహోద్యమమును అతి సమర్ధముగా నడిపిన కీ. శే. పున్నవ దంపతులకు తోడుగా పనిచేసిన అతి నిరాడంబరవ్యక్తి. ఈతని సలహా ననుసరించే ఈ కుటుం బములలోని వ్యక్తి, శ్రీమతి బండ్లమూడి హనుమాయమ్మ గారు గుంటూరులో బాలికల కొరక ఉన్నతపాఠశాలను స్థాపించుటకు తన భవనాన్ని హిందూకాలేజి హైస్కూలు కమిటీవారికి దానముచేసేరు. ఇట్టీ యుద్యమము ఆంధ్ర సంఘంలోని అతి ఉదారవ్యక్తుల సారధ్యాన్ని నడవడమే గాక అనేక స్త్రీ జీవితములను శోభావంతముచేసి, ఉదార ఆదర్శ కుటుంబా లనేకములను వెలయింప జేసింది.

బాల్యమునుండి మత,సాంఘిక సంస్కరణ కలాపాలలో అతి శ్రద్ధాభక్తులతో పాల్గొని, ఆదర్శవ్యక్తులుగా, అసహా యోద్యమంలోను, స్వాతంత్ర్య సమరంలోను ఉన్నత స్థానమందుకొని, వైద్య విద్యారంగంలో ప్రముఖ సేవను చేసి, మాజీ విద్యామంత్రి అయిన మా మిత్రులు శ్రీ మల్ల వరపు వేంకట కృష్ణారావుగారు, శరణాలయనివాసి, బి.ఏ; బి.యిడి., రాజేశ్వరమ్మగారిని వివాహమాడి ఒక ఉన్నత. ఆదర్శ కుటుంబాన్ని వెలయింప జేయడం ఈ ఉద్యమాని కెంతేనా గౌరవ ప్రపత్తులను అందజేసింది. ఉదారభావులు, విశాలహృదయులు, సేవాతత్పరులే ఈ వివాహములను చేసికొనుటకు సామాన్యముగా ఉద్యుక్తులు కావడంవల్ల ఈ ఉద్యమం మన అందరి ఆదరానికి పాత్రమయింది.

ఈ ఉద్యమాన్ని ప్రారంభించి పోషించిన శ్రీ కందు కూరి వీరేశలింగం పంతులుగారికిని, వారి సహధర్మచారిణి పరమ సాధ్వి రాజ్యలక్ష్మమ్మగారికిని. పలు చోట్ల వారి మార్గాన్ననుసరించి సంఘసేవ నొనర్చిన అనేక మహ నీయులకూ, ఆంధ్రదేశములోని మనమందరమూ ఎంతో కృతజ్ఞులమై ఉన్నాము.

"పృథివిలోపలఁ బరతంత్ర వృత్తితోడఁ
బడయునట్టి మహేంద్ర వైభవము కంటె
నుత్తములు దాము స్వచ్ఛంద వృత్తితోడ
కొలది విభవంబె గొప్పఁగాఁదలఁతు రెపుడు"

— శ్రీ వీరేశలింగం

[ సత్యహరిశ్చంద్ర నాటకము నుంచి ]

# రాజశేఖర చరిత్ర

డాక్టర్ జి. వి. కృష్ణారావు

"ఏవో నాలుగు నవలలు వ్రాశాను కాబట్టి దేశంలో నలుగురికి నా పేరు తెలుసు కాని నేను కవిత్వం చెబుతానని తెలియదు" అని ఒక రచయిత అంగలార్చాడు. మరొక విద్వాంసుడు యుద్ధానంతర సాహిత్య స్థితిని చర్చిస్తూ నవల, కథ మున్నైన గద్య రచనలనే పూర్తిగా పరిహరించాడు. ఇటీవల ఇంకొక మిత్రుడు "ఏ నవల ఆయుర్దాయమైనా ఐదు సంవత్సరాలే; కాదంటే మరొకటి రెండు సంవత్సరాలు కలుపుకో"మ్మని హెచ్చరించాడు.

నవల అన్నా, కథ అన్నా ఈ నాటి పండిత లోకంలో ఉన్న సామాన్యాభిప్రాయం యిది. ఎన్నో అనూదిత రచనలు, స్వతంత్ర రచనలు వచ్చిన తరువాత గూడ ఇలాంటి అభిప్రాయం ఉన్నదంటే 1880 నాటి స్థితి ఎలా ఉండేదో తేలికగా ఊహించుకోవచ్చు.

కందుకూరి వీరేశలింగంగారు మరొక విధంగా భావించారు. అంతమాత్రాన వారు తెలుగుపండితులు కాదందామా, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం వ్రాశారు. సంస్కృతం కాని, కవిత్వ తత్త్వం కాని తెలియనివారంటే, అభిజ్ఞాన శాకుంతలం అనువదించారు. సాహిత్య విమర్శకులు కారంటే ఆంధ్రకవుల చరిత్ర వ్రాసి ఆయా కవుల కవితా తారతమ్యాలు చక్కగా నిరూపించారు. నవలయందు ఇప్పటివారికున్న సంకుచితభావం, తిరస్కారదృష్టి వారికే ఉంటే తెలుగువారికి మొదటి నవల 1880 లో లభించి ఉండేదికాదు.

వీరేశలింగంగారు ఆంగ్లకవుల నవలలు చదివారు. ముఖ్యంగా "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు" చూచారని, అదే "రాజశేఖర చరిత్రకు" ఉద్బోధకమైందనీ, వారి పీఠిక సూచిస్తున్నది. తెనుగులో ఇంతకుపూర్వం ఇలాంటి రచనలు లేవనీ ఇకముందైనా అలాంటివి రావటం అవసరమనీ వారు గుర్తించారు. అంతేకాని అప్రాచ్యమైనది అనుపాదేయమని వారు అనుకోలేదు, "గుణాః ప్రమాణం న దిశాం విభాగః" అన్న సూక్తి వారు జీర్ణించుకొన్నారు.

వీరేశలింగంగారు సహృదయులు కాబట్టి "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు" చదివి ఆనందించారు. అలాంటిది తెలుగులో కావాలనుకొన్నారు. అయితే "ఆ రచన సాహిత్యమవుతుందా? సాహిత్యమైతే ఏ కోవకు చెందుతుంది?" అన్న ప్రశ్నలుకూడ వారికి కలిగి ఉంటవి.

హృదయాన్ని స్పందింపజేసిన రచన సాహిత్యమెలా కాకపోతుంది? దండి దగ్గరనుంచి జగన్నాధుని వరకు కావ్యమంటే "ఇష్టార్థావచ్ఛిన్న పదావళి" అనీ, "రమణీయార్థ ప్రతిపాదక శబ్ద" మనీ ముక్తకంఠంతో ఘోషించారు. కాబట్టి నవలకు కావ్యత్వం నిస్సందేహంగానే సిద్ధిస్తుంది. కాని అది ఏ కోవకు చెందుతుందనేదే ప్రశ్న.

నవలను కథ అనలేము. ఆఖ్యాయిక అనీ అనలేము. అది ముక్తకాదిలో చేరుతుందనటానికి వీలుపడదు. ఇక పరిశేషన్యాయం చొప్పున మహాప్రబంధం, లేదా ప్రబంధం కావాలి. ప్రబంధం అనగానే అష్టాదశ వర్ణనలు పద్య గద్యమయత్వం జ్ఞప్తికివస్తాయి. ఈ లక్షణాలు నవలలో లేవే అన్న సంశయం అంకురిస్తుంది. అయితే ఆలంకారికులు ప్రబంధానికి నిర్దేశించిన లక్ష

ణాలను తెలుగు ప్రబంధాలు ఎంతవరకు పాటించాయి? ప్రాచీనులు చెప్పిన పెక్కు లక్షణాలు లేక పోయినా మన చరిత్ర మున్నైనవాటిని ప్రబంధాలనే చెప్పుకొంటున్నాము. అలాగే కేవల వచన నిబద్ధమైన నవలను వచన ప్రబంధమని ఎందు కనరాదు?

నవలకు కథ ముఖ్యంకాని వర్ణనలు ముఖ్యంకావు. "ప్రబంధానికి వర్ణనలు ప్రధానాలవుతున్నవి కాని, కథ ప్రధానం కాదుగదా" అన్న ఆక్షేపణ ఈ సందర్భంలో తోచవచ్చును. వాస్తవానికి ప్రబంధం వెట్టి తలలువేసే రోజులలోనే కథకు క్షయరోగం సంక్రమించింది, కాని ఆరంభదశలోనే అంకురించలేదు. భామహుడు, దండి, భోజుడు, విశ్వనాథుడు మొదలైన అలంకారికులు కథా ప్రాముఖ్యం గుర్తించి శ్లిష్ట సుసంధిత్వం మహాప్రబంధ గుణంగా ఏనాడో పేర్కొన్నారు. కనుక నవలను వచనప్రబంధ మనటానికి ఎలాంటి ఆక్షేపణ లేదు.

నవలకున్న ఈ స్థానాన్ని గుర్తించటంలోనే వీరేశలింగంగారి విశిష్టత గోచరిస్తున్నది. ఆ విశిష్టతవల్లనే తెలుగువారికి మొదటిసారిగ 1880 లోనే నవల రూపంలో "రాజశేఖర చరిత్ర" లభించింది.

నవలలోని ఇతివృత్తం పౌరాణికం కాని, ఐతిహాసికం కాని, రాజకీయం కాని, సామాజికం కాని, మరొకటి కాని కావచ్చు. కేవలం ప్రఖ్యాత కథనే స్వీకరించాలని కాని లేదా కల్పితాన్నే గ్రహించాలని కానీ లేదు. ఇలాంటి నియమం లేనప్పుడు సాధారణంగా రచయిత ఏ ఐతిహాసిక కథనో, ఏ పౌరాణిక గాథనో స్వీకరించటం కద్దు. వీరేశలింగంగారుమాత్రం ఆ పనిచేయక సామాజిక ఇతివృత్తాన్ని స్వీకరించారు. ఇది రాజశేఖర చరిత్రలో కనుపించే మరొక విశేషం.

కథా చిత్రణకు సామాన్యంగా రెండు మూడు మార్గాలున్నవి. మొదటిది నాట్యధర్మి. రెండవది లోకధర్మి. మూడవది ఉభయధర్మి. ఇతివృత్తం సామాజికమైనప్పుడు రచనా పద్ధతి లోకధర్మాన్ని ఆశ్రయిస్తుంది. అయితే రచనను ఆమూలాగ్రం ఆ ధర్మాన్ని ఆశ్రయించి నిర్వహించటం అరుదు, కష్టసాధ్యంకూడ. రాజశేఖర చరిత్ర కేవలం లోకధర్మాన్ని పురస్కరించుకొని సాగింది. ఇది మరొక ప్రత్యేకత.

ఆనుషంగికంగా మన ప్రాచీన ప్రబంధాలు అష్టాదశ వర్ణనలకు తావిస్తే నవలలు దేశకాల స్థితిగతులను అభివర్ణిస్తున్నవి. రాజశేఖర చరిత్ర అలాకాక ప్రజల ఆచార వ్యవహారాలను ప్రదర్శించి, వాని బాగోగులను పరామర్శిస్తున్నది. జ్యోతిషంలోని వెర్రినమ్మకం, జపహోమ మంత్ర తంత్రాలయందలి ఆసక్తి, పంచాంగపుటేలు బడి, బైరాగులమీదిభక్తి, నీళ్ళ రేవులో అమ్మలక్కల కబుర్లు, వైష్ణవులలోని సంకుచిత కలహాలు, సన్న్యాసి స్వాముల దుండగాలు, జ్యోతిష్కుల వంచనలు, భూతవైద్యుల తంతులు, మాంత్రికుల మాయోపాయాలు, సువర్ణ విద్యలో విశ్వాసం, గ్రహణ కాలమందలి ప్రజల మూఢాచారాలు, జాతకాలు, బాల్య వివాహాలు, ఆతుర సన్న్యాసాలు, ఆభిచారిక క్రియలయందలి అంధ విశ్వాసం, స్త్రీ విద్యాశూన్యత, అస్పృశ్యత మున్నైనవాటిని కన్నులకు కట్టినట్లు వర్ణిస్తున్నది. ఇదిగూడ మరొక ప్రత్యేకత అని చెప్పాలి.

రాజశేఖ చరిత్ర కావ్యత్వ పరిశీలనకు కథముఖ్యం.

రాజశేఖరుడు ఘంపన్నుడైన గృహస్థు. పండితుడు. మాణిక్యాంబ అతని భార్య. సుబ్రహ్మణ్యం, రుక్మిణి, సీత అతని సంతానం. రుక్మిణి పెండ్లికి అతడు శక్తికి మించిన ఖర్చు చేస్తాడు. బంధుప్రీతికిలోనై మరికొంత సొమ్ము వమ్ముకావిస్తాడు. స్తుతిప్రియత్వానికి దాసుడై పాత్రాపాత్ర వివేచనచేయక దానధర్మాలు విపరీతంగా చేస్తాడు. అతిథి, అభ్యాగత పూజకు విరివిగ వెచ్చిస్తాడు. వీటి అన్నిటితో అతడు పేదవాడవు

తాడు. పేదరికం తిరిగి అతనికి ద్రవ్యాశ కల్పిస్తుంది. అతడు యోగిని ఆశ్రయించి బంగారం చేయించుకో వాలని యత్నించి ఉన్న వెండి బంగారాలు ఊడ్చు కుంటాడు. ఎటుచూచినా అతనకి అప్పులే. ఏవైపు తిరిగినా అపహాసాలే. స్నేహితులు తప్పుకుంటారు. ఆశ్రితులు అదృశ్యులవుతారు. చేసేదిలేక రాజశేఖ రుడు మడిమాన్యాలు, ఇళ్లువాకిళ్ళు కుదువబెట్టి డబ్బుతెచ్చి అప్పుసప్పులు తీర్చుకుంటాడు. పువ్వు లమ్మిన అంగట్లో కట్టెలమ్మలేక సకుటుంబంగా అతడు కాశీయాత్రకు బయలుదేరుతాడు.

మార్గమధ్యంలో వడసోకి పడిపోయిన రామరాజు నకు శీతలజలమిచ్చి రాజశేఖరుడు ప్రాణదానం చేస్తాడు. తరువాత అతనిని దొంగలు ముట్టడిస్తారు. రామరాజు సాయంతో ఆ విపత్తు గడచిపోతుంది. రుక్మిణిని మాత్రం రాజశేఖరుడు కోల్పోతాడు. బ్రతుకుజీవుడా అంటూ అతడు కుటుంబంతో భీమ వరం చేరి అచట కాపురం పెడతాడు. చేతిలోని నాలుగు కాసులు కరిగిపోతుంటవి. జీవనోపాధికోసం రాజశేఖరుడు ఆలోచిస్తాడు. రాజబంధువైన శోభ నాద్రిరాజువల్ల సాయం లభించదు. కొడుకు సుబ్రహ్మ ణ్యాన్ని ఉద్యోగ సంపాదనార్థం పిఠాపురం పంపు తాడు.

శోభనాద్రిరాజు రాజశేఖరుని వంచించి సీతను దుర్మార్గుడూ తనకాశ్రితుడూ అయిన పద్మరాజునకు ఇవ్వటానికి ఒప్పించి ద్రవ్యసహాయం చేస్తాడు. రామ రాజు మారువేషంతోవచ్చి ఆ వివాహానికి విఘాతం కల్పిస్తాడు. తరువాత క్రమంగా రాజశేఖరునకు వాస్తవం తెలుస్తుంది. అతడు సీతను పద్మరాజు కివ్వ టానికి నిరాకరించి శోభనాద్రిని ధిక్కరిస్తాడు. శోభ నాద్రిరాజు తనఅప్పు తీర్చలేదన్న మిషతో రాజశేఖ రుని కారాగారంలో బంధిస్తాడు. అతని రెండవ కుమార్తె సీతను తన భటులచేత అపహరింపజేస్తాడు.

సుబ్రహ్మణ్యం పిఠాపురం రాజుగారి ఆస్థానంలో ప్రవేశం సంపాదిస్తాడేకాని ఉద్యోగంమాత్రం వెంటనే పొందలేకపోతాడు. నీలాద్రిరాజు అన్న దొంగ రాజ కోశాగారం కొల్లగొట్టగా సుబ్రహ్మణ్యం అతనిని పట్టు కొని రాజానుగ్రహం సంపాదిస్తాడు. విచారణార్థం దొంగను పెద్దాపురం గొనిపోవటానికి రాజుచే నియు క్తుడై వెళ్లుతూ దారిలోనున్న భీమవరం పోయి తండ్రిని కలుసుకొంటాడు.

అప్పటికి పెద్దాపురం రాజు రాజశేఖరునిపై ఉన్న అభియోగం విచారించి నిర్దోషి అనితేల్చి అతనిని కారాగారంనుంచి విడిపిస్తాడు. ఆసమయానికే రుక్మిణి పురుషవేషంతో సీతను ధూర్తులనుంచి రామ రాజు సాయంతో తప్పించి తండ్రివద్దకు కొనివస్తుంది. దేశాంతరగతుడైన అల్లుడు నరసింహస్వామికూడ - అంటే రుక్మిణి భర్త - కూడ మామవద్దకు చేరు కొంటాడు.

రామరాజే పెద్దాపుర మహారాజు. కనికరించి రాజశేఖరుని మడిమాన్యాలు విడిపించి అతనిపిల్లల వివాహానికి వలసిన ధనసహాయం చేస్తాడు. అప్పటి నుంచి రాజశేఖరుడు, అతని కుటుంబం సుఖంగా ఉంటారు.

ఈ ఇతివృత్తంలోని రాజశేఖరుని కారాగారవాస సంఘటనకు రామరాజు శోభనాద్రిరాజు పాపయ్యా అన్న పాత్రలకు "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు" దోహద మిచ్చింది. తక్కినదంతా వీరేశలింగంగారి స్వతంత్ర సృష్టే.

1880 నాటికి భారతసాహిత్యంలోనేమి ఆంగ్ల సాహిత్యంలోనేమి ప్రబంధానికి ఏ మహారాజో ఏ ధీరోదాత్తుడో నాయకుడుగా ఉండేవాడు. రాజ శేఖర చరిత్రలోని నాయకుడు అలాకాదు. అతడు

సామాన్య గృహస్థు. అతనిలో లోకోత్తర గుణసంపత్తి లేదుకాని, సామాన్య మానవులకున్న గుణగణా లున్నవి. వాటికితోడు స్తుతిప్రియత్వం, అపాత్రదానం వంటి అల్పావగుణాలున్నవి. వాటివల్ల అతడు కష్టాల పాలవుతాడు. సామాన్య మానవదుర్లభాలైన గుణ సంపత్తి అభివర్ణించి తదభిముఖత్వం కలిగించటం మేలు. రాజశేఖర చరిత్ర ఈ పనిచేస్తూ మరొక ప్రత్యేకతను చాటుతున్నది.

రాజశేఖర చరిత్రలోని భాష గ్రాంథికమేఅయినా, వ్యర్థ సమాసాటోపం శుష్క పాండిత్య ప్రకర్ష లేక వ్యావహారిక భాషకు సన్నిహితమై సరళంగా సాగుతూ మామూలు పాఠకునికైనా తేలికగ అర్థ మవుతున్నది. ఇప్పటి పెక్కుమంది రచనలలోవలె రాజశేఖర చరిత్రలో చ్యుత సంస్కారాలు, అన్వయ రాహిత్యాలు, అసభ్య వర్ణనలు లేవు.

ఇన్ని విశేషాలున్నా రసపిపాసువునకు రాజశేఖర చరిత్రలో హృదయంగమమైనది దామోదరయ్య విషాదాంత వృత్తాంతమే. జీవితంకోసం అతడు భూత వైద్యుడవుడవుతాడు. జ్వరపీడితులు, జడుపుగొన్న పిల్లలు అతనిచేత విభూతి పెట్టించుకొని స్వాస్థ్యం పొందుతారు. దానితో గొప్ప భూత వైద్యుడన్న ఖ్యాతి అతనికి వస్తుంది. ఆ ఖ్యాతివల్ల అతని దురహంకారం పెరుగుతుంది.

ఒకసారి ఈడిగవాని ఇంటిమంగలి కొబ్బరిచెట్టున బొండాలు చూచి నాలుగు కోసి తన ఇంటికి పంపవల సిందని దామోదరయ్య అతనికి ఆజ్ఞాపిస్తాడు, డబ్బు లిస్తేనే బొండాలిస్తానని అతడంటాడు. "నీ చెట్టును ఏమిచేస్తానో చూడు" అని దామోదరయ్య బెదిరి స్తాడు. కాని ప్రయోజనం ఉండదు. ప్రతిక్రియ చేయక పోతే ఊళ్లో తాను చులకనవుతానని దామోదరయ్య ఒక నడిరేయి కొడుకుచేత బియ్యపు కడుగునీరు పాత్రలో పట్టించుకొని పోయి ఈడిగవాని చెట్టెక్కి మొవ్వ చిదుకపొడిచి, కడుగునీరు పోసి మూడవ కంటికి కనిపించకుండ ఇంటికి తిరిగి వస్తాడు.

నాలుగైదు రోజులలో కొబ్బరిచెట్టు నిలువున ఎండి పోతుంది. అదంతా తన ప్రయోగమహిమని దామో దరయ్య గప్పాలు కొడతాడు. ప్రయోగంచేసి అతడే తన చెట్టును చంపాడని ఈడిగవాడు నలుగురికి చెప్పు కొని ఏడుస్తాడు. ఊరంతా నిజమేనని నమ్ముతుంది. ఇంతలో కోమటివారి అబ్బాయికి జ్వరం వస్తుంది. పెద్దలు సోదె అడిగితే జ్వరం ప్రయోగంవల్ల దాపు రించిందని మాలెత చెప్పుతుంది. వారు దామోద రయ్యను అనుమానిస్తారు. భూతవైద్యులను పిలిపించి ప్రతిక్రియ చేయించినా కుర్రవాడు కోలుకొనక చని పోతాడు.

నాటినుంచి ప్రజలకు దామోదరయ్య అంటే ఎక్కడలేని భయం. రోగులున్న ఇండ్లలోని విధవలకు దేవతలు ఆవేశించి ప్రయోగమని పలికేవారు. "నేనెరుగను మొర్రో" అని దామోదరయ్య మొత్తుకొంటాడు. కాని ఎవరూ నమ్మరు. ఊళ్లో ఎవ రికి ఏరోగంవచ్చినా అది దామోదరయ్య ప్రయో గంగా కనిపిస్తుంది. అందువల్ల సంఘం అతనిని వెలి వేస్తుంది. నీళ్ళకు రానివ్వరు. చాకలి, మంగలి, అతని పనులు మానివేస్తారు. ఈ స్థితిలో అతని భార్యకు రోగం వస్తుంది, ఆప్తమిత్రుడుకూడ సంఘానికి భయ పడి ఆమెకు మందు ఇవ్వడు. ఏలాగో ఆమెకు కొంత స్వాస్థ్యం చేకూరిన తరువాత అతడామెను పుట్టింటికి పంపివేస్తాడు.

అయినా సంఘం అతనిని క్షమించదు. తెల్లవారి లేచేసరికి అతనిగుమ్మంలో ఎముకలు, కుండపెంకులు మున్నైన అశుద్ధ పదార్థాలు ప్రత్యక్షమయ్యేవి. దామోదరయ్య ఎలాగో శుద్ధిచేసుకొనేవాడు. బయ

టికి పోవాలంటేనే అతనికి భయం. అహోరాత్రాలు తలుపులు బిగించుకొని అతడు ఇంట్లోనే కూర్చునే వాడు. అదిచూచి గ్రామస్థులు హడలిపోతారు. దామోదరయ్యే ఏదో పాతాళహోమం చేస్తున్నాడని వణకిపోయి అతనికొంపకు చిచ్చుపెడతారు. ఆ ఇంటితోపాటు దామోదరయ్య గూడ భస్మీపటలమై పోతాడు.

దామోదరయ్య పాత్ర చిత్రణలో కనిపించే స్వాభావికత్వం, జీవం, రాజశేఖరుని చిత్రణలో కాని, తక్కిన పాత్రల చిత్రణలో కాని కనిపించవు. రచయిత అభివర్ణించిన ఆచార వ్యవహారాలు ఈ నాటికీ సమాజంలో కనిపిస్తున్నా కథకు అవశ్యకాలు కాక దాడిమబీజాలకు తమ్ముళ్ళవుతున్నవి.

ఏది ఎలా ఉన్నా కావ్యదృష్టితో చూచినప్పుడు రాజశేఖరచరిత్ర అంత సంతృప్తికరంగా లేకపోవచ్చును. కొందరు దానికి కావ్యత్వమే సిద్ధింపదని అనవచ్చును. కాని వచనప్రబంధ చరిత్రకారులు మాత్రం ముందు రాజశేఖర చరిత్రను పేర్కొని ఆతరువాతనే తక్కిన రచనలను పేర్కొనవలసి ఉంటుంది.



"వాసన చూడనట్టి ప్రసవంబు, నఖంబులఁ దున్పనట్టి నూ
త్నాసవ పల్లవంబుఁ బరులానని క్రొవ్విరితేనె, సూచి వి
న్యాసము లేని రత్నము మహోతత పుణ్యఫలంబుఁబోలు నా
భాసుర గాత్రి సోయగ మెవండు భుజింప విరించివ్రాసెనో !"

— వీరేశలింగం

("శాకుంతలము" నాటకం నుంచి)

# ఆదర్శం

శ్రీ పాటిబండ మాధవశర్మ

పరిణామమ్మును రోసి కర్కశశిలాభావమ్ము గైకొన్న ము
ష్కర విద్వాంసుల శుష్కవాఙ్మయమె దిక్కై సంఘ మల్లాడుచో
పరమాహ్లాది పదప్రబంధముల జీవద్వస్తు చిత్రమ్ములన్
చిరవాంఛాఫలితమ్ములన్ సలిపి తుష్టిన్ గొల్పె తాంధ్రప్రజన్ ।

ఆకాశంబున తారకల్ బలె సముద్యత్తావకీనాశయా
నీకంబుల్ వెలుగొందు నుజ్జ్వలసముద్మేషంబులై; నిత్యబా
ధా కల్లోలము సంఘసాగరము నీదన్ పీడిత శ్రేణికిన్
నౌ కాప్రాయము నీదు సంస్కరణ సన్నాహంబు సర్వస్వమున్.

అపమార్గమ్మున బోవునంధులకు సత్యంబైన సన్మార్గమున్
ఉపదేశించి జగమ్ము సర్వవిధసౌఖ్యోపేతమై యుండు నూ
త్న పథమ్ముల్ వెలయించువాడె కవి; ఈ నవ్యాంధ్ర సంస్కార
హర్మ్య పుటాగ్రమ్మున నీజయధ్వజము మా కాదర్శమై వెల్గెడున్ !




శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు

చిత్రకారుడు : శ్రీ గోలి శేషయ్య



శ్రీ పంతులుగారు నిర్మించుకొన్న తమ దంపతుల సమాధులు

శ్రీ వీరేశలింగం — శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ

# నా మధుర స్మృతులు

కామరాజు హనుమంతరావు

*పంతులుగారు నాకు వ్రాసిన యీ క్రింది లేఖతో వారిని గురించిన నా మధుర స్మృతులు తెలుప ప్రారంభింతును అయ్యది ఆంగ్లము నుండి యనువదింపబడినది.*

రావు బహదూర్
కె. వీరేశలింగం పంతులు

రాజమండ్రి,
1 వ మే, 1908

ప్రియమైన అయ్యా,

మీరు ఉత్తరము వ్రాసినందులకు ధన్యవాదములు. మచిలీపట్టణములో సార్వజనీన విందు జరుపబడినదని తెలిసికొని సంతోషించుచున్నాను. మీ భావి జీవితమును గురించి మీరొక నిర్ణయమునకు వచ్చినారని, మత సాంఘిక రంగములందు సేవ సలుప నిశ్చయించుకొన్నారని వినుట కానందముగ నున్నది. భగవంతునకు ధన్యవాదములు. సరియైనట్టి యుపయోగకర పర్యవసానమునకు మీరు వచ్చినారు.

ఈ నెల 3 వ తేది ఆదివారం నేను బహుశా చెన్నపురికి బయలుదేరి వెళ్ళుదును. ఇచ్చటనుండి చెన్నపురికి పోవుటకు పూర్వము, మీతో స్వయముగ మాటాడగోరుచున్నాను. మీరు రేపు పయనమై ఆదివార ముదయము 8 గంటలకు ఇచ్చటికి దయతో తప్పక రావలెను. నేను సోమవారం ప్రయాణము చేయవచ్చును; కాని నిశ్చయముగ చెప్పజాలను.

మీ రిచటికి వచ్చిన తరువాత మనము తీరికగా మన భావి కార్యక్రమమును అందుల కేర్పాటులను గురించి మాటాడుకొనవచ్చును. నాకు బాహ్యాడంబరము యావత్తు అసహ్యము.మనము నిజమైన సేవ కొంత చేయవలయును. సత్కార్యరూపము దాల్చని శుష్కోపన్యాసములతోను ఎట్టి వృధా విషయములతోను మనము కాలయాపన చేయకూడదు. జనోపయోగకరములైన సేవాకార్యములు సలుప సాంఘిక రంగములందు మనకెంతో యవకాశము గలదు. ప్రతి సత్కార్యమునూ ధర్మమునకు సంబంధించి పరమేశ్వరునకు ప్రీతికరమైనదే. అది వాస్తవము. మనము కొన్ని పరిశ్రమలు నెలకొల్పుట యావశ్యకము. మొట్టమొదట మనకు ఉత్సాహపరులైన సేవకులు కావలెను, తరువాత ద్రవ్యముకూడ కావలెను. మనము యథార్థముగ కార్యతత్పరులమైనచో, ఈశ్వరుడు మనకు ధనము సమకూర్చును. ఏ ధర్మకార్యమూ ధనాభావముచే నష్టపడదు.

నేను రాజకీయ సేవకు ప్రతికూలుడనని మీరందరు తలంతురు. మత సాంఘిక విషయములందువలె రాజకీయములందుకూడ నేను స్వాతంత్ర్య మభిలషించువాడనే. మన సాంఘిక పరిస్థితులు మనము చక్కపరచుకొనక యున్నంతకాలము, రాజకీయ స్వాతంత్ర్య సత్ఫలముల ననుభవింప జాలము. సాంఘిక రంగమున పాటుపడుట వల్ల మనము మనదేశమున కెక్కువ మేలుచేయగలము. కలసికొన్నప్పు డితర విషయములుకూడ ముచ్చటించుకొందము. వివాహాలోచనలందు నే నెంతమాత్రము బలత్కరించువాడను గాను.

15 రూపాయలు మనియార్డరుద్వారా చో. జగన్నాధరావుగారి పేరిట పంపితిని. వారు మీ కాసొమ్ము అందజేయుదురు.

భవదీయ సుహృదయుడు,
కం. వీరేశలింగం.

ఈ యుత్తరము పంతులుగారు నాకు వ్రాయుటకుగల సందర్భము లించుక దెలిపెదను. నా 21 వయేట 56 సం॥ల వయస్సుగల పంతులుగారితో దేశిరాజు పెద బాపయ్యగారి ద్వారా నాకు ప్రథమ పరిచయము కలిగినది. 1906 వ సం॥ న అది జరిగెను. అప్పటినుండి పంతులుగారు దివంగతులైన 1919 వ సం॥ వరకు 13 సం॥ ల కాలము వారితో భక్తిగౌరవములతోగూడిన సన్నిహిత సంబంధము బడయు భాగ్యము నాకు లభించినది. తత్కాలమునకు పూర్వము వినికిడివల్ల నెరిగియున్న 3 సం॥ లను, వారి మరణానంతరము నేటివరకు సంస్మృతి మూలమున మానసిక సంబంధము కలిగియున్న 40 సం॥ లను కూడ కలిపి చూచుకొన్నచో, పంతులుగారు నా దృష్టిపథమున మొత్తము 50 సం॥ లు ఆదర్శప్రాయులుగ నిలచి నాకు ధైర్యోత్సాహములు పురిగొల్పు చుండిరి. వారిని వారి సహధర్మచారిణి శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారిని సదా స్మరించుచు వారి ఆనందోద్యానవనములోనె నిర్మించుకొన్న స్వగృహము 'రాజ్యలక్ష్మీ కుటీరము' నందు రమారమి పాతిక సం॥ ల నుండి యిప్పటివరకు కుటుంబ సహితముగ నివసించుచున్నాను. నిత్యస్మరణీయులై యున్న ఆ పుణ్య దంపతులకు నా హృదయపూర్వక వందన శతములు.

దేశిరాజు పెద బాపయ్యగారు నా దగ్గిర బంధువు, ప్రాణతుల్యుడు, గురువర్యుడు. వారు 1908 వ సంవత్సరము మార్చి 9 వ తేదీన 27 వ యేట అకాల మృత్యువాత బడిరి. ఆ హృదయవిదారక సంఘటన మూలమున నా జీవితమున గొప్ప పరివర్తనము ఈశ్వరానుగ్రహము వల్ల కలిగినది. పారిశ్రామికవృత్తి నొకటి నేర్చి కృష్ణా జిల్లా కౌతవరం గ్రామములో అక్కడను పరిసర ప్రాంతములందు గల యాప్తమిత్రుల సాహాయ్యముతో స్థిరనివాస మేర్పరచుకొన కృతనిశ్చయుడనై యున్న నేను ఆ ప్రయత్న మంతయు విరమించి మచిలీపట్టణము చేరితిని. సర్వతోముఖసంస్కరణ పరాయణుడగు పెద బాపయ్యగారు తమ యువక అనుచరవర్గమునకును తదితరులకును కర్తవ్యముల దెలుపుచు మృత్యుశయ్య నుండి తమ యంతిమ సందేశ మొసంగిరి. అందు ప్రతి వ్యక్తియు సర్వతోముఖ సంస్కరణ మనుసరించి తన జీవితము దిద్దికొనుచు నొక యభిమాన సంస్కరణ కార్యము చేపట్టి నిర్వహించుటను ముఖ్య కర్తవ్యముగ పేర్కొనిరి. వారి ప్రబోధానుగుణముగ మత సాంఘిక సేవను నా యభిమాన కృషిగ నిర్ణయించుకొని మచిలీపట్టణమునందు నా ప్రేమాస్పదుల సాంగత్యమున కాలము గడుపుచుంటిని. అట్టితరి 1908 వ సంవత్సరము ఏప్రిల్ మాసములో మచిలీపట్టణమునకు ఆంధ్ర సంఘసంస్కరణ సభాధ్యక్షత వహించుటకై పంతులుగారు వచ్చిరి. నా భావి జీవితనిర్ణయము తెలిసికొని నన్ను తమవద్ద కరుదెంచి తమ కార్యములందు తోడ్పడగోరిరి. నేను వెంటనే జవాబు చెప్పక నా మనోగత భావముల నెరింగించుచు నొక యుత్తరము వ్రాసితిని. దానికి పంతులుగారు వ్రాసిన ప్రత్యుత్తరమే పైన పొందుపరుపబడినది. వారి సన్నిధికి నేను వెళ్లు సమయమున వారికిని నాకునుగల మనస్తత్త్వములు వారి యీ జవాబువలన సువిదితములు.

పంతులుగారు నిరుపమాన కర్మయోగిపుంగవులు, ఆంధ్ర సంఘసంస్కరణోద్యమ రణరంగమున అగ్రసేనాని. అట్టి ధర్మయోధాగ్రేసరుల శిక్షణము నా కయాచితముగ లభించుట నా యదృష్టము. మూడు సంవత్సరముల కాలము వారిచే సుశిక్షితుడనై నా భవిష్యజ్జీవితమునకు వలసిన సాధనసంపత్తిని, సహధర్మచారిణిని వారి వలన బడసి ధన్యుడనైతిని.

అప్పుడు పంతులుగారి తోటలో క్రొత్తగా వితంతు శరణాలయ భవనములు నిర్మింపబడుచుండెను. వారు నా కోరిక ప్రకారము ఆ భవనములందొక గదిని వెంటనే తయారు చేయించి నా నివాసమునకై యొసంగిరి. అందు నేను స్వయముగ వంటచేసికొని భుజించుచు నా యేర్పాటు

లన్నియు నేనే చేసికొనుచు సుఖముగ జీవించుచుంటిని. పంతులుగారి కుటుంబమును శరణాలయ బాలికలును వసించు గృహములకు నేనుండు గది ఒక ఫర్లాంగు దూరములో అరణ్యమధ్యముననున్నట్లు కాన్పించును; స్వాధ్యయనాదులకు మిక్కిలి యనుకూలముగ నుండెను. అచ్చట నా పనులన్నియు ముగించుకొని పంతులుగారు నా కప్పగించిన కార్యములు సకాలమున నిర్వహించుటకు ఆ యా కార్యస్థానములకు పోవువాడను. వారు చెన్నపురిలో వేసంగి గడిపి రెండు మాసముల తరువాత రాజమండ్రికి తిరిగి వచ్చిరి. నా కార్యవిధానములు, నా జీవిత పద్ధతులు, నా భక్తి శ్రద్ధలు అన్నియు గమనించి మెచ్చుకొని నాకు చాల ప్రోత్సాహ మొసంగిరి. మరికొన్ని యితర కార్యములు కూడ చేయ నియోగించిరి. అవియు వారికి తృప్తికరముగ జేసితిని.

నేను పంతులుగారివద్ద కేతెంచుటకు పూర్వము ఉపాధ్యాయ వృత్తియందు మూడు సం॥ల యనుభవము కలిగి ప్రశంసా పాత్రుడనై యుండుటను వారు విని యుండిరి. శరణాలయ బాలికలకొరకును, తదితర బాలికల కొరకును వారు తమ తోటలో నడపుచుండిన ట్యుటోరియల్ స్కూలులో, అందలి యుపాధ్యాయులలో తామును ఒకరుగ నుండి యున్నత తరగతికి తెనుగు పాఠములు గరపుచుండిరి. ఆ స్కూలులో లెక్కలు, ఇంగ్లీషు కొన్ని తరగతులకు బోధించు పనికూడ నాకు ఇతర కార్యములతో పాటు చేయ నియమించిరి. కళాశాల విద్యార్థుల కుపన్యసించు పద్ధతిని పంతులుగారు తెలుగు వాచక విషయములు, వ్యాకరణాంశములు బోధించుచుండిరి. అవి బాలికలు గ్రహింప జాలకుండిరి. తాము పాఠములు చెప్పునప్పుడు నన్ను కూడ తమ క్లాసులో కూర్చుండి యవి విని బాలికలకు గ్రాహ్యము లగునట్లు తిరిగి బోధింపుమని కోరిరి. అందువల్ల నాకును భాషాజ్ఞానము వృద్ధి కాగలదని హెచ్చరించిరి. వారు కోరినట్లు చేసి కృతకృత్యుడ నగుట గాంచి సంతోషించిరి. నేను మెట్రిక్యులేషను ప్యాస్‌చేసి పొంది యున్నకొలది భాషా ప్రవేశము వారి శుశ్రూషవల్ల కొంత పెంపొందించుకొన గలిగితిని.

పంతులుగారు ఆంగ్లాంధ్ర వారపత్రిక 'సత్యవాదిని' ప్రకటించుచుండిరి. దాని కాంధ్రమున వ్యాసము వ్రాయ ప్రోత్సహించిరి. వారి రచనలు, కొన్ని తెలుగు గ్రంథములు వారివద్దకు వచ్చిన తరువాతనే కొంత యాతురతతో పఠింప నారంభించితిని. వ్యాసరచనకును ప్రయత్నము మొదలిడితిని. 'జాతీయ జీవనమున మతము యొక్క స్థానము' అను విషయమును గూర్చి వ్యాసము వ్రాసి వా రేమందురో యను సందేహముతో వారిచేతి కిచ్చితిని. వా రది చదివి చక్కగా వ్రాసినావని మెచ్చుకొని ఆ వారపు 'సత్యవాదిని' సంచికలో ముద్రింపించిరి. నా ప్రచురిత వ్యాసములలో అదియె మొదటిది. వారివద్ద నున్న కాలములోనే 'ఆంధ్రప్రతిక' ఉగాది సంపుటమునకు, సంపాదకులు కోరగా, 'బ్రహ్మసమాజము'ను గురించి వ్యాసము రచించి పంపితిని. ఇది నా రెండవది. నాకు ఆంధ్రభాషాభిరుచి, వ్యాసరచనా శక్తి పంతులుగారి సాహాయ్యము వల్లనే యారంభమైనవి.

పంతులుగారి సంస్థల కార్య నిర్వహణకై వారు స్థాపించిన హితకారిణీ సమాజమునకు నేను సహాయకార్యదర్శిగ నియమింపబడితిని. సమాజమునకు సంబంధించిన యుత్తర ప్రత్యుత్తరములు జరుపుట, జమాఖర్చులు వ్రాయుట, సమాజసభ లేర్పరచుట, తోట నౌకర్ల పనులు పర్యవేక్షించుట మున్నగు కార్యములు గావించితిని. పంతులుగారితోను వారి సతీమణితోను కలసి హైదరాబాదు, బొంబాయి, పూనా నగరములకు సమాజ పక్షమున విరాళములు ప్రోగుచేయుటకై వెళ్ళియుంటిని. వ్యావహారిక కృత్యములం దించుక యనుభవము పొందితిని.

పంతులుగారు కార్యములందలి ప్రతి స్వల్పవిషయము కూడ తమ యుద్దేశమునకు, పద్ధతికి అణుమాత్రమైన

కామరాజు హనుమంతరావు

వ్యత్యాసమురాకుండ జరుపుకొందురు. వారి యాశయము పూర్తిగ కార్యమందు రూపొందవలెను. అట్లు స్వభావ నియతమైన కర్మ అనగా స్వధర్మము ఆచరించుటలోనే జన్మసార్థకత కలదని పంతులుగారి జీవితము సుబోధకము చేయుచుండును. అంతర్వాణి వినిపించు ఆదేశమె, స్వశక్తి సామర్థ్యముల ప్రకారము నిర్వహించుట మనకు పరమవిధియని నేను పంతులుగారివద్ద గుర్తించినగొప్ప జీవితసూత్రము — తదనుగుణముగ నా జీవితము స్వాతంత్ర్యముతో నడపుకొను నిచ్ఛయె నాలో ప్రబలెను.

పంతులుగారు నాకుతగిన వధువును ఏరి మమ్మిరువుర పరీక్షించి మా వివాహము గావించిరి. 'బాలా త్రిపుర సుందరీదేవి'యను తన నామమునకు తగినట్లు వర్తించుచు నాకు సహధర్మ సాధకురాలుగనుండిన యామెను పొందుట నా మహాభాగ్యముగ తలపోయుచుందును. అందులకయి పంతులుగారికి అత్యంత కృతజ్ఞుడను.

పంతులుగారిక్రింద పనిచేయువారు వారి యాజ్ఞను తుచ తప్పకుండ నెరవేర్పవలసి యుండును. దానికి మారు మాట చెప్పుటకు యెంతమాత్రము సహింపరు. సేనాధిపతికిలోబడి సైనికులు ఎట్లు నడచుకొందురో అట్లు, వారి వద్ద సేవకు లేమి, అనుచరు లేమి నడచుకొనవలెను. పంతులుగారు తద్భిన్నముగ నడచువారిని కఠినముగ మందలింతురు. పెద్దల కఠినోక్తులు వినయముతో సహించుకొని జాగ్రత్త వహించుటె పిన్నలకు విధియని నేను నమ్మువాడను. కాన పంతులుగారి సర్వాదేశములు శిరసావహించు చుంటిని. కొలది పర్యాయములు మాత్రము నా సందేహములు అభిప్రాయములు చెప్పవలసి వచ్చెను, కొన్ని యుత్తరువులు కూడ పాలింప జాలనైతిని. వారి తీవ్రమయిన ఆగ్రహమునకు గురియైతిని. నా భార్య విషయమునను అట్లే జరిగెను. మా యుభయులను వారు క్రమక్రమముగా తమకు దూరము చేయుచు తుదకు వదలించుకొనిరి. ఈ యనుభవమునుబట్టి నాకు పూర్వము వారి యాహ్వానముపై వారిచెంతపనిచేయుటకు వచ్చి విఫలమనోరథులై వెళ్ళిపోయిన పి. రామచంద్రరావు గారు, వారి సతీమణి లక్ష్మీకాంతమ్మగారును ఉన్నవ లక్ష్మీనారాయణరావుగారు, వారి భార్య లక్ష్మీబాయమ్మ గారును పడిన యిబ్బందులు నా కర్థమైనవి. కాని వారిలో నెవ్వరు గాని, నేను, నా భార్య గాని పంతులుగారట్లుండుటే వారి విశిష్టధర్మలక్షణ మని కొనియాడితిమి. పంతులుగారి యాదర్శసేవా దృష్టాంతము నాకును నా భార్యకును మార్గదర్శకముగ నుండి మమ్ము సేవా నియుక్తుల జేసినవి.



# వీర సంస్కర్త

కీ॥ శే॥ రాయసం వెంకటశివుడు

'క్రార్లైలు' వీరనామమును వివిధ వృత్తులలో నుండు వారల కొసంగియున్నాడు. తన విధ్యుక్తములను ధైర్యసాహస సద్భావములతో నిర్వర్తించువాడె శూరుడు. కత్తిగట్టి దేశ స్వాతంత్ర్యముకొరకు పోరాడు సైనికుని వలెనే, స్వదేశమున గలంచెడి దురాచారముల నెదుర్కొని, వానిని నిర్మూలన మొనరించెడి వాడును శూరుఁడు.

సంఘసంస్కరణ విషయమున గూడ శూరులు గాన వచ్చుచున్నారు. దేశీయుల దురభిమాన, దుర్బలములను లెక్కసేయక, సంఘ శరీరమునందలి దుష్టాంగమును ఖండించివైచుచు, చికిత్సకుడై వలసినయెడ తన సుఖ మును తన యసువులను తాను బూనిన యుత్తమ కార్య నిర్వహణమునకై యర్పణము చేయువాడెఁ శూరుడు. సంఘసంస్కర్త కార్యకలాపము సుఖశయ్యయని తలంప రాదు. దైవము పట్లను తోడి మానవుల దెసను జెల్లింపవలసిన విధ్యుక్తములు చెల్లించుట తప్ప నన్యా పేక్షలతో సంస్కరణ రంగము చొచ్చువాని కాశాభంగమె కలుగును.

కావున సంస్కర్తయు శూరుడె. ఎంత హీనస్థితి యందుండిన జాతిలోనైనను శుభోదయ సమయమున సంస్కర్త పొడసూపుచుండును. పర దేశీయుల చేత జయింపఁబడిన భారతదేశము తర తరములనుండియు యంతశ్శత్రువుల దాడికిని లోనగుచువచ్చెను. నిరర్థక కర్మలకును, హేయ దురాచారములకును భారతమాత దాస్యము చెల్లింపుచుండెను. అంత వంగదేశమున రామ మోహను డుద్భవించి సహగమన నిరోధము గావించి, స్త్రీ స్వాతంత్ర్యమునకు రాజమార్గ మేర్పరచెను. ఈశ్వర చంద్ర విద్యాసాగరుడు వితంతు వివాహముల నెల కొల్పెను. బొంబాయి రాజధానిలో విష్ణు పండితుడై సంస్కరణమును ప్రాచుర్యము గలిగించెను.

ఇంక మన రాజధానిమాట యేమని యెవరైన నడుగవచ్చును. విద్యాధిక్యత, ధన సంపన్నతలు వెలసి యుండు దిక్కున సంస్కర్త యుద్భవము గాలేదు. దాక్షి ణాత్యులలోకెల్ల నిట్టి భాగ్యము మన యాంధ్రులకే సంప్రాప్తమయ్యెను. నాటి పురమందలి యొక విద్యా బోధకునికే గౌరవము లభించెను. 1881 వ సంవత్సరము డిసెంబరు 11 వ తేదీన రాజమండ్రిలో జరిగిన ప్రథమ వితంతు వివాహము శ్రీ కందుకూరి వీరేశలింగం పంతుల నామమునకు దేశఖ్యాతిని గలిగించెను.

కారణములేని కార్య మెన్నడును గలుగనేరదు. ప్రస్తుతమున నాంధ్రు లెంత హీనస్థితిలో నున్నను పూర్వ కాలమున ప్రఖ్యాతి గలిగిన జాతియే వారిది. కృష్ణదేవ రాయల కాలమున నాంధ్రరాజ్యము దక్షిణ హిందూదేశ మంతటను వ్యాపించి యుండెను. వారి భాష లాలిత్యము, మృదుత్వములకు బర్యాయపద మయ్యెను. వారి కవితా సారస్వత మౌన్నత్యముదాల్చెను. అది వరకె ఆంధ్ర దేశమునకు రాజమహేంద్రవరము మధ్యస్థానమయ్యెను. దక్షిణదేశ వాహినులలో మిన్న యగు గోదావరీ నదీ తీర మున నా పురము భాసిల్లుచుండెను. ఆ పట్టణమున నన్నయభట్టు తన యాంధ్రభారతమును రచియించి, ఏలికయగు రాజనరేంద్రుని కంకిత మొనరించెను. ఆ ప్రాంతములందే ఆంధ్రకవి సార్వభౌముడగు శ్రీనాథుడు గ్రుమ్మరుచుండువాడు.

వీరేశలింగకవి ఆంధ్రులలో నాంధ్రుడు. వీరిది విద్వ ద్వంశము. ప్రవేశ పరీక్ష వరకె యీయన యాంగ్లవిద్య నేర్చియుండినను, ఆంగ్ల సారస్వత సారమును గ్రోలిన వాడని చెప్పవచ్చును. విద్యాబోధక వృత్తి నవలంబించిన యీ యువకుడు స్త్రీ విద్యాభిమానియై బాలికా పాఠశాల నొకటి ధవళేశ్వరమున స్థాపించెను.

పత్రికలకు వ్యాసములు వ్రాసిపంపుచు పిదప ''వివేక వర్ధని'' యను పత్రికను నెలకొల్పెను. మొదట పద్యములు రచియించుటతోడనె కాలమును గడిపినను అంతకంత కీయనగద్యరచన యారంభించి సంస్కరణ విషయములను జర్చింపసాగెను. వితంతు వివాహములను ప్రోత్సహింప నొకసమాజమును స్థాపించి, వీరేశలింగము పంతులు ఆ సంస్కరణమును గురించి విజ్ఞాపములు ప్రకటించెను. కార్యరూపము దాల్చినగాని యెట్టి సంస్కరణమునకు ధృఢత్వ స్థిరత్వము లేర్పడవనినమ్మి యీయన 1881 వ సంవత్సరము డిసెంబరు 11 వ తేదీన ప్రథమ వితంతు వివాహము జరిగించిరి.

వాక్కునకులేని చైతన్య విశేషము కార్యమునకుగలదు. మాటలకు లొంగక నిదురించెడి సంఘము పనుల కదరి పడిలేచి, ఆలోచన చేయదొడంగెను. అంత వితంతూ ద్వాహ సంస్కరణము నణచివేయ సంఘములోని పూర్వా చారపరులు విశ్వప్రయత్నములు చేసిరి. పంతులును, పంతులు మిత్రులను వారు బహిష్కరించిరి. వీరేశలింగము గారి యనుచరులంత నొక్కరొక్కరే బహిష్కార భీతిచే నొత్తిగిల్లినను, ఆయన మాత్రము గొంకకుండెను. 1888వ సంవత్సరమున దన ప్రియమిత్రుడు గవర్రాజుగారు మృతి నొందినను, వీరేశలింగము పంతులుగారు ధైర్య స్థైర్యములు వీడకుండిరి. తానొక్కడె రణరంగమున నిలువ వలసివచ్చి నను వీరేశలింగము పంతులించుకయైనను జలింపని ధీరత్వ మున బోరుసల్పెను. కావుననె యీమహాశయునికిని, ఆయన చేపట్టిన యుద్యమమునకును సంపూర్ణ విజయము చేకూరెను. కాకినాడ వాస్తవ్యులు పైడా రామకృష్ణయ్యగారు వితంతు ద్వాహములకు కావలసిన ధనసహాయము చేసిరి. బహిరంగముగ పంతులుగారితో భోజనము చేయ సాహసిం పని విద్యార్థులెందరో యీయనకు దోడుపడిరి. మొదటి నుండియు విద్యార్థు లీయనకు సహచరులుగ నుండిరి. వీరేశలింగముగారి వితంతూద్వాహ సంస్కరణము రాను రాను దేశీయుల యామోదము వడసెను. ఆ సంస్కరణ మిప్పుడు పల్లెలకు పట్టణములకును బ్రాకజొచ్చెను.

ఇట్టి వీరేశలింగ సంస్కర్తశూరుడెకదా! ఈతడు కట్టుకథలలోని ఓడిను, పరదేశవీరుడగు క్రాంవెలు, నర రక్తపాత మొనరించిన నెపోలియన్, కనుల మిరుమిట్లు గొలిపెడి కవితానైపుణ్యముగల షేక్స్పియరునకు గల కవితాశక్తియు, క్రాంవెలునకు గల బాహుబలమును, ఈత నికి గలదని చెప్పువాడనుకాను. కాని సంస్కరణ విషయ మున వీరియందువలెనే యీయనయందును శౌర్యగుణము ప్రస్ఫుట మయ్యెను. శూరునికి సద్భావము ప్రధమలక్ష ణము. వీరేశలింగము పంతులను సద్భావమున మించు వారుందు రనుట యరుదు. ఆచార కాలసర్పము కోరలు పెరికి, మతాధిపతుల తీవ్రాస్త్రములను వమ్ముచేసి, సంఘమువారి శాపముల విఫలముచేసి, మనహాస్యములను, క్రౌర్యములను సహనబుద్ధితో క్షమించిన యీ ధీరునిపేరు లూధరు', తిమొదోరుపార్కరు, రామమోహన రాయలు మున్నగు యోధులనామముల ప్రక్కను కనకాక్షరములతో లిఖియింపదగినదియెకదా! ధైర్యమునందు, బుద్ధి స్వాతం త్రమునందు, క్షితిని జయింప జాలిన క్షమాగుణమునందును, దక్షిణ హిందూదేశమున నీతనితో సరిసమానులెవ్వరు.? ఉత్ప్రేక్షాతి శయోక్తులతో బ్రొద్దుపుచ్చ నా యుద్యమము కాదు. కేవల సత్యమును గూర్చిన నా నిశ్చితాభిప్రాయమె, నేను వక్కాణించుచున్నాను. ఈ నాయకుడు అసమాన ప్రజ్ఞయు, స్వతంత్ర బుద్ధియు, సమధిక వాక్శక్తులతో వెలయుచున్నాడని చెప్పువాడనుగాను. ఆయనకుగల లోప

వీరసంస్కర్త

ములు నాకంటె ఎవరికిని బాగుగ దెలియవని చెప్పగలను. ఐనను నిశ్చితబుద్ధి, స్వార్థత్యాగము, నయసంపద వీని యందు మాత్రము ఉన్నత స్థానమునకును, అగ్రస్థానమునకును, నానాయకు డర్హు(డని నమ్మువాడను..

సంఘ సంస్కరణము తీక్షణతదాల్చి యుండెడి యా పూర్వదినములలో వీరేశలింగ సంస్కర్తకు చెడు గనిన బొత్తిగనోరిమి లేకుండెను. యుద్ధరంగమున మృదువగు సాధనములు ప్రయోగింప నాయనకు నచ్చలేదు. దౌష్ట్యము నొక్కపెట్టున దుడ్డుకర్రతో మోదుటకె యాత దభ్యాసపడి యుండెను. ఆయన ప్రహసనములు వ్యక్తిగతములని యందరు నెరుగుదురు. ఆ ప్రహసనములందలి ముఖ్య పాత్రలు సజీవులగు మనుజులె! రాజమహేంద్ర నగర వీధులలో రాత్రులు పడుపుటిండ్లకు జేరెడి విటకాండ్రును, న్యాయసభలలో నున్నతాసనము లధిష్టించు నీతిదూరులగు నుద్యోగస్థులును వీరందరును తన ప్రహసనములకై ప్రత్యేకముగ గల్పింప బడిన పాత్రలనియెకాక, నీతి పథకమునకు న్యాయమార్గమునకు ముఖ్యముగ దనకును ఆగర్భ శత్రువులనియె యాయన తలంచువాడు! వారియెడ నాయన గాంచిన గాఢమైన, హృదయపూర్వకమయిన, క్రోధమునకుగల రహస్య మిదియె!

తన ప్రక్కతుపాకి వేలాడుచుండ, ఒరనుండి తీసిన కత్తిని ఝళిపించుచు యుద్ధసన్నద్ధుడగు వీరభటునివలె వివేకవర్ధనీ పత్రిక యా దినములలో వారము వారమును నీతి న్యాయముల నుల్లంఘించుచు వారలతో బోరుసల్పుచుండెడిది. అందలి యుపన్యాసముల కెట్లు దౌష్ట్యద్రోహములు వడంకుచుండెనో యిప్పటికిని గొందరెరుంగుదురు. ఆయన ప్రహసనము కటువుగనుండునట్లె, వారివ్యాసము గాంభీర్యము వహించి యుండెను.

వీరేశలింగము పంతులపేరు సంఘ సంస్కరణ విషయములందువలెనే సాహిత్య పునరుద్ధరణమునందును విఖ్యాతి గాంచెను. ఈ రచయిత ప్రకృతాంధ్ర వచన రచనా చతురాననుడు.

సంస్కృత సారస్వత సాంగత్యమున నాంధ్ర కవిత్వము పూర్వము వినుతికెక్కిన రీతిని, ఆంగ్లసాహిత్య సంపర్కమున ప్రకృతమున నాంధ్ర వచనము సుస్థితికి వచ్చెను. ఈ కార్యము వీరేశలింగ కవి కృతమె కావున, దీనికీర్తి యంతయు వారిదె. వీరిశీలమువలెనె, వచనశైలియు, స్వచ్ఛత, మృదుత్వము, బలిమియును దాల్చి యున్నది.

మొదట యాంధ్రకవుల వలెనే యీ ప్రథమాంధ్ర వచన రచయితయు, భాషాంతర గ్రంథరచనముతోనే కాలము గడపవలసి వచ్చెను. అన్యభాషలలోగల సొంపులను మాతృభాషలోనికి కొనిరావలసిన భార మాయన వహింపవలసి వచ్చెను. ఆయన సొంతకావ్యములల్లుటకిదియె వ్యాఘాతమయ్యెను. ఇదిగాక బంగాళీ సారస్వతమున ప్రథమ వచన రచయితలగు రామమోహన, విద్యాసాగరులవలె, వీరేశలింగం పంతులుకూడ సంఘ సంస్కరణమునకె వచన గ్రంథముల నధికముగ రచింయించెను. సత్యమును విస్పష్టముగను, విపులముగను, మోమోటము లేకయు నాయనచెప్పవలెను గావున, ఆయన శైలియు స్వచ్ఛముగను, స్పష్టముగను, సూటిగను నుండెను. ఇంతియకాదు ఈ గుణములతోను, సంస్కరణాభిలాషతోడను విలసిల్లెడి వచనశైలిని మన యాంధ్రమునకు గల్పించి కానుకగ నొసంగిన కీర్తిని శాశ్వతముగ నీ మహామహుడు సంపాదించెను.

("ఆత్మ చరిత్రము" నుండి)

# సాహిత్యక్షేత్రంలో కృషీవలుడు

*డాక్టర్ సి. ఆర్. రెడ్డి*

పంతులుగారు ఆంధ్ర ప్రముఖులలో ప్రథములని చెప్ప వచ్చును. పూర్వాచారులగు బ్రాహ్మణుల వంశమున జనించినను, పంతులుగారు అడ్డు లెన్ని వచ్చినను, సరకు కొనక సంస్కరణ గమ్యస్థానమునకు చేరుటకును, స్త్రీలకు విద్యా విషయము, వితంతు వివాహముల పట్ల స్వాతంత్ర్య మిప్పించుటకును ఎంతయు సేవచేసిన మహనీయులు, బ్రాహ్మణులకును, బ్రాహ్మణేతరులకును దేశాభి వృద్ధికరములగు విషయములలో నెట్టి భేదములు లేవని పంతులుగారు తమ జీవితానుష్ఠానము వలన ప్రపంచమునకు చాటినారు. వాఙ్మయ ప్రపంచమున వారు చేసిన సేవ అపారము. అతి సులభమగు వచనమున గ్రంథములను వ్రాసి భాషయందు క్రొత్త మార్గములను త్రొక్కినట్టి మహనీయులు.

దీనులగువారి పట్ల ఆ మహనీయునికిగల సానుభూతి దాక్షిణ్యము చెప్ప నలవికాదు. ఆ మహనీయుడు పూర్వాచారుల వలన పడిన కష్టములను వినిన నెట్టి కఠిన హృదయ మైనను నీరు కాక మానదు. ప్రత్యక్షముగా కొంద రాయనమీద రాళ్ళను విసరిరి. కొన్నిసారులు ప్రాణమునకు సహితము హాని కల్పించిరి. కాని అభినవ భారతదేశము విద్యార్థుల రూపమున ఆయనను ఈ కష్టముల బారినుండి రక్షించినది. ఆయన గృహమును తగుల బెట్టుటకు ప్రయత్నములు చేయబడినవి. విద్యార్థులు ఆయన గృహమును కాపుదలచేసి అగ్నిదేవత నుండి రక్షించిరి.

పంతులుగా రెంతటి మాన్యా ప్రజ్ఞావంతులు ? నిర్భయముగా విహరించు మేధావంతుల యదార్థము గోచరింపని వారికి పంతులుగారి స్వభావము అగమ్యగోచరముగాను, విరుద్ధముగాను నుండెను. ఆంగ్ల భాషయందు అల్ప పాండిత్యము కలిగి పండితులై యున్నను, ఆధునిక యుగానుకూలమైన లక్షణములును, శీలమును వారియందు పరిపూర్ణముగా ప్రకాశించెను. కళాశాల విద్యాభ్యాసమును పట్ట బిరుదములును లేకపోయినను కేవలము ఆత్మ చైతన్య ప్రభావముచే వారు బ్రాహ్మణులై యుండియు బ్రాహ్మణులకు జన్మచే స్వతస్సిద్ధముగ నుండు దుర్గుణములను అవరోధములనుండి తరింపగలిగిరి. మన మందరము ఎక్కువగ భావించుకొను జీవిత వ్యాపారమునకు వారు ఇతరుల ఆశ్రయమందుండి బీదతన మనుభవించినను, సింహమునకు సహజమైన గాంభీర్యమును, తటిల్లతకు సహజమైన సాహసమును, బలవంతులకు సహజమైన నిర్లక్ష్యమును వారి కాశ్రయములై యుండెను. వా రాగర్భ శ్రీమంతులు కాకపోయినను ప్రభువుల సాటితోపాటు దాన ధర్మములను చేయ గలిగిరి. ప్రకృతము ఆంధ్ర దేశమున సంస్కరణోద్యమము ప్రబలముగా వ్యాపించుటకు పంతులుగారే మూలకారకులు. ఆంధ్రులు తా మొక జాతి వార మని ప్రకృతము చెప్పుకొనుటకు ఆత్మ గౌరవము మనలో నుద్భవింప జేసినది పంతులుగారే.

దేశమున మన వాఙ్మయము నామావశిష్ట మగుట పంతులుగారు కన్నులార చూచిరి. మన ఆచార వ్యవహారములలో సహిష్ణుత లేకుండుటయు వారు కనుగొనిరి. తమ కార్య పరంపర వలన పంతులుగారు వీనియందుగల లోపములను నివారణ చేయుటకు తమ శక్తివంచన లేక పనిచేసి, మన దేశ చరిత్రమున కొక నూతన శకమును నిర్మించిరి.

పంతులుగారి కార్య సేవకు సహభూతురాలుగా నున్న రాజ్యలక్ష్మమ్మగారి చరిత్రము నుదహరించక పోయిన పంతులుగారి చరిత్ర అసంపూర్తియే యనవచ్చును. ఆమె పంతులుగారికి తోడునీడగ నుండి, ఆయన చేయు ప్రతి పనికిని తోడగుచు భారత నారీ లోకమునకు మార్గదర్శకురాలై భారత స్త్రీ చరిత్రమును పవిత్రవంతముగ చేసిన మహనీయురాలు. భార్యాభర్త లిరువురును సభా వేదికల నెక్కి ఉపన్యాసముల నిచ్చునట్టివారు కారు. తాము సత్యమని నమ్ము ప్రతి కార్యమును, ఎన్ని అనివార్యములు వచ్చినను సరకుకొనక దానిని నిర్వహించునంతవరకు పట్టుదల గలవారు. ఆంధ్రదేశమునకు లభించిన కీర్తి ప్రతిష్ఠలకు వీరే మూలకారకు లనవచ్చును.

వీరేశలింగము పంతులుగారి వంటి దేవతలను భారత దేశ మెప్పుడు మరచిపోయిన అప్పుడు మనకు దుర్దశ సంప్రాప్తమైన దనియె భావించవలెను.



# వాఙ్మయోద్ధారకుడు!

సంస్కృతాంధ్రాంగ్లభాషా పాండితీయుక్తి, శాశ్వతంబుగ పేరు జాటినాడు
నిఖిలాంధ్రలోకంబు నీరాజనములీయ, సంఘ సంస్కారంబు జరిపినాడు
బహుళాంధ్ర గ్రంథముల్ బాగొప్ప రచియించి, తెలుగుభాషకు వన్నె దెచ్చినాడు
తోడివారలు నాడు కూడిరాకుండినన్, దీక్ష కార్యంబు సాధించినాడు
తెలుగు దేశంబులో కొంత వెలుగుదెచ్చె, తెలియజేసెను బాసలో తీపిదనము
తెలుగు బాసను స్వేచ్ఛగా తీర్చిదిద్దె, చేతనైనట్టి యుపకృతి జేసినాడు,
కార్యదీక్షాపరుండు, విఖ్యాతయశుడు, మానవీయుండు భాషాభిమాని యతడు
కందుకూరి వీరేశలింగమ్మ మంత్రి, తెలుగు వాఙ్మయోద్ధారకు దెలియలేరో !

శ్రీ మల్లాది చంద్రశేఖరరావు

# జీవిత చరిత్ర - విశేషాలు

శ్రీమతి నాయని కృష్ణకుమారి

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు, జిజ్ఞాసువులైన ముందు తరాలవారు తన జీవిత విశేషాలు తెలుసుకోవడానికి వీలుగా, మిక్కిలి దయతో స్వీయ చరిత్రను సంగ్రహించి పుస్తకరూపంలో మన ముందుంచి వెళ్ళిపోయారు. జీవితంలో ప్రతి ఘట్టాన్నీ శక్తి సంపన్నంగా తీర్చి దిద్దుకున్న మహాత్ముల చరిత్రలు మళ్ళీ మళ్ళీ మననం చేయతగ్గవి. ఈయన అటు సాంఘిక రంగస్థలంమీదా, ఇటు సాహిత్య రంగస్థలంమీదా ముఖ్య పాత్రధారణచేసి అందరి హృదయాల్లోనూ చెదిరిపోని ఉజ్జ్వలవేషాన్ని రూపుకట్టించిన ప్రతిభాశాలి. ఒక వ్యక్తి కాలపు తెరమరుగున క్షనుచాటయిన వెనుక, ఆ వ్యక్తితో పరిచయంలేని ముందుతరాల ప్రజా బాహుళ్యం, ముక్త కంఠంతో అతన్ని కీర్తిస్తూ ఉండడంలో అతని ప్రతిభ అంతా వెల్లడి అవుతుంది. ఆ వ్యక్తి పరోక్షంలో అతణ్ణి గుర్తుచేసేవి, ఆయన నిర్వహించిన ఘన కార్యాలూ, రూపుకట్టించిన ఆదర్శాలూ. ఈ నాటికే కాదు ఏనాటికీ ఆయన తెలుగు సాహిత్యానికి ప్రసాదించిన వివిధశాఖలు విస్మరితాలుకాలేవు. ఆయన తెలుగు స్త్రీలోకాభ్యుదయానికి వేసిన గట్టిపునాదులు కదలనైనా కదలవు. అటువంటి మహాపురుషుని జీవితం, స్మరించుకోవడానికైనా మన జాతికి మిగలడం మన అదృష్టం.

తెలుగు జాతికి ఈయన స్వీయచరిత్ర ప్రసాదించబడకముందు, ఈ రకమైన రచనలులేవు. దీన్ని వరవడిగా గ్రహించి, సమకాలికులైన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు, శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారూ స్వీయచరిత్రలు వ్రాశారు. ఇందులో ఒకరు కళా పరిపూర్ణులయితే మరొకరు ఆంధ్రకేసరి. ఒకరు సాహిత్యరంగంలోనూ, మరొకరు రాజకీయరంగంలోనూ కీర్తిపతా లందుకున్నారు. ఇద్దరికీ నాటకాలంటేనూ, రంగస్థలాలంటేనూ మోజు. అయితే చిలకమర్తివారు రంగస్థల ప్రయోగార్హాలయిన నాటకాలు వ్రాయడంలో కుతూహలం చూపితే, ప్రకాశంగారు ముఖానికి రంగు పులుముకొని, రంగంమీద వేషం రక్తికట్టించడంలో శ్రద్ధచూపించారు. ఇవి వాళ్ళ చిన్ననాటి ముచ్చట్లు. శ్రీ వీరేశలింగం పంతులుగారి జీవితచరిత్రలో ఇటువంటి చిన్ననాటి ముచ్చట్లు ఎక్కువగా కనిపించవు. ఈయన జీవితచరిత్ర అనగా, తన కుటుంబ చరిత్రా, బంధువర్గపు చరిత్రా, స్వీయప్రమోదాల విషాదాల చరిత్రా కాక, కేవలం ఆ కాలపు రాజకీయ సాంఘిక చరిత్రమాత్రమే. చిన్నప్పటి నుండీ ఆయన ఊహలెప్పుడూ శక్యాశక్య విచారణ లేకుండా, ఉన్నతత్వం వైపుకు ఎగబ్రాకుతూ ఉండేవి. తపస్సుచేసి మహత్తులు సాధించాలనీ, మహాకవియై అమూల్య కావ్యజగత్తును సృజించాలనీ ఆయన అప్పటి నుండీ కలలు కనేవారట. పెద్దయ్యాక ఈ రెండు కోరికలూ ఈయన నెరవేర్చుకోగలిగారు. ఈయన చేసిన తపస్సంతా సంఘసంస్కరణ మహాఫలాన్ని వాంఛించి: అది చక్కగా ఫలించి ఈయన జీవితానికి స్త్రీ లోకాభ్యుదయ ప్రదాతృత్వమనే మహా మహత్తును అపాదించిపెట్టింది — అందువల్ల, పందొమ్మిదవ శతాబ్దపు అర్ధభాగం నుండి ఇరవయ్యో శతాబ్దపు ప్రథమభాగం వరకూ తెలుగు జాతి వివిధ రంగాలల్లో పోయిన అద్భుతావహాలయిన మార్పులూ, స్పష్టంగా చూపించడానికి పట్టిన అద్దమే ఈయన జీవితచరిత్ర. అందులో ఈ నాడు స్మృతి

మాత్రులై నిలచిన మహా మహులెందలో మన కళ్ళ ముందు చకచకా మెరవడం కనిపిస్తుంది.

అన్ని జీవితాలకు మల్లేనే శ్రీ పంతులుగారి జీవితం కూడా అతి సామాన్యంగా మొదలయింది. ప్రథమ ఘట్టాలు చదువుతూఉంటే బాలుడుగా ఉన్న వీరేశలింగం, విద్యార్థిగాఉన్న వీరేశలింగం, ముందు ముందు అద్భుత విజయాలు సాంఘిక సాహిత్యరంగాలలో సాధిస్తాడని మనం ఊహించనైనా ఊహించము. మూడడుగుల నేల యాచిస్తున్న వామనరూపి త్రివిక్రమమూర్తియై నింగీ నేలా ఆక్రమించినట్లుగా, ప్రౌఢుడైన వీరేశలింగం ఒక్కసారిగా మన అంచనాలకూ కొలతలకూ అందకుండా అద్భుత ప్రమోద భరితమైన పూజ్యభావాన్ని మాత్రమే చూరగొంటాడు. అయితే ఇంత హఠాత్పరిణామ క్రమంలో ఈయన జీవితంలోకూడా, చిలిపికయ్యాలూ, ద్వేషాలూ, కోర్టులూ, దావాలూ, అపవాదులూ, అంత స్తాపాలూ కనిపిస్తయ్. అవన్నీ జానపదగాథల్లో కథానాయకుడనుభవించే కష్ట పరంపరలతో పోల్చేట్లయితే పంతులుగారొక రాజకుమారుడూ, సంఘ సంస్కార ప్రయాసదశ కథాసారమూ అవుతుంది.

చిన్నతనంలో ఈయన ఇంట్లో వాళ్ళందరికీ అల్లారు ముద్దుగా పెరిగిన పాపడు. ఉఫ్ఫున ఊదితే ఎగిరిపోయేంత దుర్బలంగా ఉండేవాడు. తిన్నతిండి జీర్ణం చేసుకోలేక, జలుబూ తుమ్ములూ వీటితో అవస్థపడుతూ ఉండడం ఒక అలవాటుగా ఉండేది. ఆరోగ్యం ఇంతనాసిగా ఉండడంవల్ల కాబోలు దానివంతు బలంకూడా పూరించుకుని మేధ అద్భుతంగా ఉండేది. ఏదైనా ఒక్కసారి చదివితేనే జ్ఞాపకంఉంచుకోవడం, మతికెక్కినదాన్ని మర్చిపోక పోవడం ఈయన విశిష్టత. చిన్నతనంలో ఈ జ్ఞాపక శక్తివల్లనే, అవధానాలుకూడా చేసి అందరిమెప్పులూ పొందుతూ వుండేవాడు. కాని నెమ్మదిమీద, అవి సారం లేనివనీ, గడ్డిమంటలా తక్షణాన మిరుమిట్లుగొల్పి, ఆ తర్వాత జ్ఞాపకానికైనా ఏమీ మిగల్చకుండా చల్లారి పోయేవనీ గ్రహించగలిగాడు. పంతులుగారు ఆనాడే ఆమోజులో పడిపోయిఉంటే మనకు సంఘ సంస్కర్తగా మిగిలేవారు కారేమో!

ఈయన పదమూడవ ఏటనే తొమ్మిదేళ్ళ రాజ్యలక్ష్మమ్మగారితో వివాహంజరిగింది. ఆ వివాహానికి సాక్షీభూతులైన ఎవరికికూడా ఈ కుర్రవాడే పెద్దయ్యాక బాల్య వివాహాలను నిషేధించి, వితంతువివాహాలు చేయించి, సంఘంలోఉండే అర్థరహిత సంప్రదాయాలకు స్వస్తి చెప్పే కీర్తిమంతు డౌతాడని తెలిసిఉండదు. అయితే పెద్దవాడై, బాల్యవివాహాలవల్ల చెడు జరుగుతుందని చాటి చెప్పిన ఈయనకు తన వివాహం మాత్రం శుభప్రదమూ, సర్వసహాయ్యమూ అయింది. రాజ్యలక్ష్మమ్మగారు అనుకూలవతియైన భార్య. ఆయన సంఘ సంస్కర్తగా చిరస్మరణీయుడు కావడానికి ఆవిడ చేసిన దోహదం ఎంతో ఉన్నది. తన జీవిత చరిత్రలో, జీవిత భాగస్వామి అయిన ఆవిడను గురించి పంతులుగారు చాలా భావోద్విగ్నతతో చెప్పుకున్నారు. నిజానికి ఈయన జీవిత చరిత్రలో స్వీయకుటుంబాన్ని గురించిన ప్రసక్తి ఎక్కువరాదు. చిలకమర్తివారి స్వీయ చరిత్రలో ఆయన కుటుంబ గాధ ఇతర వ్యావర్తాలతోపాటు సమాంతరంగా నడుస్తుంది. ఆయనకున్న బంధువర్గమూ, ఎవరు తనను ఆశ్రయించిందీ, ఎవరి పెళ్ళిళ్ళు ఎప్పుడెప్పుడు జరిగినవీ, ఎవరి దశ ఎలా ఉన్నదీ–అన్ని వివరాలూ అందులో మనం చూడవచ్చును. వీరేశలింగంగారి చరిత్రలో తాను పూనుకున్న రకరకాల లోకోపయుక్త కార్యాల నిర్వహణా, అందులో ఆయన పడేపాట్లు, శత్రుమిత్ర కులాలు అందుకు చేసే విఘాతసహాయాలూ — ఇవే ఎక్కడచూచినా కనిపించేవి. కాని భార్యను అమితంగా ప్రేమించి, ఆవిడ సహాయాన్ని తన లోకోపహిత కార్యాలలో అనుక్షణమూ పొందగలిగిన పంతులుగారు ఆవిడను గురించి విపులంగా

వ్రాసుకోలేకుండా ఉండలేకపోయారు. "షట్కర్మయుక్తా కుల ధర్మపత్నీ" అన్న సూక్తిని అక్షరాలా తన ధర్మ పత్నీత్వానికి అన్వయించుకున్న చరితార్థ ఆవిడ. సంప్ర దాయబద్ధమైన కుటుంబంలో పుట్టి, ఎక్కువ చదువు సంధ్యలు లేని ఆవిడకు సహజంగా కరుడుగట్టిన మౌఢ్యం, ఆచా రాలను అధిగమించలేనితనం ఉండవలసినమాటే. కాని రాజ్యలక్ష్మమ్మగారిది సంస్కృత హృదయం. అందులో భర్త నూతన సంప్రదాయాలమీద కేవలం వాగ్రూపమైన యుద్ధాన్ని ప్రకటన చెయ్యడంలో సరిపెట్టుకోక, ఆచరణ పూర్వకమైన క్రియాసిద్ధికి తలపెట్టినవాడు. అయినా ఆవిడ అతనికంటే సంస్కరణమీద ప్రీతికలది. కాబట్టే బంధు వులూ, మిత్రులూ, పరిచయులూ అందరూ "నీ భర్త నీ పనినుండి మరలించు" అని దీనంగా వేడుకున్నప్పుడు ఆవిడ ఏ మాత్రమూ చలించక, "ఆయన పూనినది మంచి కార్యమని నేనును నమ్ముచున్నదాన నగుటచే నే నాయనతో వలదని చెప్పకపోవుటయేకాక, యెన్ని కష్టములు వచ్చి నను నే నాయనను విడువక తోడ్పడెదను'' అని దృఢంగా చెప్పగలిగింది. అంతేకాక అనాథలై ఆశ్రమాన్ని చేరిన వితంతువుల్ని తల్లిలా బుజ్జగించేది. గురువులా బుద్ధులు చెప్పి అక్షరజ్ఞానం కలిగించేది; సోదరిలా, నెచ్చెలిలా వాళ్ళ నమ్మకాన్ని చూరగొనేది. బయటకు వెళ్ళిన పంతులు గారు ఇంటికి చేరుకునేలోగా, ఎవరైనా వితంతు స్త్రీ ఆశ్రమంలో చేరడానికి వస్తే, భర్తకు ఆవిణ్ణి చూపించే ముందు, "మీకి వ్వాళ మంచి శుభవార్త చెప్పదలచు కున్నాను సుమండీ!" అని చెప్పి మరీ చూపించేది. అంత విశాల దృక్పథంకలదీ, సంస్కరణాభిలాషిణీ కాబట్టి, ఆవిడ చనిపోయిందన్న ఎఱుక కలగగానే పంతులుగారు, ''ఓ ఈశ్వరా, వృద్ధదశలో నాకిట్టి మహాపదను తెచ్చి పెట్టితివా" అని మాత్రమే అనగలిగారు.

పంతులుగారి జీవితంలో స్త్రీ పునర్వివాహ సంస్కారాభి ప్రాయం చాలా చిత్రంగా కలిగింది. ఆయనకు 26 ఏండ్ల ప్రాయమప్పుడు ఉపాధ్యాయిత్వాన్ని నిర్వహిస్తూ పత్రికా విశేష కర్తృత్వాన్ని కొనసాగిస్తూ నిమ్మకు నీరెత్తిన విధంగా ప్రశాంతంగా సాగుతుండేది జీవితం. ఆ రోజుల్లో నిస్తబ్ధ కాసారంలో బెడ్డ విసిరిన మాదిరిగా ఆయన జీవితంలో కల్లోలాన్ని కల్పించిన వారు ఒక విధంగా బ్రహ్మశ్రీ కొక్కొండ వెంకట రత్నం పంతులుగారనే చెప్పాలి. వారి 'ఆంధ్రభాషా సంజీవని'లో పనిగట్టుకుని విద్యాభ్యాసం వల్ల స్త్రీకీ, ఆవిడ మూలంగా సంఘానికీ కలిగే కష్ట నష్టాలు అంచనా వేస్తూ వ్యాసాలు వ్రాస్తూ ఉండే వాళ్ళు. ధవళేశ్వరంలో ఉపాధ్యాయ వృత్తి నిర్వహిస్తున్న పంతులుగారు దీన్ని సహించలేక పోయారు. స్త్రీలోకాని కంతటికీ అపకారం కలిగించే అభిప్రాయాలు జనుల నెత్తిన రుద్దడం సంఘానికే ప్రమాదకరంగా ఆయన భయపడి పోయారు. యుక్తి ప్రయుక్తి సహితంగా కొక్కొండ వారి అభిప్రాయాలను ఖండిస్తూ, ప్రతి వ్యాసాలను పురుషార్థ ప్రదాయిని అనే పత్రికలో ప్రకటించ డానికి పూనుకున్నారు. వాద వివాదాలతో ఈ విధంగా ప్రారంభమైన స్త్రీ విద్యోద్ధరణాభిప్రాయం, ఆయనలో వేరూని, దృఢమై చివరకు తనబోటి జిజ్ఞాసువుల సహాయంతో, ఒక బాలికా పాఠశాల స్థాపించడమనే సత్కార్య రూపంలో ఫలించింది. స్త్రీ విద్యను ప్రోత్స హించే తన అభిప్రాయాలను ఇతరుల పత్రికల్లో స్వేచ్ఛగా చెప్పుకోవడం కొంత ఇబ్బందిగా తోచి, ఆ సంవత్సరమే ఆయన ఒక చిన్న మాసపత్రికను నడపడం ఆరంభించారు. అదే వివేకవర్ధని. దాన్లో ఆయన మొదట తన్ను గురించి,

"బ్రాహ్మణుండను హూణభాష నేరిచి యందు
నేఁ బ్రవేశ పరీక్ష నిచ్చినాఁడ,
నాంధ్రమున నొకింత యభిరుచిఁగలవాఁడ
దేశాభివృద్ధికై లేశమైనఁ
బాటుమాలక పాటుబడ నిచ్ఛఁ గలవాఁడ
కవితా పటిమ కొంత గలుఁగు వాఁడ."

అని చెప్పుకున్నారు. ఆ వివేకవర్ధనే పోను పోను పేరు మోసి యెన్నో లోకహిత కార్యాలను చేయగలిగింది. ఆ రోజుల్లో పెద్ద ఉద్యోగుల దగ్గర లంచగొండితనం అధికంగా ఉండేది. ముఖ్యంగా న్యాయస్థానాలలో. న్యాయాధిపతులు న్యాయానికంటే లంచానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవారు. మునసబు ఎదుట కేసులు వాదించే వాది ప్రతి వాదుల ప్లీడర్లు కేసులో పాయింట్లు చెప్పడం మాని, న్యాయాధిపతులు ఈ కేసును 100 వ సెక్షన్ ప్రకారం విచారించాలి, 120 వ సెక్షన్ ప్రకారం విచారించాలి అంటూ పాట పెంచుకుంటూ పోయేవారు. ఈ 100, 120, 130, 140 మొదలైనవి సెక్షన్ల నంబర్లు కాక కేవలం వాది ప్రతి వాదులు మునసబు గారికి ముట్ట చెప్పుకోగల మొత్తం. ఈ విషయం తమ కెవరికీ తెలియనట్లుగా అందరూ నటించే చిదంబర రహస్యం. అందువల్లే పాట ఏ పెద్ద మొత్తం దగ్గర ఆగిపోతుందో, ఆ మొత్తం పాడిన న్యాయవాదే సాధారణంగా కేసు గెలుస్తూ ఉండేవాడు — ఇటువంటి లంచగొండి తనాన్ని శరపరంపర లాటి వ్యాసపరంపరతో చించి చెండాడ గలిగింది వివేకవర్ధని. దీని విమర్శలకూ, ఇది వెలిబుచ్చిన ఋజువులకూ, లక్ష్యులయిన వ్యక్తుల్లో ఒకరిద్దరు బర్తరపు కావడమూ, అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకోవడమూ జరిగింది.

ఇందులో లోకాన్ని మరమ్మత్తు చేసే సాంఘిక విషయాలేకాక, సాహిత్యవిషయికమైన వాద ప్రతివాదాలు కూడా జరుగుతూ ఉండేవి. వీటికికూడా ముఖ్యకారకులు బ్రహ్మశ్రీ కొక్కొండవారే. వారి ఆంధ్రభాషా సంజీవనికి, వివేకవర్ధని పైకివస్తున్న కాలంలో హాస్యవర్ధని అనే అనుబంధం చేరింది. దీని అట్టమీద హాస్యాధినేత, దంతముఖుడూ, అయిన విఘ్నేశ్వరుడు నాట్యంచేస్తున్న రూపం ఉండేది. దీనికి సమాధానానుబంధంగా వివేకవర్ధనికి హాస్యసంజీవని అనే మరో అనుబంధం చేరింది. దీని అట్టమీదటంసింహముఖుడైన విఘ్నేశ్వరుడు కాన్పించేవాడు. గజసింహాల పరస్పరవైరం, ఆ వృద్ధండు లిరువురూ ఆ రకంగా వినియోగించుకున్నారు. ఈ రెండు అనుబంధాలకూ ముఖ్యాశయం, పరస్పర కృతులలో ఉండే దోషచర్చ. ఇది జరగడానికి సరియైన ఆలంబనం వీరిద్దరూ ఆంధ్రీకరించిన విగ్రహతంత్రం. ఈ రెండూ ఒకేసారి రావడంచేత ఒకరిమీద ఒకరికి రంధ్రాన్వేషణకు మంచి అవకాశం దొరికినట్లయింది. బ్రహ్మశ్రీ కొక్కొండవారి శిష్యుడు, శివశంకరపాండ్యా అనే ఆయన వారి విగ్రహతంత్రానికి ఇంగ్లీషులో పీఠిక వ్రాస్తూ ప్రస్తావనా సందర్భంలో, శ్రీ వీరేశలింగం పంతులుగారి విగ్రహంకేవలం కొక్కొండవారే ఎడమచేత్తో వ్రాసినట్లుగా ఉందని అన్నాడట ! ఇది పంతులుగారికి ఆగ్రహకారణమైంది. అందువల్ల, కొక్కొండవారి విగ్రహతంత్రంలో లోపాల్ని ఎత్తిచూపడమే ప్రథానాశయంగా కొంతకాలం విమర్శలుచేశారు. అటువంటి విమర్శలకు వివరణరూపంలో ఆయన ఇచ్చిన ఉపోద్ఘాతం చూస్తూంటే, శ్రీ కొక్కొండవారిమీద వారికా సమయాన గల కోపం ఎటువంటిదో తెల్లమౌతుంది. అది "లోకములో నిష్పక్షపాతియగు విమర్శకునకు గుణబాహుళ్యముగల కృతుల విమర్శించుటయే మిగుల వ్యసనకరమైన పనిగానుండును. అట్టి మహాకావ్యముల విషయములోనే అట్లుండుననగా కుమ్మరావములో నిత్తడి ముంతలకొరకు వెదకినట్లు గుణలేశముల నేనిం గనిపెట్ట బహుప్రయాసముతో వెదకదగిన యీ విగ్రహతంత్రమువంటి పుస్తకముల విమర్శనకుం బూనుకొనుటకంటె చింతాకరమైన పని నాబోటులకు వేరొక్కటి కన్పట్టకపోవుట వాస్తవము—" ఇటువంటి విమర్శనాధోరణి చూస్తుంటే ఆశ్చర్యంతోపాటు భీతికూడా కలుగుతుంది మనకు. సమఉజ్జీలయిన, ఆ గొప్పవాళ్ళు అట్లా తిట్టుకున్నా, హోరాహోరీ యుద్ధం చేసినావారికి చెల్లింది. ఈనాడు,అటువంటి గొప్పతనమూ,

నాయని కృష్ణకుమారి

ప్రతిస్పర్థిత్వమూ ఉన్నాయేమోగాని, అంత తెగించి ప్రత్యక్షంగా దెబ్బలాడుకునే నిర్భీకతా, నిర్మోగమాటమూ లేవు.

వివేకవర్ధని యీ విధంగా సంఘ సాహిత్య విషయికంగా మార్పుల్ని కోరుతూ విప్లవాత్మకంగా సాగుతూ ఉండగా 1874 లో ఒక సంఘటన జరిగింది. మదరాసు నుండి కొందరు జిజ్ఞాసువులు శ్రీ పునర్వివాహాన్ని ప్రోత్సహిస్తూ ఒక సమాజాన్ని స్థాపించారు. క్రియారూపంలో ఏ పనీ చేయలేకపోయినా వాగ్వాదాలతోనూ, ప్రచారాలతోను కొంతలోకొంత రెండేళ్ళపాటు ఈ సమాజం కొంత సందడి చేసింది. ఆ సందడికే బెదిరి శ్రీ కొక్కొండవారు పంతులుగారికి కొక లేఖ వ్రాశారట. ఈ ఉద్యమాన్ని ఖండించమనే సారాంశంకల ఆ లేఖలో యీ విధంగా ఉంది. ''తద్విషయము మనము మిన్నకుండ వచ్చునా? తమకుఁ దోచినట్లు ఖండన వ్రాసి పంపుఁడీ! నేను నిందసమ్మత్సభా సదులలోఁ దత్ఖండన పరాయణుండనై యున్నాఁడను. నాస్తికతా హర్మ్యసోపాన నివిష్టపరులైనవారు దుష్టులు గాక శిష్టులగుదురా?... ఒకవేళ మనకంటె విధవా వివాహవాదులు బలవంతులైనను మనము భీష్మానుయాయుల మగుదుము గాక! మన ప్రతిపక్షులు భార్గవ ప్రతిభులగుదురు గాక. ధర్మమే జయము. చింతయేల? మన మందరమును గూడుకొన్నఁ బ్రతివాదులు విత్తమత్తులైనను, మత్తగజంబులు శృంఖలాబద్ధంబులై కంది కుందుచందంబున నగుట సిద్ధంబు...'' ఈ లేఖకు పంతులుగారు ఏ సమాధానం వ్రాశారో మనకు తెలియదు—కాని కలిసివస్తారనుకున్న పంతులుగారు పూర్తిగా బ్రహ్మశ్రీ కొక్కొండవారికి నిరాశ కలిగించడమేకాక, వ్యతిరిక్తంగా శ్రీ పునర్వివాహ సంస్కారంకోసం తమ జీవితాన్ని ముడుపు కట్టినట్లుగా ప్రవర్తించసాగారు — మొదట మొదట, నేను దుర్బలుణ్ణి. అంగబలమూ, అర్థబలమూ లేనివాణ్ణి. నావల్ల యింత మహత్తర కార్యం ఏమవుతుంది? అని ఉదాసీనత వహించినా తరువాత తరువాత, మిత్రబృందమూ, సంస్కరణాభిలాషా ఆయన్ని ఉత్తేజితుణ్ణి చేయగలిగాయి. ఈ మిత్రుల్లో ముఖ్యులు శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారూ, చల్లపల్లి బాపయ్య పంతులుగారూనూ. ముప్ఫైవేల రూపాయలు దానంగా అర్పించి, అర్థబలం చేకూర్చిన ఉదారులు శ్రీ బారు రాజారావు పంతులుగారూ, పైడా రామకృష్ణయ్యగారూ. వీరికితోడు, శ్రీ కంచి కృష్ణస్వామి, అత్మూరి లక్ష్మీనరసింహం, సోమంచి భీమశంకరం మొదలైనవారి సహాయసహకారాలు పంతులుగారికీ మహాకార్య నిర్వహణలో ఎప్పుడూ ఉండేవి. ఇంత బలగం వెంట ఉండి ఉత్సాహపరచడంవల్లనే ఆయన తన జీవితంలో అరవైకిపైగా వితంతు వివాహాల్ని నిర్విఘ్నంగా కొనసాగించ గలిగారు. వివాహాలు నిర్వహించడానికి మొదటి మెట్టుగా ఈయన సభలు చేసేవారు, ఆ సభల్లో పునర్వివాహ విషయమై రెండుపక్షాల వారికీ వాదప్రతివాదాలు జరిగేవి. పంతులుగారు తన ఉపన్యాసం ముగించీ ముగించకముందే, ఆబోతుమీదికి కుప్పించి ఎగసే పెద్దపులుల గుంపులా పండితులంతా వాదనకు పూనుకునేవారు. కాని ఏ సభలోనూ చర్చితాంశం ఒకదరికి చేరేదికాదు. వాదప్రతివాదాలూ, సారాంశమూ ఎలా ఉన్నా, విషయం సంప్రదాయ విరుద్ధమైనదీ కుతూహలాన్ని రేకెత్తించేదీ అవడంవల్ల ఊళ్ళో ఏ యింట్లో ఏ మూల చూచినా అదే చర్చకు ఆస్పదమైపోతూ ఉండేది. కేవల కుతూహలంతోనో, ఏం జరుగుతుందో అనే భయ విస్మయాలతోనో, ఎలా జరుగుతుందో చూద్దాం అనే క్రోధావేశంతోనో మొత్తానికి అందరూ ఈ విషయాన్నే మననంచేస్తూ ఉండేవాళ్ళు—ఈ సభలమూలంగా పంతులుగారు మొట్టమొదట, ఊరుఊరంతటికీ చైతన్యం కలిగించి ప్రజల మనస్సుల్లో 'విధవా వివాహం' అనే మాట విన్నప్పుడు ఇదివరకు కలిగే కాఠిన్యాన్ని తొలగించి దాని స్థానంలో సానుభూతినీ జిజ్ఞాసనూ ప్రవేశపెట్టగలిగారు.

ఇది స్త్రీ పునర్వివాహ సంస్కార ప్రయాసదశలో మొదటి ఘట్టంకాగా, వివాహ నిర్వహణం రెండవ ఘట్టం అయింది. ఇదే పంతులుగారి జీవితానికే సాఫల్యాన్ని కలిగించి,ఆశయ సిద్ధి చేకూర్చింది. 1881లో ఈయన రాజమహేంద్రవరంలో మొదటి వివాహాన్ని నిర్విఘ్నంగా నిర్వహించగలిగారు. కాని దీనికిముందు ఎంతో ప్రయత్నం జరిగింది. ప్రతిపక్షులు దీన్ని ఆపడానికి శాయశక్తులా ప్రయత్నించక మానలేదు. దొమ్ములు, తన్నబోవడాలు, దూషణ తిరస్కారాలు, ఆంక్షలు — వంటి వాటి నెన్నిటినో పంతులుగారు ఎదుర్కో వలసి వచ్చింది. అంతవరకూ కలిసికట్టుగా పనిచేసిన మిత్రులు పెద్దల నిర్బంధం చేత, ఒత్తిళ్ళవల్లా పెళ్ళికి హాజరు కాలేకపోయారు. ఆ పెళ్ళికి వంట బ్రాహ్మణులు దొరక్కపోవడం, తాంబూలాలు అందుకోవడానికి ఎవరూ రాకపోవడం, చివరకు పెళ్ళి జరుగుతూ ఉండగా ఆ వీధిన నడచిన వాళ్ళకు కూడా ఆంక్షలు విధింపబడడం జరిగింది. అయినా పంతులుగారు ధీరులు. ధీరచిత్తులు మేరుపు మీద పడినా చలించరు. చేపట్టిన కార్యం తుదిముట్టందే వదలరు. అవ్యాహతంగా, అచంచల కార్యదీక్షతో ఆయన సాగించిన అరవై వివాహాలలో ఆరవ వివాహం మా కుటుంబానికి సంబంధించినదే. పిఠాపురం సంస్థానానికి రెండో దివానుగా ఉన్న కోకావెంకట సుబ్బారావుగారు వరుడు. ఆయన వితంతు వివాహం చేసుకున్న నాడు ఎంత ప్రతిఘటనా విముఖతా ఉండేవో మాకు తెలియకపోయినా దాని ప్రభావం తరువాతి తరంపైన కూడా ఎంత తీవ్రంగా ఉండేదో చెప్పడానికి ఓ చిన్న సంఘటన నిక్కడ చెప్తే అది అప్రస్తుతం కాబోదు. సుబ్బారావుగారికి ఈ వివాహం వల్ల కలిగిన కొడుక్కి మా పెద్దమ్మ కూతుర్ని ఇచ్చి బ్రాహ్మ పద్ధతిలో వివాహం జరిపించారు. ఆ పెళ్ళికి హాజరు కాబోయే బంధువుల్ని బందరు రైలు స్టేషను దగ్గరే సంప్రదాయపరులు ఎదుర్కొని బ్రతిమాలి, భంగపడి వెనక్కి తిప్పి పంపగలిగారట. మరీ మొండి కెత్తి పెళ్ళిన మాలాటి వాళ్ళను మా మా ఊళ్ళల్లో కుల పెద్దలు వెలివేశారు. మమ్మల్ని వెలివేయడానికి మరో ముఖ్య కారణం, మా అమ్మ పెళ్ళి కూతురు తల్లికి సాక్షాత్తూ అప్పచెల్లెలు కావడం.

ఈ రకపు ప్రతిఘటననూ, కష్టాన్నీ అధిగమించి చురుకుగా వితంతువివాహాలు నడిపిన పంతులుగారు తెలుగు స్త్రీ లోకానికి ఎన్నటికీ మరచిపోలేనివారు. వారి జీవితం వల్ల సంఘ సంస్కరణోద్యమమే సఫలతచెందింది. ఈ సాఫల్యం పంతులుగారి జీవితంలో ఒకభాగం మాత్రమే.

మరోభాగం ఈయన సాహిత్య ప్రపంచంలో సాధించిన విప్లవాత్మకమైన మార్పు. ఈయన జీవితంలో గ్రంథకర్తృదశ 1870 నుండి 1900 వరకూ సాగింది. స్త్రీ పునర్వివాహ సంస్కార ప్రయాసదశ 1880 నుండి 1890 వరకూ సాగింది. అంటే యీ రెండు మహాకార్యాలూ, ఈయన జీవితంలో ఒకేకాలంలో సమాన ప్రాతినిథ్యం వహించాయనే చెప్పాలి. అందువల్లనే యీ యన సృష్టించిన సాహిత్యంలో కేవలం ఊహలూ, గాలిమేడలూ, స్వప్నసౌధాలూ, స్వర్గసౌఖ్యాలూ కాక జీవితంలో సంఘ సంస్కరణకోసమై ఈయన తిన్న ధక్కామొక్కీలూ, ఎదుర్కొన్న అడ్డంకులూ, యుద్ధంచేసిన శత్రువులూ కనిపించడం సంభవించింది. లలితకళల్లో మేటిఅయిన సాహిత్యాన్ని హృదయానందకారకమైన ఉపాధి అని యీ యన చేపట్టినట్లు కనిపించదు. అది బలవంతమైన ఉపకరణమనీ,దానిచేత తాను తలపెట్టిన సంఘ సంస్కరణ మహా ప్రయత్నానికి రూపులు దిద్దవచ్చుననీ గ్రహించినట్లుగా తోస్తుంది. అందువల్లనే పంతులుగారి సాహిత్యంలో, సంఘంలోని మూఢాభిప్రాయాలను దుయ్యబడుతున్న పంతులుగారు, ప్రతిపక్షుల్ని తమ సునిశిత హాస్య వాక్కులతో నిగూఢంగా నొప్పిస్తున్న పంతులుగారు, దురాచారాలను సమూలంగా నాశనం చేయడానికి కత్తి ఝుళిపిస్తున్న పంతులుగారు, ఎటుచూచినా, సహస్ర

ముఖాలుగా విజృంభిస్తూ కనిపిస్తారు — సంఘంతోనూ, సంస్కరణతోనూ ప్రమేయంలేని యితివృత్తాలుకల వారి యితర రచనలు చూచినా, వాటిల్లోకూడా, ఏదో విప్లవాత్మకధోరణీ, ఆశయమూ కనిపించక తప్పదు. మన సాహిత్యానికి అంతవరకూ అనువాద నాటకాలు లేవుకదా అని, సంస్కృతాంగ్ల నాటకాలు అనువదించినట్లు కనిపిస్తుంది. నవలలు లేవుకదా అని రాజశేఖర చరిత్ర వ్రాశారు. చిన్నయసూరి పంచతంత్రాన్ని పూర్తిగా పరివర్తించక పోవడంచేత, విగ్రహాన్నీ, సంధినీ రచించారు. జీవిత చరిత్ర వ్రాసి, ఆశాఖకు తామే ప్రారంభకులై ముందువాళ్ళకు మార్గదర్శకు లయ్యారు. ఎన్నో సాంఘిక సారస్వత విషయాలమీద ఉపన్యాసరూపంలో, సభల్లో ప్రసంగించిన వాటిని వ్యాసరూపంలో అమర్చి ఆ శాఖకు బీజం నాటారు. పైకి నవ్వుతెప్పిస్తూ, లోలోపల గ్రుడ్ల నీరును గ్రుడ్ల కుక్కించే నిశిత హాస్యాన్ని ప్రహసన రూపంలో వెలయించారు — అంతగా వచనమే వ్రాస్తూ ఉంటే, ఛందోలంకార సహితంగా, చక్రబంధ ఖడ్గబంధ పూర్వకంగా సాహిత్యంలో సర్కసుచేసే పండితులకు చులకనకాగల ప్రమాదమున్నదని, వాళ్ళకుకూడా భయగౌరవాలు కలిగేటట్లు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధాన్నీ, శుద్ధాంధ్ర భారత, ఉత్తర రామాయణాలనూ రచించారు. అంతేకాక శాస్త్ర విభాగంలో కృషిచేసి, వృక్షశాస్త్రాన్నీ, వ్యాకరణాన్నీ, ఆరోగ్యవిధుల్నీ, నీతిసారాన్నీ జనులకు తెలిసేటట్లుగా సులభపద్ధతిలో అందించడానికి సర్వప్రయత్నాలూ చేశారు.

లోకంలో బహు రచనా వ్యాసంగం కలవారి కృతులు అన్నీ చిరస్థాయిగా నిలిచిపోవడం అరుదు. కాని పంతులుగారి అభిజ్ఞాన శాకుంతలానువాదం పాశ్చాత్య ప్రశంసల్ని అందుకుంది. అది యింతవరకూ వచ్చిన అనువాదాల్లో మేలి పూస. ఈయన జీవిత చరిత్ర జీవిత చరిత్ర రచనకే రాచబాటలు వేసిన ప్రక్రియ. 'విగ్రహం,' చిన్నయసూరి మిత్రలాభ, మిత్రభేదాలలో కలిసిపోయినట్లుగా అమరగలిగింది — ఇక వీరి ప్రహసనాలకు అవే సాటి ! —

ఈయన జీవితంలో అటు సంఘ సంస్కరణా, ఇటు సాహిత్య సంస్కరణా దేనికదే, సమాన ప్రాతినిధ్యాన్ని వహించినట్లుగా కనపడుతుంది. అందుకే సంఘ సంస్కర్త వీరేశలింగం, రచయితగా వీరేశలింగాన్ని జ్ఞాపకం రానీయడు. అలాగే సాహిత్య కారుడు వీరేశలింగం సంఘ సంస్కారిని గూర్చి ఆలోచించ నీయడు.

శ్రీ పంతులుగారు పూర్ణపురుషులు, కారణజన్ములు. తాము జీవించిన డెబ్భై ఒక్క సంవత్సరాలలో ఇంచుమించు ప్రతిక్షణమూ ఆశయ నిర్వహణకోసం నిర్విరామంగా, విశ్రాంతిరహితంగా, బహుముఖంగా ఎలా పనిచేయాలో, మనకు నేర్పడానికే పూనుకున్నారు. నిర్ణీత కాలంలో, జీతంతీసుకుని, ఆఫీసుల్లో పనిచేయడానికీ అసురుసురై తదుపరి ఏమిచేయడానికీ త్రాణ మిగలని యీ యాంత్రికయుగం మనుష్యులం, మనకు ఈ ఎరుక విస్మయాన్నే కాక భయగౌరవాలను కూడా కలిగిస్తుంది. ఇటువంటి జీవితచరిత్రలు ముందు తరాల ప్రజలకు ఆదర్శాలుగానూ, అవశ్య పఠనీయాలుగానూ ఉంటాయి. ఆ కాలంలో జీవించి, ఆస్థితిగతుల్ని ప్రత్యక్షంగా అనుభవించలేని జనులకు, ఆ చరిత్ర పఠనంతోనే కొంత తృప్తి.

కాని యెందువల్లనో తెలుగు సాహిత్యంలో ఈ జీవిత రచనాశాఖ అంతగా విస్తరిల్లడం లేదు. దీనికి కారణం నలుగురుకీ తెలియ జేసేంత గొప్ప చరిత్ర తెలుగు వాడికి లేదనేకంటే, అతగాడిలో నరనరానా జీర్ణించుకుపోయిన అకర్తృత్వ బుద్ధీ, ఆత్మ చరిత్ర చెప్పుకోలేని ఉదాసీనతా కారణాలు అయి ఉండవచ్చును.

# పంతులుగారి సమకాలికులు

## శ్రీ గిడుగు సీతాపతి

వీరేశలింగముగారి సమకాలీన రచయితలలో మూడు తరగతుల వారిని పేర్కొని వారి రచనలను సూచించడమయినది.

1. వీరేశలింగముగారికంటె వయస్సులో పెద్దవారు అయినను వీరేశలింగముగారి జీవితకాలములో సాహిత్య రంగమందు కృషిచేసి వీరేశలింగముగారికి మిత్రులుగాని పరిచయము గలవారుగాని అయినవారు.
2. ఒకటి రెండు సంవత్సరములు చిన్న వారయినను వీరేశలింగముగారితో కలిసిమెలసిగాని పోటీపడిగాని సాహిత్యరంగములో కృషిచేసినవారు.
3. వీరేశలింగముగారికి శిష్యులుగా గాని వారి ప్రాభవమునకు వశ్యులయిగాని రచనలు గావించినవారు; 1870 లో గాని ఆ తర్వాతగాని జన్మించినవారు.

### మంత్రిప్రగడ సూర్య ప్రకాశ కవి

1808 – 1873

వీరు సంస్కృతాంధ్రములందు గొప్ప పాండిత్యము గల కవులు. సీతారామచరిత్ర ప్రబంధమును, కృష్ణార్జున చరిత్రమను ద్వ్యర్థికావ్యమును రచించినారు. ఈ ద్వ్యర్థి కావ్యము వీరేశలింగముగారిని ఇంకా ఆనాటి పెద్దలను ఎక్కువగా ఆకర్షించినది. ఇందు పారిజాతాపహరణ సుభద్రాపరిణయ. కథలు రెండును విశదమగునట్లు కావ్యము రచితమైనది. దీనికి జయపుర సంస్థానాధిపతులయిన విక్రమదేవవర్మగారు (1865–1949) వ్యాఖ్యానము రచించి ప్రకటించినారు.

### కోరాడ రామచంద్రశాస్త్రి

1816 – 1900

వీరి పూర్వులు అమలాపురము తాలూకావారు. వీరి తండ్రిగారు లక్ష్మణశాస్త్రిగారు; చిన్నప్పుడే శ్రీరామతారక మంత్రోపదేశమును పొందినవారు. రామచంద్రశాస్త్రి గారు కూడ 12 వ ఏటనే తండ్రివద్ద ఈ శ్రీ రామతారక మంత్రోపదేశమును పొందిరి. శ్రీ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి గారి వద్ద కవితనేర్చుకొనిరి. కవిత అలవడిన తర్వాత వీరికి రామచంద్రకవిగారనే పేరు వ్యాప్తిలోనికి వచ్చినది.

1845 లో వీరు బందరులో నోబిల్ పాఠశాలయందు నెలకు ఏడురూపాయల జీతముమీద పండితులుగా ఉద్యోగము చేయుటకు మొదలుపెట్టినారు. ఆ పాఠశాల కళాశాలగా మారిన తర్వాత వీరు ప్రధానాంధ్రోపాధ్యాయులైనారు. వీరి జీతముకూడ క్రమక్రమముగా నెలకు రూ. 40 ల వరకును అధికమయినది. అక్కడ వీరు 40 సంవత్సరములు పనిచేసి 1888 లో ఉద్యోగమునుండి విరమించి 1900 లో స్వర్గస్థులయినారు...వీరి మనుమడు– అనగా వీరిజ్యేష్ఠపుత్రుని జ్యేష్ఠపుత్రుడు. రామకృష్ణయ్య గారు మద్రాసు విశ్వవిద్యాలయమందు తెలుగు లెక్చరరుగా పనిచేసి ఇటీవలనే స్వర్గస్థులయినారు.

రామచంద్రకవిగారు ఆంధ్ర గీర్వాణభాషలలో గొప్ప పండితులు; కవులు; అనేక గ్రంథములు రచించినవారు.

అందులో 22 సంస్కృత గ్రంథములు; 7 ఆంధ్రీకరణములు; 2 స్వతంత్ర — ఆంధ్ర గ్రంథములు. ఆంధ్రీకృత గ్రంథములందు ఉన్మత్త రాఘవము, ముద్రారాక్షసము, శాకుంతలము, వేణీసంహారము, ఉత్తర రామచరిత్రము ముఖ్యమైనవి. ఇందులో 1891 వ సంవత్సరమున ఉన్మత్త రాఘవము ముద్రితమైనది. తక్కినవి పూర్తిగా లభ్యములు కాలేదు.

వీరి స్వతంత్ర—ఆంధ్ర రచనలలో మంజరీ మధుకరీయము అనే నాలుగంకములనాటిక 1860 లో రచితమయినది. ఇదే ఆంధ్రసాహిత్యమందు మొట్టమొదటి రూపకము. వీరి శిష్యులలో ప్రసిద్ధులయిన వావిలాల వాసుదేవ శాస్త్రిగారు తాము ఆంధ్రీకరించిన ఉత్తర రామచరిత్ర పీఠికలో తెలియజేసిన వాక్యములనుబట్టి సంస్కృత నాటకముల నాంధ్రీకరించిన వారిలోకూడ రామచంద్రకవిగారే మొదటివారు. అయితే. కవిగారి వేణీసంహార నాటకము మాత్రమే వాసుదేవశాస్త్రిగారికి తెలిసినది. ఆ శాస్త్రిగారి వాక్యములను బట్టి ఈ కవిగారి తర్వాత సంస్కృత నాటకములను తెలుగుచేసిన వారిలో రెండవ వారు కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు. వీరు ధర్మభట్ట విరచితమయిన నరకాసుర విజయ వ్యాయోగమును తెలిగించిరి. మూడవవారు పరవస్తు వేంకట రంగాచార్యులవారు; వీరు శాకుంతలనాటక మాంధ్రీకరించినారు; గాని ఇది పూర్తికాక పోవుటచేతను కాబోలు కందుకూరి వీరేశలింగము పంతులుగారు ఈ నాటకమునే తెలిగించినారు. దీనిని బట్టి సంస్కృత నాటకములను తెలిగించినవారిలో వీరేశలింగముగారు నాల్గవ వారయినారు.

స్వతంత్రాంధ్ర నాటక రచనలో కూడ కోరాడ రామచంద్రకవిగారే మొదటివారు — వీరి మంజరీ మధుకరీయము 1860 సం॥ ప్రాతమున రచితమయినదని వీరి మనుమలయిన రామకృష్ణయ్యగారి వాక్యములవలన స్పష్టమయినది. ఇందలి కథస్వకపోల కల్పితమేకాని పురాణములనుండి కాని ఇతిహాసముల నుండి కాని గ్రహించినది కాదు. నాయికా నాయకాది ప్రధానపాత్రలు ఉత్తమ శ్రేణికి చెందినవారుగా కనబడుదురు. అంక విభాగము, దృశ్యముల విభాగము ప్రాచీన నాటక లక్షణమునకు గాని నవీననాటక లక్షణమునకు గాని అనుకూలింపక పోవుటవలన ఇది ప్రదర్శించుటకు అంతగా తగినది కాలేదు.

పంతులుగారి సమకాలికులు

## పరవస్తు వేంకట రంగాచార్యులు
### 1822 — 1900

వీరు విశాఖపట్టణమందు 1822 లో జన్మించి, అక్కడనే పెరిగి పెద్దవారయి 1890 వరకును ఉండిరి. ఆ తర్వాత తుని రాజావారి ఆదరణముపొంది అక్కడనే నివసించి 1900 లో పరమపదించిరి.

వీరు బాల్యమందే సంస్కృత పండితులును కవులును అయినవారు; 8 వ ఏటనే కుంభకర్ణ విజయమును సంస్కృతములో రచించినారట। వీరి రచనలలో ముఖ్యముగా పేర్కొనదగినది శబ్దార్థసర్వస్వము. ఇందులో అ ఆ లతో ప్రారంభించిన పదముల వివరణముగల మొదటి భాగము 1877 లో ముద్రితమయినది. ఇది పూర్తిగా లిఖితమైయున్నను నేటివరకును తక్కిన భాగములు ముద్రితములు కాలేదు. ప్రకటితమైన భాగమునకు గల పీఠికలో ఆచార్యులవారు తాము ఆనాటివరకును రచించి యుండిన గ్రంథములను పేర్కొని యుండిరి. అందులో "మంజులనైషధము" అనునాటము సంస్కృత భాషలోను, అభిజ్ఞాన శాకుంతలము, 'కమలినీ కలహంస' అనే సంస్కృత నాటకముల అనువాదములు తెలుగుభాషలోను రచించినట్లు ఆచార్యులవారు తెలియజేసినారు. శాకుంతల నాటకమందలి మొదటి రెండు అంకముల అనువాదమును మూడవ అంకమునందలి మొదటి పుటయును లభ్యములు. తక్కిన భాగములు పోయినవి. కమలినీకలహంసాంధ్రానువాద మేమయినదో తెలియదు.

రంగాచార్యులవారి మనుమలైన రామానుజ స్వామివారి కోరిక ననుసరించి ఆకొండి వేంకటశాస్త్రిగారు మంజుల నైషధమను నాటకమును ఆంధ్రీకరించినారు. ఇది 1941 లో ప్రకటితమయినది.

రంగాచార్యులవారు అనేక శాస్త్రములందు గొప్ప పాండిత్యము గలవారు. అందులోను వ్యాకరణ శాస్త్ర మందు ఎనలేని పాండిత్యము సంపాదించినవారు. వీరివద్ద వీరి పుత్రులును పౌత్రులును మాత్రమేకాక ఇతరులనేకులు శిష్యులై వ్యాకరణాలంకారశాస్త్రములు నేర్చుకున్నారు. వీరు సర్వ స్వతంత్రాభిలాష గలవారు. ఆర్యధర్మమునందును, విశిష్టాద్వైతమునందును అభిమానముగలవారు. ఆ కాల ములో విశాఖపట్టణమందు క్రైస్తవమతబోధ ఎక్కువగా సాగుతూ ఉండెను. దానివలన అనేకులు క్రైస్తవమత మును అవలంబించుటకూడ జరుగుతూ ఉండేది. దానిని అరికట్టుటకు రంగాచార్యులవారు ఆర్యమతమును బోధిస్తూ ఉపన్యాసముల నిస్తూ ఉండిరి. వారు స్వంతపుస్తక భాండా గారమును నెలకొల్పి ముద్రితములైన గ్రంథములనే కాక తాటియాకు గ్రంథములను కూడ సేకరించియుండిరి. ఇది దినదినాభివృద్ధి పొంది నేటికిని విశాఖపట్టణములో నిల్చి యున్నది. ఆత్మ గౌరవమునకు లోపము కలుగునన్న భయము తోచినప్పుడు విజయనగర సంస్థానాధిపతులయిన ఆనంద గజపతి మహారాజావారి ఆహ్వానమునైనను మన్నించలేదు.

## మండపాక పార్వతీశ్వరశాస్త్రి
### 1833 – 1897

వీరు బొబ్బిలి నివాసులు. వీరికి సంస్కృతాంధ్రములలో గొప్ప పాండిత్యముండేది. అనేక శతకములను రచించి నారు. ఉత్పలమాలాది వృత్తచ్ఛందస్సులో అనేక మాలి కలు 12 మొదలు 40 వరకుగల పంక్తులు ఒకే ప్రాసాక్ష రముగలవి రచించినారు. సంస్కృత భాషలోగల అమ రుకము ఆంధ్రీకరించిన మహాకవులు. వీరి అనువాదము మూలములకు సరిగాను తెలుగు భాషకు అనురూపముగాను ఉన్నదని పండితులు ప్రశంసించినారు. వీరు రచించిన తెలుగుకావ్యములలో కాంచీపుర మాహాత్మ్యము, శ్రీ రాధా కృష్ణసంవాదము ప్రబంధశైలిలో నున్నవి. వీరి లేఖలు కొన్ని పద్యరూపమున నుండేవి. వీరి రచనలు శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారి సంపాదకత్వమున నెల్లూరులో ప్రక టితమైన అముద్రిత గ్రంథచింతామణి యను మాసపత్రిక యందు తరుచుగా వెల్వడుతూ ఉండేవి. ఒక్క సంఘ సంస్కార విషయములోతప్ప తక్కిన అనేక విషయ ములలో వీరును వీరేశలింగముగారును మిత్రులే అయినా వీరికి వేదము వారితో చెలిమి ఎక్కువగా ఉండేదని వీరి మనుమలయిన పార్వతీశంకవిగారు నాతో చెప్పుతూ ఉండేవారు.

## మాడభూషి వేంకటాచార్యులు
### 1835 – 1895

వీరు నూజ్వీడు పండితులలో ఎక్కువ ప్రసిద్ధిపొందిన వారు. ఆశుకవులు; అష్టావధాన శతావధానములం దగ్ర గణ్యులు. పిఠాపురము మొదలుకొని మద్రాసు వరకును గల నగరములందు ఈ అవధానములు గావించి పెద్దల బహుమతుల నందుకొన్నవారు: "ఏకసంత గ్రాహులు". ఎంతపెద్ద శ్లోకమైనను ఒక్కసారిచదివి వినిపించినంతనే అప్పజెప్పగల సామర్థ్యము గలవారు.

అవధానములు చేయుటయేకాక వీరు కొన్ని కావ్యము లను కూడ రచించినారు. వాటిలో భరతాభ్యుదయ ప్రబంధము ప్రఖ్యాతిపొందినది. ఇందు దుష్యంత చరిత్ర శకుంతలా పరిణయము భరతునిజన్మము బాల్యము మొద లయిన వృత్తాంతములు గలవు.

## కొక్కొండ వేంకటరత్నము పంతులు
### 1842 – 1915

వీరు మాధ్వకుటుంబమునకు చెందినవారు; పుట్టుక వలన ద్వైత మతస్థులే అయినా తల్లి నియోగశాఖకు

చెందిన ప్రీయగుటచేతను బాల్యమందే తండ్రి పోవుట వలన తల్లిపోషణమందే పెరిగి పెద్దవారగుటచేతను శృంగేరీ పీఠాధిపతులకు శిష్యులై ద్వైతమును విడిచిపెట్టి అద్వైతమతమును స్వీకరించిరి. అదిగాక, తను మధ్యా బిల్వ నాథుల కరుణవలన అక్షరసాంఖ్యమను ఆర్షసాంఖ్య విద్య వీరికి పట్టుబడినది.దాని మాహాత్మ్యమువలననే తమకు కవితాపాండిత్యములు పట్టుబడినవని వీరి నమ్మకము.

1857 — 1863 లో వీరు కలెక్టరు కచేరీలోను, సర్వే ఇలాకాలోను పనిచేసి ఆపిమ్మట కోయంబత్తూరు జిల్లాలో ఉపాధ్యాయ వృత్తిలోచేరి విద్యార్థులకు తెలుగు కన్నడము బోధిస్తూ ఉండేవారు. 1864 మొదలుకొని 1900 వరకును మద్రాసులో ఉపాధ్యాయులుగా ఉండిరి. ఆ కాలమందే 1878 నుండి 1900 వరకు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసినారు. 1890 లో ఆ కళాశాలలోనే వీరు ఆంధ్రభాషాభివర్ధనీ సమాజమును స్థాపించినారు. అదినేటికిని నిల్చియున్నది.

వేంకటరత్నము పంతులుగారు రచించిన అయిదు రూపకములందు మూడు ఆంధ్రీకరణములు — 1. నరకాసుర విజయ వ్యాయోగము; 2. ధనంజయ విజయ వ్యాయోగము; 3. ప్రసన్న రాఘవనాటకము. మొదటిది 1871 లో రచితమై 1873 లో ముద్రితమయినది. ఇది వారణాసి ధర్మసూరి రచించిన సంస్కృత రూపకమునకు తెలుగు. నరకాసురుని శ్రీకృష్ణుడు జయించుటే ఇందుగల కథ. రెండవది 1894లో ప్రకటిత మయినది. సంస్కృతములో కాంచనాచార్యుడు రచించిన ధనంజయ విజయమునకిది తెలుగు. ఉత్తర గోగ్రహణమునకు సంబంధించిన కథగలది. మూడవది సంస్కృతభాషలో జయదేవుడు రచించిన నాటకమునకు ఆంధ్రానువాదము; 1897 లో గ్రంథరూపమున ప్రకటిత మయినది. కథ సుప్రసిద్ధము.

ఆధునిక కవులలో ఈ పంతులుగారు విమర్శకుల తీవ్రఖండనకు గురియైనంత మట్టుకు మరి యెవరును కాలేదు. అందులోను వీరేశలింగముగారున్ను, వేదం వేంకటరాయశాస్త్రిగారున్ను పూండ్ల రామకృష్ణయ్యగారున్ను ఎక్కువగాను నిర్దాక్షిణ్యముగాను విమర్శించిరి. ఆ కాలములో ఈ పెద్ద కవులకు ఒకొక్కరికి ఒకొక్క పత్రిక స్వయముగానో సహాయముగానో ఉండేది. వీరేశలింగముగారు తమ హాస్యవర్ధనిలోను వేంకటరత్నముగారు తమ హాస్యసంజీవనిలోను ఒకరినొకరు దూషించుకొంటూ ఉండేవారు. నెల్లూరిలో పూండ్ల రామకృష్ణయ్యగారి సంపాదకత్వమున వెల్వడుతూ ఉండిన అముద్రిత గ్రంథ చింతామణి అనే పత్రిక వేదము వేంకటరాయశాస్త్రిగారికి అండగా ఉండేది. అందులో వీరిద్దరును వేంకటరత్నముగారిని వారి గ్రంథములను దూషిస్తూ వ్యాసములు వ్రాస్తూ ఉండేవారు. ఇదిగాక వేంకటరాయశాస్త్రిగారు పంతులుగారి ఆంధ్ర ప్రసన్న రాఘవమును విమర్శిస్తూ ప్రత్యేకించి ఒక పెద్ద గ్రంథము 1898 లో ప్రకటించినారు. అసలు గ్రంథమునకు మూడురెట్లు పెద్దది. 338 పుటలు గలది. అందులో 2568 దోషములను చూపించి పంతులుగారికి సంస్కృతమూరాదు; ఆంధ్రమూ రాదని ఎత్తి పొడిచినారు శాస్త్రిగారు. ఈ దోషములలో అనేకము వాస్తవముగా దోషములు కావనిన్ని, నిర్దుష్టములుగా ఉన్నవి దోషములుగా ఎన్ని శాస్త్రిగారు తమ పాండిత్య లోపమును బయటపెట్టుకొన్నారని గిడుగు రామమూర్తి పంతులుగారు 1919—20 లో తమ "పండిత భిషక్కుల భాషాభేషజము"లో ప్రమాణ సహితముగా ఋజువుచేసినారు.

పైని పేర్కొన్న నాటకములేకాక "అజామిళోపాఖ్యానము" అనే యక్షగానమున్ను, "బిల్వేశ్వరీయము" అనే నిర్వచన కావ్యమున్ను ఇంకా మరికొన్ని కావ్యములున్ను, శతకములున్ను పంతులుగారు రచించినారు.

వీరు కవులు, నాటకకర్తలు, పండితులు, విమర్శకులు. సంగీత జ్ఞానముగలవారు, శ్రావ్యముగా పాడగల్గిన

వారు. 1907 లో వీరికి ప్రభుత్వమువారు మహామహోపాధ్యాయ బిరుదము నిచ్చి గౌరవించిరి.

## దాసు శ్రీరాములు

1846–1908

వీరు చాలా ప్రతిభావంతులు. వీరి ధారణ శక్తి అద్భుతమయినది; ఏకసంతగ్రాహి. ఏ క్రొత్త పద్యమయి నను ఒక్కసారి చదివి వినిపించినంతనే వీరు అప్పగించ గలిగే వారట : వీరికి బాల్యమునుండిన్ని సంగీతము నందభిరుచి మెండుగా నుండెను. వీరు శ్రావ్యముగా పాడ గలిగే వారట : చదువుకొనుట యందును శ్రద్ధగలిగి బాల్యమందే సంస్కృతాంధ్రముల యందు పాండిత్యము సంపాదించి 11 వ యేటనే సాత్రాజిత విలాస మను యక్ష గానమున్ను 12 వ యేట సోమలింగేశ్వర శతకమున్ను రచించినారట :

వీరికి క్రమముగా తర్క, ధర్మ, జ్యోతిష, సంగీత, అభినయ శాస్త్రములలో మంచి పాండిత్యము లభించినది. వీరు కాళిదాస విరచితమైన అభిజ్ఞాన శాకుంతలము, భవభూతి విరచితములయిన మాలతీ మాధవము, ఉత్తర రామచరిత్ర, హర్షదేవుని రత్నావళి ఆంధ్రీకరించినారు. అనువాదములే అయినను నాటకములలో వీరు రచించిన పద్యములు మనోజ్ఞములయి యున్నవి. 1908 లో వీరు తమ జీవితాంతిమ దశయందు దేవీ భాగవతమును ప్రౌఢ కావ్యముగా రచించినారు. దీని ప్రాశస్త్యమును గూర్చి చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు ఈ గ్రంథ పీఠికలో వ్రాసిన వాక్యములందు 'నేటి కవులలో కవితా సంప్రదాయములను వీరొక్కరే చక్కగా పాటించినారని చెప్పగలను' అని వ్రాసినారు.

'తెలుగునాడు' అను పేరను వీరొక హాస్యరస ప్రధానమయిన కావ్యము రచించినారు. అందులో వివిధ బ్రాహ్మణ శాఖల వారి మాండలిక భాషలను ప్రదర్శించి నారు. ఉ॥ అష్షే సూష్షివషే బలే చెవుదుషే ... కాదుషే। విస్సావజ్ఝుల వారి బుజ్జి నషయా విస్సయ్య కిష్తారషే।"

సంగీతములోను నాట్యములోను అభినయములోను వీరికి మంచి పాండిత్యము కళాభిజ్ఞత ఉండుటచేత వీరు పదములు జావళీలు రచించి ఏలూరిలోగల సానిపిల్లలకు నేర్పుతూ ఉండేవారట. వారు మేళములుకట్టి దేవాలయాలలోను రచ్చసావిళ్ళలోను ఆడుతూ పాడుతూ ఉండే వారట :

## గురుజాడ శ్రీరామమూర్తి

1851–1900

చిన్నయసూరి వచన రచనా ప్రాభవము కోరాడ రామచంద్రశాస్త్రి, వీరేశలింగము మొదలయిన వారిపై యుండినట్లే వీరి మీదను కూడా కొంతవర కుండెను. అది వీరి చిత్రరత్నాకరము అను గద్య రచనలో కన బడుతున్నది. ఇందులో కళాపూర్ణోదయ కథ వచనములో రచితమయినది.

వీరి ప్రాముఖ్యము కవుల చరిత్రలో ఎక్కువగా కన బడును. అందు బమ్మెరపోతనాది ప్రబంధ రచయితలలో కొందరి చరిత్ర ఎక్కువగా కలదు. కాని, వీరి గ్రంథము వీరేశలింగముగారి కవుల చరిత్రవలె సప్రమాణమైనదిగా గాక అనుశ్రుతముగా వచ్చిన కథలతో కలిసియున్నది. యాథార్థ్యమును అంతగా పాటింపని వారికి ఎక్కువ ఇంపుగా నుండగల కథనముగలది. అందుచేత ఆనాడే కాదు ఈ నాడును ఈ గ్రంథము చదువుట కిష్టపడువారు గలరు.

## వావిలాల వాసుదేవశాస్త్రి

1851–1897

వీరు గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలో జన్మించి బాల్యదశ ఆ జిల్లాలోనే గడపి బందరులో విద్యార్థిదశ గడపిరి. వీరి పూర్వులు వేదవేదాంగ వేత్తలుగా ప్రసిద్ధి

కెక్కిన వారు. వీరి పితామహులు సోమయాజియైన వారు; మాతామహులు సి. పి. బ్రౌనుగారికి గురువుగా రయిన వఠ్యం అద్వైత పరబ్రహ్మశాస్త్రిగారు. వీరి తండ్రిగారు వ్యాపారము సాగించి 1872లో రాజమహేంద్రవరములో స్థిరపడుటవలన వాసుదేవశాస్త్రిగారు బందరులో ఎఫ్. ఏ. వరకును చదువు సాగించి రాజమహేంద్రవరము వచ్చి అక్కడి సర్వ కళాశాలలో 1873లో ఉపాధ్యాయులయినారు. వీరు ఎఫ్. ఏ. మాత్రమే అయినా వీరికి సంస్కృతాంధ్రము లందును ఆంగ్లము నందును మంచి పాండిత్య ముండుట వలన అప్పుడా కాలేజీకి ప్రిన్సిపాల్‌గా నుండిన మెట్‌కాఫ్ దొరగారికి అమితాభిమానము కలుగుటచేత, ఈ శాస్త్రి గారు కాలేజీ క్లాసులకు కూడ అధ్యాపకులుగా నియమితులయినారు. 1877లో ప్రైవేటుగా బి. ఏ. పరీక్షలో ఉత్తమ తరగతిలో ఉత్తీర్ణులయి మాక్డోనాల్డు స్వర్ణ పతకమును బహుమానముగా పొందిరి. అప్పటినుండిన్ని వీరి ఖ్యాతి మరింత ఎక్కువయినది.

ఆ కాలమందు పై తరగతులకు లొల్ల రామశాస్త్రి గారును, క్రింది తరగతులకు కందుకూరి వీరేశలింగము గారును తెలుగు బోధిస్తూ ఉండేవారు. వేదం వేంకటరాయశాస్త్రిగారి తండ్రి యయిన వేంకటరమణశాస్త్రిగారు కాలేజీ తరగతులకు సంస్కృతము బోధిస్తూ ఉండేవారు. వావిలాల వాసుదేవశాస్త్రిగారు అప్పుడా కాలేజీలో కొత్తగా ఏర్పడిన దేశ భాషాధ్యక్ష పదవికి నియమితులయినారు.

ఈ శాస్త్రిగారి శిష్యులలో పానుగంటి లక్ష్మీనరసింహారావుగారును, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారున్ను సుసర్ల అనంతరావుగారున్ను ప్రసిద్ధ రచయితలయినవారే.

1881లో చింతామణి యను సాహిత్య సంస్థకు శాస్త్రి గారు కార్యనిర్వాహకులుగా పనిచేసిరి. ఆ కాలములో నవలా రచనాభివృద్ధికి న్యాపతి సుబ్బారావుగారున్ను వీరేశలింగము పంతులుగారున్ను 1893—1898లో ప్రతి సంవత్సరమును నవలల పోటీ లేర్పరచినప్పుడు ఈ శాస్త్రిగారు ఆ పోటీలకు పరీక్షాధికారులుగా కొంతకాలము పనిచేసిన వారు. ఆ పోటీలలో మొదటి బహుమానమో రెండవ బహుమానమో పొందిన వారిలో పేర్కొనదగినవారు — చిలకమర్తివారు, ఖండవల్లి రామచంద్రుడు గారు, తల్లాప్రగడ సూర్యనారాయణగారు, గోపేటి కనకరాజుగారు, చేకుమళ్ళ రాజగోపాలరావుగారు.

శాస్త్రిగారి రచనలలో మొట్ట మొదటిది భజగోవింద శ్లోకముల ఆంధ్రీకరణము. దాని పేరు ముముక్షుతారకము; 1874లో ప్రకటితము. కావ్యరచన కంటె నాటక రచన ఎక్కువగా సాగించి ఈ శాస్త్రిగారు ప్రసిద్ధి పొందినారు. వీరి నాటకములలో మొదటిది "జూలియస్ సీజరు"అనే ఆంగ్లనాటకమునకు ఆంధ్రీకరణము. ఇది 1875లో ప్రకటితము. రెండవది "నందకరాజ్యము" అనే స్వతంత్ర సాంఘిక నాటకము; 1880లో ప్రకటితము. మూడవది భవభూతి విరచితమైన ఉత్తర రామచరిత్ర — ఆంధ్రానువాదము 1881లో ప్రకటితము. నాల్గవది మృచ్ఛకటికానువాదము; 1891లో ప్రకటితము. వీరు నాటకములేకాక కాళిదాస విరచితమైన రఘువంశ కావ్యమందలి మొదటి యారుసర్గలను కూడ ఆంధ్రీకరించి 1891లో ప్రకటించినారు.

## దేవులపల్లి సుబ్బయశాస్త్రి
### 1853—1909

1879లో మాడభూషి వేంకటాచార్యుల అవధానములు పిఠాపురములో జరిగిన తర్వాత అక్కడి సంస్థానాధీశులైన గంగాధర రామారావుగారి ప్రోత్సాహమున ఈ సుబ్బయశాస్త్రిగారు తమ తమ్ములైన కృష్ణశాస్త్రిగారితో కలిసి శతావధానములు చేయుటకు ప్రారంభించినారు. కాని అట్టి అవధానముల వలన ప్రయోజనము అంతగా ఉండదని గ్రహించి అవధానములు చేయుటమాని కావ్యరచన ఎక్కువగా సాగించినారు. వీరి రచనలలో మహేంద్ర

విజయము ప్రాచీన ప్రబంధశైలిలో చక్కగా రచిత మైనది. రావువంశ ముక్తావళి వీరి సంస్కృత రచనలలో ముఖ్యమైనది.

## దేవులపల్లి కృష్ణశాస్త్రి
### 1856_1912

వీరు సుబ్బయశాస్త్రిగారి తమ్ములు. అందుచేత తిమ్మన్నశాస్త్రిగారనే పేరు కూడ వీరికి కలదు. వీరు తమ అన్నగారు సంస్కృతములో రచించిన రావువంశ ముక్తావళిని తెలుగు కావ్యముగా అనువదించినారు. యతిరాజ విజయ మొక ప్రబంధముగా రచించినారు.

## వేదము వేంకటరాయశాస్త్రి
### 1853_1929

రాజమహేంద్ర మందలి ప్రభుత్వ కళాశాలలో వీరేశ లింగముగారు తెలుగు పండితులుగా ఉద్యోగము చేస్తూ ఉండిన కాలమందు వేంకటరాయశాస్త్రిగారి తండ్రిగారు, వేంకటరమణ శాస్త్రిగారు ఆ కళాశాలలో సంస్కృత పండితులుగా ఉండేవారు. అప్పటినుండిన్ని వీరేశ లింగము గారికిని వేంకటరాయశాస్త్రిగారికిని అన్యోన్య పరిచయముండెను. ఇరువురును పెద్దవారయిన తర్వాత ఇరువురికిని పరస్పర ద్వేషము విరోధము ఎక్కువయినవి. ఇరువురికిని కొక్కొండ వేంకటరత్నముగారి యెడల విరోధము మరింత ఎక్కువయినది. 1887 లో విక్టోరియా మహారాణి స్వర్ణోత్సవ సమయమున కొక్కొండ వారికి మహామహోపాధ్యాయ బిరుదము రాణి గారిచే సమర్పింపబడినది. అందుకు తగినంత అర్హత వారికి లేదని వీరి అభిప్రాయము. అందుచేత వారి యెడల వీరికి గల విరోధము అసూయ వలన ఎక్కువయినదని కొందరు తలచిరి గాని అది వాస్తవము కాదని నా అభిప్రాయము. ఆ కాలములో పండితులలో కిక్షయలెక్కువగా ఉండేవి. ప్రాచీనాంధ్రములో రచన సాగించినప్పుడు ఈనాడే కాదు, ఆనాడును అందరును కొలదిగానో ఎక్కువగానో తాము ప్రమాణముగా ఎన్ను కొన్న వ్యాకరణ సూత్రములకు విరుద్ధములయిన ప్రయోగములు చేసినవారే అయినా తమ తప్పులు తాము గుర్తింపక ఎదిరి కావ్యములందలి తప్పులను చూపి నిందించుటలో గొప్పవారు. ఈ విషయములో వీరేశ లింగముగారు అంతగా చొరవగలవారు కారు. సంఘ సంస్కార విషయములోనే వీరేశలింగముగారు పూర్వాచార పరాయణులతో వాదప్రతివాదములు చేయవలసి వచ్చినది. వీరి సంఘ సంస్కారము — అందును ఎక్కువగా విధవా పునర్వివాహము కాశీభట్ల బ్రహ్మయ్య, కొక్కొండ వేంకటరత్నము, వేదము వేంకటరాయ శాస్త్రి మొదలయిన పండితులకు నచ్చలేదు. వేంకటరాయ శాస్త్రిగారు వీరేశలింగముగారి మతమును ఖండిస్తూ స్త్రీ పునర్వివాహ గ్రంథ మొకటి రచించినారు.

వేంకటరాయశాస్త్రిగారు ప్రధానముగా సంస్కృత పండితులు. ఏ ఒక్క శాస్త్రమందును ప్రామాణికులయిన పండితులు కాకపోయినా అన్నింటను మంచి పాండిత్యము గలవారు, సాహిత్యమందు దొడ్డ పండితులు. అలంకార గ్రంథములు సంస్కృతములోను తెలుగులోను గొప్ప కృషిచేసి ఆంధ్ర సాహిత్య దర్పణము ఉదాహరణ శ్లోక ములతో రచించినారు. కథాసరిత్సాగరము వీరి ఆంధ్ర వచన రచనలలో ఎక్కువ ప్రఖ్యాతి పొందినది. శ్రీనాథుని శృంగార నైషధ కావ్యమునకు సమగ్రమైన వ్యాఖ్య, కృష్ణదేవరాయల ఆముక్త మాల్యదకు సంజీవనీ వ్యాఖ్య వ్రాసి వీరు తమ పాండిత్య సంపదను వెల్లడించినారు. ప్రాచీనాంధ్ర కావ్యములు సవరించి ముద్రింపించినారు. కాని తమ అసంపూర్ణ ప్రాచీనాంధ్ర కావ్యభాషా పాండిత్యమును బట్టి మహాకవుల ప్రబంధములందుగల ప్రయోగము లలో తమకు తప్పుగా తోచినవి దిద్ది ప్రకటించుటవలన ఆ కవులకును భాషా చరిత్ర తెలిసికొనగోరు వారికిని_ సదుద్దేశముతోనే కావచ్చు, అపకారముచేసిన వారయినారు.

గిడుగు సీతాపతి

నాటకములందు వందల కొలదిగా పద్యములు రచించిన వారే కాని పాండిత్యములో తెచ్చుకొన్న పేరు వీరుకవిత్వమందు తెచ్చుకొనలేదు. అందుచేతనే వీరు తెలుగు కావ్యమేదీ స్వతంత్రించి రచించలేదు.

నాటకములు రచించుటలోను ఆడించుటలోను వీరికిమంచి చతురతగలదు. అభిజ్ఞానశాకుంతలము, విక్రమోర్వశీయము, రత్నావళి, నాగానందము, మొదలయిన సంస్కృత నాటకములను వీరు రచించినారు. మూలమందలి భావమును యధాతధముగా తమ అనువాదములందు విశదీకరించుటలో వీరు అగ్రగణ్యులేకాని వీరి పద్యములలో రమ్యత తక్కువ. అభిజ్ఞాన శాకుంతలానువాదములు ఇరువదికిపైగా ఉన్నవి. అన్నిటిలోను వీరేశలింగముగారి అనువాదమే శ్రేష్ఠమయినదని విజ్ఞుల అభిప్రాయము. వీరి స్వతంత్రనాటకములు— ఉష, బొబ్బిలియుద్ధము, ప్రతాపరుద్రీయము — సంప్రదాయ సిద్ధమయిన నాటకలక్షణమును అనుసరించి రచితములయినవి. అన్నిటిలోను వీరి ప్రతాపరుద్రీయము శ్రేష్ఠమయినదని నాటక కళాభిజ్ఞుల అభిప్రాయము.

## కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి
1853—1897

వీరు వావిలాల వాసుదేవ శాస్త్రిగారి మేనత్త పుత్రులు; ఆ శాస్త్రిగారి పినతండ్రిగారికి అల్లుడును అయినవారు. వీరి పూర్వులు తెలంగాణా మధిర తాలూకాలోని విప్పలమడక అగ్రహారములో నుండిరిగాని, వీరి తండ్రి గోపాలకృష్ణ శాస్త్రిగారు గుంటూరుజిల్లాలోని రేపల్లె తాలూకాలో స్థిరనివాసులయి వాసుదేవశాస్త్రిగారి కుటుంబమునకు సన్నిహితులయినారు. అందువలననే వాసుదేవ శాస్త్రిగారి ప్రాభవము సుబ్రహ్మణ్య శాస్త్రిగారిమీద ఎక్కువగా కనబడుతున్నది; పరిచయము చనువుకూడ ఎక్కువగుటవలననే సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'వావిలాల వాసుదేవశాస్త్రి' గారిని చూచి బావగారు ఆటవెలది చరణములందు చక్కగా చిక్కినారని పరియాచకము లాడుచుండిరట!

సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మెట్రిక్యులేషన్ వరకు మాత్రమే చదివి 1884 వరకును గుంటూరు మిషను స్కూలులోను ఆ తర్వాత 1889 వరకును అక్కడి ప్రభుత్వమువారి హైస్కూలులోను తెలుగు పండితులుగా పనిచేసి ఆ పిమ్మట చెన్నపురిలోని పచ్చయ్యప్ప కళాశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా ఉద్యోగం చేసినారు.

వీరు గుంటూరు మిషన్‌స్కూలులో పండితులుగా పనిచేయుచుండినప్పుడే కొండా వేంకటప్పయ్యగారు విద్యార్థులుగా నుండిరి. ఈ శాస్త్రిగారికి నాటకములు రచించుటలోను ఆడించుటలోను ఆసక్తి ఎక్కువగా ఉండేది.

1881 లో ధార్వాడ నాటక సమాజమువారు నాటక ప్రదర్శన సంచారముచేస్తూ గుంటూరులో కూడా నాటకాలాడుట జరిగినది. ఇది ఈ శాస్త్రిగారి నాటక రచనకు ప్రోత్సాహము కలిగించినది. అనతికాలములోనే వీరు గుంటూరులో ఒక నాటక సమాజమును నెలకొల్పి ఆ సమాజమువారు ప్రదర్శించుటకై స్వతంత్ర నాటకములను రచించుటకు మొదలుపెట్టి కొలది సంవత్సరములలో మొత్తము 31 నాటకములను రచించినారు. ఇవి అన్నీ వచన నాటకములే. చిలకమర్తి వారున్ను, కొండా వెంకటప్పయ్య గారున్ను తాము వ్రాసికొన్న స్వీయచరిత్రలను బట్టి ఈ శాస్త్రిగారి నాటకరచనలను గురించిన్ని నాటకములాడించుటలో వీరికి గల చాతుర్యము గురించిన్ని అనేక విషయములు తెలియగలవు.

రాజమహేంద్రవరమున వీరేశలింగము పంతులుగారు 1881 లో స్థాపించిన నాటక సమాజము మొదటిది. గుంటూరులోనిది రెండవది (1882); బందరులోనిది (1883) మూడవది. ఆ కాలమందే విశాఖపట్టణమందున్ను విజయనగరములోను నాటక సమాజములు నెలకొల్పబడినవి కాని సరిగా ఎప్పుడు ప్రారంభించినవో తెలియదు.

విజయ నగరమందు 1874 లోనే అనగా విజయరామ గజపతి మహారాజుగారి కాలమందే జగన్నాధ విలాససభ

అను పేర నొక నాటక సమాజము నెలకొల్పబడినది: ఆ మహారాజుగారి పుత్రులును విద్వత్తుకు విద్యాపోషణకు ప్రసిద్ధికెక్కిన ఆనంద గజపతి మహారాజుగారి కాలమందు ఎక్కువగా వృద్ధిపొందినది. వాస్తవముగా అక్కడి నాటక సమాజమే ఆంధ్రదేశమందు మొదటిది కావలెను. కాని, ఆ సమాజమువారు సంస్కృత నాటకములే ఆడుతూ ఉండుట వలన అది తెలుగు నాటక సమాజముల గణన లోనికి రాలేదు.

ఈ శాస్త్రిగారు 31 నాటకములు రచించినా అవి అక్కడి సమాజమువారే కాని తక్కిన సమాజముల వారాడరాదన్న నియమ ముండుటవలన అవి ముద్రితములు కాలేదు. ఆ పిమ్మట అవి అంతరించినవి. నేటికొక ప్రతియైనను దక్కలేదు. కాని, ఆ నాటకముల ప్రాభవము — అందును ముఖ్యముగా గయోపాఖ్యాన నాటక ప్రాభవము చిలకమర్తి వారి రచనలందు కనబడుతున్నది.

ఈ శాస్త్రిగారు చెన్నపురి వచ్చిన తర్వాత అక్కడివారి అభిరుచుల ననుసరించి కేవల వచన రచనగల నాటకములు గాక గద్య పద్యాత్మక నాటకములను రచించుటకు పూను కొని ద్రౌపదీ వస్త్రాపహరణమను నాటకము మరల ఈ నూతన మార్గమున 1896 లో రచించినారు.

## వడ్డాది సుబ్బారాయడు

### 1854–1938

వీరేశలింగముగారి సమకాలికులలో రాజమహేంద్ర వరమున ప్రఖ్యాతి చెందినవారు వడ్డాది సుబ్బారాయడు గారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు, చిలకమర్తి లక్ష్మీ నరసింహముగారు. వీరి తర్వాత పేర్కొనదగినవారు మధుర కవి నాళము కృష్ణారావుగారు.

వడ్డాదివారు సంస్కృతాంధ్రములందు మంచి పాండిత్య ముగలవారు. సంస్కృత గ్రంథములలో కాళిదాస విరచి తములయిన మేఘసందేశము, అభిజ్ఞాన శాకుంతలము, విక్రమోర్వశీయము; నారాయణభట్టు విరచితమయిన వేణీసంహారము, కృష్ణమిశ్ర విరచితమయిన ప్రబోధ చంద్రోదయము; జగన్నాథ పండితరాయల భామినీ విలా సము వీరు ఆంధ్రీకరించినారు. వీటిలో వేణీసంహార నాటకము నేటికిని ప్రదర్శన యోగ్యముగా నున్నది.

వీరి స్వతంత్ర రచనలలో చెప్పుకోదగినది "భక్త చింతామణి'' అనే శతకము. నేటికిని ఇందలి పద్యములు కంఠస్థముచేసి చదివేవారు చాలామంది గలరు. పత్నీ వియోగము గలిగినప్పుడును, పుత్రుడు అకాల మరణము పొందినప్పుడును నిండు దుఃఖముతో వీరు చెప్పిన ఖండ కావ్యములు చదివినవారికి కన్నులు బాష్పపూరితములగును. వీరి సూక్తి వసుప్రకాశిక యువకులకు నీతిదాయకము.

## పుచ్చా వేంకటకవి

### 1856–1903

వీరు గంజాం జిల్లావారు. వీరి రచనలలో శుద్ధాంధ్ర నిర్వచననిరోష్ఠ్య కుశలవ చరిత్ర ఆకాలమందలి కవి పండితుల ప్రశంస నందుకొన్నది. వీరేశలింగముగారి మెప్పును బొందినది. ఇదిగాక యక్షగానముగా సుభద్రా పరిణయమును, శతకములనుకూడ వీరు రచించినారు.

## కల్లూరి వేంకటరామశాస్త్రి

### 1857–1928

వీరు సంస్కృతాంధ్రములందు గొప్ప పండితులు; కవులు. చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణమునకు వ్యాఖ్యగా గుప్తార్థ ప్రకాశిక రచించినారు. కాళిదాసు మేఘ దూతకు ఆంధ్రానువాదములు ఎన్నియోకలవు. అన్నిటి లోను ఈ శాస్త్రిగారి అనువాదమే శ్రేష్ఠమయినదని చాలా మంది పండితుల అభిప్రాయము.

## తాడూరి లక్ష్మీనరసింహ కవి

### 1856–1936

వీరి రచనలు ఎక్కువగా 1912 తర్వాతనే సాగినా వీరేశలింగముగారితో వీరికి పరిచయము కలదు గనుకను

రాజమహేంద్రవరములో నుండినవారే కనుకను వీరిని కూడా వారి సమకాలీనులుగా పేర్కొనవచ్చును.

వీరు సంస్కృతాంధ్రములందు పాండిత్యమలవరచుకొన్నారు. సంస్కృత గ్రంథములలో చంద్రాలోకము, రసమంజరి, భగవద్గీత, మేఘసందేశమందలి పూర్వ భాగము ఆంధ్రీకరించినారు.

## వావిలకొలను సుబ్బారావు

1863–1936

మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో కొక్కొండ వేంకటరత్నముగారు, వీరేశలింగముగార్ల తర్వాత తెలుగు పండితులుగా విద్యార్థుల అభిమానమును పొందిన పండితులని ప్రఖ్యాతి బడిసినవారు వావిలకొలను సుబ్బారావుగారు. వీరి జీవితము ఆదర్శ ప్రాయమయినదనిన్ని, వీరి హృదయము నవనీత సమానమనిన్ని, వీరి దైవభక్తి అమోఘమయినదనిన్ని వీరిని ఎరిగినవారు ఎక్కువగా శ్లాఘిస్తూ ఉంటారు. వీరి రచనలలో కుమారాభ్యుదయం వీరి కవిత్వ సంపదకు మొదటి తార్కాణముగా వెలసినది. వీరి రామాయణ మహాకావ్యము వీరు మహాకవులని తెలియజేసినది. దానివల్లనే వీరు ఆంధ్రవాల్మీకులుగా పేరుపడినారు. వీరి నాటికి అనేకముగా వాల్మీకి రామాయణమునకు అనువాదములు ప్రకటితములయినా అవి యథామూలకములుగావు; స్వేచ్ఛానువాదములు; కాని వీరిది పూర్తిగా యథా మూలకము; అయినను శైలి కుంటువడలేదు. కాని, వీరు ప్రమాణముగా గ్రహించిన వ్యాకరణ సూత్రములకు విరుద్ధమైన ప్రయోగములు, అసంగతములయిన ప్రాచీనాంధ్రపదముల ప్రయోగములు అక్కడక్కడ గలవు. మొత్తముమీద వీరి గ్రంథము మెచ్చుకోదగినది. వీరికి పోతనగారి భాగవతశైలి ఆదర్శప్రాయము. దాని శైలిని అనుకరించుటకు వీరు ప్రయత్నించినారు; కొంతవరకు కృతకృత్యులయినారని నా అభిప్రాయము.

పెద్దలకేకాక పిల్లలకుకూడ పనికివచ్చు నను ఉద్దేశముతో సులభశైలిలో నీతి కథలను రచించినారు. విద్యార్థులకోసము సులభ వ్యాకరణముకూడా రచించినారు.

వీరు శాంతిప్రియులు, అజాత శత్రువులు. కనుక పండితుల వాద ప్రతివాదములకు దిగలేదు, వాదగ్రస్తమైన విషయమునుగూర్చి వ్రాయవలసిన అవసరము రాకపోలేదు. పోతన ఎక్కడివాడు? అనేవిషయమునుగూర్చి తగాదా వచ్చినది. కడపజిల్లాలోని ఒంటిమెట్టనివాసియని పోతననుగూర్చి వీరును, జనమంచి శేషాద్రిశర్మగారును ఇంకాకడపజిల్లా పండితులున్ను వాదిస్తూ ఉండేవారు. వీరేశలింగముగారు, జయంతి రామయ్య పంతులుగారు మొదలయినవారు అందుకు విరుద్ధముగా పోతన ఏక శిలానగర అనగా ఓరుగల్లు, వరంగలు నివాసియని ఋజువుచేసిరి. ఆ వాదములో పాల్గొన్నవారే అయినా తక్కిన కొందరివలె వీరు వ్యక్తిదూషణ ఎన్నడును చేసియుండలేదు.

## ఆదిపూడి సోమనాథరావు

వీరు సంస్కృతము, తెలుగు, తమిళ్, హిందీ భాషలలో కొంత పాండిత్య మలవరచుకొన్న కవులు. ఆర్యమతమును స్వీకరించినవారే అయినా వీరేశలింగముగారి సంఘ సంస్కారకృషిలో పాల్గొన్నవారు. సంస్కృత భాషలోనున్న బాలరామాయణము, భగవద్గీత, రఘువంశము కుమార సంభవము, మేఘసందేశము తెలిగించినారు. తమిళములోగల కంబరామాయణముకూడా తెలిగించినారు. రవీంద్రనాథటాగూరుగారికి నోబెల్ బహుమానము వచ్చినదని తెలిసినవెంటనే వారి గీతాంజలి తెలిగించినారు.

వీరు శ్రావ్యముగా పాడుచుండేవారు. నౌకాయానమను హరికథ రచించి సభలలో చెప్తూ ఉండేవారు.

## కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి

1863_1940

వీరు సంస్కృతాంధ్రములందు గొప్పపాండిత్యము గలవారు. సనాతన ధర్మాభిమానులు ; కనుక వీరేశలింగము గారి సంఘ సంస్కారము వీరికి అనిష్టమయినది. ఈ విష యములోగల ద్వేషము సాహిత్య విషయములోకూడ వ్యాపించినది. అందుచేత వీరేశలింగముగారి రచనలలోను సంఘసంస్కారములోనుగల లోపాలను ఎత్తిచూపిస్తూ అదేపనిగా వ్యాసములు విమర్శలువ్రాస్తూ ప్రకటించేవారు.

వీరేశలింగముగారు రాజశేఖరచరిత్ర అను నామాంత రముగల వివేక చంద్రికయను నవలను రచించి అది తమ స్వతంత్ర రచనగా ప్రకటించినారు. దానిపైని ఈ శాస్త్రిగారు ఒక పెద్ద విమర్శన గ్రంథమువ్రాసి 1896 లో ప్రకటించినారు. అది స్వతంత్ర గ్రంథముకాదనిన్ని ఆంగ్ల భాషలో గోల్డ్‌స్మిత్ రచించిన వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్ అనే నవలపై ఆధారపడిన రచన అనిన్ని, వీరేశలింగముగారు అది తమ స్వతంత్ర నవలగా చదువరులకు తోచునట్లు పాత్రలపేర్లు తెలుగువారిపేర్లుగాను దృశ్యస్థలములపేర్లు తెలుగుఊళ్ళ పేర్లుగాను మార్చినారేకాని కథ మూలమును అనుసరించియే ఉన్నదనిన్ని విమర్శించి – ఈ శాస్త్రిగారు వీరేశలింగముగారి యెడల తమకుగల అక్కసు బయలు పెట్టుకొన్నారు. కాని వాస్తవమైన విషయమేమంటే, వీరేశలింగముగారు ఆ యాంగ్లనవలను చదివి దానివంటిదే తెలుగువారి ఆచార వ్యవహారములను తెలియజేస్తూ కథా విశేషములు అనేకముగా మార్చి తమ నవలను రచించి నారు. ఆ కాలములో ఇట్టి రచన నూతనమగుటచేతను ఎక్కువగా వ్యాప్తిచెందినది. తెలుగు తెలిసిన ఆంగ్లేయు లకు కూడ దీనియెడల ఆసక్తి ఎక్కువయినది. రాబర్ట్ హచిన్సన్ అనే ఆంగ్లేయ రచయిత దీనిని ఆంగ్లభాష లోనికి అనువదించి దీనికి "ఫార్చ్యూన్స్ వ్హీల్'' అని పేరుపెట్టినాడు. అది 1887లో లండన్ నగరమందు ప్రకటితమయినది. శాస్త్రిగారి విమర్శ మరి తొమ్మిదేండ్లు గడచిన తర్వాత రచించి ప్రకటించినదే అయినా ఈ విష యము తెలియకనో తెలిసిన్నీ ఏదో రహస్యము బయట పెట్టి వీరేశలింగముగారి కీర్తికి మచ్చతెచ్చి పెట్టవలెనన్న పట్టుదలతోనో రచించియుండిరి.

## ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ

1864_1933

వీరు ఆంగ్లాంధ్ర సంస్కృత ప్రాకృత భాషలలో పాండిత్యముగలవారు. గట్టి విమర్శకులు. వీరి రచనలు కొలదిమాత్రమే ప్రకటితములగుటకు వీరి విమర్శన దృష్టియేకారణము, తాము వ్రాసినది తమకేతృప్తికలిగించ నందున వీరు తమ రచనలను ప్రకటించేవారు కారు. వాస్తవముగా వారువ్రాసి ప్రకటించకపోయినవి మేలయి నవే. వారితో సంభాషించినవారికి వారి పాండిత్యము, వారి విమర్శనశక్తి, వారి విశాలదృష్టి, వారి సంస్కృతి, వారిఉపలబ్ధి ఎంత ఉన్నతములయినవో బోధపడుతూ ఉండేవి. వీరు తమ సంపాదకత్వమున కల్పలతయను నొక మాసపత్రికను కొన్ని సంవత్సరములు నడపినారు. అందులో తమవ్యాసములు ప్రకటిస్తూ ఉండేవారు. అందులో విశిష్టమైన విషయమేమంటే ఏబదిమొదలు నూరువరకును సాహిత్య విషయములగూర్చి ప్రశ్నలిచ్చే వారు. వారికి సమాధానములిచ్చిన వారిలో ఎక్కువ గుణములు (మార్కులు) వచ్చినవారికి మొదటి బహు మానము, తర్వాతివారికి రెండవ బహుమానము అని నూటపదహారు రూపాయలిస్తూ ఉండేవారు. ఈ బహు మతులు తరుచుగా నడకుదుటి వీరరాజు, బాలాంత్రపు వేంకటరావు, ఓలేటి పార్వతీశముగార్లకు వస్తూండేవి.

వీరు కొన్ని ఖండకావ్యాలు 1900_1905 లో రచించి నారు. వాటిలో "చందమామ'' అన్నది పోలవరం

గిడుగు సీతాపతి

జమీందారు కృష్ణారావుగారు ప్రకటిస్తూ ఉండిన సరస్వతీ పత్రికలో ముద్రితమయినది; కడు మనోహరమైన రచన.

వీరి రహస్యదర్పణము వృక్షశాస్త్రమునకు సంబంధించినది. శాస్త్రగ్రంథమయినా సాహిత్యధర్మము గలది. భవభూతి ఉత్తరరామచరిత్ర యథానుమూలముగా వచనములో వీరు రచించినారు; ఇది వచన రచనకు ఆదర్శప్రాయమయినది.

## పానుగంటి లక్ష్మీనరసింహారావు

1865—1940

వీరు రాజమహేంద్రవరములోని కళాశాలలో చదువుకొన్నప్పుడు వావిలాల వాసుదేవశాస్త్రిగారికిని వీరేశలింగముగారికిని శిష్యులయియుండిరి. సంఘసంస్కార కృషిలో వీరు వీరేశలింగముగారి విధానమునకు సమ్మతించలేదు. సంఘములో కొన్ని దురాచారము లున్నవన్న మాట నిజమేకాని అవి నివారించుటకు హితబోధ కావలెనేకాని సనాతన ధర్మమునకు విరుద్ధముగా ఆచరించరాదని వీరి అభిప్రాయము. బ్రహ్మసమాజమును వీరామోదించలేదు. కాని వీరేశలింగముగారిని గాని వారి మతమునుగాని సభలలోగాని వ్రాతలలోగాని ఖండించలేదు.

వీరు నాటకరచయితలుగాను సాక్షివంటి హాస్యరస ప్రధానమైన వచన రచయితలుగాను ప్రఖ్యాతి పొందిన వారు. నాటకములు ప్రదర్శించునప్పుడు పద్యములు రాగవరుసనుపాడుట వీరికి ఇష్టముకాకుండెను. అందుచేత తమ నాటకములందలి పద్యములను బ్లాక్ వెర్సు మాదిరిగా రచించవలెనన్న ఉద్దేశ్యముతో యతిప్రాసలు విడిచిపెట్టుటకు మారుగా నడక చెడగొట్టి రచిస్తూఉండేవారు.

## చిలకమర్తి లక్ష్మీనరసింహము

1867—1945

వీరు బాల్యములో పూర్వసంప్రదాయాను సారముగా సంస్కృతాంధ్రములు చదువుకొని ఆధునికాంగ్లేయ విద్య నభ్యసించినవారు. వీరికి మేనమామలును, సంస్కృతాంధ్ర పండితులును శుక్రనీతిసారమును అనువదించిన వారును అయిన పురాణపండా మల్లయ్యశాస్త్రిగారు గురువులు. ఆంగ్లవిద్యను ఉన్నత తరగతిలోను కళాశాలలోను అభ్యసించినప్పుడు వావిలాల వాసుదేవశాస్త్రిగారు గురువులు. యౌవనములోనే అంధులగుట వలన వీరికి పెద్ద చదువుల భాగ్యము లభ్యము కాలేదు. కాని తెలుగు రచయితగా ఎక్కువ ప్రసిద్ధి పొందగలిగిరి. వీరేశలింగముగారికి అనుచరులును సహచరులునై సంఘసంస్కార విషయములో చేదోడు వాదోడుగా వీరు పనిచేస్తూ ఉండేవారు.

వీరు సాహిత్యరంగములో బహుగ్రంథ రచయితలు; పెక్కు కథలు, నవలలు, నాటకాలు, వ్యాసములు రచించినారు. నవలల పోటీలలో బహుమతులు పొందిన వారు. సంస్కృత భాషలోగల భాసుని నాటకములు కొన్ని తెలిగించినారు. ఆంగ్లభాషలో టాడ్ రచించిన రాజస్థాన కథావళి తెలిగించినారు. వీరి స్వతంత్ర నాటకములలో నరకాసుర విజయము, గయోపాఖ్యానము ఎక్కువగా వ్యాప్తిచెందినవి. నేటికిని ఈ నాటకములను పెక్కుచోట్ల ప్రదర్శిస్తున్నారు.

వీరు గొప్ప వక్తలు; వీరి ఉపన్యాసములు సెలయేఱువలె వడివడిగాను గంభీరముగాను ప్రవహిస్తూ ఉండేవి. వీరి సంభాషణలు కూడా మనోహరములుగా ఉండేవి. 1907 లో బిపిన్‌చంద్రపాలు రాజమహేంద్రవరములో టౌనుహాలు ఆవరణలో ఒక గంటసేపు ఆంగ్లభాషలో ఉపన్యసించిన తర్వాత ఆంగ్లము తెలియని తెలుగు సభ్యుల కోరిక ననుసరించి వీరు ఆ యాంగ్లభాషలోని ఉపన్యాసమంతా — ముఖ్యమైన విషయములలో ఒక్కటయినను విడిచిపెట్టకుండా తెలుగున చెప్పి సభవారి మెప్పును పొందిరి. ఆ సమయమందే తమ ఉపన్యాసము చివరను "భరతఖండంబు చక్కని పాడియావు, హిందువులు లేగదూడలై యేడ్చుచుండ, తెల్లవారను

గడసరి గొల్లవాండ్రు, పితుకుచున్నారు మూతులు బిగియ గట్టి" అనే పద్యము ఆశువుగా చెప్పి సభ్యులను రంజింప జేసినారు. వీరి ధారణశక్తి అత్యద్భుతమైనది. కన్నులు కానరాకపోయినందుకు పరిహారముగా వీరికి భగవంతుడు శ్రవణశక్తి ఎక్కువగా అనుగ్రహించినాడు. ఒక్కసారి పరిచయము గలిగి విన్న గొంతు కొన్ని సంవత్సరములు గడచిన పిమ్మట మరల వినబడగానే అది ఎవరిదో వీరు పోల్చుకొన గలిగే వారు.

వీరి వచనరచన చాలా సరళమయినది; తెలుగు నుడికారముతో నిండుగా నుండును. పద్యరచన కడు హృద్యమైనది. వీరి కథలు హాస్యరస ప్రధానమైనవి. వందల కొలది పద్యములు రచించినను స్వతంత్రభావనాశక్తి ఉన్నతమయినది కాకపోవుటవలన వీరిని గొప్ప కవులుగా పేర్కొనలేము గాని వచన రచయితగాను నాటక కర్తగాను వీరికి సాహిత్య చరిత్రలో ఉన్నతస్థానము కలదని చెప్ప గలము.

## చెన్నాప్రగడ భానుమూర్తి

### 1868–1945

వీరు ఆంగ్లసంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యము గలవారు. రాజమహేంద్రవరములో స్థిరనివాసమేర్పరచు కొన్నవారే కాని గవర్నమెంటు ట్రాన్స్‌లేటరుగా ఉద్యోగము చేసినంత కాలము మద్రాసులో ఉండేవారు. ఎక్కడ ఉండినా వీరు వీరేశలింగముగారికి మిత్రులు. వీరేశలింగముగారి సంఘ సంస్కార కృషిలో పాల్గొన్న వారు. భాషాసంస్కార విషయములో కూడా ముందడుగు వేయదలచిన వారు గనుకనే గిడుగు రామమూర్తిగారి వ్యావహారిక భాషావాదమును ఆమోదించిరి. నూతన పాశ్చాత్యశాస్త్ర విషయములు తెలుగులో వ్రాయవలసిన దనిన్ని అందుకు కావలసిన పదజాలము తెలుగులో లేనప్పుడు ఆంగ్లపదములను ధారాళముగా వాడుకోవచ్చు ననిన్ని వీరి ఆశయము. చరిత్ర రచన తెలుగులో ఉన్నత సాహిత్యరీతిని జరుగవలసియున్నదని బోధిస్తూ ఉండేవారు.

## రాయసం వేంకటశివుడు

### 1870–1952

వీరు వీరేశలింగముగారికి ఏకలవ్య శిష్యులు; వారి ప్రాభవము వీరిపై సంఘసంస్కార విషయములోను స్త్రీవిద్యాభివృద్ధి విషయములోను, సాహిత్యరచనా విషయంలోను ఎక్కువగానుండెను. వీరు చాలాకాలము జనానా పత్రికను తమ సంపాదకత్వమున నడపి యువతీ యువకుల రచనలను ప్రకటిస్తూ ఉండేవారు. వీరు కవులు కారుగాని వచన రచయితగా పేరుపొందినవారు. ఆదర్శ ప్రాయమయిన నడవడిగలవారు. శాంతిప్రియులు. వీరి జీవితమందలి కడపటి సంవత్సరములలో వీరు స్వీయ చరిత్ర రచించి ప్రకటించినారు.

## కొటికలపూడి సీతమ్మ

### 1872–1934

వీరు వీరేశలింగముగారికి శిష్యురాలుగాను, స్త్రీ విద్యాభివృద్ధి విషయములో చేదోడు వాదోడుగాను కృషిచేసినారు. వీరి రచనలలో చెప్పుకోదగినవి రెండు పద్యకావ్యములు—సాధురక్షణ శతకము, వీరేశలింగముగారి జీవితచరిత్ర. రెండవది వీరేశలింగముగారి శైలిని అనుకరించి నట్లుండును.

గురుజాడ అప్పారావుగారున్ను, గిడుగు రామమూర్తి గారున్ను వీరేశలింగముగారి సమాకాలీనులే అయినా ఇప్పుడు అప్పారావుగారి సంచిక ప్రకటితమయినది గనుకను అందులో వీరిచరిత్ర విషయములు ప్రకటితములయినవి గనుకను, వచ్చేసంవత్సరము రామమూర్తిగారి శతవార్షికోత్సవము జరుగునప్పుడు వారినిగూర్చి ఎక్కువగా వ్రాయునవకాశము గలదు గనుకను వారిద్దరిని గూర్చి ఇక్కడ వ్రాయలేదు.



గిడుగు సీతాపతి

# స్త్రీ జనోద్ధరణ

## శ్రీమతి అద్దేపల్లి వివేకానందదేవి

వీరేశలింగం పంతులుగారు, స్త్రీ జన కల్పవల్లి, అనాధ స్త్రీలపాలిటి పెన్నిధి, యుగపురుషుడు, అభినవ ఆంధ్ర వాఙ్మయస్రష్ట. ఇన్ని బిరుదులపొందిన యీ మహాత్ముడు, ఆంధ్రజనని నోములపంట. ఆనాటి మత, ఆధ్యాత్మిక, రాజకీయ భావముల చైతన్యమే పంతులుగారిగా పుంజీభూతమైనది.

దేశవ్యాప్తమైన అజ్ఞానము, దురాచారములు, మూఢ సమ్మకములు, అవినీతి, ముఖ్యముగా అనాధస్త్రీల ఆర్తారవము, నేరమెరుగని పసికన్యల హాహాకారముల మాన్పు పరాక్రమముగాని, ప్రజ్ఞగాని కలిగినవారు విజ్ఞులయం దుదయించలేదు. ఆంధ్ర జాతిని అట్టుడికించుచున్న యీ అనాచారములను, క్రూరత్వమును బాపువాడొక్క కరుణామయుడైన సర్వేశ్వరుడేయన్న మూగభావము, సామాన్యుల హృదయముల కేవల మొక ఆశాభావము, మిణుగురువలె మెరిసిపోవుచున్న కాలమది. ఈ మూకబాధకు ఫలమా అన్నట్లు సంస్కార పరాయణులైన కందుకూరి వారింట వీరేశలింగం పంతులు 1848 ఏప్రియల్ నెల 16వ తేదీన కలమను వీరఖడ్గమును చేబూని, అన్యాయములను, అక్రమములను, అజ్ఞానమును చీల్చి చెండాడుటకై జన్మించినాడు.

వీరేశలింగంగారి పితామహులగు, వీరేశలింగం తన సంస్కార పరాయణత్వమును, లింగధారణ తీసివేయుటతో రుజువు చేసుకున్నారు. వారి మనుమడు, వారి దారినే పురోగమించి, ప్రగతిమార్గమున తాను నడుచుటయేగాక అశేష ఆంధ్ర ప్రజానీకాన్ని, తరతరాలకు సరిపడునట్టుగా, నడిపించి ధన్యులైనారు. పంతులుగారు తమ మాతృదేవినుండి యుగ్గుపాలతో ఉదార స్వభావమును, దయార్ద్రచిత్తమును, స్వతంత్రశక్తినీ, ధైర్యశాలిత్వమును, పరోపకారచింతయు, స్థిర ప్రవృత్తియు అలవరచుకున్నామని తమ స్వీయచరిత్రమున సగర్వముగా వ్రాసికొన్నారు.

చిన్ననాటినుండియు వీరేశలింగం పంతులుగారి హృదయంలో అనన్య యీశ్వరభక్తి అమృతధారగా ప్రవహించింది. ఈ భగవద్భక్తియే వారిని సత్యమార్గమున నడిపించింది. ఈశ్వరప్రేమయే వారిని కరుణాంతరంగిత హృదయులుగా గావించి, ఆంధ్ర స్త్రీ జనులపాలిటి గంగా స్రవంతిజేసినది. మానవులంతా భగవంతుని బిడ్డలైనప్పుడు, సోదర, సోదరీమణులుగనే సంఘమున వ్యక్తులు వ్యవహరింపక యెందు కొకరికొకరు యన్యాయము చేయుచున్నారో వారు గ్రహించినారు. అధఃపాతాళమునకు అణచివేయ బడిన స్త్రీ సంఘమును చూచి వారి హృదయ ఫలకము ప్రిధిలి కరుణారసము స్రవించినది. అనాధల ఆర్తారవము వారి హృదయాన్ని కుంగదీసింది.

పంతులుగారిలోని సహజ జిజ్ఞాస రేకెత్తినది. స్త్రీ విద్య వ్యాప్తమైనగాని దేశమునకు ముక్తిరాదని మనసారా నమ్మి, యందులకై యుపన్యాసముల సేయనారంభించినారు. 1874 లో నారంభించిన వివేకవర్ధని యను పత్రిక యందీ విషయముపై రచనలు వెలువడ సాగినవి. పంతులుగారీ సమయమున ధవళేశ్వరమునం దుపాధ్యాయ వృత్తియందుండిరి. వారి వుపన్యాస ఫలితముగా ధవళగిరి వాస్తవ్యులు యుత్సాహముగా విరాళములను పోగుచేసి పంతులుగారిని బాలికా పాఠశాల యేర్పరుపమని కోరిరి. దీనికి శ్రీ మల్లాది అచ్చన్న శాస్త్రిగారు ప్రధానోపాధ్యాయులు. ఈ పాఠశాల యీనాటికినీ, ధవళగిరి పురమున వెలయుచున్నది.

పత్రికా ముఖమున, దేశ సేవయు భాషా సేవయు చేయ వలె ననెడి సంకల్పము కలిగి వివేకవర్ధనిని సృష్టించినారు పంతులుగారు. వారి పారిభాషికమున దేశసేవను నానాముఖముల చేయవచ్చుననియు రాజకీయ చైతన్యమున కన్న యాదిని, సాంఘిక చైతన్యము కలుగవలెననియు, నై యున్నది. ఆనాటి సాంఘిక దురాచారముల నవ హేళనము చేసి వాటిని రూపుమాపుటయే వివేకవర్ధని ఆశయము.

ఆనాటి సంఘమున వేశ్యా ప్రియత్వము మేరమీరినది. రాజమహేంద్రవరమున 'పాఠశాల'యన్న యర్థము వేశ్యా కూటమి యని అర్థముగా యెంచబడెడిది. ప్రముఖులైన కొందరు తమపేరిట శాస్త్రిగారి మేళము, నాయుడుగారి మేళము, పంతులుగారి మేళము లని ప్రసిద్ధము చేసి ధనార్జన చేయుచుండిరి. ఏ యింట శుభకార్యము జరిగినను యీ మేళముల ద్వారా వసూళ్ళు చేయబడెడివి. ఇందు యీ ప్రముఖులకు వేశ్యలు పాలుపంచి యిచ్చెడి వారు. శుద్ధశ్రోత్రియులు గూడ వీరికి భయపడి, నెల వారిగా వారికి మామూళ్ళు 'పాఠశాల'కై యిచ్చుచుండెడివారు. పంతులుగారు యీ దురాచారముపై ధ్వజమెత్తి, పత్రికా ముఖమున వానిని దుయ్యబట్టి యీ పాఠశాలల నామ రూపములు లేకుండ గావించినారు.

వీరి కార్య మింతటితో ఆగిపోలేదు. బాల్య వివాహ ములపై పంతులుగా రిచ్చు వుత్తేజకరమైన వుపన్యాసముల వినుటకై ప్రజలు తీర్థయాత్రకు తరలిపోయినట్లు తండోప తండములుగా వచ్చి కూర్చుని నిశ్శబ్దముగా వారి సిద్ధాంత ములనువిని ఆకర్షింప బడెడివారు. ప్రజల హృదయ ములకు హత్తునట్లుగా, సామాన్య భాషలో, శాస్త్ర విషయ ములను గూడ చెప్పి మెప్పించెడి వారు.

1874 లో పల్లాచంచలరావుగారి కార్యదర్శిత్వము క్రింద మదరాసునందు స్త్రీ పునర్వివాహ సమాజము స్థాపించ బడినది. ఈ విషయమున యన్ని మండలముల యందును ప్రకటింపబడినను. ఆనాటికి పంతులుగా రింకను సుప్ర సిద్ధులు కాకపోవుటచే యీ ప్రకటన వారి కందలేదు. ప్రసంగవశమున పంతులుగారి మిత్రులు చల్లపల్లి బాపయ్య గారు స్త్రీ పునర్వివాహములకు మన మేల తలపెట్టరాదని ప్రశ్నించెను. 'మీ బంధు మిత్రులందరును యేకగ్రీవముగా మిమ్ములను పరిత్యజించినను మీరు మీ పూనిక వదల కుండ, ప్రతిజ్ఞ చేసిన యెడల మన మీ కార్యరంగమున కురుకుద'మని పంతులుగారు నుడివిరి. 'ఈశ్వర ప్రేరిత మును, ఈశ్వర ప్రీతికరమునునైన యొక ధర్మ మిది. యనెడి దృఢ విశ్వాసముతో సాధ్యసాధ్యముల విచారిం పకయే నేనీకార్యమున ప్రవేశించితి'నని పంతులుగారు వ్రాసుకున్నారు.

ఇదే సమయమున విద్యాసాగరుల వారు బంగాళా దేశమున స్త్రీ పునర్వివాహ విషయమున కార్యసాధన చేయుచూ యొక యపూర్వ గ్రంథమును ప్రకటించిరి. కాని దురదృష్టము కొద్ది పంతులుగారికి దీని ప్రతి లభింపక పోయినను మనుస్మృతి, పరాశరస్మృతి యాదిగా గల గ్రంథముల దెప్పించి యీ విషయమును కూలంకషముగా విమర్శించి, తనబుద్ధి బలముతో 1879 ఆగస్టు 3 వ తేదీన విజయనగర మహారాజా వారి బాలికా పాఠశాల యందు అనేకుల ముందు మహోపన్యాసము గావించి, మూఢాచార పరాయణులపై దండయాత్ర జరిపెను.

సభకు వేలాదిజనము హాజరైనారు. మరునాటికి వూరంతయు అట్టుడికిన ట్టుడికి పోయినది. వాదోప వాదములు చెలరేగినవి. మహాపండిత ప్రకాండులు సయితము పంతులుగారిపై కక్షబూనిరి. ఇందుమీద రెండవ యుపన్యాసము అదే బాలికా పాఠశాల యందు అక్టోబరు 12 వ తేదీన చేయవలసి వచ్చినది.

ఏ విధముననైనను వాదమున పంతులుగారిని జయించ వలెననియును, వీలైన మర్దించవలెననియు సంకల్పించి కాకినాడ యందలి పూర్వాచార పరాయణులు కొందరు

పంతులుగారిని వుపన్యాసమునకై యాహ్వానించి, పరాజితులైనారు.

ఉపన్యాసముల పిదప కార్యరంగమున కురక నుద్దేశించి పంతులుగారు తమ మిత్రులను సలహా చేయగా వారందరును దీని కెంతో యుత్సాహమున సమ్మతించుటయే గాక, యట్టి వివాహ విందునకు తాము వచ్చుట కంగీకరించిరి. పైడా రామకృష్ణయ్యగారు నిండైన హృదయముతో, యీ వివాహముల ఖర్చుల నిమిత్తమై ముప్పది వేల రూప్యముల నిచ్చుటకు ప్రతిన జేసిరి.

ఇది యదునుగా గొని, విరూపాక్ష పీఠస్థులైన శంకరాచార్యుల వారిని యూరిలోని చాంధసు లందరును రావించి పంతులుగారిపై వాగ్యుద్ధమునకు పురిగొల్ప బూనిరి. స్వాముల వారును, శిష్య బృందమును చేయు యకృత్యములను వివేకవర్ధని యందు ప్రకటించి పంతులుగారు ప్రజల కనువిప్పు జేసిరి. 1881వ సంవత్సరముననే, పీఠికాపురాధిపతివారి సత్రమున బాలికా పాఠశాల నొక దానిని పంతులుగారు యేర్పాటు జేసినారు. పూర్వాచార పరాయణుల నపహాసము చేయగోరి వ్యవహార ధర్మబోధిని యను నాటకమును సయితము విజయనగర మహారాజా వారి బాలికా పాఠశాల యందు ప్రదర్శించినారు పంతులుగారు. ఈ విధమున, యెన్నో ప్రక్రియల ద్వారా సంఘమున చైతన్యము కలిగించి మొదటి వితంతూద్వాహమును 1881 డిసెంబరు 11 వ తేదీన జరుపుటకు సన్నాహములు కానించబడినవి. ఉత్సాహవంతులైన పురుషులును, విద్యాధికులైన యువకులును, యీ వివాహముల తాము వరులుగా నుండ గోరిరి. అనేక కన్యల నిరాశా హృదయములలో యాశా జ్యోతి వెలిగినది. లెక్కలేని అనాథల కోరికలు చిగిరించినవి. పెక్కు తలిదండ్రుల హృదయ భారము తీరినది, పుర్వాచార పరాయణులమని విర్ర వీగు యసమర్థులు చేరి యీ శుభకార్యముల నే విధముననైన ధ్వంసము చేయబూనుకొన్నారు. మంగళ్ళను, వాద్యకాండ్రను రాకుండా నరికట్ట ప్రయత్నించినారు. అలాగుననే వంట బ్రాహ్మలను అడ్డుకొట్టినారు. కాని వీరందరికిని సంవత్సర బత్యముల నేర్పాటుచేసి, ధనము నెరజూపికార్య సాధన గావించినారు. పంతులుగారు ఇట్టి వివాహములకు కన్యలను కడుంగడు రహస్యముగా దీసుకొని రావలసియుండుటేగాక, వరులుకూడా కడకంటను ధైర్యముగా నిలబడునట్లు జూచుకొనవలసివచ్చెడిది.

ఒకానొక సందర్భమున, బాలిక తల్లియే వచ్చి తన బిడ్డకు పెండ్లి చేయమని పంతులుగారికి యొప్పజెప్పి పోయినది. కాని వివాహ సమయమున బిడ్డ తండ్రి యభియోగము జేయకుండ కాపాడుకొనవలసివచ్చినది పంతులుగారికి.

వితంతుద్వాహములు జేసుకొన్న వారికి ఆర్థిక సాంఘిక సహాయముకూడ పంతులుగారే చేయుచుండెడివారు. రక్షక భటుల సహాయమున, మొదటి రెండు వివాహములను విజయవంతముగా చేసిరి. ఊరిలోని ప్రభుత్వోద్యోగులు, విద్యార్థులు పంతులుగారి కృషికి యండదండగా నిలచిరి.

ఈ యుద్యమ మీవిధముగా విజయపతాక నెగుర వేయుటచే, పంతులుగారిని మదరాసునందున్న మిత్రులును, బందరునందున్న మిత్రులును రావలసినదిగా కోరిరి. మిత్రుల ప్రోత్సాహ మీవిధమున నుండగా, పంతులుగారి పితామహి, మనుమనిపై కోపగించి యిల్లు వెడలిపోయినది. అయినను యీ మహాత్ముడు చెక్కుచెదరలేదు. బంధువు లనేకులు పంతులుగారి సహధర్మచారిణి వద్ద చేరి యెట్లయిన యాయన పట్టుదలను సడలింపజేసి పూర్వాచారమును నిల్పుమని చెవి నిల్లుగట్టుకొని పోరిరి. కాని యామె యించుకైనను చలింపలేదు సరిగదా తన సతీత్వ ధర్మ ప్రకారము సహధర్మచారిణీత్వము నెరపెదనని యెదురు సవాలు జేసినది.

కేవలము వితంతూద్వాహముల వలననే సంఘము బాగుపడదని పంతులుగారు దృఢిగా నమ్మటచే, స్త్రీలకై

20th May 1887

K. Veeresalingam
Govt. College
Rajahmundry

శ్రీ వీరేశలింగం పంతులుగారు ఒక పుస్తకముపై చేసిన ఇంగ్లీషు చేవ్రాలు



శ్రీ వీరేశలింగ కవిసమాజము (కుముదవల్లి, భీమవరం తాలూకా) ఒక గ్రంథాలయమును స్థాపించిరి. ది 9-10-1907 న పదియవ వార్షికోత్సవమునకు పంతులుగారు అధ్యక్షత వహించిరి. ఆ సందర్భమున ఈ ఛాయాచిత్రములో కుర్చీలలో కూర్చున్న వరుస (ఎడమనుంచి కుడికి) : బోడి నారాయణరావు, అవటపల్లి నారాయణరావు, కోన సీతారామారావు, బుద్ధిరాజు పావకేశ్వరరావు, శ్రీ పంతులుగారు. ఆ వెనుకనే నిలచినవారిలో మొదటివారు శ్రీ మంగిపూడి వేంకటశర్మగారు.



ఆనందోద్యాన వనములో పంతులుగారు నివసించిన మేడ
దీనిని మ్యూజియముగా మార్చ ప్రయత్నము జరుగుచున్నది

మద్రాసులో శ్రీ పంతులుగారు నిర్మింపజేసి,
పరమ పదించిన మందిరము "వేద విలాస్", మైలాపూర్

సతీహితబోధిని యను నొక మాస పత్రికను 1883 నందు ప్రచురింప నారంభించిరి. అందు స్త్రీల యుపయోగార్థము సత్యవతీ చరిత్రమును, నీతిమత విషయక ధర్మముల దెల్పు చంద్రమతీ చరిత్రము వంటి యనేక యుపయోగ్యములైన సాహిత్యములు వచ్చినవి. 1887 నందు స్త్రీలకై సత్య సంజీవి యను నీతి ప్రవర్ధక పుస్తకమును పంతులుగారు రచించిరి.

1891లో స్త్రీలకు సంఘీయులు చేసిన యన్యాయమును వేలెత్తి చూపుటకై సత్యరాజు పూర్వ దేశ యాత్రను రచించి ప్రకటించినారు పంతులుగారు. స్త్రీలను విదుషీమ తల్లులుగా నొనర్చినగాని సంఘమున విజ్ఞానము పాదుకొనదని గ్రహించి, దేహారోగ్య ధర్మ బోధిని వంటి యారోగ్య శాస్త్రమును, పత్నిగా పేరొందవలసిన మగువలకు సహాయకారిగా పత్నీహిత సూచనిని ప్రకటించిరి.

వితంతువుల కెంతటి సహాయము పంతులుగారి వలన జరిగినదో యంతకన్న మిక్కిలిగా స్త్రీల కుపకార మొనగూడినది. మాండలిక వ్యవహారిక సభలయందు స్త్రీలకు గూడ యర్హ్వపదము లీయవలెనని పంతులుగారు ప్రభుత్వమునకు సిఫారసు జేసిరి. సాంఘిక సభలకు తన ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మగారిని తీసుకొని వచ్చుటయేగాక యట్టి పనికి తోటి మిత్రులను యుత్సాహితులను జేసిరి.

1897 ప్రాంతమున పంతులుగారు రాజమహేంద్రవరమును వీడి చెన్నపురి నివాసమునకై పోయిరి. అక్కడి మిత్రుల ప్రోద్బలముచే వితంతు శరణాలయము నొకదానిని నెలకొల్పిరి. పంతులుగా రిక్కడకూడ యనేక వితంతూ ద్వాహములను జేసిరి. చెన్నపురియం దుండియే పంతులుగారు స్త్రీలకై ప్రత్యేకముగా నొక ప్రార్థన మందిరమును 1904 ప్రాంతమున గట్టించినారు. చెన్నపురమున నే గాక బెంగుళూరు నందును యెన్నో కార్యములకు పంతులుగారు సహాయానుభూతులుగా నుండిరి. వీరి కీర్తి దిగంతముల వ్యాపించినది, కాని, మాతృభూమిపై వసింపవలెనను కుతూహలము మాత్రము వారిని వీడలేదు. అందుచేత 1905 నాటికి పంతులుగారు పత్నీ సమేతులై రాజమహేంద్రవరము తిరిగి వచ్చివేసిరి.

రాజమహేంద్రవరమున తిరిగి యడుగు పెట్టగానే, వితంతు స్త్రీలకై శ్రీ విక్టోరియా బాలికా పాఠశాలను స్థాపించిరి. శరణాలయ విద్యార్థినుల కొరకై యీ పాఠశాల స్థాపింపబడినను, యూరనున్నవారీ సదుపాయము లనుపయోగించుకో గలరని పంతులుగారు యభిప్రాయపడిరి. దీని నేవిధముగనైనను వున్నత స్థితికి తీసుకొని రావలెనని, మంగుళూరునుండి లక్ష్మీకాంతమ్మ యను నామెను, ఆమె భర్తనూ యుపాధ్యాయినీ, యుపధ్యాయులుగా తీసుకొని వచ్చెను. వితంతు శరణాలయ సంబంధమున నడిపించు పాఠశాలయందు బాలికల సంఖ్య తక్కువగా యున్నందున, యా పాఠశాలను దీచివైచి, తమయింటనే నడిపింప ప్రారంభించెను. జనానా స్త్రీలకు పంతులుగారే స్వయముగా బోధనలు జేసెడివారు. వారి సతీమణి రాజ్యలక్ష్మమ్మగారు సంగీతమును చెప్పుచుండెడివారు.

పంతులుగారు చేసిన వితంతూద్వాహములు కొన్ని కాలవశమున విధ్వంసమైనవి. తల్లులనుపోగొట్టుకొన్న బిడ్డలను, కన్నతల్లివలె రాజ్యలక్ష్మమ్మగారు సాకుచుండెడివారు.

పతితులైన కొందరు వితంతువులు సయితము పంతులుగారి శరణు జొచ్చుటచే వారిని రహస్యముగా నుంచి, బుద్ధిజెప్పి వారికి తమ సహధర్మచారిణితోనే పురుళ్లు సయితము పోయించుచుండెడివారు. అట్టి అనాధ శిశువులకై, శరణాలయమును స్థాపింప బూనుకొని శ్రీ పీఠికాపురాధీశు లీ పని కుద్యుక్తులైనారని తెలసికొని యా కార్యమును యాపుజేసిరి. పతిత స్త్రీ సముద్ధరణకై కూడా యొక నిలయమును స్థాపించిరి. అందు కొందరు కొంతకాలముండి తరువాత, యచ్చటి క్రమశిక్షణకు యాగలేక పారిపోయిరి. కొందరు తిరిగి సచ్చరిత్రము నలవడజేసుకుని, వివాహితలై సుఖజీవనము జేసిరి.

అద్దేపల్లి వివేకానందదేవి

పంతులుగారు పఠన మందిరము నొకదానిని స్థాపించి యందు స్త్రీలకు యింటింటికి గ్రంథముల పంపునేర్పాటు చేయించిరి.

పంతులుగారి పేర స్థాపింపబడిన యున్నత పాఠశాలను, స్త్రీల యున్నత పాఠశాలగా నేర్పాటు చేయవలెనని చాలా యుత్సాహముతో పంతులుగారు కృషి చేసిరి. కాని యాదియందది యంత సులభసాధ్యము గాకపోయినది. అయినను, యీ యాస్తికోన్నత పాఠశాల యందు పంచములకును, స్త్రీలకును వుచిత విద్యగరప యాదేశము చేయబడెను. అట్లే యే పాఠశాల యందును విద్యార్థినులకై విశ్రాంతి గృహములు లేకుండెను. దీని వలన విద్యార్థినులు బహు ప్రయాసలకును, విద్యార్థుల యవహేళనకును గురికావలసి వచ్చుచుండెడిది. పంతులుగారీ విషయమున శ్రద్ధవహించి యుపాధ్యాయులుండే గది సమీపముననే, వీరికిని విశ్రాంతికి గది గట్టించెను.

1908 వ సంవత్సరమున క్రొత్త శరణాలయమును నిర్మించి జీవిత శేషమును స్త్రీ జనాభివృద్ధి నిమిత్తము వినియోగింప నిర్ణయించుకున్న పంతులుగారికి విధి బలీయమై పతీవియోగమును అచిరకాలముననే కలుగ జేసినది. అయినను వారు మాతృహీనయైన పసిబిడ్డవలె సంరక్షలు లేకపోయినను, తమ జీవిత లక్ష్యమును వీడలేదు.

తమ జీవితమున నాటిన వృక్షముల ఫలములను తామే యనుభవించువారు బహు యరుదు. కాని శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి కృషి ఫలమును యాయనయే కనులారగాంచి యానందించుటయే గాక, యా వృక్ష ఛ్ఛాయల, నీడనూ, ఫలములను యశేష స్త్రీ జనానికందిచ్చిపోయి ధన్యులైనారు. వారి బహుముఖ కృషికి, రాజ్యలక్ష్మీదేవి సూర్యుని నంటిపెట్టుకుని వర్తించు ఛాయాదేవివలె తన విద్యుక్త ధర్మమును నెరవేర్చుటయే గాక వారికి యుత్సాహమును, మనోధైర్యమును ప్రసాదించిన మహాశక్తి యామె. ఆ దంపతులకు యీనాటి యావదాంధ్ర స్త్రీ జనమూ, అందునూ, యన్నిరంగముల కీర్తి గడించిన మహిళామతల్లు లెందరో రుణపడి యున్నారు. కాని యీ విషయ మెంద రెరుగుదురు !

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ.

---

ఉ. కొందఱు విద్య నన్యులకుఁ గోవిదులయ్యును నేర్పలే రిలన్ ;
గొందఱు బోధచేయుదురు గొప్పఁగఁగొంచెమె తామునేర్చియున్;
బొందుగ రెండిటం దెలివిఁ బొంది వెలింగెడు బుద్ధిశాలులే
యెందును నగ్రగణ్యులని యెన్నిక గాంతురు శిష్యకాళిలోన్.

*వీరేశలింగం*

(స్వీయ చరిత్రనుండి)

# అధిక్షేపక కావ్యములు

శ్రీ అక్కిరాజు రమాపతిరావు

వీరేశలింగం పంతులుగారు స్త్రీల కొరకు ఎట్టి సరళ సుందరములైన రచనలు గావించెనో, సంఘములో తగు మనుష్యుల మనిపించుకొను వారి అక్రమవర్తనమును నిరసించుటకై అంత తీవ్రములైన అధిక్షేపక రచనలను గావించెను. ఎక్కడ ఏ అక్రమమున్నను పంతులుగారిది చూచి సహించెడి స్వభావము కాదు. దురాచార నిరసము పట్ల ఆయన కెంతమాత్రమును జాలి, మొగమాటము, దాక్షిణ్యము లుండెడివి కావు. న్యాయవాదుల యొక్కయు, అధికారుల యొక్కయు, సంఘములోని ఇతర పెద్దమనుషుల యొక్కయు లోపములను నిర్దయుడై వివేకవర్ధని యందు పంతులుగారు బాహిరము చేయుచుండెడివారు. సంఘ సంస్కరణమనిన పూర్వ నాగరకులు కంటగించు కొనుచుండిన యారోజులలో వీరేశలింగము పంతులుగారికి బొత్తిగ నిలుపు నిదానములు లేకుండెను. చెడుగనిన బొత్తిగ నోరిమి లేకుండెను. ఆయన ప్రహసనములన్నియు సంఘములోని పెద్దమనుషులను అధిక్షేపించుట కుద్దేశింప బడినవే అని అందరును యెరుగుదురు. రాజమహేంద్రవర వీధులలో రాత్రులు పడుపుటిండ్లకు జేరెడి విటకాండ్రును, న్యాయసభలలో నున్నతాసనము లధిష్టించియు నీతి దూరులగు నుద్యోగస్థులును–వీరందరును తన ప్రహసనములకై గల్పింపబడిన పాత్రలనియె కాక, నీతిపథమునకు, న్యాయ మార్గమునకు, వ్యక్తిగతముగ తనకును శత్రువు లనియే పంతులుగారు తలంచుచుండిరని, వారి యెడల మిక్కిలి భక్తిప్రపత్తులను కలిగియున్న శ్రీ రాయసం వెంకట శివుడుగారు తమ ఆత్మ చరిత్రమునందు వ్రాసియున్నారు. పంతులుగారి ప్రహసనము లన్నియును వ్యంగ్య రచనములే. ధంభాచార్య విలసనము, కలిపురుషశనైశ్చర విలాసము, హిందూమత సభ, యోగాభ్యాసము, మహారణ్య పురాధిపత్యము, తిర్యగ్విద్వన్మహాసభ మొదలగు ప్రహసనము లన్నియు వ్యక్తిగతమగు హేళనకును, కరకుదనమునకును ప్రసిద్ధిజెందియున్నవి.

వీరేశలింగం పంతులుగారి వ్యంగ్య రచనలలో 'సత్యరాజా పూర్వదేశ యాత్రలు' అను వచన కావ్యమును 'అభాగ్యో పాఖ్యాన' మను పద్య కావ్యమును మిక్కిలి ప్రసిద్ధిజెందియున్నవి.

"స్త్రీల విషయమున మనవారు చేసిన యన్యాయములు తేటపడునట్లుగా వ్యాజరీతిని సత్యరాజ పూర్వదేశ యాత్రల యొక్క ప్రథమ భాగము రచించి ప్రకటించితిని. నే నింగ్లీషున 'గలివర్సు ట్రావెల్సు' చదివినప్పుడు వ్యాజరూపమున మనలోని దురాచారములను మూఢ విశ్వాసములను పరోక్షముగా బ్రదర్శించునట్టి పుస్తకమును నాలుగు భాగములుగా జేయవలెనని బుద్ధిపుట్టి మొదట నీ భాగమును జేసితిని. దీనిని మనవా రత్యద్భుత పడి చదువ దొడగిరి." అని పంతులుగారు స్వీయ చరిత్రమునందు వ్రాసియున్నారు. ఈ సత్యరాజా పూర్వదేశ యాత్రల ప్రథమ భాగమును జనులు ఆడు మలయాళ మందురు. ఈ ఆడు మలయాళమునందు సత్యరాజాచార్యుల వారు మలయాళ దేశమును దర్శించుట, అచ్చటి ఆచార వ్యవహారములను వర్ణించుట, కథావస్తువై యున్నది. Jonathan Swift అను ఆంగ్లకవీశ్వరుడు కూడా సమకాలీన సంఘమును విమర్శించుటే ప్రధానాశయముగా చేసికొని Gullivers Travells అను నవలను నాలుగు భాగములుగా చేసి రచించి యుండెను. నాటి సంఘములోని అవ్యవస్థ, రాజకీయములు, మూఢ విశ్వాసములు,

నిరంకుశత్వము, దౌర్జన్యములు మొదలగు విషయముల నాధారము చేసికొని ఆతడు తన నవలను రచించెను. స్విఫ్ట్‌రచనయందు రాజకీయముల కెక్కుడు ప్రాధాన్యము కలదు. స్విఫ్ట్ ఆ కాలపు రాజకీయ వ్యవహారములందు తల మున్కలు వేసినవాడు. పంతులుగారి ఆడు మళయాళము నందు సాంఘిక విషయములపై అవహేళనమున్నది కాని నాటి రాజకీయ విషయముల ప్రసక్తి లేదు. పంతులుగారు స్విఫ్ట్ గలివర్స్ ట్రావెల్స్ గ్రంథమును అనుసరించిరే కాని అనువదింపలేదు. స్థూలముగా కథను, స్విఫ్ట్‌యొక్క రచనా విధానమును మనసు నందుంచుకొని, మన వారి ఆచారవ్యవహారములను పంతులుగారు హేళన చేసిరి. గలివర్సు ట్రావెల్సులో గలివరు అను అతడు కథా నాయకుడు. ఆతడు లిల్లీపుట్ దేశమును దర్శించుట గలివర్సు ట్రావెల్సు యొక్క ప్రథమ ప్రకరణమై యున్నది. లిల్లీపుట్టు అనగా అంగుష్టమాత్రులని అర్థము. అట్లే పంతులుగారి సత్యరాజా చార్యులుగారు ఆడు మళయాళమును దర్శించుట ఇందు ప్రథమ ప్రకరణము. నాటి రాజకీయములందు ప్రాధాన్యము వహించిన మనుష్యులు యెంత అల్పులో నిరూపించుచు, వ్యాజరీతిని స్విఫ్ట్, తన నాయకుని అంగుష్టమాత్ర వాసుల ద్వీప మునకు యాత్ర చేయించి ఆ దేశమందలి వింతలు విశేష ములను వర్ణించును. గలివరు లిల్లీపుట్ దేశములో చూచిన పరిస్థితులన్నియు, స్విఫ్ట్‌యొక్క కాలమున ఇంగ్లండులో నున్నవనియే చెప్ప వచ్చును. పంతులుగారు దీని నాధారముగా చేసికొని మన సంఘములోని స్త్రీల స్థితిని చక్కబరచుటకు, సత్యరాజును వానిని ఆడు మళయాళమునకు యాత్ర చేయించి, మన సంఘములోని లోపములను యెత్తి పొడుచును. మన సంఘమునందు స్త్రీకి జరుగుచున్న యన్యాయములను దృష్టిలో పెట్టుకొని, ఆడు మళయాళము నందలి ఆచారము లన్నియు, సాంఘిక ధర్మము లన్నియు, మన వారికి వ్యతిరేకముగా నుండునట్లు పంతులుగారు కల్పించి, మనసాంఘికాచారములను హేళన చేసిరి. ఆడు మళయాళము నందలి పట్టణముల పేర్లు, మనుషుల పేర్లు విన్నంతనే నవ్వు పుట్టించునట్లుగ, పంతులు గారు రచించిరి. ఆడు మళయాళయునందు, మన సంఘము నందు పంతులుగారి కాలమునకు స్త్రీయెట్టి దుస్థితి ననుభ వించుచుండెనో, పురుషు డట్టిస్థితి ననుభవించుచుండినట్లు కల్పింప బడినది. ఆడు మళయాళము నందు ఉద్యోగములు చేయువారందరును స్త్రీలే. రాజకీయ వ్యవహారములు నిర్వ హించువారు స్త్రీలే. రక్షక భటులును స్త్రీలే. పురుషునికి విద్య కూడదు. పురుషుడు వ్రతములు, ఉద్యాపనములు చేయుచు ఇంటియందే పడియుండవలెను మొదలగునవి ఆడుమళయాళము నందలి దేశాచారములు. సత్యరాజా చార్యులవారు ఆడు మళయాళమునందు ప్రవేశించిన తరువాత, ఆతనిని అచ్చట రక్షకభటులు పట్టుకొని చెరసాలలో బంధించిరి. ఎవ్వడో విదేశస్థుడైన పురుషు డొకడు బంధింపబడెనని రక్షక భటులందరును వచ్చి చూచి పోవుచుండిరి. "అంతట రాజభటులు కొంద రొకరు విడిచి యొకరు తలుపు వద్దకు వచ్చి దానికి నిలువుగా వేయబడిన, యినుప కమ్మీల సందునుండి బోనులోనున్న యడవి జంతువును జూచినట్లుగ నన్ను తొంగితొంగి చూచుచు నావలకు బోవుచు వచ్చిరి. ఇట్లు వచ్చుచు బోవుచుండుటయు వారిలో నేమో యాలోచించు కొనుటయు చూడగా మన దేశములోని పోలీసు భటుల సంగతి నాకు జ్ఞప్తికి వచ్చి వారికేదో దురుద్దేశము కలిగి నట్లు నాకు పొడగట్టినది. కాని నేను స్త్రీనిగాక పురుషుడ నయినందున అట్టి యనుమానముతో బనిలేదని మనస్సమా ధానము చేసికొంటిని.'' అను పంతులుగారి వాక్యములు, వారి స్వీయచరిత్రయందు ఒకసారి ఇరువురు రక్షకభటులు, రాజమహేంద్రవరమున నడిరాత్రి ఇంట పురుషులెవ్వరును లేని ఒక గేస్తురాలిని బెదరించి, ఆమె కూతురును దురుద్దేశముతో ఎవరో పిలుచు చున్నారని, తీసుకొని

పోవుట, దైవికముగా ఆ దారిన ఆ సమయమున ఒక పెద్ద మనుష్యుడు నడుచుటవలన, ఆ ముద్దరాలికా యాపద తప్పిపోవుట, ఆ పెద్దమనుష్యుడు పంతులుగారికీ విషయము నెరింగింపగా, వారు ఆ రక్షక భటులపై, రక్షక భటాధికారివద్ద చర్యనడిపించుట మొదలగు విషయములు స్ఫురించును. తదుపరి సత్యరాజాచార్యులు ఆడు మళయాళమునందు ''షాండీభంగీ'' అను రాజకీయాధికారిణి అనుగ్రహము సంపాదించి వారి ఇంటనే నివసించుచుండెను. ఈమె ఆ దేశమునందు సంఘ సంస్కారవాదుల పక్షమునకు జెందినది. ఈమె భాంగీఫిండే యను పేరుగల విద్వాంసురాలిని బెట్టి, దేశాచారమునకు విరుద్ధముగ సత్యరాజాచార్యులకు చదువు చెప్పించెను. ఆ దేశస్థులలో బహు సంఖ్యాకులు పురుషుల కెప్పుడును విద్య చెప్పింపగూడదనియు, విద్య చెప్పించుటవలన స్వేచ్ఛా విహారులై చెడిపోవుదురనియు భావించి పూర్వాచారమును నిలుపుటకు పాటుపడుచుండిరి. ఆడు మళయాళమును పరదేశస్థులు జయించి, అచ్చటి దేశీయాచారములను సంస్కరింప ప్రయత్నించుచుండిరట. ఆ పరదేశస్థులు ఆడు మళయాళమునందు పురుషుల నిమిత్తమై పాఠశాలలను బెట్టి పురుష విద్య వ్యాపింప జేయుటకై ప్రయత్నించుచున్నను గౌరవముగల కుటుంబములలోని మగపిల్లలెవ్వరు బడికి పోకుండిరట. ఆడుమళయాళమునందు విధురుడైన వానికి ముక్కు కోయవలెనను ఆచారముండెనట. అచ్చట పురుషులందరును పత్నీ వ్రతమును పాటింపవలెను. మనదేశమునందలి విగతభర్తృకలకు శిరోజములు తీసివేసెడి ఆచారమును, ఆడు మళయాళము నందలి, భార్య చనిపోయిన మగవారలకు ముక్కు కోసివేసెడి ఆచారముతో పోల్చి పంతులుగారు హేళన చేసిరి. ఆడు మళయాళమునందు ''పంఢీ పేఢీ ఘాఢీ'' యను ధర్మశాస్త్ర గ్రంథము నందలివని సత్యరాజాచార్య ఆంధ్రీకృత నవరత్నములు గాంచినచో, వీరేశలింగం పంతులుగారి వ్యంగ్య రచనా సామర్థ్య మెట్టిదో తెలిసికొన వచ్చును. పూర్వోదాహృతమైన ధర్మశాస్త్ర గ్రంథమునకు, "పత్నీ వ్రతధర్మబోధిని" యని యర్థము. అందలి పద్యములు మిక్కిలి చమత్కారములుగా నుండుటయే కాక, హిందూ సంఘము నందలి పురుషులెల్లరును, స్త్రీలను తామట్టి దుస్థితిలో పడద్రోచినారను విషయమును గ్రహించి లజ్జితులగుదురు. ఆ పద్యములలో రెండు మూటి నుదహరించెదను.

పురుషున కిమ్మహి బత్నియె
పరమంబగు దైవతంబు పత్నీ సేవన్
నిరతము చేసెడి పురుషుడె
పరమున నిహమున సుఖమ్ము బడయుంజుమ్మీ.

కుష్ఠరోగిణియైనను గ్రుడ్డిదైన
భూరి వికలాంగియైనను ముసలిదైన
బత్నియెంగిలి భుజింపవలయు సతము
పుణ్యలోకంబు గాంక్షించు పురుషవరుడు.

పురుషుండు గార్దభమున్
స్థిరమగు దండనములేక చెడిపోదు రిలన్
గరుణదలంపక నెల కొక
పరి యైనన్ గొట్టవలయు బత్ని పురుషునిన్

అను నీ ధర్మశాస్త్రమునందలి సూక్తులు పంతులుగారి వ్యంగ్యరచనా వైభవమునకు నిదర్శనములు. ఇంకనూ ఆడమళయాళమునందు మన దేశమునందు శంకరమఠములను బోలిన మఠము లుండెను. మన పీఠాధిపతులను బోలిన పీఠాధికారిణులుండిరి. ఆడుమళయాళమునను పూర్వనాగరక పక్షమువారును, సంస్కారవాదులును యుండిరి. మన సభాపతులవలె ఆదేశమున సభాపత్నులుండిరి. ధర్మమునకు, పూర్వాచారమునకు భంగము వాటిల్లినప్పుడు అచ్చటి సభాపత్నులు పీఠాధికారిణులకు విన్నపములు పంపుచుండిరి. వారు పూర్వాచారమును ధిక్కరించినవారికి, శాస్త్రదూషణము చేయువారికి, ఆంక్ష

పత్రికలు పంపుచుండిరి. జగద్గురువులవారి సంచారమును గూర్చి ఆడుమళయాళ దేశమునందలి వింతలను సత్య రాజాచార్యులవా రిట్లు తెలుపుచున్నారు. "జగద్గురువులవారు తాము విచ్చేయుచున్నట్టు సభాపత్నులకు శ్రీముఖమును బంపిరి. శ్రీముఖము వెనుకనే శ్రీవారును గుఱ్ఱములతోను, ఏనుగులతోను, వాద్యములతోను విజయంచేసిరి. అప్పు డింటింటను నాసికా మహోత్సవములు జరగ మొదలు పెట్టెను. (నాసికా మహోత్సవములనగా, భర్తృహీనులకు మనదేశమున జరుగు కేశఖండనముల బోలిన, అపత్నీకుల నాసికా చ్ఛేదములు) ... ఇతర సమయములయందు పట్టుదల కాకపోయినను స్వాములవారు వచ్చినప్పుడు మనదేశమునందు బాలవితంతువుల శిరోజములు సహితము తీయించివేయునట్లుగానే యా దేశమునందు జగద్గురువులు వచ్చినప్పు డపత్నీకుల ముక్కులన్నియు కోసివేయుదురు." మన వేదములవలె వారికి "గాధా"యని పరమప్రమాణమైన గ్రంథమున్నదట. దానియందు పురుష విద్యాభ్యాసమున కాధారముగా నొక ప్రమాణమున్నదని ఇటీవల నవనాగరీకురాండ్రు వాదింపజొచ్చి రట. ఇట్లీ విధముగా పందొమ్మిదవ శతాబ్దమునందలి హిందూదేశము నందలి సాంఘిక దురాచారములన్నియు, ఆడుమళయాళము వారికి అంటగట్టి పంతులుగారు హేళనచేసియున్నారు. స్త్రీ విద్యాభ్యాసము, స్త్రీ పునర్వివాహము, పీఠాధిపతుల అక్రమములు మొదలగు విషయములన్నియు ఆడుమళ యాళమునందు వ్యంగ్యముగా విమర్శింపబడియున్నవి. పంతులుగారి స్వీయచరిత్రలోని అనేక సాంఘికవిషయ ములు, సత్యరాజా పూర్వదేశయాత్రల ప్రథమభాగమైన ఆడుమళయాళమునందు చోటుచేసుకొన్నవి. వ్యాజరూప మున నాటిసాంఘిక పరిస్థితులన్నియు పంతులుగారు యీ ప్రథమభాగమునందు హేళనచేసియున్నారు. ఇక రెండవ భాగము లంకాయాత్ర. ఇది గలివర్స్ ట్రావెల్సులోని బ్రాబ్డింగ్‌నాగ్ యాత్రకు అనుసరణము. స్థూలముగా కథనుమాత్రము దృష్టియందుంచుకొని, పంతులుగారు దీనిని మనవారి మూఢవిశ్వాసములను విమర్శించుటకై కల్పించిరి. జ్యోతిశ్శాస్త్రములోని జాతకభాగము యొక్కయు, ముహూర్త భాగముయొక్కయు నవిశ్వస నీయతను పరోక్షముగా దెలుపుటకయి లంకాయాత్రయను భాగమును రచించినట్లు పంతులుగారు స్వీయచరిత్రయందు తెలిపియున్నారు. ఈ రెండవ భాగమైన లంకాయాత్ర రచించుటయందు పంతులుగారు జ్యోతిశ్శాస్త్రమును విమ ర్శించుటే ప్రధానాశయముగా చేసికొనిరి. లంకలో సత్యరాజాచార్యులవారిని వాలఖిల్యమహర్షియని జనులు నమ్మిరి. అందువలన జ్యోతిశ్శాస్త్రముయొక్క విశ్వసనీయ తనుగూర్చి ఒకసభ జరుగగా దానికి సత్యరాజాచార్యుల వారిని అగ్రాసనాధిపతిగా యెన్నుకొనిరి. ఆ సందర్భమును ఆధారముచేసికొని పంతులుగారు జ్యోతిశ్శాస్త్రమును విమ ర్శించిరి. ఆ జ్యోతిశ్శాస్త్రముయొక్క విశ్వసనీయతను పూర్వనాగరికులు స్థాపింపబోవు సభలో పూర్వనాగ రికులును, నవనాగరికులును వాదులాడిరట. ఈ సందర్భము స్త్రీ పునర్వివాహ విధాయక వాదులకును, ప్రతిపక్ష వాదు లకును జరిగిన వాద వివాదములను, పంతులుగారు స్వీయ చరిత్రములో యుల్లేఖించినవాని సామ్యముగలిగియున్నవి. లంకాద్వీపమునందు మహాకాయుడను నొకగృహస్థు సత్య రాజాచార్యులను తన ఇంటనుంచుకొని, ఆతనికి యాజ మాన్యమువహించి, ఆ రాక్షస దేశమునందు, ఎట్టి ఆపత్తు లును కలుగకుండ రక్షించుచుండును. ఒకనాడు యజ మానునకును, సత్యరాజాచార్యులవారికిని జ్యోతిశ్శాస్త్ర విషయమై చర్చజరుగును. సత్యరాజాచార్యులు మహా కాయునకిట్లుచెప్పెను. "శాస్త్రమర్మము లెప్పుడును సర్వ జనులకును వెల్లడిచేయగూడదు. అందులో ముఖ్యముగా మూడు శాస్త్రములు పరమగుహ్యములు. అందుచేతనే మా దేశమునందుగూడ చదువెరుగనివారు సహితము జ్యోతిశ్శాస్త్రములోను, వైద్యశాస్త్రములోను, మంత్ర

శాస్త్రములోను, మహావిద్వాంసులయి జనసన్మానము పొంది కోటీశ్వరు లగుచున్నారు." సత్యరాజాచార్యులు పూర్వ నాగరిక పక్షమునకు జెందినవాడు. అట్టి సత్యరాజాచార్యులవారి నోటివెంట ఇట్టి అభిప్రాయములు వెలువడుట మనకు మిక్కిలి వింతగొలుపును. పంతులుగారు యీ లంకాయాత్రయను భాగమునందు, జ్యోతిషవిద్వాంసులను అపహాస్యముపాలు గావించెను. వారి చర్చలో సత్యరాజాచార్యులవారి యజమానుడైన మహాకాయుడు సిద్ధాంతులు చెప్పు ఫలములలో వ్యత్యాసముకలుగుటకు గల కారణము జ్యోతిశ్శాస్త్రమునకుగల పరమేశ్వరుని శాపమే యని చెప్పును. మనదేశమునందు జ్యోతిశ్శాస్త్రమునకు పార్వతీ దేవి శాపముకలదని అందువలననే విద్వాంసులుచెప్పు ఫలములలో వ్యత్యాసముకలుగుచుండుననియు విద్వాంసులు చెప్పుచుందురు. దానిని అపహసించుటకు రాక్షసుల దేశములో జ్యోతిశ్శాస్త్రమునకు పరమేశ్వరుని శాపమున్నదని వారి నమ్మకమయినట్లు పంతులుగారు కల్పించిరి. యజమానుని సమాధానమునకు సత్యరాజాచార్యులు ప్రహృష్టాంతరంగుడై యీ విధముగా పలుకును. "నిజమైనకారణమును గ్రహించుటచేత నేనిప్పుడు పరమ సంతుష్టాంతరంగుడ నయినాను. ఇది యత్యంత గుహ్యమైన పరమరహస్యమనుటకు సందేహములేదు. ఇది దేవ రహస్యమే కాకపోయినపక్షమున, పురాణములను రచించిన మా దేశములోని సర్వజ్ఞులయిన మహర్షుల కొక్కరికైన దెలిసివుండకపోవునా ? నేను మా దేశము చేరినతోడనే దీనిని పద్మపురాణముయొక్క యుత్తర భాగములోని యష్టోత్తర శతసహస్రాధ్యాయమునందు జేర్చి వ్యాసప్రోక్తము జేయించెదను.'' ఈ వాక్యముల వలన స్త్రీలకు విద్యకూడదు, స్వాతంత్ర్యము కూడదు, పునర్వివాహముకూడదు మొదలైన శాస్త్రవాదములన్నియు ప్రక్షిప్తములనియు, దాంభికులు, స్వార్థపరులునైన సత్యరాజాచార్యులవారివంటి యే బుద్ధిమంతుడో వానిని పురాణములయందు, శాస్త్రములయందు ప్రక్షిప్తముచేసియుండుననియు, పంతులుగారి విశ్వాసమైనట్లు తోచుచున్నది. ఈ విధముగా పంతులుగారు మన సంఘమునందలి దురాచారములను, మూఢనమ్మకములను, సాంఘిక దురన్యాయములను అపహాస్యముపా లొనరించు నుద్దేశముతో యీ సత్యరాజా పూర్వదేశయాత్రలయొక్క రెండు భాగములు రచించిరి.

ఇంక యీ సత్యరాజా పూర్వ దేశయాత్రలయొక్క మౌలికతనుగూర్చి ఒక విషయము చెప్పుదును. పంతులుగారికి మిక్కిలి సన్నిహిత మిత్రులైన శ్రీ రాయసం వెంకట శివుడుగారు యీ సత్యరాజా పూర్వదేశయాత్రలనుగూర్చి ఒక విశేషమును వారి ఆత్మచరిత్రమునందు వ్రాసియున్నారు. ''నేను చెన్నపురిలో నుండురోజులలోనే స్విఫ్టువిరచితమగు 'గల్లివరుని ప్రయాణముల' ననుసరించి 'సత్యరాజాపూర్వ దేశయాత్రలు' అను విచిత్ర కథను పంతులుగారు రచింప దొడంగిరి. ఏనాడు వ్రాసిన ప్రకరణముల నానాడు పంతులు నాకు జదివి వినిపించి, నా యభిప్రాయము గైకొనుచుండెను. ఓడ ప్రయాణమందలి నా బాధల సంగతి నేజెప్పగా విని,సమయోచితముగ నందు గొన్నిటిని సత్యరాజున కాయన యారోపించుట చోద్యముగ నుండెను. హాస్యరసకల్పనా విషయమున పంతులుగారు అడిసనునికంటె స్విఫ్టునే యెక్కువగా బోలియుండెనని నేనంటిని. అడిసనుని మృదుహాస్య ప్రయోగము తెలుగున జొప్పింప పంతుల యాశయము.'' కాని పంతులుగారి లక్ష్యము వేరు. ఆయన గ్రంథరచనయంతయు దుర్మత భంజనమునకే యుద్దేశింపబడినది. కనుక వారి ప్రయోగము కొంత కాఠిన్యము వహించుట, ఆ రచన లెవరికై యుద్దేశింపబడినవో, వారి మనస్సులు నొచ్చుట అనివార్యము. తన రచనలనే కుఠారముగ జేసికొని, దుర్మతములనెడి విషవల్లికలను పంతులుగారు ఖండించివైచిరి. దుష్టాంగంబు ఖండించి శేషాంగ్రవాంతము రక్ష సేయుట

పంతులుగారు విధిగా భావించిరి కనుక, వైద్యునివలె సంఘమునకు శస్త్రచికిత్స గావించిరి. వెక్కిరించి, అపహాస్యముచేసి, హేళనచేసి, మనస్సు నొచ్చుకొనునట్లుచేసి, తమ తప్పులను సరిదిద్దుకొనునట్లు చేయవలయునని పంతులుగారు సంకల్పించి ఇట్టి హేళన కావ్యములను రచించిరి.

ఇట్టిదే పంతులుగారి అభాగ్యోపాఖ్యానముకూడ. ఇది పద్యకావ్యము. ఇది సాంఘికాచారములను హేళనచేయునట్టి కావ్యము కాకపోయినను, పంతులుగారి రచనలయందు దీనికొక విశిష్టమైన స్థానమున్నది. చర్విత చర్వణముగ మన సాహిత్యమునందు వెలువడిన ప్రబంధములను పరిహాసింపవలెనని పంతులుగారు దీనిని రచించిరి. ముఖ్యముగ దక్షిణాంధ్ర యుగమునుండి, వసుచరిత్రకు పుత్రికలో యనున ట్లుద్భవిల్లిన అనంతర యుగ ప్రబంధములను దృష్టియందుంచుకొని పంతులుగారీహేళన కావ్యమును రచించిరి. ఇది ప్రధమాంధ్ర హేళన కావ్యమని చెప్పవచ్చును. ఇంతకు పూర్వమే వెలసిన చంద్రరేఖావిలాపము, రావణ దమ్మీయము మొదలైన అధిక్షేపక కావ్యములున్నను, అవి తిట్టు కవిత్వమునందు చేర్పవలసినవి గనుక, సాహిత్య గౌరవము చెడకుండునట్లుగా రచింపబడిన ప్రధమాంధ్ర అధిక్షేపక కావ్యమిదియే యని చెప్పనొప్పును. దీనిని గూర్చి పంతులుగారు స్వీయచరిత్రము నం దిట్లు వ్రాసియున్నారు. "ఇంచుమించుగా దెలుగుభాషలోనున్న ప్రబంధములన్నియు కామినీకచకుచ సంభోగాది వర్ణనలతో నిండియుండి యేకరీతివిగా నుండుట చేతను, అట్టిప్రబంధములను రచించిన వారిలో నేనొక్కఁడనైనను, నాకు వెనుకటి యభిప్రాయములుమారి శృంగార ప్రబంధములు చేయు మేలుకంటె కీడెక్కువగా నుండునన్న సిద్ధాంతమునకు వచ్చినవాడ నగుట చేతను, ప్రబంధ ప్రణేతృ పంథను బరిహసింపవలెనన్న యుద్దేశముతో నభాగ్యోపాఖ్యానముచేసితిని". అనగా శృంగార ప్రబంధములను అధిక్షేపించుటకై చేయబడిన కావ్యమీ యభాగ్యోపాఖ్యానమని బోధపడుచున్నది. "ఎక్కడ జూచినను స్త్రీల కచములయొక్కయు, కుచములయొక్కయు వర్ణనంబులెకాని మానవులను సన్మార్గంబునకు ద్రిప్పజాలిన నీతులను బోధించు వాక్యము లేకుండుటజేసి'' పంతులుగారు అట్టి ప్రబంధములను వికటముజేయుచు, అభాగ్యోపాఖ్యానమును చేసియున్నారు. పరవనితారతి యమిత పాప మూలంబని అభాగ్యోపాఖ్యానమందలి ఫలితార్థము. ఈ అభాగ్యోపాఖ్యానమును జూచి ఆ కాలమున స్నేహితులందరు పంతులవారికి రామలింగమువలె వికట కవిత్వమబ్బుచున్నదని చెప్పుకొనిరని శ్రీ తోలేటి వెంకట సుబ్బారావుగారు వీరేశలింగకవి చరిత్రమునందు వ్రాసియున్నారు. సాధారణముగ నుపాఖ్యానము లన్నియు నరణ్యవాసము చేయుచున్న ధర్మరాజాదులకు మార్కండేయ మహర్షి ఎరింగించెననియో, లేక నైమిశారణ్యంబున శౌనకాది మహర్షులు సత్రయాగం బొనర్చుతరి వారలకు శౌమహర్షణి వినిచెననియో రచింపబడుచుండుట ప్రసిద్ధము. అందువలన ఈ అభాగ్యోపాఖ్యానముకూడ ధర్మరాజును సందర్శింప నేతెంచిన యొక పరిహాసకుడు దీనిని పాండవుల కెరింగించెనని కల్పింప బడినది. ఇది హాస్య ప్రబంధమగుటచే ధర్మరాజుకు పరిహాసకు డెరిగించెనని కల్పింపబడినది. ప్రబంధములయందు సర్వసాధారణముగా "ఒక రాజు వేటకుంజని యచ్చటనొక కాంతామణింగాంచి తన చెలికాని సహాయ్యమున, గాంధర్వ విధిని యాకన్యకామణింబరిణయమాడుట" యనునదే ఇతివృత్తమని అందరు నెరుగుదురు. ఈ లోపల నాయకుడు, నాయికయు విరహావస్థను బొందుట, చంద్రోపాలంభనము, మన్మధమలయానిలాది దూషణలు మొదలగునవి ప్రతి ప్రబంధము నందును అనివార్యములు. ఈ విధముగా స్వకీయమైన ప్రతిభలేక, చిత్ర కవిత్వములు, చర్విత చర్వణములగు వర్ణనలు తరువాత కవులు తెచ్చిపెట్టిరి. ఆ వర్ణనలను పంతులుగారు

అధిక్షేపక కావ్యములు

యీ విధముగా హేళనచేసి యున్నారు. పురవర్ణన, చాతుర్వర్ణనముల వారిని వర్ణించుట, రాజువేటకు వెడలుట మొదలగు వర్ణనలన్నియు అభాగ్యోపాఖ్యాన మందున్నవి. అభాగ్యుడు వ్యాఘ్రాఖ్యపట్టణమునకు రాజు. ఆ పట్టణము యొక్క వర్ణనవినుడు :

ఆ పురము లచ్చియప్పకు గాపురము జగంబులందుగల
పురములలో
గాపురము పాప సమితికి, దాపురము మహాపురముల
దానవ తతికిన్.

అట్టి మహాపట్టణమున కొడయుడైన అభాగ్యుని రూప లావణ్య విశేషములును, పాండిత్యమును, శౌర్యమును వర్ణించి తుదకొక్క పద్యమున

అతనికి బొట్ట కోసినను నక్షరమొక్కటిలేదు కాగడన్
వెతకిన దెల్విలేదు, దయవీసమునుంగలనైన లేదు ప్రో
న్నత నయవిద్యలేదు పదునాల్గు పుటంబులు వెట్టి
కాల్చినన్
జతురత వాతపెట్టినను సత్యము జిహ్వకు రా దొకప్పు
డున్.

పంతులుగారు వానిని శ్లాఘించిరి. ఆతడు కొలువున్న చంద మి ట్లభివర్ణితమైనది.

ఒక దిక్కునను గుక్కలొక గ్రుక్క గూయ నొక
చెంత బలుదొంత లలసి యార్వ
నొకమూల ఖరజాల మురులీల నోండ్రింప నొకచోట
గుడిసేటి యువతు లడల
నొకదండ ముది...లొక దండుగాగూడ నొకవంక బలు
కుంక లొదిగి యుండ
నొక పొంత గడముంత లొక దొంతరగ నుండ నొక
క్రేవ మధుసేవ లొనర జేయ
బెంటపోగులు జేపుళ్ళు బేడకుప్ప లలుకుగుడ్డలు గోడి
యీకలును దనర
దంబుమారిన శునకాసంబునందు గొలువులో జచ్చి
నట్టుల కూరుచుండె.

తదుపరి రాజుగారు మృగయా వినోదమునకై వెడలుట ఇట్లు వర్ణింప బడినది :

ముడ్డియెండియున్న మొద్దుగుఱ్ఱముమీద గదలకుండ
నెక్కి కాళ్ళు నేల
దగుల గూరుచుండి తక్కినవారలు వెనుక జేరి తోల
వెడలె నతడు.

మృగముల వేటాడుట, వనవిహారము, కానలోపాడు దేవళము పొంత నొక ఇంతిని కనుగొనుట, తనకు దానిని కూర్చుమని ఒక దూతికను బ్రతిమాలుకొని పంపుకొనుట, ఆ దూతికపోయి దాని నొడబరుప ప్రయత్నించుట, ఈ కథానాయికయయిన ఇగురుబోడిని వెదకికొంచు దానిబంధువులువచ్చి, అభాగ్యునితో కూడియున్న ఇంతిని జూచి ఇరువురికిని దేహశుద్ధిజేయుట, మిక్కిలి నవ్వు పుట్టించు నటుల ఇం దభివర్ణితము. నూటపదహారు పద్యములుగల ఏకాశ్వాస ప్రబంధములలోని పద్యముల బోలిన పద్యములే అన్నియును. దీనిని Parody (హేళన కావ్యమని) అని చెప్పవలెను. ప్రసిద్ధిపొంది యున్న ప్రబంధమార్గము లన్నియు హేళన చేయబడినవి. పంతులుగారికి గల పూర్వసాహిత్య పరిచయ మంతయు యీ కావ్యమువలన తెలియనగును.

# వీరేశలింగం ఇంగ్లీషు పదములకు వాడిన తెలుగు పదములు

శ్రీ పాతూరి నాగభూషణం

యుగపురుషుడు శ్రీ వీరేశలింగం పంతులు స్మారక సంచికను ప్రచురించుచున్న వీరేశలింగ స్మారక కమిటీ సమావేశకర్త శ్రీ ఆవుల సాంబశివరావుగారిని కలిసినప్పుడు పంతులుగారు ఆంగ్లపదములకు బదులుగా వాడిన తెలుగు మాటల పట్టికను దీనిలో చేర్చుట బాగుండు నని సూచించితిని. వారీ పనిని నన్నే చేయవలసినదిగా కోరిరి. సమయమంతగాలేదు. వారి గ్రంథములన్నిటిని పరిశీలించుట కనుకూలములులేవు. కనుక వారి స్వీయ చరిత్రమును చకచక తిరుగవేసి నాకుచేతనైన వరకు దీనిలో వా రుపయోగించిన తెలుగు పదముల నేరితిని. వీనికి సరియగు ఇంగ్లీషు మాటలను సిద్ధపరచి వీని నకారాదిగా పేర్చి ఒక్కొక్క పదమున కెదురుగ పంతులుగారి తెలుగు మాటను వ్రాసితిని. ఈ కార్యములో నాకు ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ కోదాటి నారాయణరావుగారు కొంత సహాయపడినారు. వారికినేను మిగుల కృతజ్ఞుడను.

పంతులుగారి కాలమునాడు కొన్ని యుద్యోగముల వివరములు తెలుసుకొనుట కుదరలేదు. వారి స్వీయ చరిత్రము రెండవ సంపుటము మాత్రము నాకు లభించి నది. కనుక నా వద్దగల దీని సంక్షిప్తప్రతి సహాయ ముతో మొదటి సంపుటములో వారు వాడిన మాటలను సేక రించినాను. అందుచేత నీ పనిలో లోపములు దొరలుట సహ జము. వీనిని గమనించి పాఠకులు సవరణలను పత్రికల ద్వారా తెలియజేసి పుణ్యము గట్టుకొన గోరుచున్నాను.

శ్రీ వీరేశలింగం పంతులుగారు వ్రాసి ప్రచురించిన 1. శారీర శాస్త్రము 2. జ్యోతిశ్శాస్త్రముల చివర నీ గ్రంథములలో వా రుపయోగించిన పారిభాషిక పదముల పట్టికలను ప్రత్యేకమిచ్చినట్లు వారు స్వీయచరిత్రములో తెలిపినారు. ఈ పట్టికలోనే గాక వారి సంపుటము లన్నిటిలోను గల పారిభాషిక పదముల సమగ్ర జాబితాను సిద్ధముచేయుటకు బుద్ధిమంతు లెవరైన పూనుకొనుచో కొంత భాషా సేవ జరుగగలదని ఇందుమూలముగ మనవి జేయుచున్నాను.

Accusation or charge (in criminal law) - అభియోగము.

Accuser - అభియోక్త.

Act - రాజశాసనము.

Advance - సంచకరువు.

Agreement - ఒడంబడిక

Anglo-vernacular School - ఆంగ్లదేశ భాషా పాఠశాల.

Announcement - ప్రకటన పత్రిక.

Appeal - విజ్ఞాపన పత్రిక

Appeal (in law) - ఉపర్యభియోగము.

Appointment order - నియోగాజ్ఞా పత్రము.

Arbitrator - మధ్యవర్తి

Argument (in law) - విమర్శ

Assistant teacher - సహాయోపాధ్యాయుడు

Astronomy - జ్యోతిశ్శాస్త్రము

At right angles - సమసూత్రముగ

B, A. Examination - పట్ట పరీక్ష

Bank - నిధి

Beach - సముద్రతీరము
Cantonment - దండుపట్టు
Capital - మూలధనము, బీజధనము
Case - అభియోగము
Central Jail - మధ్యస్థ కారాగారము
Certificate - నిర్ణయ పత్రము
Chairmanship - అగ్రాసీనత్వము
Charge (in property Law) - ఆధారము
Clerk - లేఖకుడు, గుమాస్తా
Collector - కరగ్రాహి
Collectorate - కరగ్రాహి కార్యస్థానము
College - కళాశాల, శాస్త్ర పాఠశాల
Complainant or accuser - అభియోక్త
Commercial Bank - వాణిజ్య ధనాగారము
Commission - నియుక్త సభ
Correspondence - ఉత్తర ప్రత్యుత్తరములు
Court - న్యాయసభ, న్యాయస్థానము
Cover - ఆచ్ఛాదన పత్రము
Criminal - దండ విధి
Criminal Record keeper - దండశాఖాలేఖ్యరక్షకుడు
Cross examination - అడ్డు పరీక్ష
Damages - నిష్కృతి ధనము
Defendent - ప్రతివాది
Deputy Collector - ఉప కరగ్రాహి
Director - విచారణకర్త
Director of Public Instruction - విద్యా విచారణాధికారి
District - మండలము
District Magistrate - మండల దండ విధాయి
District Munsiff - ప్రాడ్వివాకుడు
Documents - లిఖితములు
Election - స్వతంత్రవరణము
Electric Power House - విద్యుద్బలోత్పాదక స్థానము
Elementary school - ప్రాథమిక పాఠశాల
Entrance Examination - ప్రవేశ పరీక్ష
Examiner - పరీక్షకుడు
Executive Committee - కార్య నిర్వాహక సంఘము
Exercising of vote - గుళికాపాతము
Extract - నిదర్శన పత్రము
Fellow - సభ్యుడు
Fine - ధన దండనము
F. A. Examination - ప్రథమశాస్త్ర పరీక్ష
Free Dispensary - ధర్మ వైద్యశాల
Garden Superintendent - వనపాలకోద్యోగి
Gilt Letters - స్వర్ణాక్షరములు
Governor - రాజధాని పరిపాలకులు
Government College - రాజకీయ కళాశాల
,, Doctor - రాజకీయ వైద్యుడు
,, Gazette - రాజకీయ వ్యవహార పత్రిక
Government Officers - రాజకీయోద్యోగులు
Government Pleader - దొరతనము న్యాయవాది
Government servant - రాజ సేవకుడు
Grant - సహాయ ద్రవ్యము
High Court - ఉన్నత న్యాయసభ
High School - ఉన్నత పాఠశాల
Indian National Congress - హైందవదేశీయ మహాసభ
Inspector General of Police - రక్షక శాఖాధ్యక్షుడు
Inspector of Police - రక్షక పర్యవేక్షకుడు
Inspector of Schools - పాఠశాలా పరీక్షకుడు
Insurance Policy - భీమాపత్రము

పాతూరి నాగభూషణం

Invitation – ఆహ్వాన పత్రము
Joint Magistrate – సంయుక్త దండ విధాయకుడు
Journalism – పత్రికా విలేఖకత్వము
Journalist – పత్రికా విలేఖకుడు
Judge – న్యాయమూర్తి, న్యాయాధిపతి
Judgement – తీర్పు
Judicial Department – దండశాఖ
Lawyer – న్యాయవాది
Lecturer – ఉపన్యాసకుడు
Letters of congratulation – అభినందనపత్రము
Library – పుస్తక భాండాగారము
Lower Secondary Examination – మాధ్యమిక పరీక్ష
Madras Presidency College – చెన్నపురిరాజధానీ రాజకీయశాస్త్ర పాఠశాల
Magistrate – దండవిధాయకుడు, దండవిధాయి, దండాధికారి, దండన్యాయాధికారి, న్యాయపరిపాలకుడు
Main road – ప్రధాన రథ్య
Management – కార్య నిర్వాహకత్వము
Manager – కార్య నిర్వాహకుడు
Memo – జ్ఞాపిక
Memorial – స్మరణ చిహ్నము
Memory – స్మృతి
Mortgage – తాకట్టు, కుదువ
Minute book – నిర్ధారణ పుస్తకము
Municipality – పురపారిశుద్ధ్య సంఘము, నగర పారిశుద్ధ్య విచారణసంఘము, పురపాలక సంఘము
Munsiff Court – ప్రాడ్వివాక న్యాయస్థానము, ప్రాడ్వివాక న్యాయసభ
Natural sciences – ప్రకృతిశాస్త్రము
Newspaper – వార్తాపత్రిక, వృత్తాంతపత్రిక
Non-Official Visitor – అనాధికారికద్రష్ట

Notice – నివేదన పత్రము
Observatory – నక్షత్రశాల
Office – కార్యస్థానము
Office Superintendent – కార్యస్థాన ఆవేక్షకుడు
Oral evidence – వాగ్రూప సాక్ష్యము
Oriental Manuscripts Library – ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము
Orphanage – అగతిక శిశు సంరక్షణశాల
Penal code – దండ శాసనము, శిక్షాస్మృతి
Pencil – సీసపు పుడక
Peon – భటుడు
Pension – ఉపకార వేతనము
Perpendicular – సమరేఖ
Perpetuate – శాశ్వతపరచుట, స్థిరీకరించుట
Personal Assistant – స్వీయ సహాయకుడు
Petition – విజ్ఞాపన పత్రము, విన్నపము
Photo – ఛాయా ప్రతిమ
Physics – పదార్థ వివేచక శాస్త్రము
Physiology – శారీర శాస్త్రము
Plaintiff – వాది
Pocket of the shirt – కంచుక కోశము, చొక్కా జేబు
Police constable – రక్షక భటుడు
,, Officer – రక్షక భటాధికారి
Political confernce – వ్యావహారిక సభ
Political movement – రాజ్యాంగోద్యమము
Postman – ఉత్తరములు తెచ్చు భటుడు
Politics – రాజ్యాంగము
Postmortem examination – శవ పరీక్ష
Post Offices – ప్రోషణ కార్యస్థానములు
Precis writing – సంక్షేప లేఖనము
Presidency College – రాజధానీ (శాస్త్ర) పాఠశాల

President - అగ్రాసనాధిపతి
Principal - ప్రధానాధ్యక్షుడు, అధ్యక్షుడు
Printing Press - ముద్రాక్షర శాల
,, machine - ముద్రా యంత్రము
Promissory note - వాగ్దాన పత్రము
Proofs - ప్రథమ ముద్రణ పత్రములు
Proof reading - అచ్చు తప్పులు దిద్దుచుండెడి పని
Proxy - ప్రతినిధి
Public - మహాజనులు
Public garden - జనోద్యానము
Quote - ఉదాహరించు
Railway - అయో మార్గము, ధూమశకట మార్గము
Railway freight - అయోమార్గ భృతి
,, station - అయోమార్గ కార్యస్థానము
Reading room - పఠన మందిరము
Register - లేఖ్యారూఢముచేయు
Registrar - లేఖ్యారూఢాధికారి
Registrar of Marriages - వివాహ లేఖ్యారూఢకుడు
Regular suit - క్రమమైన వ్యాజ్యము
Resignation letter - పరిత్యాగ పత్రము
Resolution - నిర్ధారణము
Revenue Department - కరగ్రాహకశాఖ
Revision Petition - పునర్విమర్శకు విన్నపము
Road - రథ్య
Savings Bank - రక్షణ నిధి
Scholarship - విద్యార్థివేతనము
School Final Examination - పాఠశాలాంతిమపరీక్ష
Science apparatus - శాస్త్రోపకరణములు
Seals - లక్క ముద్రలు
Secretary - కార్యదర్శి
Security - ప్రాతిభావ్యము
Service Register - సేవాపుస్తకము
Skeleton - కంకాళము
Statement - వాఙ్మూలము
Steamer - పొగయోడ, ధూమనౌక
Sub-collector - అనుగత కరగ్రాహి
Sub-court - అనుగత న్యాయస్థానము
Sub-Magistrate - అనుగత దండధారి
Suit - వ్యాజ్యము
Summary suit - సంక్షిప్తాభియోగము
Summon - ఆజ్ఞాపత్రము
Superintendent - పర్యవేక్షకుడు
Superintendent of Police - రక్షకాధ్యక్షుడు
Superintendent of vernaculars - దేశభాషా పర్యవేక్షకుడు
Telegram - తంతి
Telegraphic message - తంత్రీ వార్త
Telegraph office - తంత్రీ వార్తాహరణ కార్యస్థానము
Telescope - దూరదర్శక యంత్రము
Text books - పరీక్షా గ్రంథములు
Text book committee - పఠనీయ గ్రంథ సభ
Thiestic society - ఆస్తిక సమాజము
Town hall - పురమందిరము, పట్టణ మందిరము
Train - ఆవిరి బండి, ధూమ శకటము
Training College - బోధనాభ్యసన కళాశాల
,, school - బోధనాభ్యసన పాఠశాల
Transfer - స్థాన భ్రంశము
Translation - భాషాంతరీకరణము
Translator - భాషాంతరీ కర్త
Trust deed - నిక్షేప పత్రము
Trustee - ధర్మకర్త
Trust money - నిక్షేప ధనము
Undertaking - పూట పడుట
University - సర్వ కళాశాల
,, senate - సర్వకళాశాల సభ
Unveiling of photo - ఛాయా పటోద్ఘాటన
Welcome address - స్వాగత పత్రిక
Will - మరణ శాసనము

పాతూరి నాగభూషణం

# పంతులుగారి గ్రంథరచనా, ముద్రణముల వివరములు

శ్రీ అక్కిరాజు రమాపతిరావు

1868-1869: వీరేశలింగం పంతులుగారు చంధస్సు నప్పుడే నేర్చుకొనుచు, మార్కండేయ శతకమును, గోపాల శతకమును రచించిరి. ఇవి నేడు ఉత్సన్నములు.

1870: పంతులుగారు సర్వకళాశాలా ప్రవేశ పరీక్షకు చదువుచున్న కాలములో దొరతనమువారి పాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగానున్న బారోదొర గారు నడుపుచున్న గోదావరీ విద్యా ప్రబోధిని (Godavari Educationist) అను మాస పత్రిక యందు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమును కొంతభాగము ప్రచురించిరి. 1875లో పుస్తక రూపముగా ముద్రింపబడినది.

1870: ఈ కాలముననే రసికజన మనోరంజన మను అచ్చతెలుగు ప్రబంధమును రచించిరి. ఈ ప్రబంధము 1874 అక్టోబరు వివేకవర్ధని యందు (వివేకవర్ధని ప్రారంభ సంచిక) ప్రారంభింపబడినది.

1872: శుద్ధాంధ్రోత్తర రామాయణము; 1872 సం॥న బందరునుండి వెలువడుచుండెడి పురుషార్థ ప్రదాయినియందు దీనిలోని కొంతభాగము ప్రచురింపబడినది. ఇది అసంపూర్ణము.

1873: "ముద్దియ విద్దియ పెద్దకార్యమనుట ప్రసిద్ధము'' అను పద్యములను పురుషార్థ ప్రదాయినియందు (బందరు) వెలువరించియున్నారు.

1874 అక్టోబరు : "వివేకవర్ధని" పత్రిక ప్రారంభము.

1874: నీతిచంద్రిక, విగ్రహము. నవంబరు 1874 వివేకవర్ధనియందు నీతిచంద్రిక, విగ్రహము ముద్రింపబడినదనియు, వలయువారు తెప్పించుకొనవచ్చుననియు వ్యాపార ప్రకటనము కలదు.

1874 అక్టోబరు : ఆస్తిక్యము (వివేకవర్ధని) అను వ్యాసము. ఈ వ్యాసము ఉపన్యాస మంజరిలో చేర్చబడినది.

1874 నవంబరు : సత్యము (వివేకవర్ధనిలో వ్యాసము).

1874 డిశంబరు : అహింస (వివేకవర్ధనిలో వ్యాసము).

1874 అక్టోబరు : నవంబరు, డిశంబరు నెలలయందు వివేకవర్ధనిలో ప్రార్థన యను పేరున సంచిక కొక్కటి చొప్పున మూడుపద్యము లున్నవి.

1875: నీతిదీపిక. కోరంగి పాఠశాలలో పనిచేయుచున్న కాలములో ఈ నీతి పద్యములు రచింపబడినవి. (1872-1874).

1875: జాన్‌గిల్పిన్. కౌపర్ అను ఇంగ్లీషు కవీశ్వరుని కృతికి తెలుగు సేత.

1875: స్త్రీ విద్య. స్త్రీ విద్యా ప్రతిపక్షవాదులకు సమాధానముగ బందరునుండి వెలువడుచుండిన పురుషార్థ ప్రదాయిని యందు పద్యాత్మకమగు లేఖను ప్రకటించియున్నారు.

1875: సంగ్రహ వ్యాకరణము; కోరంగిలో ఆంగ్లో దేశ భాషా పాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగానున్న కాలములో (1872-1874) రచింపబడినది. 1902 సం॥నందు అముద్రిత గ్రంథచింతామణి యను పత్రికయందు యీ సంగ్రహ వ్యాకరణము సమీక్షింపబడునాటికి పదకొండుసార్లు ముద్రింపబడినదని చెప్పబడినది.

1875 జనవరి : చదువువేరు. సద్గుణమువేరు. (వివేక వర్ధనిలో వ్యాసము).

1875 ఫిబ్రవరి : స్త్రీ విద్య. (వివేకవర్ధనిలో వ్యాసము).

1875 మార్చి : దయ్యములు. (వివేకవర్ధనిలోని వ్యాసము).

1875 ఏప్రియల్ : విద్య. (వివేకవర్ధని).

1875 మే : వైద్యులు. (వివేకవర్ధని).

1875 జూన్ : వేశ్యలు. (వివేకవర్ధని).

1875 జూన్ : కామెడి ఆఫ్ ఎర్రర్స్. షేక్స్పియర్ మహాకవియొక్క The Comedy of Errors అను నాటకమును అదే పేరుతో యథాతథముగ అనువదించుటకు పూనుకొని ప్రథమాంకమును, ద్వితీయాంకములోని కొంతభాగమును అనువదించి వివేకవర్ధనిలో ప్రకటించియున్నారు.

1875 జూలై : ఐకమత్యము. (వివేకవర్ధనిలో వ్యాసము).

1875 అగష్టు : సత్యము. రాజమహేంద్రవరము విజయ నగర మహారాజావారి బాలికా పాఠశాలలో దేశ భాషా పాఠశాలా సమాజ పక్షమున నొసగబడిన ఉపన్యాసము. తదుపరి పంతులుగారు ప్రకటించిన ఏడవ సంపుటమునందు చేర్చబడినది.

1875 సెప్టెంబరు : దయ్యములు. (వివేకవర్ధనిలో వ్యాసము).

1875 అక్టోబరు : ప్రమాణ విచారము. (వివేకవర్ధనిలో వ్యాసము).

1875 అక్టోబరు : ఈశ్వర సద్భావము. (వివేకవర్ధనిలో వ్యాసము).

1875 అక్టోబరు : యదార్థ జ్ఞానము. (వివేకవర్ధనిలో వ్యాసము) ఉపన్యాసమంజరిలో చేర్చబడినది.

1875 డిశంబరు : ఆత్మ. (వివేకవర్ధనిలోని వ్యాసము).

1876 : నీతిప్రబోధము. గ్రంథకర్తల కెంతయు నీతిబోధకములుగను, జ్ఞానదాయకముగను నుండునటుల వివేకవర్ధనియందు మూడు పద్యములను ప్రచురించిరి.

1876 : అభాగ్యోపాఖ్యానము. హాస్య సంజీవని మొదటి సంచికలో వెలువడినది. హేళన కావ్యము.

1876 ఏప్రియల్, మే, జూన్ : భగవద్గుణములు (వివేక వర్ధనిలో వ్యాసము) ఉపన్యాస మంజరిలో చేర్చ బడినది.

1876 జులై : బ్రాహ్మణులును, వారి వృత్తులును (వివేకవర్ధని)

1876 సెప్టెంబరు : దయ్యములు (వివేకవర్ధనిలో వ్యాసము)

1876 : కొక్కొండ వెంకటరత్న కవికృత విగ్రహతంత్ర విమర్శనము. (వివేకవర్ధనిలో ప్రకటింపబడినది).

1876 డిశంబరు : సుగుణ దుర్గుణములు (వివేకవర్ధని) ఉపన్యాస మంజరిలో చేర్చబడినది.

1877–1878 : పదార్థ వివేచక శాస్త్రమును ప్రశ్నోత్తర రూపమున కొంత భాగము, తెనిగించి ప్రకటించిరి.

1878 జూన్ : సంభాషణము (వివేకవర్ధని) ఉపన్యాస మంజరిలో చేర్చబడినది.

1878 : బ్రాహ్మ వివాహము. సంఘ దురాచార నిరసక మగు యీ నాటకమును హాస్య సంజీవని ప్రథమ సంచికలో (1876 జులై 16) ప్రారంభించిరి. పుస్తక రూపమున 1878 వ సం॥ న ప్రకటించిరి.

1878 : నీతిచంద్రిక, సంధి. దీనిని పంతులుగారు రాజ మహేంద్రవరము శాస్త్ర పాఠశాలాధికారియైన మెట్కాఫ్ దొరగారికి అంకితము చేసిరి.

1879 : శుద్ధాంధ్ర భారత సంగ్రహము. దీనిలోని సభా పర్వములోని కొంత భాగము, 1872 సం॥ న కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి ఆంధ్ర భాషా సంజీవనిలో ప్రచురింపబడినది. పుస్తక

రూపమున చెన్నపురి శ్రీనిలయ ముద్రాక్షరశాలలో ముద్రితము.

1879 : శ్రీ పునర్వివాహ సభా నాటకము (అసంపూర్ణము) పంతులుగారు దీనిని ఆసాంతము పద్యాత్మకముగ రచింప సంకల్పించిరి. కాని ప్ర థ మాం క ము మాత్రమే ముగింపబడి వివేకవర్ధని యందు ప్రకటింపబడినది.

1879 : వ్యవహార ధర్మబోధిని. బ్రాహ్మ వి వా హ ము ముగిసిన తరువాత హాస్య సంజీవనిలో యీ నాటకము ప్రచురింపబడినది. సంఘములోని పెద్దల యొక్కయు, అధికారుల యొక్కయు అక్రమ వర్తనమును యీ నాటకము నిరూపించుచుండును. నవ్వుపుట్టించు సంభాషణలతో నుండి. ప్లీ డ రు నాటక మను పేరున ఇది ప్రసిద్ధికెక్కినది.

1879 జులై 7 : శ్రీ పునర్వివాహ విషయకోపన్యాసము విజయనగర మహారాజాగారి బాలికా పాఠశాలలో నొసగబడినది.

1879 ఆగష్టు 3 : శ్రీ పునర్వివాహ విషయక ప్రథమ విజ్ఞాపనము. విజయనగర రాజాగారి బాలికా పాఠశాలలో చేయబడినది.

1879 సెప్టెంబరు : శ్రీ పునర్వివాహ ప్రవర్తక సమాజ విజ్ఞాపనము. విజయనగర మహారాజాగారి బాలికా పాఠశాలలో చేయబడినది.

1879 అక్టోబరు 12 : శ్రీ పునర్వివాహ వి ష య క ద్వితీయ విజ్ఞాపనము. విజయనగర మహారాజాగారి బాలికా పాఠశాలలో చేసిన ఉపన్యాసము.

1880 : రత్నావళి. శ్రీ హర్షదేవుని సంస్కృత నాటకమున కాంధ్రీకృతి. ధార్వాడ నాటక సమాజము వారు 1880 వ సం॥ న రాజమహేంద్రవరమున గొప్ప పాకవేసి దానిలో తమ నాటకముల నాడిపోయిన తరువాత పాక తీసివేయకముందే ఆ నాటకశాలలో నాడింపవలెనన్న కుతూహలముతో పంతులుగారు యీ నాటకమును, షేక్స్పియరు మహాకవి విరచితమైన కామెడి ఆఫ్ ఎర్రర్స్ అను నాటకమునకు అనువాదమైన చమత్కార రత్నావళి యను నాటకమును నాడించియున్నారు. ఆంధ్రదేశమున తెనుగు నాటకముల స్టేజి ప్రదర్శనముల కిది నాంది.

1880 : చమత్కార రత్నావళి. షేక్స్పియరు మహాకవి కామెడి ఆఫ్ ఎర్రర్స్ అను నా ట క ము న కు గద్యాత్మక మగు అనువాదము.

1880 : వివేక దీపిక. శ్రీ పునర్వివాహమునకు సంబంధించిన శాస్త్ర చర్చలతో నిండిన మూడు అంకముల నాటకము. పంతులుగారు దీనిని పూర్తి చేయలేదు.

1880 : వినీసు వర్తక చరిత్రము. (అసంపూర్ణము) షేక్స్పియరు మహాకవి The merchant of Venice అను నాటకమునకు అ ను వా ద ము. పంతులుగారు దీనిని యథాతథముగ అనువదించియున్నారు. పేర్లు, దేశాచారములు మార్చియుండలేదు. పంతులుగారు-దీనిని ద్విపదయందు కూర్చుటకు సంకల్పించిరి. రెండు అంకములు మాత్రమే ముగించిరి.

1880 : హిందూ మతములు. విజయనగర మహారాజావారి బాలికా పాఠశాలలో చదవబడిన ఉపన్యాసము.

1880 : వర్ణములు. విజయనగర రాజాగారి బాలికా పాఠశాలలో ప్రార్థనా సమాజ పక్షమున చేయబడిన ఉపన్యాసము.

1880 : రాజశేఖర చరిత్రము. 1878 సం॥ న వివేక వర్ధనిలో భాగ భాగములుగా ప్రచురింపబడి తదుపరి 1880 సం॥ న పుస్తక రూపమున ముద్రింపబడినది. అప్పటి విద్యా విచారణాధికారియగు కల్నల్ మెక్డానల్డు దొరగారికి అంకితము. రెవరెండు

హచ్చిన్సను అను క్రైస్తవ మతాచార్యుడు యీ రాజశేఖర చరిత్రమును ఆంగ్లములోనికి అనువదించి క్రిస్టియన్ కాలేజి మ్యాగజేనునందు 1886 సం॥ న కొంత భాగము ప్రకటించి 1887 సం॥ న లండను నగరమునందు Fortunes Wheel (అదృష్ట చక్రము) అను పేరిట పుస్తక రూపమున ప్రకటించిరి. ఇది కన్నడ భాషలోనికి కూడ అనువదింపబడి బెంగుళూరున ముద్రింపబడినది. ఇప్పటికి రాజశేఖర చరిత్రము తొమ్మిది ముద్రణల నొందినది.

1880 ఫిబ్రవరి : సర్వతోముఖము (వివేకవర్ధనిలో వ్యాసము)

1880 మార్చి : స్త్రీ విద్య.

1880 మార్చి : కాలముయొక్క విలువ.

1880 మార్చి : అపాత్ర దానము.

1880 ఏప్రియల్ : ద్విజులలోని గొప్ప దురాచారము.

1880 ఏప్రియల్ : హిందూదేశాభివృద్ధి మార్గము.

1880 మే : కన్యాశుల్కము.

1880 జూన్ : హిందూమహాజనుల యుపేక్ష.

1880 జూన్ : త్రాగుబోతు తనము.

1880 జులై : దేశాభిమానము.

1880 జులై : విద్యాభ్యాసోద్దేశము.

1880 ఆగష్టు : సత్కార్యాచరణ ధైర్యము.

1880 నవంబరు : శవవహన సాహాయ్యము.

1880 నవంబరు : స్త్రీ విద్య.

ఈ పదునాల్గు వ్యాసములు వివేకవర్ధనియందు వెలువడినవి.

1881 : చమత్కార రత్నావళి. (The Comedy of Errors) అనునాటకమునకు కథారూపమైన అనువాదము. Lamb's Tales from Shakespeare నుండి పంతులుగారు యీ కథను అనువదించిరి.

1881 : అతిబాల్య వివాహములు. విజయనగర మహారాజావారి బాలికా పాఠశాలలో నొసగబడిన ఉపన్యాసము.

1881 : జన్మాంతరము. ప్రార్థనాసమాజ పక్షమున విజయనగర మహారాజావారి బాలికా పాఠశాలలో చేయబడిన ఉపన్యాసము.

1881 జనవరి : సంఘ విద్యాభ్యాసము.

1881 ఫిబ్రవరి : వైద్యులు.

1881 ఫిబ్రవరి : భోగస్త్రీ పుత్రికా స్వీకారము.

1881 మార్చి : కృష్యాది వ్యాపారములు.

1881 మార్చి : రాజకీయ పాఠశాలలు.

1881 ఏప్రియల్ : ఔషధ దానము.

1881 ఏప్రియల్ : సుజ్ఞానము.

1881 మే : దేశాభివృద్ధి ప్రయత్నము.

1881 జూన్ : అతిబాల్య వివాహము.

1881 జూన్ : వివాహ వ్యయము.

1881 జూన్ : దేశాభివృద్ధికర మార్గము.

1881 జులై : శిశుపోషణము.

1881 జులై : దేశాభిమానము.

1881 సెప్టెంబరు : భర్తకు భార్యవిషయమున నడుపవలసిన ధర్మములు.

1881 అక్టోబరు : విద్యకంటె నీతి ముఖ్యం.

1881 అక్టోబరు : దేశభాషలు.

ఈ పదహారు వ్యాసములును వివేకవర్ధనియందు వెలువడినవి.

1882 జనవరి 20 : స్త్రీ పునర్వివాహ శాస్త్రసంగ్రహము. విజయనగర మహారాజావారి బాలికా పాఠశాలలో నివ్వబడిన ఉపన్యాసము.

1882 మార్చి : విద్యాధికుల యర్హకృత్యములు.

1882 జూన్ : ఆంధ్ర భాషాభివృద్ధి.

1882 జులై : దానధర్మములు.

1882 ఆగష్టు : మతకలహములు.

1882 ఆగష్టు : వృద్ధవివాహములు.

1882 సెప్టెంబరు : పీఠాధిపతులు;
ఈ ఆరు వ్యాసములు వివేకవర్ధనియందు వెలువడినవి.

1883 : సత్యవతీ చరిత్ర. స్త్రీల ఉపయోగార్థమై పంతులుగారు ప్రారంభించిన సతీహితబోధిని యను మాస పత్రికయందు వెలువడినది. ఈ సత్యవతీ చరిత్రము తమిళము, కన్నడము, ఇంగ్లీషు భాషల లోనికి అనువాదము చేయబడినది. దీనిని స్త్రీలు మాత్రమేకాక పురుషులుకూడ మిక్కిలి ఆసక్తితో చదువసాగిరనియు, చదివి ఆనందించినవా రనేకులు తమకు పుట్టిన స్త్రీ శిశువుల కందలి కథానాయకురాలైన సత్యవతి పేరు పెట్టిరనియు, ఇది ప్రాడ్వివాకులు మొదలైనవారి పరీక్షలకు కూడా పఠనీయ గ్రంథముగ నిర్ణయింపబడిన దనియు పంతులుగారు తమ స్వీయ చరిత్రమునందు వ్రాసిరి.

1883 : శాకుంతలము. పంతులుగారు శాకుంతలానువాదమును 1876 లోనే ప్రారంభించిరి. పుస్తకరూపమున 1883 న ప్రకటించిరి.

1883 జనవరి : బాలికా పాఠశాలల కుపాధ్యాయినులు. (వివేకవర్థని).

1883 జనవరి : దేశాభివృద్ధి. (వివేకవర్థని)

1883 ఏప్రియల్ : సత్యాద్రౌపది సంవాదము (ద్విపద) (సతీహితబోధిని).

1883 మే : చదువెరుగని స్త్రీలు తమ బిడ్డలకు శత్రువులు. (సతీహితబోధిని).

1883 జూన్ : విద్యాధికుల యర్హ్యకృత్యములు. (వివేకవర్థని).

1883 జూన్ : విద్యాధురీణుల కృత్యములు. విజయనగర మహారాజావారి బాలికా పాఠశాలయందు ప్రార్థనా సమాజపక్షమున చేయబడిన ఉపన్యాసము.

1883 జూన్ : పతివ్రతా ధర్మము (సతీహితబోధిని).

1883 జులై : అత్తగారి కోడంట్రికము (సతీహితబోధిని).

1883 ఆగష్టు : బాలశిక్షణము (సతీహితబోధిని).

1883 సెప్టెంబరు : భూతదయ (సతీహితబోధిని).

1883 అక్టోబరు : బాలికా విక్రయ వ్యాపారము (వివేకవర్థని).

1883 అక్టోబరు : దేశాభివృద్ధి సాధనము (వివేకవర్థని).

1883 అక్టోబరు, నవంబరు : రిప్పను ప్రభువు స్వాగతము (సతీహితబోధిని).

1883 అక్టోబరు, నవంబరు : మాతృపూజ (ద్విపద) (సతీహితబోధిని).

1883 అక్టోబరు, నవంబరు : తల్లిదండ్రులను పూజించుట (సతీహితబోధిని).

1883 అక్టోబరు, నవంబరు : మితవ్యయము (సతీహితబోధిని).

1883 అక్టోబరు, నవంబరు : దేహారోగ్యము (సతీహితబోధిని).

1883 అక్టోబరు, నవంబరు : అజీర్ణము (సతీహితబోధిని).

1883 నవంబరు : ఇతరులను సత్కార్యములకు త్రిప్పువారి క్రమము (వివేకవర్థని).

1883 డిశంబరు, 1884 జనవరి : స్త్రీలు చదువ వలసిన విషయములు (సతీహితబోధిని).

1883 డిశంబరు, 1884 జనవరి : ధనము (సతీహితబోధిని).

1883 డిశంబరు, 1884 జనవరి : పితృపూజ (ద్విపద) (సతీహితబోధిని).

1884 : చంద్రమతీ చరిత్రము. (స్త్రీలకొరకై చేయబడిన చిన్న వచన ప్రబంధము)

1884 : స్త్రీ నీతి దీపిక: బాలికా పాఠశాలల యందలి బాలికలకై కూర్చబడిన నూరు పద్యములు.

1884 ఫిబ్రవరి : స్త్రీ విద్యాభ్యాసము (వివేకవర్ధని)

1884 ఫిబ్రవరి, మార్చి : సుగుణ దుర్గుణములు. (సతీ హితబోధిని)

1884 ఫిబ్రవరి, మార్చి : పరివర్తనము (వస్తువు లొండొరులు మార్చుకొనుట) (సతీ హితబోధిని)

1884 ఏప్రియల్ : శ్రీ విక్టోరియా మహారాజ్ఞిగారు (సతీ హితబోధిని)

1884 మే : తగవులమారితనము (సతీ హితబోధిని)

1884 జూన్ : భూగోళ స్వభావ దీపిక (సతీ హిత బోధిని యందు ప్రారంభింపబడినది)

1884 జూన్ : పరులమీది దోషములు చెప్పుకొనుట (సతీ హితబోధిని)

1884 జులై : పరోపకారము (సతీ హితబోధిని)

1884 సెప్టెంబరు : అతిబాల్య వివాహము, నిర్బంధ వైధవ్యము (వివేకవర్ధని)

1884 అక్టోబరు : పాటుపడుట (వివేకవర్ధని)

1884 నవంబరు : అతిబాల్య వివాహము (వివేకవర్ధని)

1885 : ప్రహ్లాద నాటకము. (స్వతంత్రనాటకము)

1885 : ప్రబోధ చంద్రోదయము. (కృష్ణమిశ్రుని సంస్కృత నాటకమునకు తెనిగింపు)

1885 : మాళవికాగ్నిమిత్రము. (కాళిదాసుని సంస్కృత నాటకమునకు తెనిగింపు)

1885 : దక్షిణ గోగ్రహణము (స్వతంత్ర నాటకము)

1885 : రాగ మంజరి. (షెరిడన్ అను ఇంగ్లీషు కవీశ్వరుని "ది డ్యుయన్నా" అను నాటకమునకు తెనిగింపు)

1885 : దేశీయ మహాసభయు, దాని ఉద్దేశ్యములును. (ఈ వ్యాసము వలన పంతులుగారి రాజకీయాభిప్రాయములు తెలుసుకొనవచ్చును)

1885 మార్చి : సంఘ దురాచార నివారణమునకు స్త్రీ విద్య యావశ్యకము (వివేకవర్ధని)

1885 మార్చి : ఇంగ్లీషు ప్రభుత్వము వలని లాభములు (వివేకవర్ధని)

1885 జూన్ 9 : రాజమహేంద్రవర స్త్రీ పునర్వివాహ చరిత్రము. విజయనగర మహారాజాగారి బాలికా పాఠశాలలో చేయబడిన ఉపన్యాసము.

1885 ఆగష్టు : మన బాలుర నీతి వర్తనము(వివేకవర్ధని)

1885 సెప్టెంబరు : కులీన బ్రాహ్మణ వివాహములు (వివేకవర్ధని)

1885 సెప్టెంబరు : రాజ్యాంగ సంస్కరణము, కులాచార సంస్కరణము (వివేకవర్ధని)

1885 నవంబరు : అతిబాల్య వివాహము, నిర్బంధ వైధవ్యము.

1886 : సత్య హరిశ్చంద్ర (స్వతంత్ర నాటకము) హరిశ్చంద్ర కథను నాటకముగా చేయుటలో పంతులుగారు ప్రథములు.

1886 మార్చి 13 : దంభాచార్య విలసనము ప్రథమ భాగము (ప్రహసనము) (వివేకవర్ధని)

1886 ఏప్రియల్ : అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము (వివేకవర్ధని)

1886 ఏప్రియల్ : శారీరశాస్త్ర సంగ్రహము (వివేక వర్ధనియందు మొదటి ప్రకరణము ప్రారంభింప బడినది)

1886 ఏప్రియల్ 5 : ప్రార్థన. విజయనగర మహారాజా వారి బాలికాపాఠశాలలో నొసగిన ఉపన్యాసము.

1886 మే 12 : దంభాచార్య విలసనము– ద్వితీయ భాగము (ప్రహసనము) (వివేకవర్ధని)

1886 సెప్టెంబరు : నీతి విద్య (వివేకవర్ధని)

1886 అక్టోబరు : అతిబాల్య వివాహము, నిర్బంధ వైధవ్యమును (వివేకవర్ధని)

అక్కిరాజు రమాపతిరావు

1886 నవంబరు : దేశభాష (వివేకవర్ధని)

1886 డిశంబరు : "అర్థస్యపురుషోదాసః"(వివేకవర్ధని).

1887 : కవుల చరిత్ర ప్రథమ భాగము. 1886 లో కవుల చరిత్ర వివేకవర్ధనియందు ప్రారంభింప బడినది. 1886 మే సంచికలో నన్నయభట్టును గూర్చిన వ్యాసమున్నది. ఆ సంచికలోనే తిక్కనసోమ యాజిని గూర్చియుకలదు. జూన్‌లోను తిక్కన సోమయాజి చరిత్రకలదు. జులై సంచికలో ఆథ ర్వణాచార్యులను గురించి కలదు. ఆగష్టుసంచిక మొత్తము కవులచరిత్రము. 1892 నుంచి రెండవ భాగము చింతామణియందు ప్రచురింపబడినది. 1887 లో మూడవభాగము చింతామణిలో అను బంధముతోసహా పంతులుగారు ప్రచురించిరి. 1899 లో మూడు భాగములు కలిపి ఒకే సంపుట ముగా పంతులుగారు ప్రచురించియున్నారు. 1917 లో కవుల చరిత్ర ప్రథమభాగము సంస్కరించి, విశేషాంశములతో, పంతులుగారు ప్రకటించి యున్నారు.

1887 : సత్యసంజీవని (సతీహితబోధినియందు 1884 సం॥ నందు ప్రచురింప బడినది.)

1887 జనవరి 15 : స్త్రీ పునర్వివాహ వ్యాపారము యొక్క భూతభవిష్యద్వర్తమానములు.
విజయనగర మహారాజాగారి బాలికా పాఠశాలలో చేసిన ఉపన్యాసము.

1887 మార్చి 26 : దానములు
విజయనగర మహారాజాగారి బాలికా పాఠశాలలో చేసిన ఉపన్యాసము

1887 ఏప్రియల్ : త్రాగుబోతుతనము. (వివేకవర్ధని)

1887 ఏప్రియల్ : కులాచారమతాచార సంస్కరణము.

1887 జూన్ : భార్యాభర్తల ఐకమత్యము.

1887 జులై : అదృష్టము.

1887 జులై : స్వ బంధుజనాభిమానము

1887 జులై : కులాచార సంస్కరణము.

1887 ఆగష్టు : మతద్వేషము.

1887 ఆగష్టు : వల్లభాచార్యమతము.
ఈ పైయెనిమిది వ్యాసములును వివేకవర్థనియందు వెలువడినవి.

1888 : జంతుస్వభావ చరిత్ర. సతీహితబోధినియందు వెలువడి, 1896 లో పుస్తకరూపముదాల్చినది.

1888 : శరీరశాస్త్రము. (పుస్తకరూపమున ముద్రింపబడి నది).

1888 : హాస్యసంజీవని ప్రథమభాము; (పుస్తకరూపమున ముద్రింపబడినది). ఇందు 19 ప్రహసనములు కూర్చబడినవి.

1888 జనవరి . గర్వము.

1888 ఫిబ్రవరి : బిడ్డల నాజ్ఞలోనుంచుట.

1888 ఏప్రియల్ : భవిష్యత్తును చెప్పుట.

1888 మే : జ్యోతిశ్శాస్త్రము.

1888 జూన్ : గృహిణీ ధర్మము.

1888 జులై : అమితత్వము.

1888 ఆగష్టు : దేహ మనస్సౌందర్యములు.

1888 సెప్టెంబరు : అగ్నిపర్వతములు.

1888 సెప్టెంబరు : శకునములు.

1888 అక్టోబరు : ఆభరణములు.

1888 అక్టోబరు : సూక్ష్మవస్తుదర్శక యంత్రములు.

1888 నవంబరు : జీవకారుణ్యము; (సతీహితబోధిని).

1888 డిశంబరు : మంచుగడ్డ.

1888 డిశంబరు : హిందూసుందరుల ప్రస్తుతస్థితి.
పై 13 వ్యాసములు సతీహితబోధినిలో వెలువడి నవి.

1889 : దేహారోగ్య ధర్మబోధిని.(సతీహితబోధినియందు 1884వ సం॥ నందు వెలువడినది.)

1889 : సతీహిత బోధిని:

1883వ సంవత్సరమునందు స్త్రీలయుపయోగార్థమై పంతులుగారు సతీహితబోధిని యను మాసపత్రికను ప్రారంభించియున్నారు. 1883 నుండి 1889 వరకు ఆ పత్రికయందు ప్రచురించిన వ్యాసములన్నిటి నొక్కచోచేర్చి సతీహితబోధిని యను పేరున పుస్తకరూపమున ముద్రించిరి. ఈ పుస్తకమునందు మొత్తము 35 వ్యాసములు చేర్చబడినవి.

1889 : తిర్యగ్విద్వన్మహాసభ:

ఆక్షేపగర్భనాటకము. సంఘములోని పెద్దమనుషలను హేళనచేయునట్టి సంభాషణా రూపకమైన నాటకము. మూషకాసుర విజయముతో కలిపి పంతులుగారు. దీనిని ప్రచురించిరి.

1889 : మహారణ్య పురాధిపత్యము.

(ఆక్షేప గర్భ సంభాషణము)

1889 జనవరి : కళావతీ పరిణయము; ఛార్లస్‌ల్యాంబ్ రచించినకథలలోని The cymbaline అను నాటక కథకు అనువాదము. ( సతీహితబోధినియందు ప్రచురింపబడినది.)

1889 ఫిబ్రవరి : కళావతీ పరిణయము.(సతీహితబోధిని) (ఈ సంచికయందు ముగింపు చేయబడినది).

1889 మార్చి : కొండెములు చెప్పుట (సతీ హితబోధిని).

1889 మార్చి : రఘుదేవ రాజీయము (సతీ హిత బోధిని. ఛార్లస్ ల్యాంబ్ కథలలోని The Pericles అను నాటక కథకు అనువాదము.)

1889 ఏప్రిల్ : పాతివ్రత్యము (సతీ హితబోధిని).

1889 ఏప్రిల్ : రఘుదేవ రాజీయము, The Perciles, నాటక కథ కనువాదము.

1889 మే : రఘుదేవ రాజీయము. : (ఈ సంచికయందు పూర్తిగావింపబడినది).

1889 మే : పాములు. (సతీహితబోధిని).

1889 మే : సహనమును ధైర్యమును(సతీహితబోధిని).

1889 మే 28 : మాకర్ల సుబ్బారావునాయుడుగారు. (ఉ.)

1889 అక్టోబరు 27 : ఈశ్వరదత్త పుస్తకములు. విజయనగర మహారాజావారి బాలికాపాఠశాలయందు ప్రార్థనాసమాజ పక్షమున నొసగబడిన యుపన్యాసము.

1891 : హాస్య సంజీవని ద్వితీయభాగము వివిధ పత్రికలలో పంతులుగారు ప్రచురించిన ప్రహసనములు 17 చేర్చి పుస్తక రూపమున ముద్రింపబడినవి.

1891 : సత్యరాజా పూర్వదేశయాత్రలు– ప్రథమభాగము. ఆడుమళయాళమును Jonathan Swift, Gulliver's Travells ఆధారముగా, స్త్రీల విషయమున మనవారు చేసిన యన్యాయములు తేటపడునట్లుగా వ్యాజరీతిని రచించి ప్రకటించిరి.

1891 : అలంకార సంగ్రహము. 1887 లో రాజకీయ శాస్త్ర పాఠశాలలోని పట్టపరీక్ష తరగతి విద్యార్థుల కొరకై దీనిని రచించినట్లు పంతులుగారు తెలిపియున్నారు. 1891 ఆగష్టు సంచికనుండి ప్రారంభింపబడి చింతామణిలో ప్రచురింపబడినది. 1903 లో ప్రథమ ముద్రణమొందినట్లు (పుస్తక రూపమున) పంతులుగారు పీఠికలో తెలియజేసియున్నారు.

1891 మార్చి 9 : ఈశ్వరోపాసనము (మహారాజావారి బాలికా పాఠశాలలో ప్రార్థనసమాజ పక్షమున పంతులుగారిచ్చిన ఉపన్యాసము).

1891 ఏప్రిల్, మే : కురంగేశ్వర వర్తక చరిత్రము ఛార్లస్ ల్యాంబ్ కథలననుసరించి The Merchant of Venice అను నాటక కథకు పంతులుగారు చేసిన అనువాదము. చింతామణి పత్రికయందు వెలువడినది.

అక్కిరాజు రమాపతిరావు

1892 : జంతు స్వభావచరిత్రము. ప్రథమమున చింతామణియందు ప్రకటింపబడినది. తదుపరి 1896 లో పుస్తకరూపము దాల్చినది.

1892 : పథిక విలాసము. Oliver Goldsmith రచించిన The Traveller అను కావ్యమునకు తెనుగు సేత.

1892 ఏప్రియల్ 30 : మానుష ధర్మము. విజయనగర మహారాజావారి బాలికపాఠశాలలో నొసగబడిన ఉపన్యాసము.

1892 ఆగష్టు : హిందూమత సభ (ప్రహసనము) (సత్య సంవర్ధని).

1892 సెప్టెంబరు : కులాచార సంస్కారపూర్వ నాగరిక పంచరత్నములు (సత్యసంవర్ధని).

1892 అక్టోబరు : కలిపురుష శనైశ్చర్య విలాసము (ప్రహసనము) (సత్యసంవర్ధని) మూడు సంచికలలో వచ్చినది.

1892 నవంబరు. డిశంబరు : యోగాభ్యాసనము (ప్రహసనము) (సత్యసంవర్ధని). రెండు సంచికలలో వచ్చినది.

1893 మే : వేశ్యకాంతల గూర్చిన ఉపన్యాసము. విజయనగర మహారాజావారి బాలికా పాఠశాలలో నొసగబడిన ఉపన్యాసము.

1893 : విద్యాధికుల ధర్మములు. ప్రార్థనాసమాజ పక్షమున నొసగబడిన ఉపన్యాసము.

1893_1894 : సత్యరాజాపూర్వదేశ యాత్రలు. చింతామణి పత్రికయందు రెండవభాగమయిన లంకా ద్వీపము వెలువడినది.

1893_1894 : నీతికథా మంజరి అను ఈసప్ నీతికధలు. రెండుభాగములు. మొత్తము, 158 చిన్నకధలు. 71. చిత్రపటములు. 1892_1893 సం॥వత్సరములలో చింతామణి పత్రికయందు వెలువడినది. రెండు భాగములలో కలసి తొమ్మిది పద్యకథలు గూడ నున్నవి. ప్రతికథకును ఒక నీతిపద్యము చేర్పబడినది.

1893 ఆగష్టు : దేశాభిమానము. వివేకవర్ధనిలో వ్యాసము.

1893 నవంబరు : సత్కార్య శూరత్వము (వివేక వర్ధని).

1894 : కల్యాణ కల్పవల్లి. షెరిడన్ అను ఆంగ్లేయ కవీశ్వరుని The Rivals అను ఆంగ్ల నాటకమునకు తెనిగింపు.

1894 : సకాయకష్ట కర్మలు. విజయనగర మహారాజావారి బాలికా పాఠశాలలో నొసంగబడిన ఉపన్యాసము.

1894 : స్వయంకృషి. విజయనగర మహారాజావారి బాలికా పాఠశాలలో నొసగబడిన ఉపన్యాసము.

1894 జనవరి : దివ్యజ్ఞాన సమాజచరిత్ర (వివేకవర్ధని)

1894 ఏప్రియల్, మే : అన్నాబాయి (అనిబిసెంటు). (చింతామణి).

1894 ఏప్రియల్, మే : స్వదేశ సంస్థాన చరిత్రాదులు (హైదరాబాదు రాష్ట్రము).

1894 జూన్ : కూచిబీహారు రాజ్యము. (చింతామణి.)

1894 జులై : జయపుర రాజ్యము (చింతామణి).

1894 ఆగష్టు : ఉదయపుర రాజ్యము.

1894 సెప్టెంబరు : జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము (చింతామణి పత్రికయందు ప్రకటింపబడినది).

1894 అక్టోబరు : జాడ్పుర రాజ్యము (చింతామణి).

1894 నవంబరు : ట్రావెన్కూరు రాజ్యము (చింతామణి).

1894 డిశంబరు : మైసూరురాజ్యము (చింతామణి).

1895 : వైరాగ్యము. మహారాజావారి బాలికా పాఠశాలలో నివ్వబడిన ఉపన్యాసము.

1895 జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము. పుస్తకరూపమున ముద్రింపబడినది. 50 పటములకంటె ఎక్కువగా ఇంగ్లండునుంచి తెప్పించి పంతులుగారు దీని యందు ముద్రించి యున్నారు. 1894 లో భాగము లుగా చింతామణియందు వెలువడినవి.

1895 జనవరి : బరోడా రాజ్యము (చింతామణి).

1895 ఏప్రియల్ : గ్వాలియర్ సంస్థానము (చింతామణి).

1895 మే : కాశ్మీరు రాజ్యము.

1895 జూన్ : ఇందూర్ సంస్థానము.

1895 జూన్ : దూర్భంగ రాజ్యము.

1895 : చింతామణి యందు ప్రకటింపబడిన స్వదేశ సంస్థానములు కలిపి పుస్తకముగ ముద్రింపబడినది.

1895 అక్టోబరు : అహల్యాబాయి (చింతామణి).

1895 అక్టోబరు : సరస్వతి నారద విలాపము (చింతామణి).

1895 అక్టోబరు : మాంసభక్షక వృక్షములు (చింతామణి).

1895 నవంబరు : బదరికాశ్రమ యోగి (చింతామణి).

1896 : జీవితపరమార్ధము, దానిని పొందు మార్గములు. (బాలికా పాఠశాలలో చదివిన ఉపన్యాసము).

1896 : జంతు స్వభావ చరిత్ర (చింతామణిలో ప్రచురింప బడినది).

1896 : పత్నీహిత సూచని (1883 లో సతీహిత బోధినిలో ప్రచురింపబడి యిప్పుడు పుస్తకరూపమున ప్రకటింపబడినది).

1896 జనవరి : సజ్జల పండితుడు (చింతామణి).

1896 మార్చి : లక్ష్మీశనైశ్చర విలాసము, బాదము కాయ, వరికంకులు, కణుదురీగ, రొట్టెలు అను నీతి కథలు చింతామణి యందు ప్రచురింపబడినవి.

1896 ఆగష్టు : శ్రీ రాజారామ మోహనరాయలు చరిత్రము సత్యసంవర్ధనిలో ప్రారంభింపబడినది. పంతులు గారి అసంపూర్ణ రచనలలో యిది యొకటి.

1896 అక్టోబరు : పండిత రామాబాయి సరస్వతి. (చింతామణి).

1896 నవంబరు : పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరులు. (చింతామణి).

1897 : విక్టోరియా జ్యూబిలీ నవరత్నములు.

1897 : విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము.

1897 జనవరి : పూర్వాచారము. (ప్రహసనము). (సత్యసంవర్ధని) ఈ ప్రహసనము హాస్యసంజీవని మూడవ భాగమునందు కలదు. కాబట్టి హాస్య సంజీవని తృతీయ భాగము 1897 లో వెలువడిన దని ఊహింపవచ్చును.

1897 జనవరి 6 : విగ్రహారాధనము. ప్రార్ధనా సమాజము పక్షమున బాలికాపాఠశాలలో నొసగబడిన ఉపన్యాసము.

1897 జూన్ 8 : గోదావరీ మండల సాంఘిక సభలో చేసిన ప్రసంగము.

1899 నవంబరు : అపూర్వ నాగరికత. (ప్రహసనము) (సత్య సంవర్ధిని).

1900 : ప్రవర్తనము. (పఠనాలయములో చేయబడిన ఉపన్యాసము).

1900 డిశంబరు, 1901 జనవరి : స్త్రీ పునర్వివాహ ప్రహసనము. (సత్యసంవర్ధని).

1901 మార్చి : శంకరాచార్యులు. (సత్య సంవర్ధని).

1901 సెప్టెంబరు : సౌదామినిరాయ్. (తెలుగు జనానా).

1901 సెప్టెంబరు : అలెగ్జాండరు మహారాజ్ఞి చరిత్రము (హిందూ సుందరి).

1901 అక్టోబరు : ఉత్తమ మాత (వ్యాసము) (తెలుగు జనానా).

అక్కిరాజు రమాపతిరావు

1904 : అక్టోబరు, పావిత్రి సత్యవతి సంభాషణము (తెలుగు జనానా) (ప్రహసనము).

1904, 1905 : భౌతికశాస్త్ర సంగ్రహము. (తెలుగు జనానా).

1906 జనవరి : భండారు అచ్చమాంబగారు, (తెలుగు జనానా).

1906 ఏప్రియల్ 1 : సత్యవాదిని. (ప్రార్థనాసమాజ మున చదువబడిన ఉపన్యాసము)

1906 ఏప్రియల్ 15 : పరిశుద్ధాస్తిక మతము. (సత్య వాదిని) గుంటూరు ఆంధ్రదేశాస్తిక సభయందు చదివిన ఉపన్యాసము.

1906 : రాజమహేంద్రవర ప్రార్థనా సమాజము. (సత్యవాదిని).

1908 ఏప్రియల్ 1 : సన్మతము. (సత్యవాదిని).

1908 ఏప్రియల్ 1 : గృహము భూతల స్వర్గము. (సత్యవాదిని).

1911 : స్వీయ చరిత్ర. మొట్ట మొదట దీనియొక్క ప్రథమ భాగమును విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి వారు ప్రచురించిరి. తదుపరి దీనియొక్క ద్వితీయ భాగమును 1915 లో వారే ప్రచురించిరి. తదుపరి 1937 లో హితకారిణి సమాజమువారు రెండు భాగములను కలిపి ఒకే సంపుటముగ ప్రకటించియున్నారు. తదుపరి హితకారిణి సమాజమువారిచే ఇదే 1951 లో తిరిగి ముద్రింపింపబడి నది. హితకారిణి సమాజమువారీ స్వీయ చరిత్రము సంగ్రహపరిచి 1962 లో మరల ఇంకొకసారి ప్రకటించి యున్నారు. అనగా స్వీయ చరిత్రము ఇప్పటికి నాలుగు సార్లు ముద్రింపబడినది.

1913 : జీసస్ చరిత్ర :

1894 లో హిందూజన సంస్కారిణి అను పత్రిక యందు ప్రారంభింపబడి నాలుగు ప్రకరణములతో నిలిచిపోయినది. తదుపరి, 1913 లో తక్కిన రెండు ప్రకరణములను పూర్తిచేసి పంతులుగారు పుస్తకరూపమున దీనిని ప్రకటించిరి.

1915 మార్చి : కీర్తిశేషులైన దేశిరాజు పెదబాపయ్య గారు. (ధర్మసాధని).

1919 : సవ్యాంధ్ర వ్యాకరణము. (అసంపూర్ణము).

1919 : బమ్మెర పోతరాజు. (ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక).

## గ్రంథరచనా ప్రచురణములు

## తేదీలుతెలియని పంతులుగారి కొన్నిరచనలు

1. విచిత్ర వివాహ ప్రహసనము.
2. మహాబధిర ప్రహసనము.
3. పునర్మరణ ప్రహసనము.
4. బలాత్కార గాన వినోద ప్రహసనము.
5. కలహప్రియ ప్రహసనము.
6. మహా మహోపాధ్యాయ ప్రహసనము.
7. యోగానిద్ర ప్రహసనము.
8. మహావంచక ప్రహసనము.
9. అసహాయ శూర ప్రహసనము.
10. వేశ్యా ప్రియ ప్రహసనము.
11. కౌతుకవర్ధని.
12. వినోద తరంగిణి.

ఇవి పంతులుగారు ప్రచురించిన పది సంపుటములలో మొదటి సంపుట మందు చేర్చబడినవి. ఇట్లే పంతులు గారు పుస్తకరూపమున ప్రచురించిన హాస్యసంజీవను (మూడు భాగములు) ల యందలి 41 ప్రహసనముల తేదీలు తెలియవు. పంతులుగారు నడిపిన పత్రికా సంపుటములు లభించిన కాని ఇవి రచింపబడిన తేదీలను సాధించుట కష్టము. ఇదే విధముగా స్త్రీల కుపయోగించు కథలు అను పేరున పంతులుగారు ప్రకటించిన ల్యాంబ్

కథల ననుసరించి చేయబడిన కథలలో పన్నెండు కథలకు తేదీలు తెలియవు. ఇదే విధముగా ఉపన్యాసమంజరిలో చేర్చబడిన 21 వ్యాసములలో 16 వ్యాసములకు తేదీలు తెలియవు. వరుసగా ఇవి :

1. ఆచారము.
2. అపాత్రదానము.
3. గురుశుశ్రూష.
4. పెళ్ళి వెళ్ళిన తరువాత పెద్ద పెళ్ళి.
5. ఉన్మత్త ప్రలాపము.
6. గ్రహణములు.
7. యోగ్యాయోగ్య విచారము.
8. వర్షము.
9. హిందూ మహాజనుల మత సభ.
10. శకునములు.
11. దురాచార దూషణము.
12. నవనాగరికులు.
13. లోకోత్తర వివాహము.
14. రోగ చికిత్స
15. మూఢభార్య - మంచి మగడు.
16. శిశు పోషణము.
17. కులాభిమానము.
18. వసూళ్ళు.
19. నాడుల భేదము - విద్వత్సభ.
20. వేశ్యావిషయ సంవాదము.
21. స్వర్గలోక సుఖము.
22. చంద్రగ్రహణము - తేలుమందు.
23. నారద సందర్శనము.
24. యజ్ఞప్రయత్నము (భార్యాభర్తల సంవాదము).
25. జమాదారి ధర్మ ఖర్చు.
26. హిందూ వివాహములు.
27. వినాయక చతుర్థి.
28. అంత్య పుష్కర మహాత్మ్యము.
29. జమాబందీ - ౧
30. జమాబందీ - ౨
31. గొట్టాలమ్మ సభ.
32. బహు భార్యాత్వము.
33. బహిష్కార పత్రికలు.
34. బాల భార్యా వృద్ధ భర్తృ సంవాదము.
35. కన్యాశుల్కము.
36. వినాయక చతుర్థి (చవితి)
37. అతిబాల్య వివాహము.
38. మ్యునిసిపల్ నాటకము.
39. కామరూప మంత్రము.
40. లులాయ శాస్త్రి.
41. లక్క గేదె.

దీనిలో మ్యునిసిపల్ నాటకము, మూడంకముల చిన్న నాటకము, ప్రథమాంకమున మూడు రంగములు, ద్వితీయాంకమున మూడు రంగములు, తృతీయాంకమున రెండు రంగములు దీనియందు కలవు. దీనిని నాటకముల సంపుటి యందు చేర్చియుండవలసినది. ఇదే విధముగా మొదటి సంపుటము ప్రహసనముల యందు చేర్చిన కౌతుకవర్ధని కూడ మూడంకముల నాటకమే. దీనియందు కూడ ప్రదేశము లనుపేర రంగవిభజన మున్నది. ఈ కౌతుకవర్ధని, మ్యునిసిపల్ నాటకము లను, నాటకముల సంపుటియందు చేర్చి, నాటక సంపుటమున చేర్చిన తిర్యగ్విద్వన్మహాసభ, మహారణ్య పురాధిపత్యము అను ప్రహసన ప్రాయములైన రచనలను యీ ప్రహసనముల సంపుటమునందు చేర్చి యుండవలసినది. ఇక,

1. సతీమణి విజయము.
   ( All's Well that Ends Well )
2. సుమిత్ర చరిత్రము.
   ( The Winters Tale )

అక్కిరాజు రమాపతిరావు

3. గయ్యాళిని సాధుచేయుట.

( The Taming of the Shrew )

4. చిత్రకేతు చరిత్రము.

( The King Lear )

5. దానకేసరీ విలాసము.

( Times of Athens )

6. వైదర్భీ విలాసము.

( As You Like It )

7. భానుమతీ కళ్యాణము.

( Much Ado About Nothing )

8. సరసిజన మనోభిరామము.

( The Twelfth Night )

9. ధర్మ కవచోపాఖ్యానము.

( Measure for Measure )

10. కుమారద్వయ విలాసము.

( The Two Gentlemen of Verona )

11. పద్మినీ ప్రభాకరము.

( Othello )

12. మాలతీ మధుకరము.

( Romeo and Juliet )

అను ల్యాంబ్ కథలననుసరించి చేయబడిన నాటక కథానువాదములకు తేదీలు తెలియవు. ఇదేవిధముగా ఉపన్యాసమంజరి (8 వ సంపుటమునందు చేర్చబడినది). యందలి

1. మతముయొక్క యావశ్యకము.
2. ఆత్మయొక్క నిత్యత్వము.
3. భగవద్విషయక ధర్మము.
4. దైవసహాయ్యము.
5. భగవన్మహిమయు. కరుణాళుత్వము.
6. ఈశ్వరభక్తి.
7. పాపశిక్షణము.
8. ఇహపర సుఖములు.
9. నీతి.
10. కాలమును సద్వినియోగమునకు దెచ్చుట.
11. అభ్యాసము.
12. మిత్రులు.
13. వ్యభిచారము.
14. సాధువర్తనము.
15. పాటుపడుట.
16. అసద్గ్రంథములు.

అను ఉపన్యాసములయొక్క తేదీలు తెలియవు. ఇదే విధముగా 9 వ సంపుటమునందు చేర్చిన

1. తర్క సంగ్రహము.
2. కావ్య సంగ్రహములయొక్క గ్రంథ రచనా ప్రచురణముల తేదీలు తెలియవు.

సత్యవాదినిలో ప్రచురించబడిన

1. స్త్రీవిద్య యను ప్రహసనమునకును.
2. పాపము — ఈశ్వర కారుణ్యము.
3. అద్వైతమత సంగ్రహము.
4. విశిష్టాద్వైతమత సంగ్రహము.
5. ద్వైతమత సంగ్రహము. అను వ్యాసములకును.

ఉత్తమ స్త్రీ చరిత్రములు అను గ్రంథమునందు కూర్చిన

1. గ్రేస్‌డార్లింగు కన్య.
2. జోన్ ఆఫ్ ఆర్కు.
3. లేడీజేన్‌గ్రే.
4. మేరీ కార్పెంటరు.

అను స్త్రీ చరిత్రముల రచనా, ప్రచురణముల తేదీలు తెలియవు.

ఇవిగాక పంతులుగారు బాలబాలికలకై కొన్ని వాచక పుస్తకములను కూర్చియున్నారు. కర్నల్ మెక్డొనల్డు దొరగారు విద్యా విచారణాధికారిగానున్న కాలములో దొరతనము వారి రెండవ పాఠ్యపుస్తకమును వ్రాసినట్లు స్వీయ చరిత్రలో పంతులుగారు వ్రాసిరి. కర్నల్ మెక్డొనల్డుగారు

1818 వ సం॥ ప్రాంతమున విద్యా విచారణాధికారిగా పనిచేసినట్లు స్వీయ చరిత్రవలన తెలియును. కనుక రెండవ వాచక పుస్తకము – 1878 (?)

ఇవిగాక మాక్మిలన్ అండ్ కంపెనీవారికి

4 వ తరగతి వాచక పుస్తకము, 5 వ తరగతి వాచకము, 6 వ తరగతి వాచకము.

వ్రాసి యిచ్చినారు. వీని తేదీలు తెలియవు.

## పంతులుగారు సంస్కరించి ముద్రింపించిన అముద్రిత గ్రంథములు

1. కవిరాజ మనోరంజనము అను పురూరవశ్చరిత్రము. ... కనపర్తి అబ్బయామాత్యుడు.
2. మొల్ల రామాయణము
3. ప్రభావతీ ప్రద్యుమ్నము ... పింగళి సూరన.
4. పాంచాలీ పరిణయము ... కాకుమాని మూర్తికవి
5. రామాభ్యుదయము ... అయ్యలరాజు రామభద్రుడు.
6. విజ్ఞానేశ్వరము ... కేతన.
7. ఉత్తర హరివంశము ... నాచన సోమన.
8. చిత్ర భారతము ... చరిగొండ ధర్మన్న.
9. పంచతంత్రము ... నారాయణకవి.
10. రాజశేఖర చరిత్రము ... మాదయగారి మల్లన
11. ఆంధ్ర భాషాభూషణము ... కేతన.
12. కవిసంశయ విచ్ఛేదము ... అడిదము సూరకవి.
13. హరిశ్చంద్రోపాఖ్యానము ... శంకరకవి.
14. ఆంధ్ర భాషార్ణవము ... కోట వెంకనార్యుడు
15. జైమినీ భారతము ... పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు.
16. చమత్కారమంజరి ... సింహాద్రి వెంకటాచార్యుడు.
17. ప్రబోధ చంద్రోదయము ... నంది మల్లయ్య, ఘంట సింగయ్య.
18. దశకుమార చరిత్రము ... కేతన.
19. సుదక్షిణా పరిణయము ... తెనాలి అన్నయార్యుడు.
20. భోజరాజీయము ... అనంతామాత్యుడు.
20. వరాహపురాణము ... నంది మల్లయ్య, ఘంట సింగయ్య.

వీనిలో జైమినీ భారతమును, హరిశ్చంద్రోపాఖ్యానమును పూర్వమే ముద్రణ లొందియుండెను కాని, అవి తప్పులతడికలుగా నుండుటచే పంతులుగారు తిరుగ వానిని సంస్కరించి ముద్రింపించిరి. శబ్దరత్నాకర నిఘంటు కర్తలైన శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యుల వారు తమ నిఘంటువుయొక్క యవతారికలో కొన్ని పూర్వ పుస్తకముల పేరులు చెప్పి వానిపేరులు వినపడుటయేకాని పుస్తకము లెక్కడను కానరావని వ్రాసియున్న వానిలో పంతులుగారు పదింటికంటె హెచ్చుగా సంపాదించి పరిశోధించి ముద్రించిరి.

జనవరి 1902 వ సం॥న వెలువడిన అముద్రిత గ్రంథ చింతామణియందు "ఆంధ్రమహాభారతమును మ॥రా॥శ్రీ వేమూరి వెంకటకిష్ణమ్మ సెట్టి అండ్ సన్సుగారు, బ్ర॥ శ్రీ మ॥రా॥శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి చేతను, రాయదుర్గం నరసయ్యాశాస్త్రిగారి చేతను బరిష్కరింపించి, ముద్రింపించి ప్రకటించియున్నారు" అని కృతివిమర్శనము అను శీర్షికయందు వ్రాయబడియున్నది. బ్రౌను దొరవారు కూర్చిన ఇంగ్లీషు తెలుగు నిఘంటువు యొక్క రెండవ ముద్రణమును పంతులుగారు ప్రకటించిరి. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు "కవిత్వ తత్త్వ విచార మను" విమర్శగ్రంథమును పంతులుగారికి సవరణకొరకుగా తాము బంపినట్లు రామలింగారెడ్డిగారు ఆంధ్ర పత్రికయందు వ్రాసిరి.

అక్కిరాజు రమాపతిరావు

## పంతులుగారు నిర్వహించిన పత్రికలు

### శ్రీ వివేకవర్ధని

### 1874 అక్టోబరు (ప్రథమ సంచిక)

1890 ప్రాంతంలో ఆగిపోయినదని పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాసిరి. కాని వారు ప్రచురించిన వివేకవర్ధని మూడవభాగము అను ఉపన్యాస సంపుటము నందు; 1894 వరకు పత్రికలలో వెలువడిన రచనలు చేర్చబడినవి. ఆ వ్యాసముతరువాత అప్పుడప్పుడు వెలువడుచు వచ్చిన వివేకవర్ధనిలోనివికాని, లేక పంతులు గారు నిర్వహించిన ఇతర పత్రికలలోనివి కావచ్చును. వివేకవర్ధని వెలువడినంతకాలము క్రమముగా వెలువడ లేదు. ప్రపథమమున మాసపత్రికగా ప్రారంభింప బడెను. తదుపరి పక్షపత్రికగా రూపొందెను. తదుపరి వారపత్రికగా కొన్నాళ్ళు వెలువడెను. 'ఒరులేయవి యొనరించిన' యన్న తిక్కనగారి పద్యమును పంతులు గారు వివేకవర్ధని ముఖపత్రముపై ప్రచురించిరి.

### హాస్యసంజీవని

### 1876 జూలై 16

వివేకవర్ధనిని అపహాశ్యము చేయుచు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు ప్రారంభించిన హాస్యవర్ధనికి ప్రతిగ వివేకవర్ధని కనుబంధముగ కొన్నాళ్లు పంతులు గారు దీనిని నడిపించిరి. తదుపరి ఇది వివేకవర్ధనిలో అంతర్భాగమైపోయెను. పంతులుగారి ప్రహసనములకు హాస్య సంభాషణములకు, హేళన కావ్యములకు, హాస్య సంజీవని అను పేరు రూఢమైపోయెను. మొట్టమొదట మూడునెలల కొకసారి వెలువడుచుండెడిది.

### చింతామణి

### 1891 జూలై ప్రథమ సంచిక (మాసపత్రిక)

దీని యాజమాన్యమును న్యాపతి సుబ్బారావు పంతులు గారు వహించుచుండిరి. పంతులుగారు నిర్వహించు చుండిరి. 1897 వ సం॥ ప్రాంతమున పంతులుగారితో చింతామణికూడ చెన్నపట్టణము చేరెను. చెన్నపట్టణము నుండి ఒక సంవత్సరము వెలువడి ఆగిపోయినది. సత్యరాజా పూర్వదేశ యాత్రలు, జంతుస్వభావ చరిత్ర, నీతికథామంజరి, అలంకార సంగ్రహము మొదలగునవి పంతులుగారు యీ పత్రికయందు వెలువరించిరి.

### సతీహితబోధిని

1883 ఏప్రియల్ నెలయందు మొదటి సంచిక వెలు వడెను. స్త్రీల యుపయోగార్థమై పంతులుగారు మాస పత్రికగా దీనిని నడిపిరి. సత్యవతీ చరిత్రము, సత్య సంజీవని, దేహారోగ్య ధర్మబోధిని, పత్నీహిత సూచని మొదలగు రచనలను పంతులుగారు యీ పత్రికయందే వెలువరించిరి. 1890 ప్రాంతమున యీ పత్రిక ఆగి పోయినది.

### సత్యాసంవర్ధని

రాజమహేంద్రవర ప్రార్థనా సమాజ పక్షమున వెలు వడుచుండెడిది. ఇది మాసపత్రిక. 1891 జూలై 29 ప్రథమ సంచిక కలిపురుష శనైశ్చర విలాసము, యోగాభ్యాసము మొదలగు ప్రహసనములు, విద్యాధికుల ధర్మము వర్ణము మొదలగు ఉపన్యాసములు యీ పత్రికయందే వెలువడినవి. పంతులుగారే దీనిని నిర్వ హించుచుండెడివారు.

### సత్యవాదిని

1905 మార్చి 1 వ తేదీనుండి పంతుగారు దీనిని వెలువరించిరి. ఇది వారపత్రిక. కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు నడుపుచుండెడి ఆర్యమతబోధినికి ప్రతిగ పంతులుగారు దీనిని నిర్వహించెడివారు. సాంఘిక, మత విషయములు, వాదోపవాదములు, చర్చలు ఇందు ప్రధాన స్థాన మాక్రమించుచుండెను.

తెలుగు జనానా

1893 వ సం॥న శ్రీ మల్లాది వెంకటరత్నంగారిచే స్థాపింపబడెను. 1894 వ సం॥నుండి శ్రీ రాయసం వెంకట శివుడుగారు దీని సంపాదకత్వము వహించిరి. పంతులుగారు 1904 సెప్టెంబరునుండి, వెంకట శివుడు గారితోబాటు సంపాదకత్వము వహించి ఉత్తమ స్త్రీ చరిత్రములు, భౌతిక భూగోళశాస్త్ర సంగ్రహము మొదలగునవి దీనియందు వెలువరించిరి.

పంతులుగారికి సమకాలికములయిన

కొన్ని పత్రికలు

శ్రీ ఆంధ్రభాషా సంజీవని

1871 వ సం॥ నుండి బ్రహ్మశ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారిచే చెన్నపట్టణము నుండి వెలువరింపబడుచుండెడిది. పంతులుగారు దీనికి రచనలు చేసెడివారు.

పురుషార్థ ప్రదాయిని

1871–72 ప్రాంతమున మచిలీపట్టణమను బందరు నుండి వెలువడుచుండెడిది. ఆంధ్రభాషా సంజీవనికిని, పురుషార్థ ప్రదాయినికిని కుల లలనా పఠనా సిద్ధాంతము యెడ జరుగుచున్న వాదోప వాదముల యందు పంతులుగారు కం. వీ. యనియు స్వదేశాభిమాని యనియు స్త్రీ విద్యా ప్రోత్సాహకరములగు రచనలను యీ పత్రిక యందు ప్రచురించెడివారు.

శ్రీ అముద్రిత గ్రంథ చింతామణి

1885 జూన్ ప్రారంభ సంచిక. శాకుంత లానువాదమును గూర్చి పంతులుగారు దీనియందు రెండు లేఖలను ప్రకటించిరి. పంతులుగారి గ్రంథము లన్నియు ఇందు సమీక్షింపబడుచుండెను. ఆ కాలమున సారస్వత విమర్శకు పేరెన్నిక గన్న పత్రిక ఇది. దీని సంపాదకులు పూండ్ల రామకృష్ణయ్యగారు.

విద్వన్మనోహారిణి

1874–1875 లో ప్రారంభింప బడినది. నరసాపురమునుండి వెలువడు చుండెడిది. 1875 అక్టోబరులో వివేక వర్ధని యందు కలిసిపోయినది.

సత్యాన్వేషిణి

1892 ఏప్రిల్ 12 మొదటి సంచిక (రాజమహేంద్రవరము) సత్య సంవర్ధనిలో పంతులుగారు దీనిలోని వ్రాతలను ఖండించు చుండెడివారు.

హిందూ జన సంస్కారిణి

మన్నవ బుచ్చయ్య పంతులుగారు చెన్నపట్టణము నుండి ప్రచురించెడివారు. దీనిలోనే పంతులుగారు ప్రప్రథమమున జీసస్ చరిత్రను నాలుగు ప్రకరణములు ప్రచురించిరి (1894).

ఆర్యమత బోధిని

1905 జనవరి 1 వ తేదీ – ప్రథమ సంచిక. పంతులుగారు 1906 ప్రాంతమున యీ పత్రికతో వాద ప్రతివాదములు జరుపుచుండెడివారు.

ఇవి గాక హిందూ సుందరి, సావిత్రి, ధర్మ సాధని మొదలగు పత్రికలలో చర్చలు, సమాధానములు, విమర్శలు, ప్రతి విమర్శలు పంతులుగారు వెలువరించు చుండిరి.

పంతులుగారు బాల్యమున 1864–1870 సం॥ల మధ్య వెలువడు చుండిన తత్త్వ బోధిని యను పత్రికను చదివి స్త్రీ పునర్వివాహ విషయకములైన వాదములను గ్రహించు చుండిరి. 1875 ఫిబ్రవరి సంచిక యందు శ్రీ కానుకుర్తి భుజంగరావు పంతులుగా రనువారు నడుపుచుంచిన సుధీ రంజని యను మాస పత్రిక యొక్క మొదటి రెండు సంచికలు చేరినవని ప్రకటింప బడినది.

వివేకవర్ధని యందు పంతులుగారు గ్రంథ స్వీకారమునకు (Exchange of Copies) అను శీర్షికకు ఆ దానిక

యను శీర్షికను పెట్టిరి. దానిని వివేకవర్ధని తరువాత వెలువడిన శ్రీ అముద్రిత గ్రథా చింతామణి, (నెల్లూరు) కళావతి (శ్రీ పాద కృష్ణమూర్తిగారు సంపాదకత్వము వహించెడివారు) గ్రహించి, తమ పత్రికల యందు గ్రంథ స్వీకారము (exchange of copties) అను శీర్షికకు ఆదానిక యనియే వాడినారు. పంతులుగారికి సమకాలికములైన పత్రికలలో సుధీరంజని (కానుకుర్తి భుజంగరావు పంతులుగారు) సకల విద్యాభి వర్ధని (విశాఖపట్నం - గూడూరు వెంకట కృష్ణారావుగారు) వాగ్వల్లి, సరస్వతి శ్రీ యక్షిణి, గోదావరీ విద్యా ప్రబోధిని, సత్యాన్వేషిణీ, రాజహంస మొదలగునవి ముఖ్యములు.

వీరేశలింగం పంతులుగారు 1848 సం॥లో జన్మించిరి. ఇంచుమించుగా 1861 సం॥ ప్రాంతమున రచనలు సాగించుటకు ప్రారంభించిరి. 1874 సం॥న వారి గ్రంథములు ప్రప్రథమముగా ముద్రింప బడినవి. 1899 వ సం॥న పంతులుగారు తమ రచనలను 10 సంపుటములుగా ముద్రించిరి. పంతులుగారు 1919 వ సం॥న కీర్తిశేషులగువరకును రచనలు చేయుచునే యుండిరి. నవల, నాటకము, ప్రహసనము, సాహిత్య విమర్శనము, జీవ చరిత్రలు, శాస్త్రగ్రంథములు మొదలగు సాహిత్య ప్రక్రియలనన్నిటినీ వారు చేపట్టిరి. తెలుగు సాహిత్యమున వారు స్పృశింపని, సాధింపని ప్రక్రియ లేదన్నచో అతిశయోక్తి కాదు. పంతులుగారు పత్రికా నిర్వహణము నందుకూడ అసమానమైన ప్రజ్ఞను ప్రదర్శించి, ఎన్నియో పత్రికలను నడిపిరి. వారు నిర్వహించిన పత్రిక ప్రతులన్నియు లభ్యమయిననే తప్ప వారి రచనలకు కాల సూచికను ఇచ్చుట దుర్లభము. [illegible] నేను నిర్ణయించిన తేదీలను సంవత్సర క్రమముగా పొందు పరచితిని. తేదీలు తెలియని వారి రచనల యొక్క (వారు పది సంపుటములతో చేర్చినవానిని, పంతులుగారు తమ పది సంపుటములలో చేర్చని కొన్ని రచనలను) వారు నడిపిన వివేక వర్ధని, సతీహిత బోధిని, చింతామణి, సత్య సంవర్ధని మొదలగు పత్రికల సహాయమున (నాకు లభించిన కొన్ని ప్రతులతో) రచనా కాలమును నిర్ణయించితిని. వాని రచనా కాలమును నేను సాధింపలేని కొన్ని రచనలను, ఆ పట్టిక చివర ఇచ్చితిని.

పంతులుగారు స్వీయ చరిత్ర యందు చెప్పినట్లు, వారి రచనలు పుస్తక రూపమును పొందినవి కాక, ప్రకటింపబడనివి పరశ్శతములు గలవు. ప్రహసనములు వ్యాసములు, నీతి ధర్మ వికాసనములు, పెక్కులు వారు ప్రకటించిన పది సంపుటములలో చేరి యుండలేదు. అట్టి వానిలో కొన్నిటిని యీ పట్టికలో నేను చేర్చగలిగితిని. అయినను, ఇంకనూ మిగిలిపోయినవి పెక్కులు వుండవచ్చును. వాని రచనా కాలములను నిర్ణయించి వెలువరించుటకు వ్యగ్రమైన పరిశోధన అవసరమని నేను అభిప్రాయ పడుచున్నాను.

ఈ పట్టికతోడ పంతులుగారు పరిశోధించి ప్రకటించిన అముద్రిత గ్రంథముల వివరములను, వారు నిర్వహించిన పత్రికల యొక్క వివరములను, వారి సమకాలికములైన కొన్ని పత్రికల వివరములను కూడ చేర్చియున్నాను. ఇట్లు వీనిని కూర్చుటలో శ్రీ రాయసం వెంకట శివుడుగారి ఆత్మ చరిత్రము, చిలకమర్తివారి స్వీయ చరిత్రము, హితకారిణీ సమాజమువారు 1950 వ సం॥న ప్రకటించిన ఏడవ సంపుటము యొక్క శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి పీఠిక, రాజమహేంద్రవరము గౌతమీ గ్రంథాలయమందలి పత్రికా సంపుటములు: పుర మందిరమున గల గ్రంథాలయమునందలి పత్రికా సంపుటములు నాకు మిక్కిలి తోడ్పడినవి. 




గ్రంథరచన, ముద్రణ